ఓమ్ పరబ్రహ్మణే నమః.

శ్రీకృష్ణయజుర్వేదే ఏకాగ్నికాణ్డే ప్రథమప్రపాఠకః.

స్మార్తబాలానామత్యంతోపకారాయ

శ్రీహరదత్తాచార్యభాష్యానుసారేణ

# వివాహోపనయనాది
# మంత్రప్రశ్నార్థప్రకాశిక.

ఆంధ్ర- పద- టీకా తాత్పర్య విరచితః

అయమ్

మచిలీపట్టణవాస్తవ్యేన

చెల్లా నాగలింగశాస్త్రిపుత్రేణ

లక్ష్మీనృసింహశాస్త్రిణా

స్వకీయశ్రీ

ఆర్యానందముద్రాక్షరశాలాయాం

ప్రథమవారం ముద్రాపితో విజయతేతరామ్.

హూణశకవత్సరాః 1936

ముద్రాపిత గ్రంథసంఖ్యా 500

ఏతద్గ్రంథమూల్యం రు 2—0—0

 (పోష్టుఖర్చులు ప్రత్యేకము)

# పీఠిక.

ద్విజులకు నీప్రపంచంబున నుత్తమంబగు మానవజన్మము నొంది ధర్మార్థకామమోక్షము లనియెడు పురుషార్థ చతుష్టయమును సాధింపకున్న నంతకంటె నధమజన్మ మెద్దికలదు? చతుర్థపురుషార్థ మన్నిటికన్న నుత్తమంబయ్యు; త్రివర్గసంపదలేక యద్దానినిఁ బడయఁ జాలడు. పురుషార్థములలో మొదటిదగు ధర్మము, అన్నింటికి బ్రధానము. అట్టిధర్మము ఆశ్రమధర్మము, వర్ణధర్మము, జాతిధర్మము, కుల ధర్మమని యనేకవిధంబులు, శాస్త్రములయందు వివరింపఁబడినది. ప్రతి మానవునకును ధర్మము ప్రధానము. ధర్మము విడనాడినచో, మానవునకును, పశువునకునుగల భేదమేమి? శ్లో॥ ధర్మోరక్షతిరక్షితః, ధర్మమును రక్షించుకొనినవానిని, ఆధర్మమే కాపాడును. శ్లో॥ ఏకఏవ సుహృద్ధర్మో గచ్ఛంతమనుగచ్ఛతి ॥ ధర్మమను మిత్రుఁడొకఁడే. పర లోకమునకు పోవువాని వెంటనంటివచ్చును. స్వధర్మానుష్ఠానముగావింప వలయునన్న నేదో నొకయాశ్రమముండి తీరవలయు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసములను, నాలుగాశ్రమములలో గృహ స్థాశ్రమంబుత్తమంబనియు, తక్కినమూడాశ్రమంబులవారికి నీగృహస్థు డుపచరించుచుండవలసినదనియు మనుస్మృతియందు జెప్పఁబడినది.

సకల ప్రాణివర్గము వాయువు నాశ్రయించి జీవించునట్లు, సక లాశ్రమములవారును, గృహస్థుల నాశ్రయించి జీవించుచున్నారు. ప్రతిదినము, నన్నదానముచేతను, జ్ఞానదానముచేతను, బ్రహ్మచర్య, వానప్రస్థ సన్న్యాసాశ్రమములలో నుండువారిని భరించుచు నుపచ రించుచునుండుటచేత నెల్లయాశ్రమములలో గృహస్థాశ్రమము శ్రేష్ఠ మనఁబడుచున్నది. ఇహపరలోక సౌఖ్యములను గోరువారిచేత గృహ స్థాశ్రమము స్వీకరింపబడవలెననియు జితేంద్రియులగువారికి గృహ స్థాశ్రమమాధారమనియు జెప్పఁబడుచున్నది. మఱియు, గృహస్థ పంచమహాయజ్ఞము లొనరించుటచే, ఋషులు, పితరులు, దేవతలు, భూతములు, అతిథులుసంతుష్టులై యాశీర్వదించి మేలొనరించుచుందురు

గృహస్థాశ్రమమందుండువారు స్వాధ్యాయముచేత ఋషులను, హోమములచేత దేవతలను, శ్రాద్ధములచేతఁ బితరులను, అన్నముచే నతిథులను, బలికర్మచేత భూతములను సంతృప్తిఁ జేయుచుండవలయునని తాత్పర్యము.

మనుజుఁడు పుట్టుపుట్టుతోడనే మూఁడుఋణములను గలిగి పుట్టుచున్నాఁడు. ఆ మూఁడు ఋణములనెడి బంధమునుఁ బోగొట్టుకొనక మోక్షమును జెందఁజాలడని పారాశరస్మృతియందుఁ జెప్పఁబడుచున్నది మూఁడు ఋణములనుఁ బోగొట్టుకొనుటకు గృహస్థాశ్రమముదప్ప వేఱు మార్గములేదు. త్రివర్గసంపదను సేవించినవానికే చతుర్థపురుషార్థమగు మోక్షము లభించును. లేనివానికి బహుళతర క్లేశములు గలుగును.

నియమపూర్వక వేదాధ్యయనముచేసి, బ్రహ్మచర్యముచే ఋషులను, గృహస్థాశ్రమము స్వీకరించి, పుత్రులనుఁబడసి పితరులను, శక్తికొలది యజ్ఞములఁజేసి దేవతలను సంతృప్తిపఱచి, వారి ఋణములను దీర్చి పిమ్మట మనస్సును మోక్షమందు ప్రవేశింపజేయవలయును గాని ఋషి, పితృ, దేవఋణములనుఁ దీర్పక మోక్షము నాశ్రయించెనేని యధఃపతితుండగుచున్నాఁడని శ్రుతిస్మృతులయందు జెప్పఁబడుచున్నది. ప్రతిపురుషుఁడును పూర్వజన్మంబులయందు నీజన్మంబునందుం బాపంబులు సేయుచుండుటచే బాపంబులు బహుళంబులై యుండును. అవి తీర్చుకొనుటకుం దానొక్కఁడే చేసికొను సుకృతంబులుచాలవు. కాఁబట్టి యుండుకుఁదగిన సహాయసంపదం గూర్చికొనుటయావశ్యకము ఇంతియేగాక తాను దేవర్షిపితృఋణగ్రస్తుండై యుండుననుటనుగూర్చి పైని జెప్పఁబడినది అవితీర్చుకొనుటకును సహాయాపేక్షగలదు. అందు ముఖ్యసహాయముపుత్త్రుఁడు. పుత్రుడుసేయుధర్మములవలన దనకునరకనిస్తరణంబును స్వర్గాదిలోకప్రాప్తియుం గలదనుట బహుప్రమాణసిద్ధము. "ఆత్మావై పుత్రనామాసి" అను శ్రుతి, తానేపుత్రుండనుపేరనుండునను నర్థముం జెప్పును. తానుపుత్రునితో భిన్నుండగుట యనుపపన్నముగాన తానుజేసికొనుధర్మంబులు దనకెట్లుమేలుసేయునో,యట్లు పుత్త్రుండుసేయు ధర్మంబును దనకు మేలుసేయునని ఫలితార్థము.

"జ్ఞాత్వాకర్మాణికుర్వీత" తెలిసికొని కర్మాచరణము జేయఁదగును. ఏకాగ్నికాండము రెండు ప్రపాఠకములుగాను వీనిలో ప్రథమప్రపాఠకమునందు (౧౮) పదునెనిమిది ఖండలున్ను, రెండవ ప్రపాఠకమందు (౨౩) ఇరువదిమూఁడు ఖండలును, అయితే ఆపస్తంబులవారు సూత్రమును రచించిరి దీనికే గృహ్యాసూత్రమని పేరు. ఈ సూత్రమునకు సుదర్శనాచార్యులవారు భాష్యమును జేసిరి ఆసూత్రము వినియోగ విధులను దెలియజేయుచున్నవి వినియోగమనఁగానే యేమంత్రముతో నేయేకార్యమును జేయవలసినదిన్ని తెలియజేయునది విధియనఁగా పంచదశకర్మలు వానివానికార్యము లేకాలమందెవరిచే నేరీతిగ జేయవలసినదిన్ని తెలియజేయునది ఈ మంత్రపన్నములలోని మంత్రములు కృష్ణయజుర్వేదముయొక్క తైత్తిరియ్యశాఖలోనుండు మంత్రములు మంత్రప్రశ్నలని చెప్పుకొనుచున్నాము మఱియుపంచదశకర్మలయొక్క మంత్రపన్నములయందుండు వివరణము ప్రస్తుతము గ్రంథబాహుళ్య మగునని విస్తరించలేదు ఈగ్రంథమునందుండు ముద్రణ స్ఖాలిత్యాదోష ములు గనుగొన్న మహానీయ్యులు వానిని సవరించి నాకుఁబంపినచో రెండవ కూర్పునందు సవరించి ముద్రించెదను గనుక బుధోత్తములను ప్రార్థించెదను.

ఆర్యానందముద్రాక్షరశాలా,
బచ్చుపేట మచిలీపట్టణము.

ఇట్లు,
చిల్లా. లక్ష్మీనృసింహాశాస్త్రి.



# విషయానుక్రమణిక.

## శ్రీకృష్ణయజుర్వేదే ఏకాగ్నికాండే ప్రథమప్రపాఠకః.



విషయములు సమాప్తము.

---

వివాహకార్యక్రమము దీనితరువాయి చూడుడు.

# వివాహ కార్యక్రమము.



## 1 నిశ్చితార్థము.

శుభసమయమందు పంచాంగశుద్ధిగల శుభలగ్నమందు (వధువును) పెళ్లికుమార్తెను వరునికొఱకు నిశ్చయించుట దీనినే కొందఱు నిశ్చితార్థమందురు. నిశ్చితార్థప్రకరణము పురాణోక్తకర్మప్రకాశిక యందు విస్తరించి ముద్రించబడినందున ఆగ్రంథమందు జూడఁదగును. కన్యాదాత ముందుగా పెళ్లికుమారుని తండ్రిగారికి తాంబూలమిచ్చి తమ పుత్త్రిక చి॥ సౌ॥ సీతమ్మను తమపుత్త్రుఁడు చి॥ రామయ్యయను వరున కివ్వనిశ్చయించిన తాంబూలమని పెద్దలసన్నిధిలో తాంబూల మివ్వవలెను పిమ్మట వరునియొక్క తండ్రిమొదలగువారు తమవాగ్దాన నిశ్చితార్థప్రకారము తమపుత్త్రికను పుచ్చుకొనిశ్చయించినతాంబూల మనిచెప్పి యివ్వవలెను గంధపుష్పఫలసుగంధాది ద్రవ్యములు బంధు వర్గములవారికి సమర్పింపవలెను పిమ్మట పురోహితులను సంతోష బఱచవలెను "ధ్రువంతేరాజా"యనుమంత్రమును చూర్ణికనుమొదలగు నవి చెప్పుట శిష్టాచారము వధువునకు పసుపు కుంకుమ చీరె రవిక ఫలపుష్పములు సువర్ణాభరణములును యివ్వవలెను శీఘ్రమే వివాహ సిద్ధిరస్తు ఇత్యాశీర్వాదః॥

## 2 లగ్నమునిశ్చయించుట.

శుభలగ్నము నిశ్చయించుటకు జ్యోతిష్కునవద్దకువెళ్లి వధూ వరుల జన్మ, నామనక్షత్రములుచెప్పి జామిత్రశుద్ధిగల చంద్రతారా బలాదిసర్వము అనుకూలమగు ఏకవింశతి దోషరహితమగు మంచి ముహూర్తమును లగ్నపత్రికారూపముగా గ్రహించి వారినిపూజించి వారి యాశీర్వాదమును బొందవలెను.

## 3 శుభలేఖపంపుట.

వధువు తండ్రిగారు శుభలేఖను వరునియొక్కతండ్రిగారికి పంప వలెను పిమ్మట తమరు పంపించిన శుభలేఖప్రకారము వివాహమునకు తరలివచ్చుచున్నారమని ప్రత్యుత్తరమగు శుభలేఖలను వ్రాసిపంపించ

పలెను శుభలేఖ వ్రాయువిధము యాజ్ఞీకులకు విశదమేగాన యిందు విస్తరింపలేను.

4 పెళ్ళికుమార్తెనుచేయుట పసుపుకొట్టుట.

శుభసమయంబున పెళ్ళికుమార్తెను పెళ్ళికుమారుణ్ణి యవరి గృహమందువారు ముందుగా వరుఁడు పిమ్మట వధువు పసుపుకుంకుమ సుగంధాదులచే మంగళవాద్యాది ధ్వనులతో విఘ్నేశ్వరపూజా శోభనదేవతాపూజా మొదలగునవిచేయించి పసుపుకొమ్ములురోటిలో నుంచి దంచవలెను హారిద్రాచూర్ణమును వివాహమందుంచవలెను. మంగళహార్తి పిమ్మట మంగళస్నానము నూతనవస్త్రధారణము మొద లగునవి జరపవలెను.

5 అంకురారోపణము దేవతాహ్వానము.

వధువుగృహమందు దేవతాహ్వానము అంకురారోపణము మొద లగునవి నాందిసమారాధనము కొందరు సద్యస్కాలమందు జర్పుదురు వారివారియాచారముచొప్పున జరపవలెను పంచపాలికలు క్రమవిధిగా పూజించి వివాహవేదికయందుంచవలయును.

6 కళ్యాణమంటపము.

కళ్యాణపంటపమును విధిప్రకారము నిర్మించుట బంధువులను బిలుచుట మొదలగునవి జరువవయును.

7 స్నాతకవ్రతము.

వరునిగృహమందు స్నాతకవ్రతము విధిప్రకారము జరుపుట పిమ్మట కాశీయాత్రకు వెళ్లుటకు బోవుచుండగా మార్గమధ్యంబున వధువుయొక్క సహోదరుఁడు నూతనవస్త్రాభరణములచే పూజించి బావగారు మీరు గృహస్థాశ్రమస్వీకారముచేయుఁడు అస్మత్సహోదరిని మీకిచ్చి వివాహము చేసెదముగాన దయచేసి పాణిగ్రహణమునకు తరలి రావలసినదని చెప్పి నమస్కరించవలెను పిమ్మట తథాస్తు అని ఆచార్యుఁడు పలుకవలెను పిమ్మట బావమరిదిని వస్త్రాదులచే పూజిం చుట సుప్రసిద్ధము గృహములో ప్రవేశించి వారుపంపించిన భోజన సామగ్రిని స్వీకరించవలెను.

8 వధూవరుల మంగళస్నానము.—వివాహామునకువధువుగయొక్క గృహామందు ప్రవేశించవలెను. పిమ్మట దంపతులకు మంగళస్నానము వస్నాపూర్వకము

9 గణాధిపతిపూజా పుణ్యాహావాచనము.— గణాధిపతి పూజా పుణ్యాహావాచనము తత్రసంకల్పవిశేషములు (అనుహావమి?) శాకునాదిమంత్రములు సర్వమువిశదముగాన యిందువిస్తరింపలేను.

10 రక్షాబంధనపూజా.—రక్షాబంధనపూజా "విశ్వేత్తాతే" అను మంత్రముచే వరుని కుడిచేతికిని,

11 యజ్ఞోపవీతధారణము.— శ్వశురదత్త ద్వితీయయజ్ఞోపవీతధారణము.

12 కన్యావరణములు —కన్యావరణార్థము సుహృద్వరప్రేరణము.

13 గౌరీపూజా.—గౌరీపూజా కంకణపూజా "బృహాత్సాను" అను మంత్రముచే కన్యకయొక్క యెడమచేతికిని గట్టవలయును పిమ్మట గోత్రోచ్చారణము వరాన్వేషణప్రేషణము.

14 వరునికన్యాదాతపూజించుట.— కన్యాదాత పత్నిసహితుండై సంకల్పముచేసి పాద్యకలశోదకము నభిమంత్రించి వరుని పాదప్రక్షాళనము జేసి మధుపర్కమునిచ్చునది.

15 పాదప్రక్షాళనము.— పాదప్రక్షాళనముచేబోయిన తేజస్సును మరలగ్రహించుటకై వరుండు "మయిమహా" యను మంత్రమును పఠింపవలెను.

16 సముద్రనుండు జలమువిడచుట.— కూర్చపట్టుటోని "అగ్నాశీయాఆపః" అను మంత్రముచే నభిమంత్రించి అంజలియందుంచబడిన జలమును వరుండు "విరాజోదోహాోస" యను మంత్రముచే జపించి నీళ్లువిడుచునది మిగిలినజలమును సముద్రముందు విడువవలయును.

17 వరునికి వస్త్రాభరణములిచ్చుట.— వరునకు వస్త్రాలంకారములను యథాశక్తిననుసరించి యివ్వవలెను అప్పుడు వస్త్రద్వయధారణానంతరము వరుండాచమనము చేయువలయును కేశవాయస్వాహా... శ్రీకృష్ణాయనమః ॥ అని పఠింపవలెను తూర్పు ఉత్తరము శ్రేష్ఠము

శ్లో॥ పూర్వమమృతమాచమ్య సోమపాన తథోత్తరే । దక్షిణేపునరాచమ్య పునస్స్నానంతుపశ్చిమే ॥ అను ప్రమాణమునననుసరించి జరుపవలెను.

18 మధుపర్కప్రాశనము.—మధుపర్కప్రాశనము అనఁగా పెరుగును తేనెయును ఒకపాత్రయందుఁగలిపి దానిని గొప్పదియగు కంచుపాత్రముచేత మూసి రెండుకూర్చలతోఁ దీసికొని యిదిమధుపర్కమని దాతచెప్పవలెను.

19 మధుపర్కమును గ్రహించుట.— వరుఁడా మధుపర్కమునుఁ దీసికొని పైనగప్పియుండు పాత్రను దీసివైచి "త్రయ్యైవిద్యాయై" "ఆమాగన్ యశసా"యను నీరెండుమంత్రములచే సంస్కరింపవలెను.

20 వరుఁడు ఆచమనము —"అమృతోప స్తరణమసి" అని యుదకమును లోపలికిపుచ్చుకోవలెను రెండుపర్యాయములాచమించినపిమ్మట అత్తగారుచేతిలోఁబెట్టగా "యన్మధునోమఘవ్యం" అను మంత్రముచేత ముమ్మాఱు వరుఁడు ప్రాశనముఁజేయవలయును.

21 హస్తప్రక్షాళనము.—వరుఁడు ఉదకమును పానముచేసి చేతిని కడిగికొని రెండుపర్యాయములాచమనముఁ జేయవలయును

22 గోవును అభిమంత్రించుట.—"గౌరితిగాం" అను మంత్రముచే దాత గోవును వధింపఁదలతువా? విడువఁదలతువాయని యడిగినప్పుడు ప్రతిగృహీత వధింపఁదలచినచో "గౌరస్యపహతపాప్మా" అను మంత్రములచేతనున్ను, విడువఁదలచినచో "యజ్ఞోవర్ధతాం"అను మంత్రములచేతనున్నుప్రత్యుత్తరమిచ్చును గోవుకుప్రతినిధిగా వక్కనుపైకియెగురవైచి ఉదకమునుత్రాగుగాక, గఱికలనుభక్షించుగాకయని చెప్పాచు,

23 గోవును విడిచివేయుట.—"ఓముత్సృజత" అని వరుఁడు గట్టిగాఁబలుకవలయును.

24 సిద్ధమన్నము.— పిమ్మట దాత చెప్పవలసినదేమనఁగా అన్నము సిద్ధపఱచఁబడినదని దాత చెప్పగా వరుఁడు సిద్ధమైనయన్నమును నంగీకరించితి రండని గట్టిగాఁ జెప్పవలయును పిమ్మట "అంతఃపటలంకృత్వా" అనఁగా తెఱబట్టవలెను.

25 కన్యాదానము.— తదుపరి కన్యాదాత ప్రాణాయామముచేసి సాలంకృతకన్యాదానము గావించుటకై సంకల్పించవలయును.

26 మహాదానములు చేయుట.— షోడశ మహాదానాంతర్గతమగు సాలంకృతకన్యాదానసమయంబున మహాసంకల్పము పురాణోక్తకర్మ ప్రకాశికయదుఁ జూడదగును గ్రంథవిస్తరభీతిచే యిచ్చట చెప్పఁబడలేదు అస్యశ్రీమదాది...సాలంకృతకన్యా మహాదానంకరిష్యే ॥ శ్లో॥ కన్యాంకనక...సిద్ధయే॥ యనువరకు పఠింపవలెను.

27 గోత్రోచ్చారణము.— వరునియొక్క గోత్రప్రవరలను జెప్పి వధువుయొక్క గోత్రప్రవరలనుగూడ జెప్పి కన్యాదానము జేయవలెను అప్పుడు "తుభ్యమహంసంప్రదదే" అనువరకు చెప్పవలెను నమమ-అను శబ్దము కన్యాదానమందు జెప్పఁదగదు వరదక్షిణ సువర్ణపూర్వకముగా యివ్వవలెను

28 గౌరీపూజ.—పెళ్లికుమార్తెను గౌరీపూజ సన్నిధిలోనుంచి తెచ్చే మేనమామకు బట్టలు యివ్వవలెను ధరించి తట్టనుసహా పెళ్లి కుమార్తెను తీసికొనిరావలెను ఇది లోకాచారము కన్యాదానానంతరము సమస్తదానములు జరుపవలెను ఆ మహాదానములన్నియును అష్టోత్తరశతదానకల్పమందుఁ జూడఁదగును.

29 ధర్మార్థకామములు.—ధర్మార్థకామములయందు ఈకన్యనీచే విడువఁబడి నడువగూడదనియు అనఁగా వరుఁడు సంకల్పించిన ప్రకారము వధువుఁడనవలెను వ్యతిరేకముండగూడదని కన్యాదాత వరునిఁజూచి చెప్పవలెను పిమ్మట వరుఁడు ధర్మార్థకామములనుమీరి నడచుట లేదని పెళ్ళికుమారుఁడు పలుకవలెను.

30 సుముహూర్తము.—సుముహూర్తకాల సమయంబున పుణ్యాహకాది మంత్రములను పఠించి జీరకసహితగుడమును శిరస్సుపైన నొకరకొకరు దంపతులుభయులు శిరస్సునందు బెట్టవలయును ఇదియే సుముహూర్తకాలమని పెద్దలుచెప్పుదురు "ధ్రువంతే...అయంముహూర్త సుముహూర్తో౽స్తు॥

31 వధువనుజూచుట.— సుముహూర్తమందు పెళ్ళికుమారుఁడు పెళ్ళికుమార్తెనుజూచి "అభ్రాతృఘ్నీం" అను మంత్రమును జపించి కన్నులుమూసికొని "అఘోరచక్షురపతిఘ్న్యేధి" అను మంత్రమునుఁ జెప్పి కన్యకను జూడవలయును.

32 కన్యాదాతకు నూతన వస్త్రాభరణములు — కన్యాదాతకు నూతనవస్త్రాభరణములు వారియుత్తవారు దంపతులకు బట్టలు చదివించుదురు ఇదిలోకాచారము పిమ్మట కన్యాదాత పెద్దలను నూతన వస్త్రములచే పూజించి తాను నూతనవస్త్రములను ధరించవలెను. వధువుకును వల్లెపంచెలు చీరె రెవిక మొదలగునవి చదివించవలెను.

33 దంపతులుభయులు ఏకముగా కూర్చుండుట.— "ఆవాభ్యాం కర్మాణికర్తవ్యాని" వధూవరులు ప్రాణాయామముఁ జేసినవారలయి మనమిరువురము కలిసి సత్క్రియలను జేయవలెను సంతానము బడయవలయునని సంకల్పించవలెను వధువుయొక్క పాపిడియందు "దర్భైనిరస్యేత్" దర్భతో తుడిచివేయవలెను.

34 కన్యకయొక్క శిరస్సునందు దర్భతో పాపిడిమీఁద తుడిచి వేసిన పిమ్మట.—"అర్యమ్ణోఅగ్నింపరియంతు" అను మంత్రముచే కన్యక శిరస్సునందు దర్భతోఁజేసిన ○ చుట్టనుంచి దానియందు కాడియొక్క యెడమతట్టుండెడు రంధ్రమునుంచవలయును 'ఖేనసయితి...'

35 కాడియొక్కరంధ్రమందు అభిషేకము.—కాడియొక్క యెడమ రంధ్రమునందు "శంతేహిరణ్యాగ్ం" అను మంత్రమునుఁజెప్పి సువర్ణముతో గప్పి "హిరణ్యావర్ణాశ్శుచయః" అనునది మొదలు అయిదు మంత్రములను పఠించి 'పంచభిస్సకృస్స్నాపయతి' ఒక్కమాఱు స్నానముచేయించవలెను ఇదే గంగాస్నానమని కొందరందురు.

36 'పరిత్వాగిర్వణో' అను మంత్రమును పఠించుట.—"పరిత్వాగిర్వణోగిర" అను మంత్రముఁజెప్పి ఖండింపని వస్త్రముచేత నాచ్ఛాదింపవలయును.

37 యోక్త్రధారణము.— ఆచమించి "ఆశాసానాసౌమనసం" అను మంత్రముతోఁ జేనిన త్రాటిని కన్యకయొక్క మొలను కట్టవలెను

నాభికి ఉత్తరపుతట్టుతాళిబొట్టుని ఈడ్చుకొని ముడివేసి ప్రదక్షిణముగాం జుట్టి నాభికి దక్షిణపుతట్టుంచవలెను దీనిసేయోక్త్రమందురు దర్భత్రాడుఅని కొందరందురు.

38 మాంగళ్యధారణము.—శ్లో॥ మాంగళ్యతంతునానేన మమ జీవనహేతునా । కంఠేబధ్నామిసుభగే త్వంజీవశరదశ్శతమ్ ॥ మాంగళ్యసూత్రమును గట్టవలెను రెండుముళ్లు గట్టివి 3వ ముడి దూముడి,

39 సభాశీర్వచనము.— (సభాయాం) సభయందుండు వారందఱు దంపతులశిరస్సునందు అక్షతారోపణము అనగా మాంగల్యధారణ ముహూర్తసుముహూర్తోఽస్తు అని అందరు పఠించునది.

40 తలంబ్రాలు.—"ప్రజాపతిస్త్రియాం" ప్రజాం మేకామస్సమృధ్యతాం-వరుడుపోయవలెను. పశవో మేకామస్సమృధ్యతాం- కన్యయును యజ్ఞో మేకామస్సమృధ్యతాం- వరుడును, అన్యోన్యస్యాయుగపత్తు ఒకరి కొకరు శిరస్సునందుంచవలెను నాలుగవపర్యాయము తూష్ణీంచతుర్థం ౪ మారు శ్రియోమేకామ స్సమృధ్యతాం అని పఠింపవలెను.

41 బ్రహ్మముడి — "యోస్యైతాంబ్రహ్మణా" "అగ్నిపిశ్వేభి" మంత్రములనుజెప్పి బ్రహ్మముడి వేయవలెను మత్రతయుతాంబూలను సభాయాశీర్వాదము స్వస్తిమంత్రార్థము జరుపవలెను.

42 హస్తగ్రహణము.—"పూషాత్వేతోనయతు" ఈమంత్రమును కూతురి హస్తము బట్టుకొని వివాహప్రధానహోమమునకు బోవలెను అచ్చట గృహ్యాగ్నిప్రతిష్ఠాపనము విధిప్రకారము జరుపవలెను.

43 సప్తపది —అగ్నికి ఉత్తరపుతట్టు "ఆతిష్ఠేమమశ్మాన" అను మంత్రమునుజెప్పి కన్యకను కుడికాలిచేత రాతిపై నెక్కించినిలుపవలెను అగ్నిప్రదక్షిణము.

44 లాజహోమము.—లాజహోమము జయాదిహోమము జరుపవలెను లాజహోమమందు భావమరిదిగారికి బహుమానమిచ్చెదరు లోకాచారము వధువుకు మట్టెలుంచుదురు హోమాంతమందు "ప్రత్వా ముంచామి"అనుమంత్రములజెప్పి యోక్త్రమునుముడివిప్పి వేయవలెను.

45 ప్రవేశహోమము.—వివాహగృహ ప్రవేశహోమము జయాది హోమములును "ధ్రువక్షితి" ధ్రువనక్షత్రదర్శనముఅరుంధతీదర్శనము అర్ఘ్యమిచ్చువలెను శ్లో॥ కశ్యపాత్రిభరద్వాజో విశ్వామిత్రోధగౌతమః। వసిష్ఠో... స్తథా। అర్ఘ్యందద్యాత్॥ "ధ్రువమరుంధతీ చదర్శయతి"

46 అగ్నేయస్థాలీపాకము.—ఆగ్నేయస్థాలీపాకము గంధర్వప్రతిష్ఠాపనముల జయాదివర్జము ప్రాజాపత్యహోమము ఔపాసనము యావజ్జీవము జరుపవలెను.

| | |
|---|---|
| సా—అగ్నయేస్వాహా<br>అగ్నయేస్విష్టకృతేస్వాహా | తండులహోమము. |
| ది— సూర్యాయస్వాహా<br>అగ్నయేస్వాహా | మొదటిదానికన్న రెండవదియధికము |

ఆహుతిసంసర్గదోష నివృత్యర్థం వనస్పతిహోమంకుర్యాత్॥

47 సదస్యము.—తృతీయాహ్నిక క్రియప్రాతకౌపాసనము సదస్యము మహాదాశీర్వచనము పెద్దలను సన్మానించుట పండితులను సన్మానించుట మొదలగునవి సభాకట్నం గ్రామకట్నం దేశాచారముల చొ॥ జరుపవలెను.

48 (ర)దినముయొక్క అపరరాత్రియందు శేషహోమము గంధర్వోద్వాసనము శేషహోమము జయాదిపరిషేచనాంతము కర్మణః పుణ్యాహవాచనము.

49 కంకణోద్వాసనలు.—గి దినంబున కంకణోద్వాసనలు.

50 నాకబలి.— నాకబలిత్రయస్త్రింశత్కోటి దేవతావిసర్జనమునకు ముందు కర్మణః పుణ్యాహము నీలలోహితధారణము "నీలలోహితే" అను మంత్రముచే (నల్లపూసలు) ధారణము గర్భాధానమంత్ర సంస్కారము పిమ్మట పాన్పు దంపతీతాంబూలము ఫలదానములు సూర్పవాయనదానము జలపాత్రద్వయ మున "దేవేంద్రాణీనమస్తుభ్యం దేవేంద్రప్రియభామిని। వివాహం భాగ్యమారోగ్యం పుత్రలాభంచ దేహిమే। అను మంత్రముడు జెప్పి ఇంద్రాణిం బ్రార్థించవలయును (కమ్మాకడియం) అనఁగా బంగారపువస్తువు వెండివస్తువు జలమందుంచ

వలెను సువర్ణము వరుడు స్పృశింపవలెను వెండివస్తువు వధువు స్పృశింపవలెను దక్షిణతట్టుననుండు ఏనుగమీద వధువును ఉత్తరపుతట్టుననుండు ఏనుగుమీద వరుడును నిలుచుండి ఇంద్రాయరాజ్ఞే అను మంత్రమును పఠించుచు మూడు ప్రదక్షిణములను జేయవలయును "వాతో దేవతా" అను మంత్రములను పఠించునది ప్రదక్షిణమందు జ్యోతులు వెలిగింతురు 33 అని కొందరు ౧౬ అని కొందరు చెప్పుదురు కంకణవిసర్జనము వధూగృహ ప్రవేశానంతరము చేయుదురు "కంకతో నకంకతో" అను మంత్రమును చెప్పుదురు పిమ్మట వసంతోత్సవము అయిదవదినంబున పగలే చేతురు దండాడింపు అప్పగింతలు వధూగృహప్రవేశము చేయవలెను తక్కిన కర్మలకు క్రమవిధానము గ్రంథ బాహుళ్యమగునని ఈ ప్రథమకూర్పునందు జేర్పబడలేదు ఈవివాహప్రయోగము సూత్రీయము భట్టీయము అని ద్వివిధము శాస్త్రమునందు సూత్రీయమునకుఁ బ్రాధాన్యము కలుగుచున్నను క్రియాసౌకర్యార్థము భట్టీయమీప్రాంతములందు వాడుకలోనున్నందున భట్టీయప్రకారము కార్యక్రమము వ్రాయబడెను సూత్రీయ భట్టీయములకుఁ గార్యములుజరుపుటయందు ముందువెనుక భేదములు గాని ప్రధానమంత్రములందు భేదముచూపట్టదు. కంకణవిసర్జనము నూతన వధూ గృహప్రవేశానంతరమందు జరుపుదురు.

## ఆధీనమంత్రః.

శ్లో॥ అష్టవర్షాత్వియంకన్యా పుత్రవత్పాలితామయా । ఇదానీం తవదాస్యామి దత్తాంస్నేహేనపాలయ॥ ఇతికన్యాహస్తం గృహీత్వా క్షీరేణసంస్పృశ్య వరహస్తేనిక్షిపేత్ । ఇతిభర్తుః॥ అష్టవర్షా + ఇదానీంతవపుత్రస్యదత్తాంస్నేహేనపాలయ॥ ఇతిశ్వశురస్య॥ శ్లో॥ అష్టవర్షా ...తవపౌత్రస్య దత్తాంస్నేహేనపాలయ॥ ఇతి భర్తృపితామహస్య॥ అష్టవర్షా... ఇదానీంతవభ్రాతుశ్చ దత్తాంస్నేహేనపాలయ॥ ఇతిభర్తృ

భ్రాతుః॥ అష్టవర్షా... ఇదానీంతవబంధోశ్చ దత్తాంస్నేహేనపాలయ॥ ఇతిబంధూనాం॥ ఇతి ఆధీనమంత్రస్సమాప్తః.

వివాహ క్రమవిధి సంపూర్ణము.

---

## విజ్ఞప్తి.

1. బ్రహ్మశ్రీ కావూరి రంగయ్యశాస్త్రిగారు, 2. ముక్త్యాల అప్పళాచార్యులవారు ఈగ్రంథమునకు నిండాసహాయ్యులు వీరికెన్ని వందనములు జేసినను చాలదు. పరమేశ్వరుఁడు వీరిని రక్షించుచుండుగాత.

బందరు, బచ్చుపేట.

ఇట్లు,
చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి.

వలయువారు.—

ఆర్యానందముద్రాక్షరశాలా,
బచ్చుపేట మచిలీపట్టణము.



# శ్రీకృష్ణ యజుర్వేదే ఏకాగ్నికాణ్డే

## ప్రథమ ప్రపాఠకారంభః

—— :o: ——

### ప్రథమమన్త్రపన్న ప్రారమ్భః

### అథాద్రాపరిషేచమంత్రాః॥

మూ॥ అదితేఽను మన్యస్వ॥ ౧॥ అనుమతేఽను మన్యస్వ॥౨॥ సరస్వ తేఽను మన్యస్వ ॥౩॥ దేవ సవితః ప్రసు వ ॥౪॥

ప॥ అదితే । అను । మన్యస్వ ॥ ౧॥ అనుఽమతే । అను । మన్యస్వ॥ ౨ ॥ సర స్వతే । అను । మన్యస్వ ॥ ౩॥ దేవ । సవితః । ప్ర । సువ ॥౪॥

అర్థము॥ హే అదితే = (దేవతలకు తల్లివయిన) ఓ అదితి దేవి, అనుమన్యస్వ= (నాచేతఁ జేయఁబడుచున్న కర్మను) అంగీకరింపుము ॥౧॥అనుమతే=ఓపౌర్ణమాసీ దేవతా, అనుమన్యస్వ= అంగీకరింపుము॥ ౨ ॥ హే సరస్వతే =ఓసరస్వతీ దేవి, అనుమన్యస్వ= అంగీకరింపుము ॥౩॥ హే సవితః= (ప్రేరకుఁడవగు, దేవ = పరమేశ్వరుఁడా, ప్రసువ = ప్రేరణఁజేయుము ॥ ౪ ॥ హేఅదితే = అఖండుఁడవగునోపరమాత్మా- హే అను మతే = సమస్తము దెలిసిన పరమాత్మా, హే సరస్వతే = సర్వవ్యాపకుఁడవగు పర మాత్మా, సవితః = సృష్టికర్తవయిన, హే దేవ = ఓపరమాత్మా, నాచేత చేయఁబడు చున్న కర్మముల నంగీకరింపుము.

| | |
|---|---|
| ఇతి పూర్వపరిషేచనమ్- | ఇత్యుత్తరపరిషేచనమ్- |
| అదితేను మన్యస్వ౧॥ | అతితేఽన్వమగ్గ్స్థాః॥ ౧॥ |

ఇతిదక్షిణతః ప్రాచీనమ్.

---

అనుమ తేనుమన్యస్వ ॥ ౨॥ అనుమతే న్వ మగ్గ్స్థాః ॥౨॥

ఇతిపశ్చా దుదీచీనమ్

సరస్వతేను మన్యస్వ ॥ 3॥ సరస్వతే న్వమగ్గ్స్థాః ॥3॥

ఇత్యుత్తరతః ప్రాచీనమ్

దేవ సవితః ప్రసువ॥ ౪॥ దేవసవితః ప్రాసావీః ॥౪॥

ఇతి సమంతమ్.



## —♦ అథ మంత్రప్రశ్నారంభః ♦—

మూ॥ ప్రసుగ్మంతా ధియసానస్య సక్షణి వరేభి ర్వరాగ్ అభిషుప్రసీదత । అస్మాక మింద్ర ఉభయం జుజోషతి య త్సౌమ్యస్యాంఽధసో బుబోధతి ॥ ౧ ॥

ప॥ ప్రఽసుగ్మంతా । ధియసానస్య । సక్షణి । వరేభిః । వరాన్ । అభి । సుప్రసీదత । అస్మాకం । ఇంద్రః । ఉభయం । జుజోషతి । యత్ । సౌమ్యస్య । అంధసః । బుబోధతి ॥ ౧ ॥

అర్థము॥ ప్రసుగ్మంతా=విస్తారముగ, బాగుగా నడచునట్టి, (హే సఖాయః) ఓ స్నేహితులారా, (వః)=మిమ్ము, (౨) ధియసానస్య=ధ్యానించుచున్న, (వరస్య)=వరుఁడనయిన (మమ)=నాయొక్క, (౩) సక్షణి=కూర్చఁదగిన (ఈ వివాహకార్యమందు) వరేభిః=శ్రేష్ఠములైన, (మార్గైః)=మార్గములచేతను, వరాన్=కోరఁదగినట్టి (కన్యకయొక్క తండ్రి మొదలగు) వారలను, అభిషుప్రసీదత = అభిముఖముగా, లెస్సఁగా=బాగుగా పొందుఁడు, ఇంద్రః=ఇంద్రుఁడు, లేక పరమైశ్వర్య యుక్తుఁడగు భగవంతుఁడు, (౪) అస్మాకం=మాకు అనఁగా నాకును, ఆ కన్యకకును, ఉభయం=దాంపత్యమును, (౫) జుజోషతి = సేవించుచున్నాఁడు, అనఁగా కలుగఁజేయుచున్నాఁడు, యత్=ఎందువలన ననఁగా, (౬) సౌమ్యస్య = సోమలతారసరూపమైన అనఁగా శ్రేష్ఠమయిన (౭) అంధసః=అన్నమును, బుబోధతి=తెలిసికొనుచున్నాఁడు.

తా॥ ఓ స్నేహితులారా! యీ వివాహమును గూర్చి మీరు మంచిమార్గముల చేతను, కన్యకయొక్క తండ్రి మొదలగు వారల సమీపమునకు త్వరగా వెళ్ళి కార్యమును సఫలము చేసికొని రావలయునని వరుఁడు ధ్యానించుచున్నాఁడు. కాఁబోవు దంపతులు చేయు యజ్ఞమందుఁ దనకు సోమరసరూపమయిన యన్నము దొరకు నని యింద్రుఁ డీ వివాహకార్యమునకు సహాయుఁడగును.

---

౧ వ్యా । ప్ర-సు॥ ఇత్యుపసర్గద్వయపూర్వ కాత్ - గమేర్లట్ - ఛాందస శ్శపో లుక్ - లటశ్శత్రాదేశః - ఛాందస శ్ఛాదేశాభావః - గమహనేత్యుపధా

లోపః - సుపాంసులుగితి - జసః - ఆకారాదేశః । ఈ పదము ప్రథమాబహువచనాంతము - ఉపసర్గావుదాత్తౌ । శతురకారఉదాత్తః । విభక్త్యాకారో౽నుదాత్తః ॥

౨ ధి - ధారణే - అస్మాద్ధాతోః - ఛాందసః - అసానచ్ప్రత్యయః - సచకిత్ - చిత్త్వాదంతోదాత్తః ॥

3 షచ - సమవాయె - అస్మాద్ధాతోః ఔణాదిక స్సనిః - ఛాందసః - ప్రత్యయస్యాదిరుదాత్తః । సుపాంసులుగితి సప్తమ్యా లుక్ - ఈ పదమునకు హరదత్తాచార్యులు సమానక్షణమం దని యర్థము వ్రాసిరి - శ్రీవిద్యారణ్యులవారీ పదమునకు "సక్షణి - సేవాయాం సద్గుణకే సేవ్యే యజ్ఞే" యని యజ్ఞపరముగ వ్రాసిరి.

౪ ద్వివచనస్థానమందు "అస్మదోర్ద్వయోశ్చ" అనుసూత్రముచేతను బహువచనప్రత్యయము ॥

౫ జుషీ - ప్రీతిసేవనయోః అస్మాద్ధాతోర్లట్ - ఛాందసో లిడ్వద్భావః తస్మాద్ద్విత్వం ॥

౬ ఛాందసఔకారః ॥

౭ ద్వితీయార్థమందు షష్ఠి.

---

## —♦ వివాహమన్త్రాః ♦—

మూ॥ అనృక్షరా ఋజవ స్సంతు పంథా యేభి స్సఖాయో యంతి నో వరేయం। స మర్యమా సం భగో నో నినీయా త్సంజాస్పత్యగ్ం సు యమమస్తుదేవాః ॥ ౧ ॥

ప॥ అనృక్షరాః । ఋజవః । సంతు । పంథాః । యేభిః। సఖాయః । యంతి । నః । వరేయం । సం । అర్యమా । సం । భగః । నః । నినీయాత్ । సం । జాస్పత్యం । సుయమం । అస్తు । దేవాః ॥

అర్థము॥ హే దేవాః = ఓ దేవతలారా, యేభిః = ఏ మార్గములచేతను, నః = మా యొక్క, సఖాయః = స్నేహితులు, వరేయం = కోరదగిన (కన్యక యొక్క

తండ్రి మొదలగు) వారలనుగూర్చి, యంతి = వెడలుచున్నారో, పంథాః = (ఆ) మార్గములు, అనృక్షరాః = ముండ్లు, బెడ్డలు మొదలగు కఠినవస్తువులు లేనివియును, ఋజవః = తిన్ననివియును, సంతు = అగుఁగాక, నః = మా యిద్దఱను, అర్యమా = అర్యముఁడను దేవుఁడు, లేక, సర్వవ్యాపకుఁడగు భగవంతుఁడు, సంనినీయాత్ = కూర్చుఁగాక, భగః = భగుఁ డను దేవుఁడు, లేక షడ్గుణసంపన్నుఁడగుభగవంతుడు, సంనినీయాత్ = కూర్చుఁగాక, జాస్పత్యం = దాంపత్యము, సం = లెస్సగాను, సుయమం = యోగ్యసంబంధము గలదిగాను, అస్తు = అగుఁగాక ॥

తా॥ కన్యను సంఘటనచేయుటకుఁ బంపఁబడుస్నేహితులయొక్క మార్గములు ముండ్లు మొదలగునవి లేక తిన్నగ నుండవలయుననియు, అర్యమాదిదేవతలు దాంపత్యమును సంఘటన జేయవలయుననియు వరుఁడు భగవంతుని ప్రార్థించుచున్నాఁడు.

మూ॥ అభ్రాతృఘ్నీం వరుణా పతిఘ్నీం బృహస్పతే ఇంద్రా పుత్రఘ్నీం లక్ష్మ్యం తా మస్యై సవిత స్సువ ॥3॥

ప॥ అభ్రాతృఘ్నీం । వరుణ । అపతి ఽ ఘ్నీం । బృహస్పతే । ఇంద్ర । అపుత్ర ఽ ఘ్నీం । లక్ష్మ్యం । తాం అస్యై । సవితః । సువ ॥

అ॥ హేవరుణ= ఓ వరుణుఁడా, లేక, లోకులచే గోరికలడుగఁబడెడు పరమాత్మ, అస్యై= (౧) ఈ కన్యకకు, అభ్రాతృఘ్నీం= తోడఁ బుట్టినవాండ్రను జంపనియట్టి, లక్ష్మ్యం= (౨) లక్ష్మిని, సువ= ఇమ్ము, హే బృహస్పతే= ఓ బృహస్పతీ, లేక యోగ్యులను పాలించు పరమాత్మ, అపతిఘ్నీం= పెనిమిటిని జంపనియట్టి, లక్ష్మ్యం= లక్ష్మిని, సువ= ఇమ్ము, హేఇంద్ర= ఓయింద్రుఁడా, లేక పరమైశ్వర్యముగల భగవంతుఁడా, అపుత్రఘ్నీం= పుత్రులను జంపనట్టి, లక్ష్మ్యం = లక్ష్మిని, సువ= ఇమ్ము, హేసవితః= ఓసూర్యుఁడా, లేక సృష్టికర్తవగు పరమాత్మ, తాం-లక్ష్మ్యం= ఆ లక్ష్మిని, అనఁగా భ్రాతలను, పెనిమిటిని, పుత్రులను జంపనియట్టి, లక్ష్మిని- సువ= ఇమ్ము.

---

ఈ మంత్రము, ఋగ్వేదము - మం ౧౦ - సూ - ౮౫ - ఋ - ౨౩- అథర్వవేదము - కాం ౧౪ - అను ౧ - మం ౩౪ - కొన్ని పదములు భేదముగానున్నవి.

తా॥ ఈ కన్యకను భ్రాతృపతిపుత్రనాశనము లేనిదానినిగాఁ జేయుమని వరుఁడు దేవప్రార్థనఁ జేయుచున్నాఁడు.

మూ॥ అఘోరచక్షు రపతి ఘ్న్యేధి శివా పతిభ్య స్సుమనా స్సువర్చాః జీవసూ ర్దేవకామా స్యోనా శం నో భవ ద్విపదే శం చతుష్పదే ॥ ౪॥

ప॥ అఘోరఽచక్షుః । అపతిఽఘ్నీ । ఏధి । శివా । పతిభ్యః । సుమనాః । సుఽవర్చాః । జీవఽసూః । దేవఽకామా । స్యోనా । శం । నః । భవ । ద్విఽపదే । శం । చతుఃఽపదే॥ ౪॥

అ॥ (హేవధు)=ఓచిన్నదానా (త్వం)=నీవు, అఘోరచక్షుః=భయంకరము గాని దృష్టిగలదానవును, అపతిఘ్నీ=పెనిమిటిని జంపనిదానవును, ఏధి=అగుము, పతిభ్యః=పెనిమిటికొఱకును, బావ మఱఁదులకొఱకును, శివా=మంగళప్రదురాలవు, ఏధి=అగుము, సుమనాః=మంచిమనస్సుగలదానవును, సువర్చాః = మంచితేజస్సు గలదానవును, ఏధి=అగుము, జీవసూః=జీవించెడి సంతానము కనుదానవును, దేవకామా=దేవతలను, (యాగమునిమిత్తము) లేక పరమేశ్వరుని (సౌభాగ్యము నిమిత్తము) కోరుదానవును, స్యోనా=ప్రశస్తమయినదానవును, భవ=అగుము, నః=మాసంబంధమయిన, ద్విపదే=ద్విపాదజంతువులగు మనుష్యులకొఱకును, చతుష్పదే=చతుష్పాదజంతువులగు గోవులు మొదలగువానికొఱకును, శం=సుఖకరురాలవు, భవ=అగుము, ౪॥

---

ఈ మంత్రము అథ కాం ౧౪-అ-౧-మం ౬౨-(అభ్రాతృఘ్నీం వరుణా పశుఘ్నీం బృహస్పతే। ఇంద్రా పతిఘ్నీం పుత్రిణీ మాస్మభ్యం సవిత ర్వహ) ఈ రీతిగ స్వరపదవ్యత్యయములతో నున్నది. ఈ రెండు పాఠములలోను అథర్వవేదమందుండు స్వరము శాస్త్రానుసారముగఁ గనుపించుచున్నది.

౧ మన్త్రార్థమందు చతుర్థి.

౨ శాఛందసేఅను పాణినియ్యసూత్రముచేత యణాదేశము.

తా॥ ఈ కన్యక తన పెనిమిటియందును, బావలు మొదలగువారియందును మంచితనము గలదియును, నశింపనిసంతానము గలదియును, దేవపూజాసక్తురాలును, భృత్యులయందును, పశువులయందును, ఆదరణముకలదియును, గావలయు నని వరుఁడు దేవప్రార్థన జేయుచున్నాఁడు. ॥౮॥

---

ఈమంత్రము- ఋ- మం-౧౦- సూ ౮౫- ఋ-౪౪- అఘోరచక్షు రపతిఘ్న్యేధి శివా పశుభ్య సుమనా స్సువర్చాః వీరసూ ర్దేవకామా స్యోనా శం నో భవ ద్విపదేశం చతుష్పదే॥ ఈ రీతిగ పదవ్యత్యయముగా నున్నది.

మూ॥ ఇద మహం యా త్వయి పతి ఘ్న్యలక్ష్మీ స్తాం నిర్దిశామి ॥ ౯ ॥

ప॥ ఇదం । అహం । యా । త్వయి । పతిఽఘ్నీ । అలక్ష్మీః । తాం । నిః । దిశామి ॥ ౯ ॥

అ॥ (హేవధు) = ఓ చిన్నదానా, త్వయి = నీయందు, పతిఘ్నీ = పెనిమిటిని జంపునట్టి, యా = ఏ (౧) అలక్ష్మీః = అభాగ్యత (అస్తి) = ఉన్నదో, తాం= ఆ యభాగ్యతను, అహం=నేను, నిర్దిశామి=తుడచితీసివేయుచున్నాను, ఇదం= దర్భచేత పెండ్లికూతునిరొకట భ్రూమధ్యమందుఃదుడుచుట యే యభాగ్యతను దీసివేయుట యగును తా॥ స్పష్టము.

అథ - కాం - ౧౪ - అ - ౨ మం - ౧౭ (అఘోర చక్షు రపతిఘ్నీ స్యోనా శగ్మాసుశేవా సుయమాగృహేభ్య । వీరసూర్దేవృకామాసంత్వయైధిషీమహి సుమనస్యమానా) ఈ రీతిగ పదవ్యత్యయముగా నున్నది.

కృష్ణయజుర్వేదు లీమంత్రములో (పతిభ్యః) అని పఠింపుచున్నారు. ఋగ్వేదమందును, శుక్లయజుర్వేదులు వాడుకచేయు వివాహమంత్రమందును, (పశుభ్యః) అనియున్నది. పతిభ్యః = భర్తకొఱకు అను బహువచనమునకు వారదత్తుఁడు వ్యాఖ్యానములో బావగార్లు మఱదులు అని కష్టక్లిష్టిగా నర్థము వ్రాసినాడు. పశుభ్యః = అనుపాఠమందు అట్టిబాధ లేదు. ఈ మంత్రములో (పతిఘ్నీ) అనుపదముండుటచేతను ద్విరుక్తిదోషమును గనుపట్టుచున్నది. పశుభ్యఃఅనుపదమున

గోవులు మొదలగునవి యనియర్థము - చతుష్పదె - అను పదమునకు ఏనుగులు - గుఱ్ఱములు మొదలగునవి యర్థము గనుక ద్విరుక్తి దోషమును లేదు. *

వ్యా॥ (౧) లక్ష్మీశబ్దమునకు ఛందస్సగుటవలన హ్రస్వము.

మూ॥ జీవాగ్ రుదంతి విమయంతే అధ్వరె దీర్ఘా మనుప్రసితిం దీధియు ర్నరః వామం పితృభ్యో య ఇదగ్ సమేరిరే మయః పతిభ్యో జనయః పరిష్వజే॥ ౬॥

ప॥ జీవాం । రుదంతి । వి । మయంతె । అధ్వరే । దీర్ఘాం । అనుప్రసితిం । దీధియుః । నరః । వామం । పితృభ్యః। యె । ఇదం । సంఏరిరె । మయః । పతిభ్యః । జనయః పరిష్వజే॥ ౬॥

అ॥ యే=ఏ నరులు (కన్యకయొక్క బంధువులయిన జనులు) దీర్ఘాం=గొప్పదయిన, ప్రసితిం =ప్రేమానుబంధమును (ఆవయోః)=మా యిద్దఱకును, అనుదీధియుః=చేయుచున్నారో, పితృభ్యః=పితృదేవతలకొఱకు, వామం=కోరఁదగినట్టియు (౧) పతిభ్యః=(పత్యుః) పెనిమిటికైన (నాకు) (౨) మయః=సుఖకరమగునట్టియు- (3) జనయః (ఈ) పెండ్లికూతునియొక్క-(౪) పరిష్వజే=ఆలింగనము చేయఁదగిన ఇదం=ఈ (వివాహకర్మమును) సమేరిరే = ప్రేరణజేసిరో, (తే) = వారు (కన్యాబంధుజనులు) అధ్వరే=హింసారహితమయిన, అనఁగా శుభకరమయిన ఈ వివాహకర్మయందు జీవాం=జీవించియున్న యీ చిన్న దాని గూర్చి, రుదంతి= ఏడ్చుచున్నారు. విమయంతే=వ్యత్యయమును జేయుచున్నారు.

తా॥ కన్యావియోగమునుగూర్చి దుఃఖించుచున్న బంధువులను సంతోషకరమగు వివాహ సమయమందు దుఃఖింపవద్దని వరుఁడు కోరుచున్నాఁడు.

---

* ఈ మంత్రము యజస్సు అని ఆపస్తంబులవారు గృహ్యసూత్రములో వ్రాసినారు. కాని కృష్ణయజుర్వేదముయొక్క తైత్తిరీయశాఖయందు శుక్లయజుర్వేదము యొక్క కాణ్వశాఖయందును ఈ మంత్రముగనుపింపలేదు.

( ఋక్-మం ౧౦ సూ ౮౦ ఋ ౧౦ ) ఈ మంత్రమునకు విద్యారణ్యుల వారు యజ్ఞములో ప్రాతరనువాకయందు వినియోగముం జెప్పి అర్థమును భేదముగా వ్రాసినారు. జీవాం, అనుపదమునకు మాఱుగా ఋగ్వేదమందు జీవం అనియున్నది. ( అథ-కాం ౧౪ అను ౧ మం ౪౬) జీవం రుదంతి వినయం త్యధ్వరం దీర్ఘా మనుప్రసితిం దీధ్యు ర్నరః । వామ పితృభ్యోయ ఇదం సమీరిరే మయః పతిభ్యో జనయే పరిష్వజే॥ ఈరీతిగ స్వరపదవ్యత్యయములతో అథర్వవేదమందు వివాహప్రకరణమందున్నది.

---

మూ॥ వ్యుత్షు క్షూ౽ర ముదచం త్వాప * అస్యై బ్రాహ్మణా
స్స్నపనగ్ం హరంతు అవీరఘ్ని రు దచం త్వాపః ॥ 2 ॥

పదవిభాగం॥ ఉత్ । క్షీరం । ఉత్ । అచంతు । అపః । ఆ । అస్యై । బ్రాహ్మణాః । స్నపనం । హరంతు । అవీరఽఘ్నీః । ఉత్ । అచంతు । అపః ॥2॥

టీక॥ క్షీరం=(ఉదక సంబంధమయిన) కలుషత్వము, (౧) వ్యుత్షుత్=దూరముగాం బోవుంగాక, అపః=ఉదకములు, ఉదచంతు=మీంఁదికి వచ్చుంగాక (౨) అస్యై=ఈ చిన్నదానికి, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, స్నపనం=ఉదకమును, ఆ+హరంతు=తీసికొని వచ్చెదరుగాక, (౩) అవీరఘ్నీః=వీరులగు పురుషులను జంపని, అపః=ఉదకములు, ఉదచంతు=మీంఁదికి వచ్చుంగాక.

తా॥ కలుషములేని యుదకముల నీ చిన్నదాని స్నానము నిమిత్తము బ్రాహ్మణులు తీసికొని రావలసినది.

వ్యా॥ (౧) షష్ఠ్యేకవచన స్థానమందు వ్యత్యయముగా చతుర్థీబహువచన ప్రత్యయము. (౨) సకారాంతద్వితీయైకవచనము. (౩) జనికర్తృమునకు షష్ఠ్యేక వచనస్థానమందు వ్యత్యయముగా ప్రథమాబహువచన ప్రత్యయము (౪) పరిపూర్వకమయిన ష్వంజ-సంగ-అను ధాతువుకంటె కృత్యార్థమందు కేన్ప్రత్యయము ఆలింగనము జేసికొనఁదగినట్టిది యని యర్థము.

---

* ఈ మంత్రము, (అస్యైబ్రాహ్మణాస్స్నపనీర్హరంత్వవీరఘ్ని రుదజంత్వాపః) ఈ రీతిగ స్వరపదవ్యత్యయములతో అథకాం ౧౪- అ ౧ మం ౩౯ లో ప్రథ

మార్ధర్చగా నున్నది. దీనిని ఋక్కు అని ఆపస్తంబులవారు గృహ్యసూత్రములో వ్రాసిరి. ఋగ్వేదముయొక్క శాకలశాఖలో గనుపించలేదు. ఈ మంత్రముయొక్క ప్రథమపాదము అథర్వవేదమందును గనుపించలేదు......

౭॥ వ్యా॥ (౧) సేచనార్థకమయిన ఉక్షధాతువున కిచ్చుట పోవుట యర్థము! లేట్ లకారముయొక్క రూపము (౨) షష్ఠ్యర్థమందు చతుర్థి (3) ప్రథమా బహు వచనమునకు వాఛందసి-అను సూత్రముచేతను పూర్వసవర్ణదీర్ఘము.

మూ॥ అర్యమ్ణో అగ్నిం పరియం తు క్షిప్రం ప్రతీక్షంతాగ్ శ్వశ్రో
దేవరాశ్చ ॥౮॥

పదవి॥ అర్యమ్ణః । అగ్నిం । పరి । యంతు । క్షిప్రం । ప్రతి । ఈక్షంతాం. శ్వశ్ర్వః । దేవరాః । చ ॥౮॥

టీక॥ శ్వశ్ర్వః= అత్తగార్లు అనఁగా మా యిద్దఱయొక్క తల్లులును, దేవరాః=చ= బావమరదులును, అనఁగా మా యిద్దఱయొక్క తోబుట్టువులును, అర్యమ్ణః= సూర్యునియొక్క లేక సర్వవ్యాపకుడగు భగవంతునియొక్క (ప్రసాదాత్)= అనుగ్రహమువలన, అగ్నిం= (వివాహసంబంధమయిన) అగ్నిని క్షిప్రం= శీఘ్రముగాను, పరియంతు= చుట్టునావరించియుందురుగాక, ప్రతీక్షంతాం= (చల్లా, ఆరకుండునట్లు జాగరూకతచే) చూచుచుందురుగాక ॥తా॥ స్పష్టము.

---

ఈ మంత్రము యజస్సు అని ఆపస్తంబులవారు గృహ్యసూత్రమున వ్రాసినారు. కాని కృష్ణయజుర్వేదముయొక్క తైత్తిరియ్యశాఖయందును శుక్లయజుర్వేదముయొక్క కాణ్వశాఖయందును గనుపించలేదు.

---

(అర్యమ్ణో అగ్నిం పర్యేతు పూషన్ప్రతీక్షంతే శ్వశురో దేవరశ్చ) ఈ రీతిగ పద వ్యత్యయముతో అథ కాం ౧౪-అ ౧-మం ౩౮లో రెండవయర్ధర్చగానున్నది.

ఈ మంత్రముయొక్క తాత్పర్యము. వరునియొక్కయు కన్యకయొక్కయు తల్లులును బావమరుదులును వివాహాగ్నికి చుట్టును జాగరూకతగా సంరక్షకులై యుండవలెనని కోరినట్లు కానబడుచున్నది. ఆపస్తంబులవారీ మంత్ర

ముచేతను కన్యయొక్క శిరస్సునందు ఇణ్వ * మను పేరుగలదర్భవలయము నుంచవలసిన దని వినియోగము చెప్పిరి. హరదత్తాచార్యులు కన్యకయొక్క శిరస్సునందుంచబడు ఇణ్వము ఎటులు వలయాకారముగా నుండునో అటులు వివాహాగ్ని వరకన్యా బంధువులు చుట్టును ఆవరించి సంరక్షణఁ జేయవలసిన దని వ్రాసిరి.

* ఇణ్వ మనఁగా, ఇరువదిదర్భలను అయిదుదర్భలచేతను వలయాకారముగాఁ జుట్టినది.

* శ్లో॥ పంచభి ర్వలయాకారై ర్వేష్టనం వింశతే స్తథా । పంచవింశతిదర్భై శ్చ కౢ ఇణ్వసంఖ్యా విధీయతే॥

మూ॥ ఖేఽనసః ఖే రథః ఖే యుగస్య శచీపతే। అపాలా మింద్ర త్రిః పూ ర్త్వ్యకర త్సూర్యవర్చసం ॥ ౮ ॥

ప॥ ఖే । అనసః । ఖే । రథః । ఖే । యుగస్య । శచీఽపతే । అపాలాం । ఇంద్ర । త్రిః । పూర్త్వీ । అకరత్ । సూర్యఽవర్చసం ॥ ౮ ॥

టీక॥ హేశచీపతే = శచీదేవికిఁ బెనిమిటివయిన ఓయీ ఇంద్ర (త్వం) = నీవు, అనసః = ఇరుసుయొక్క, ఖే = రంధ్రమందును, (౧) రథః = రథముయొక్క, ఖే = రంధ్రమందును, యుగస్య = కాడియొక్క, ఖే = రంధ్రమందును. అపాలాం = అపాలయను పేరుగల కన్యకను, త్రిః = మూమార్లు (౨) పూర్త్వీ = శోధనచేసి, సూర్యవర్చసం = సూర్యునియొక్క తేజస్సువంటి తేజస్సుఁగలదానినిగా (3) అకరత్ = చేసితివి.

తా॥ ఓ యింద్రుఁడా యీ చిన్నదానిని గూడ అపాలవలె సూర్యతేజస్సు గలదానినిగాఁ జేయుము.

---

( ఖే రథస్య ఖేనసః ఖే యుగస్య శతక్రతో । అపాలా మింద్రత్రిష్పూత్వ్యకృణో స్సూర్యత్వచం ) ఈ రీతిగపదవ్యత్యయముగా నర్థభేదములేకుండ ఋక్ మం ౮ - సూ ౯౧ ఋక్కుగానున్నది. విద్యారణ్యులవా రీమంత్రమువలన శరీరదోషము కలవారు పఠించినయెడల దోషము పోయి సూర్యతేజస్సు వచ్చు నని వినియోగము వ్రాసిరి.

అథర్వవేదములో కాం ౧౪ - అ ౧ - మం ౪౧ - కొంచెము భేదముగా వివాహప్రకరణములో నున్నది.

తా॥ అత్రిమహాముని కొమార్తెయు, బ్రహ్మవాదిని యను పేరుగల యొకకన్య, బొల్లి యను వ్యాధిగలదిగా వున్న దాని నెవడును వివాహము చేసికొనఁడాయెను. అందువలన పాలకులు లేనిది గావున అపాలయను పేరు వహించెను. పెండ్లియగుటకు నింద్రు నెట్లు పూజింతు నని యెల్లప్పుడును దానికి గోరిక గలిగెను. అది యొకప్పుడు స్నానమునకై నదిలోనికి దిగి ప్రవాహవేగముచేతఁ గొట్టుకొని పోవుచు ఆ కోరిక యే మనసునం గలిగి, నీటం గొట్టుకొని వచ్చుచున్న సోమలతను జూచి యాతీగను దంతములతో నమలి యారసము నింద్రునికి సమర్పించెను. ఇంద్రుఁడా రసము ద్రావి, రథము, ఇరుసు, కాడి, యీ మూటిరంధ్రములయందు నుదకము పోసి యా యుదకముచే నామెను మూడుమారులు స్నానము చేయించి,

మూ॥ శం తే హిరణ్యగ్ సముశం త్వాప శ్శం తే మేధీ భవతు శం యుగస్య తృద్మ । శం త ఆపశ్శతపవిత్రా భవం త్వథా పత్యా తన్వగ్ సగ్ సృజస్వ॥ ౧౦॥

పదవి॥ శం । తే । హిరణ్యం । సం । ఉ । శంతు । ఆపః । శం । తే । మేధీభవతు । శం । యుగస్య । తృద్మ । శం । తే । ఆపః శతపవిత్రాః భవంతు । అథ । పత్యా తన్వ । సం । సృజస్వ॥ ౧౦॥

ఇతి ప్రథమఖండస్సమాప్తః॥

టీక॥ ( హేవధు )=ఓచిన్నదానా, తే=నీకు, హిరణ్యం=(బండి కాడియొక్క రంధ్రమందుంచిన) బంగారము, శం=సుఖకరము (అగుఁగాక) ఆపః=(ఉదకములు (౧) సం+ఉ=(౨) సుఖకరములు. 3) శంతు=అగుఁగాక, మేధీ=కాడి,

---

*. పవిత్రురాలి నొనర్చెను. దాన నామెబొల్లి వదలి సూర్యుని తేజస్సుగలది యాయెను. ఈ యితిహాసము హరదత్తాచార్యులు మంత్రప్రశ్నముల వ్యాఖ్యానమున వ్రాసిరి. ౘ * వ్యా॥ (౧) వష్ఠ్యర్థమందు ప్రథమ- (౨) పూత్వా-అను క్త్వాప్రత్యయాంతమునకు ఈ కారమును, రేఫయును ఛందస్సగుటవలన వచ్చినవి. (3) మధ్యమ పురుషస్థానమందు ప్రథమపురుష.

* "సముశంత్వాపః" అను స్థలమందు శముసంత్వాపః అనుపాఠము కొన్ని పుస్తకములయందు గనుపించినది గాని మూలమందు వ్రాసినపాఠమే సంప్రదాయసిద్ధము, అని హరదత్తాచార్యులు వ్రాసిరి.

తే=నీకు, శం=సుఖకరము, భవతు=అగుఁగాక, యుగస్య=కాడియొక్క, తృద్మ=రంధ్రము, శం=సుఖకరము, (అగుఁగాక) శతపవిత్రాః=అనేకవస్తువులను బవిత్రముచేసెడు, ఆపః=ఉదకములు, తే=నీకు, శం=సుఖకరములు, భవంతు=అగుగాక, అథ అటు పిమ్మటను, పత్యా=పెనిమిటినయిన (నా) తోడను, తన్వం=(నీయొక్క) దేహమును, సంస్పృజస్వ=కలుపుము ౧౦॥

తా॥ బండికాడియొక్క రంధ్రమం దుంచఁబడిన బంగారముమీదుగా ప్రసరించిన యుదకముచేతఁ బవిత్రమయిన యీ కన్యకయొక్క దేహము ఆలింగనమున కర్హమగు నని వరుఁడు కోరుచున్నాఁడు.

"శం తే హిరణ్యం శము సం త్వాప శ్శం మేధి ర్భవతు శం యుగస్య తర్ద్మ । శంత ఆప శ్శతపవిత్రా భవంతు శము పత్యాతన్వం సంస్పృశస్వ" ఈ ప్రకారముగఁ గొంచెము స్వరపదవ్యత్యయముతో అథకాం ౧౪ అను ౧ మం ౪౦ గా నున్నది.

వ్యా॥ (౧) వ్యత్యయముగా శవర్ణస్థానమందు సవర్ణము (౨) అనర్థకపదము పాదపూరణమే ప్రయోజనముగాఁ గలది (౩) సకారస్థానమందు వ్యత్యయముగా శవర్ణము.

ప్రథమ ఖండము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

---

## ద్వి తీ య ఖ ం డః

మూ॥ హిరణ్యవర్ణా శ్శుచయః పావకాః ప్రచక్రము ర్హిత్వా వద్య
మాపః శతం పవిత్రా వితతా హ్యాసు తాభి స్త్వా దేవ
స్సవితా పునాతు॥

పదవి॥ హిరణ్యఽవర్ణాః । శుచయః । పావకాః । చక్రముః । హిత్వా । అవద్యం । ఆపః । శతం । పవిత్రాః । వితతాః । హి । అను । తాభిః । త్వా । దేవః । సవితా పునాతు॥

టీక॥ హిరణ్యవర్ణాః=బంగారముయొక్క కాంతివంటి కాంతి గలిగినట్టియు, శుచయః=పరిశుద్ధములగునట్టియు, పావకాః=పవిత్రముచేయునట్టియు, ఆపః=ఉదకములు పరిచక్రముః=ప్రవహించుచున్నవి. అవద్యం=పాపమును, హిత్వా=పోగొట్టి, ఆసుహి=ఈ యుదకములయందు, పవిత్రాః=పవిత్రములగునట్టియు, వితతాః=వ్యాపించినట్టియు, శతం=నూఱులకొలంది, యనఁగా ననేకమైన తీర్థములు (నద్యాద్యుదకములు) (సంతి) ఉన్నవి, (హేవధు)=ఓ చిన్నదానా, సవితా=ప్రేరకుఁడైన దేవః=పరమేశ్వరుఁడు, తాభిః=ఆ (ఉదకములచేతను) త్వా=నిన్నును, పునాతు=పవిత్రురాలను జేయుఁగాక.

తా॥ పవిత్రములగు ననేక తీర్థములుగల యీ యుదకములు, ఓ చిన్నదానా, దేవుఁడు నీ పాపమును బోగొట్టి నిన్నును బవిత్రురాలను జేయుఁగాక.

---

ఈ మంత్రము మొదలు అయిదు మంత్రములు తైత్తిరియ్య సంహితయొక్క కాం ౫ ప్ర ౬ అ ౧ ప ౧౨ లో పదభేదముగాను, స్వరవ్యత్యయుగాను ఉన్నవి.

మం॥ హిరణ్యవర్ణా శ్శుచయః పావకా యాసు జాతః కశ్యపో యా
స్వగ్నిః యా అగ్నిం గర్భం దధిరే సువర్ణా స్తా స్త ఆప శ్శగ్గ్
స్యోనా భవంతు ॥౧॥

పదవి॥ హిరణ్యవర్ణాః । శుచయః । పావకాః । యాసు జాతః । కశ్యపః । యాసు । అగ్నిః । యాః । అగ్నిం । గర్భం । దధిరే । సుఽవర్ణాః । తాః । తే । ఆపః । శం । స్యోనాః । భవంతు ॥ ౨ ॥

టీక ॥ యాసు=ఏ యుదకములయందు, [౧] కశ్యపః= సూర్యుఁడు, జాతః=పుట్టెనో, యాసు=ఏ యుదకములయందు, అగ్నిః=అగ్ని, జాతః=పుట్టెనో, యాః=ఏ యుదకములు, అగ్నిం=బడబాగ్నిని, (౨) గర్భం=గర్భమందు, దధిరే=ధరించినవో, హిరణ్యవర్ణాః=బంగారముయొక్క కాంతిగలిగినట్టియు, శుచయః=పరిశుద్ధములగునట్టియు, పావకాః=పవిత్రముచేయునట్టియు, సువర్ణాః = సౌభాగ్యమైన కాంతి గలిగినట్టియు, తాః=ఆ, ఆపః=ఉదకములు, (హేవధు)=ఓ చిన్నదానా, తే=నీకు, శం=(ఇహలోకమందు) సౌఖ్యమును జేయునవియును, స్యోనాః = (పరలోకమందు) సౌఖ్యమును జేయునవియును, భవంతు=అగుఁగాక.

తా॥ అత్యంతపవిత్రకరులకునూర్యాగ్నులను పుట్టించినట్టియు, తమయందు బడబాగ్నిని ధరించినట్టియు, ఈ యుదకములు ఓచిన్నదానా నీకు ఇహపరసౌఖ్యములను గలుగఁజేయుఁగాక.

---

౨॥ ౧౨॥ తై - సం - కాం ౫ - ప్ర ౬ అ ౧ ప ౨ - (౧) పశ్యతిసర్వమితిపశ్యః = సర్వమును జూచువాఁడు. పశ్య ఏవ పశ్యకః = స్వార్థమందు కప్రత్యయము. ప్రశ్యకశబ్దమునకు ఆద్యంతవర్ణములయొక్క వ్యత్యయముచేత కశ్యపః అను రూపము కలిగిన సర్వవ్యాపారములనుచూచే సూర్యుడని యర్థము.

మూ॥ యాసాగ్ రాజా వరుణో యాతి మధ్యే సత్యానృతే అవపశ్యన్ జనానాం యా అగ్నిం గర్భం దధిరే సువర్ణా స్తా స్త ఆప శ్శగ్గ్ స్యోనా భవంతు ॥ 3 ॥

పదవి॥ యాసాం। రాజా। వరుణః। యాతి। మధ్యే। సత్యానృతేఇతిసత్య౽। అనృతే। అవ౽పశ్యన్। జనానాం। యాః। అగ్నిం। గర్భం। దధిరే। సు౽వర్ణాః। తాః। తే। ఆపః। శం। స్యోనాః। భవంతు॥

మూ॥ యాసాం దేవా దివి కృణ్వంతి భక్షం యా అంతరిక్షే బహుధా ని నివిష్టాః యా అగ్నిం గర్భం దధిరే సువర్ణా స్తా స్త ఆప శ్శగ్గ్ స్యోనా భవంతు ॥ ౪ ॥

టీక॥ వరుణః = వరుణుఁడు, యాసాం = ఏయుదకములకు, రాజా = ప్రభువగుచు, జనానాం = జనులయొక్క, సత్యానృతే = నిజానిజములను, అవపశ్యన్ = చూచుచున్నవాఁడగుచు, అనఁగా తెలిసినవాఁడగుచు, మధ్యే = మధ్యలోకమందు యాతి = సంచరించుచున్నాఁడో, తాః = ఆ, ఆపః = ఉదకములు, (హేవధు) = ఓ చిన్నదానా, తే = నీకు, స్యోనాః, సుఖకరములు, భవంతు = అగుఁగాక ॥ 3 ॥

తా॥ మధ్యలోకమందలి జనులయొక్క నిజానిజములను గనిపెట్టుచున్న వరుణుడు అధిష్ఠానదేవతగాఁ గలయుదకములు ఓచిన్నదానా నీకు సుఖకరములగుఁగాక॥ 3 ॥

---

ఇందుకు ప్రమాణము, తైత్తిరీయారణ్యకము. ప్రపాఠకము. ౧ అ ౮ ఖ లో "కశ్యపః పశ్యకో భవతి। యత్సర్వం పరిపశ్య తీతి సౌక్ష్మ్యాత్" ॥

(౨) సప్తమ్యర్థమందు ద్వితీయావిభక్త్యేకవచన ప్రత్యయము.

(3) ఈ మంత్రముయొక్క పూర్వార్థము ఋగ్వేదము మండలము ౭ సూక్తము. ౪౯ ఋక్కు 3 లో నున్నది. తై-సం-కాం-౫ప్ర౬-అ౧-ప౪.

ప॥ యాసాం । దేవాః । దివి । కృణ్వంతి । భక్షం । యాః । అంతరిక్షే । బహుఽధా । నిఽవిష్టాః । యాః । అగ్నిం । గర్భం । దధిరే । సుఽవర్ణాః । తాః । తే । ఆపః । శం । స్యోనాః । భవంతు॥ ౪॥

మూ॥ శివేన త్వా చక్షుషా పశ్యం త్వాప శ్శివయా త న్వోపస్పృశంతు త్వచం తే । ఘృతశ్చుత శ్శుచయోయాః పావకా స్తా స్త ఆప శ్శగ్గ్ స్యోనా భవంతు ॥ ౫ ॥

పదవి॥ శివేన । త్వా । చక్షుషా । పశ్యంతు । ఆపః । శివయా । తన్వా । ఉప । స్పృశంతు । త్వచం । తే । ఘృతశ్చుఽతః । శుచయః । యాః । పావకాః । తాః । తే । ఆపః । శం । స్యోనాః । భవంతు ॥

టీక॥ యాసాం=ఏ యుదకములయొక్క, భక్షం=భక్షణమును, దివి=అంతరిక్షలోకమునందు, దేవాః=దేవతలు, కృణ్వంతి=చేయుచున్నారో, యాః=ఏ యుదకములు, అంతరిక్షే=ఆకాశమునందు, అనఁగా మేఘములయందు, బహువిధా=అనేక ప్రకారములుగాను, నివిష్టాః=ఉన్నవో, తాః=ఆ, ఆపః=ఉదకములు, (హేవధు)=ఓచిన్నదానా, తే=నీకు, స్యోనాః=సుఖకరములు, భవంతు=అగుఁగాక. తాత్పర్యము స్పష్టము. ౪॥

౫ మం॥ టీక॥ ఘృతశ్చుతః=నేతివంటిరసమును ప్రవించుచున్నట్టియు, శుచయః=పరిశుద్ధములగునట్టియు, పావకాః=పవిత్రముచేయునట్టియు, యాః=ఏ, ఆపః=ఉదకములు, (సంతి)=ఉన్నవో, తాః=ఆపః=ఉదకములు, (హేవధు)=ఓ చిన్నదానా, త్వాం=నిన్ను, శివేన=మంగళమయిన, చక్షుషా=దృష్టిచేతను.

---

తై - సం - కాం ౫ - ప్ర ౬ - అ ౧ - ప ౧

మూ॥ పరి త్వా గిర్వణో గిర ఇమా భవంతు విశ్వతః వృద్ధా యు మనువృద్ధయో జుష్టాభవంతు జుష్టయః॥ ౬॥

ప॥ పరి । త్వా । గిర్వణః । గిరః । ఇమాః । భవంతు । విశ్వతః వృద్ధఽఆయుం। అను । వృద్ధయః । జుష్టాః । భవంతు । జుష్టయః॥ ౬॥

పర్యంతు=చూచుచుండుగాక, శివయా = మంగళమయిన, తన్వా=(తన) శరీరము చేతను, తే=నీయొక్క, త్వచం=శరీరమును, ఉపస్పృశంతు=స్పృశించుచుగాక, తే= నీకు, స్యోనాః=సుఖకరములు, భవంతు=అగుగాక, తాత్పర్యము స్పష్టము॥ ౫॥

౬. మం అ॥ (౧) హే గిర్వణః=స్తుతివాక్యములచేతను, సేవింపఁదగిన ఓయీ యింద్రుఁడా (భగవంతుఁడా) త్వా=నిన్ను, ఇమాః=ఈ నాసంబంధమైన, గిరః=(స్తుతి) వాక్యములు, విశ్వతః అంతటను, పరి+భవంతు=ఆవరించుఁగాక, వృద్ధాయుః= దీర్ఘాయుర్దాయముగల, త్వా=నిన్ను, అను=అనుసరించి, వృద్ధయః=వృద్ధిగలవి, భవంతు=అగుఁగాక, జుష్టయః=(నాయొక్క) సేవలు, జుష్టాః= (నీకు) ప్రియములైనవి. భవంతు=అగుఁగాక॥ ౬॥

తా॥ ఈ మంత్రముచేతను వరుఁడు పెండ్లికూతును మగనిపక్క వస్త్రము చేతను గప్పవలసినదని ఆపస్తంబుల వారు చెప్పిరి. స్తుతివాక్యము లెట్లు ఇంద్రుని నంతటను ఆవరించునో యట్లే వస్త్రము పెండ్లికూతురిని ఆవరించు నని యభిప్రాయమును హరదత్తాచార్యుఁడు వ్రాసినాఁడు. ఈ మంత్రము ఋగ్వేదముయొక్క మం ౧ సూ ౧౦ ఋక్కు ౧౨ గాను తైత్తిరీయ సంహితయొక్క కాం ౧ ప్ర 3 అ ౧ ప ౧౨ లో యజుస్సుగాను ఉన్నది. ఈ మంత్రముయొక్క అర్థము వ్యాఖ్యానములలోను భేదముగా నుండుటవలన ఆ భేదము లిచ్చట వివరింపఁబడును.

హరదత్తునిచే వ్రాయఁబడినయర్థము :-

హే ఇంద్ర త్వం గిర్వణః సర్వమంత్రైః స్తుతిలక్షణాభి ర్గీర్భి స్సంభజనీయ్యః, స్తుతీనాం సంభక్తః, ఇమా, మదీయా, గిరః, త్వా, త్వాం, పరిభవంతు, (పరిపూర్ణో భవతి, పరిగ్రహో, వర్తతే,) పరిగృష్ణంతు, విశ్వతః, సర్వతో యథేమా మిదంవాసః, పరితోభవ తీత్యభిప్రాయః। కీదృశం, త్వాం, వృద్ధాయుం, వృద్ధా, స్తమానప్రీతి గంతారం కీదృశ్యోగిరః, అనువృద్ధయః, అను గుణధతః, ప్రవృద్ధాః, తాశ్చజుష్టా స్సేవితా భవంతు త్వయా జుష్టయస్సేవితత్వాత్॥ శ్రీవిద్యారణ్యులవారిచే యజుర్వేదమునందు వ్రాయఁబడినయర్థము. కల్పః అ స్మై నాజా పరిశ్రయంతి పరిత్వా గిర్వణో గిర ఇమా భవంతు విశ్వతో వృద్ధాయు మనువృధయో జుష్టా భవంతు జుష్టయః ఇతి గీర్భిస్తుతిభి ర్వననీయా భజనీయ ఇంద్ర స్సదాభిమానీ గిర్వణః హే గిర్వణ ఇమాః స్తోత్రశస్త్రరూపాః గిరఃసర్వతః కటరూపేణ త్వాం పరిభవంతు వేష్టయంతు

కీదృశ్యః దీర్ఘాయుషం త్వా మను స్వయమపి వృద్ధియత్యః కించ జుష్టయః అస్మత్సే వాః తవ జుష్టాః ప్రియాః భవంతు మంత్రస్య స్పష్టార్థతాం దర్శయతి పరిత్వా గిర్వణో గిర ఇత్యాహ యథా యజుశ్శైతత్ సం ౬ కాం ౨-ప్ర ౧౦ - అను.

శ్రీ దయానంద సరస్వతీస్వాములవారిచే జేయఁబడిన ఋగ్వేదభాష్యమందు వ్రాయఁబడిన యర్థము.

పదార్థః । పరి-పరితః । పరీతి సర్వతోభావంప్రాహ । నిరు ౧-౩ త్వా-త్వాం సర్వ తస్తుతిభాజన మిందర మీశ్వరం । గిర్వణః-గీర్భి ర్వేదానాం, విదుషాంచ వాణీభి ర్వన్యతేసంసేవ్యతే య స్తత్సంబుద్ధౌ । గిరః-స్తుతయః । ఇమాఃవేదస్థాః ప్రత్యక్షావిద్వత్ప్రయుక్తాః । భవంతు । విశ్వతః-విశ్వస్యరుధ్యే ।వృద్ధాయుం ఆత్మనో వృద్ధమిచ్ఛతీతి తం అను-క్రియార్థే । వృద్ధయః-వర్ధ్యంతే యాస్తాః । జుష్టాః యాః ప్రీణంతి సేవంతే తాః । భవంతు । జుష్టయః-జుష్యంతే యాస్తాః ॥

అన్వయః॥ హే గిర్వణ ఇంద్ర విశ్వతో యా ఇమా గిర స్సంతి తాః పరి సర్వత స్త్వాం భవంతు । తథా చెమా వృద్ధయో జుష్టయో జుష్టా వృద్ధాయుం త్వా మను భవంతు॥

భావార్థః ॥ హే భగవన్ యా యోత్కృష్టా ప్రశంసా సా త వై వాఽస్తి । యా యా సుఖానందవృద్ధిశ్చ సా సా త్వా మేవ సంసేవతే । య ఏవ మీశ్వరస్య గుణాన్ తత్సృష్టిగుణాం శ్చాఽనుభవంతి త ఏవ ప్రసన్నా విద్యా వృద్ధా భూత్వా విశ్వస్మిన్ పూజ్యా జాయంతే । అత్ర సాయణాఽచార్యేణ పరిభవంతు సర్వతః ప్రాప్నువం త్వి త్యశుద్ధ ముక్తం । కుతః । పరా భువోఽవజ్ఞాన ఇతి పరిపూర్వకస్య భూధాతో స్తిరస్కారార్థే నిపాతితత్వాత్॥

మ॥ ౭॥ ఆశాసానా సౌమనసం ప్రజాగ్ం సౌభాగ్యం తనూం అగ్నే రనువ్రతాభూత్వా సన్నహ్యే సుకృతాయ కం॥ ౭॥

పదవి॥ ఆఽశాసానా । సౌమనసం । ప్రఽజాం । సౌభాగ్యం । తనూం అగ్నేః । అనుఽవ్రతా । భూత్వా । సంనహ్యే । సుఽకృతాకం ॥

మూ॥ పూషా త్వేతో నయతు హస్తగృహ్య శ్వినౌ త్వా ప్రవ హతాగ్ం రథేన గృహా న్గచ్ఛ గృహపత్నీ యథా సో వశినీ త్వం విదథ మావదాసి॥ ౮

టీక॥ (వధూః) పెండ్లికుమార్తె, సౌమనసం=మంచిమనస్సును, ప్రజాం=సంతానమును, సౌభాగ్యం= సువాసినీత్వమును తనూం (మంచి) దేహమును, ఆశాసానా= కోరుచున్న దగుచు, అగ్నేః=అగ్నికి లేక భగవంతునికి, అనువ్రతా = అనుసరించి వ్రతము చేయుచున్నది, భూత్వా=అయి, (తిష్ఠతి=ఉంచున్నది) సుకృతాయ= వివాహమనెడి పుణ్యకర్మకొఱకు, యోక్త్రేణ = త్రాటిచేతను, సన్నహ్యే= కట్టుచున్నాను, కం=నిరర్థకము. ౭॥

తా॥ ఈ పెళ్ళికుమార్తె మంచిమనస్సును సంతానమును, సువాసినీత్వమును మంచిదేహమును, గోరి వ్రతములను జేయుచున్నది. వివాహమనెడు పుణ్యకర్మకొఱకై చిన్నదానికి నడుమునందు దర్భత్రాటిని గట్టుచున్నాను.

---

వ్యా॥ (౧) గిరా వన్యతే ఇతి గిర్వణాః స్తుతివాక్యములచేత సేవింపఁబడువాడు. తస్య సంబుద్ధిః-హేగిర్వణః గిర్ అను శబ్దము ఉపపదముగాగల "వన సంభక్తౌ" అను ధాతువునకంటె కర్మార్థమందు అసున్ ప్రత్యయము ఈ పదము సకారాంతము. పృషోదరాది గణములోని దగుటవలన ఉపపద మయినగిర్ అను శబ్దమునకు దీర్ఘము రాలేదు. (౨) పరి అను ఉపసర్గ పూర్వముగాగల భవంతు అను పదమునకు ఇచ్చట అవరించుట యర్థము ౬॥

ఈ మంత్రము తైత్తిరీయసంహితయొక్క కాం ౧ ప్ర ౧ అ ౧౦ వ ౧ లో ఋక్కుగానున్నది.

౮ మ॥ ప॥ పూషా । త్వా । ఇతః । నయతు । హస్తఽగృహ్య । అశ్వినా । త్వా । ప్ర । వహతాం । రథేన । గృహాన్ । గచ్ఛ । గృహఽపత్నీ । యథా । అసః । వశినీ । త్వం । విఽదథం । ఆ । వదాసి॥ ౮॥

టీక॥ (హేవధు)=ఓచిన్నదానా, త్వా=నిన్ను, పూషా=సూర్యుఁడు, లేక పోషకుఁడగు భగవంతుఁడు, హస్తగృహ్య=హస్తమును బట్టుకొని, ఇతః=ఇక్కడనుంచి, నయతు=(అగ్నిసమీపమును) పొందించుఁగాక, అశ్వినా=అశ్వినీదేవతలు, త్వా=నిన్ను, రథేన=రథముచేతను, ప్రవహతాం=నడపించెదరుగాక, గృహపత్నీ=గృహయజమానిని, యథా=ఏ ప్రకారముగాను, అసః=అగుదువో, తథా=ఆ ప్రకారముగాను, గృహాన్ = (నా సంబంధమయిన) గృహములను, గచ్ఛ = పొందుము,

త్వం=నీవు, వశినీ=(గృహజనులయొక్క) స్వాధీనముగలదానవగుచు, విదథం=గృహ కార్యములను, ఆవదాసి=చెప్పుము. ౮॥

తా॥ ఓ చిన్నదానా సూర్యుఁడును అశ్వినీదేవతలును రథముచే నిన్ను నా గృహమును బొందించెదరు గాక. నీవు నా గృహమునకు యజమానురాలవై గృహ కార్యములను బాగుగ నెరవేర్పుము. ఈ మంత్రము ఋగ్వేదముయొక్క మం ౧౦ సూ ౮౫ ఋక్కు ౨౬ గా నున్నది. ఈ మంత్రముచేతను పెండ్లికొమార్తను భర్తృగృహప్రయాణమునిమిత్తము రథము నెక్కింపవలసిన దని ఆశ్వలాయనగృహ్య సూత్రమందు వినియోగము చెప్పబడినది. "పూషా త్వేతో నయతు హస్త గృహ్యేతి యాన మారోహయేత్" ఆశ్వలాయనగృహ్యసూత్రము ౧-౫

పెండ్లికొమార్తను అగ్నిసమీపమును బొందింపవలసిన దని ఆపస్తంబులవారిచే వినియోగము చెప్పఁబడినది. ఆ థైనాము త్తరయా దక్షిణహస్తే గృహీత్వాగ్ని మభ్యానియ" ఆప - గృ - ప్ర ౧ - ఖం ౪.

ద్వితీయ ఖండము సమాప్తము.

---

—♦ ప్రథమ మంత్ర ప్రశ్నః ♦—

మూ॥ సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః తృతీయో అగ్ని ష్టేపతి స్తురీయ స్తే మనుష్యజాః॥

పదవి॥ సోమః । ప్రథమః । వివిదే । గంధర్వః । వివిదే । ఉత్తరః । తృతీయః । అగ్నిః । తే । పతిః । తురీయః । తే । మనుష్యజాః॥

టీక॥ సోమః=చంద్రుఁడు, ప్రథమః=మొదటిపెనిమిటియయి, త్వాం=నిన్ను, వివిదే=పొందెను, గధర్వః=విశ్వావసుఁడనుగంధర్వుఁడు,ఉత్తరః=వానితర్వాతపెనిమిటి యై, త్వాం=నిన్ను, వివిదే=పెందెను, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, తే=నీకు, తృతీయః= మూడవవాఁడైన, పతిః=పెనిమిటి, మనుష్యజాః = మనుష్యునివలనఁబుట్టిన, అహం= నేను, తే=నీకు, తురీయః=నాల్గవవాఁడనైన, పతిః=పెనిమిటిని॥

తా॥ ఓ చిన్నదానా! చంద్రుఁడు నిన్ను ముందుగా వరియించెను. అటు పిమ్మట విశ్వావసుఁడను గంధర్వుఁడు నిన్ను వరియించెను. వారిద్దరి యనంతర

మగ్నిహోతృడు వరియించినందున మూడవ పెనిమిటి యాయెను. ఆ దేవతలు పొందినపిమ్మట మనుష్యజాతియందుఁ బుట్టిన నేనుపొందినవాఁడనవుటచే నాల్గవ పెనిమిటి నయ్యెదను.

మూ॥ సోమోఽదద ద్గంధర్వాయ గంధర్వోఽదద దగ్నయే। రయిం చ పుత్రాగ్ శ్చాదా దగ్ని ర్మహ్య మథో ఇమాం॥

పదవి॥ సోమః । అదదత్ । గంధర్వాయ । గంధర్వః । అదదత్ । అగ్నయే। రయిం । చ । పుత్రాన్ । చ । అదాత్ । అగ్నిః । మహ్యం । అథః । ఇమాం॥

టీక॥ సోమః=చంద్రుఁడు, త్వాం=నిన్ను, గంధర్వాయ=గంధరునికొఱకు, అదదత్=ఇచ్చెను, గంధర్వః=గంధర్వుఁడు, అగ్నయే=అగ్నిహోత్రునికొఱకు, అదదత్=ఇచ్చెను, అథః=అనంతరమందు, అగ్నిః=అగ్నిహోతృడు, మహ్యం=నాకొఱకు, రయించ=ధనమును, పుత్రాంశ్చ=తనయులను, ఇమాం=ఈచిన్నదానవైన నిన్నును, అదాత్=ఇచ్చెను.

తా॥ చందుృఁడు ముందుగా ఈ చిన్నదానిని పొంది విశ్వావసుఁడను గంధర్వున కిచ్చెను. ఆ గంధర్వుఁడు అగ్నిహోతృన కిచ్చెను. ఆ యగ్నిహోతృఁడీ చిన్నదానిని నాకొఱ కిచ్చి దీనియందు సంతానము కలుగునట్లుగాను, మాకు భాగ్యము గల్గునట్లుగా ననుగ్రహించెను.

మూ॥ గృభ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం మయాపత్యా జరదష్టి ర్య థాసః। భగో అర్యమా సవితా పురంధి ర్మహ్యం త్వా దు ర్గార్హపత్యాయ దేవాః॥

పదవి॥ గృభ్ణామి । తే। సుప్రజాస్త్వాయ । హస్తం । మయా । పత్యా । జరదష్టిః యథా । అసః । భగః । అర్యమా । సవితా । పురంధిః । మహ్యం । త్వా । అదుః । గార్హపత్యాయ । దేవాః ॥

టీక॥ పత్యా=పెనిమిటినైన, మయా=నాతోఁ గూడ, యథా = ఏ ప్రకారముగా, జరదష్టిః=ముసలితనమును, అసః=పొందెదవో, తథా=ఆ ప్రకారముగాను, సుప్రజాస్త్వాయ=సౌభాగ్యమైనసంతానము కలుగుటకొఱకు, తే=నీయొక్క, హస్తం=హస్తమును, గృభ్ణామి=పట్టుకొనుచున్నాను, పురంధిః=విశేషమైనజ్ఞానముగల, అర్య

మా=అర్యముఁడు, భగః=భగుఁడు, సవితా=సవితృఁడు అను పేర్లుగల, దేవాః=దేవతలు, గార్హపత్యాయ=గృహస్థాశ్రమముకొఱకు, త్వాం = నిన్ను, మహ్యం = నాకొఱకు, అదుః=ఇచ్చిరి॥

తా॥ ఓ చిన్నదానా! నన్ను వివాహము చేసికొని నే నెంతపర్యంతము వార్ధక్యదశను బొందియుండెదనో అంతపర్యంతము జీవించియుండుము. యోగ్యమైన సంతానమును బొందుటకు నిన్నుఁ బాణిగ్రహణమును జేసికొనుచున్నాను. విశేషమైన జ్ఞానముగలవారును దేవతలును ద్వాదశాదిత్యులలో నన్యతములు నగు భగుఁడు అర్యముఁడు, సవితృఁడు, నేను గృహస్థాశ్రమమును బొందుటకు నిన్ను నాకిచ్చునట్లు ప్రేరేపణఁజేసిరి.

మూ॥ తే హ పూర్వే జనాసో యత్ర పూర్వవహో హితాః మూర్ధ
న్వాన్ యత్ర సౌభ్రవః పూర్వో దేవేభ్య ఆతపత్॥

పదవి॥ తే । హ । పూర్వే । జనాసః । యత్ర । పూర్వవహః । హితాః । మూర్ధన్వాన్ । యత్ర । సౌభ్రవః । పూర్వః । దేవేభ్యః । ఆతపత్ ॥

టీక॥ తేహ, ఆపూర్వోక్తమైన భగుఁడు మొదలగువారును పూర్వవహః = వివాహమునకుఁ బూర్వమందుఁగర్తలై, నవారును, పూర్వేజనాసః= పూర్వులైన తండ్రి మొదలగు మనుష్యులును= యత్ర, ఏ గార్హపత్య విషయమై, హితాః= ప్రయత్నము కలవారై యుండిరో మూర్ధన్వాన్ = ప్రధానుఁడైనవాఁడును, దేవేభ్యః = దేవతలకంటె పూర్వః, మొదటివాఁడును = సౌభ్రవః, అదితి కుమారుఁడు నగు అగ్నిహోతృఁడు, యత్ర = ఏ గార్హపత్య, వేదికయందు= ఆతపత్, అంతట బ్రకాశించుచుండునో ॥

తా॥ ఏ గృహస్థాశ్రమము విషయమై చిన్నదానియొక్క తండ్రులు మొదలగువారును భగుఁడు మొదలగు దేవతలును ప్రయత్నము జేయుచుండిరో దేవతలకంటె మొదటివాఁడును, ప్రధానుఁడును, అదితి కుమారుండు నగు అగ్నిహోతృఁడు ఏ వివాహవేదిక యందు బ్రకాశించు చుండునో యట్టువంటి గార్హపత్యాశ్రమమును గుఱించి భగుఁడు మొదలగు దేవతలు నిన్ను నాకొఱకిచ్చు చున్నారు కాన నీ హస్తమును గ్రహించు చున్నానని పూర్వముతో నన్వయము.

మూ॥ సరస్వతి ప్రేద మవ సుభగే వాజినీవతి తాం త్వా విశ్వస్య భూతస్య ప్రగాయామ స్యగ్రతః ॥

పదవి॥ సరస్వతి । ప్ర । ఇదం । అవ । సుభగే । వాజినీవతి । తాం । త్వా । విశ్వస్య । భూతస్య । ప్ర । గాయామసి । అగ్రతః॥

టీక॥ సుభగే= ఓ సౌభాగ్యవంతురాలా ! వాజినీవతి = స్తోత్రములు కలదానా ! సరస్వతి = సరస్వతీదేవీ ! ఇదం = ఈ పాణిగ్రహణమును, ప్రావ = మిక్కిలి రక్షింపుము, తాం = ఆ ప్రఖ్యాతి కలదానవైన త్వా = నిన్ను, విశ్వస్య = సమస్తమైన, భూతస్య = జంతువులలో, అగ్రతః = ముందుగా, ప్రగాయామసి = స్తోత్రమును జేయుచున్నాము.

తా॥ భాగ్యవంతురాలవును, స్తుతింపఁబడుదానవు నగు నో సరస్వతీ ! యీ వివాహమును మిక్కిలి రక్షింపుము. సమస్త భూతములలో నిన్ను ముందుగా స్తోత్రము జేయుచున్నాము.

మూ॥ య ఏతి ప్రదిశ స్సర్వా దిశోఽను పవమానః । హిరణ్యహస్తా ఐరమ్మ స్స త్వా మన్మనసం కృణోతు ॥

పదవి॥ యః । ఏతి । ప్రదిశః । సర్వాః । దిశః । అను । పవమానః । హిరణ్యహస్తః । ఐరమ్మః । సః । త్వా । మన్మనసం । కృణోతు ॥

టీక॥ హిరణ్యహస్తః = భక్తులకు నిచ్చునట్టి బంగారము హస్తమందుఁ గలవాఁడును, ఐరమ్మః = అన్నమును నిలిగింపఁజేయు నగ్నిహోత్రునకు మిత్రుఁడును అగు, యః = ఏ, పవమానః = వాయువు, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను, ప్రదిశః = విదిక్కులను, అను = క్రమముగా, ఏతి = వ్యాపించుచున్నాఁడో, సః = అటువంటి వాయువు, త్వాం = నిన్ను, మన్మనసం = నాయందు మనస్సుగలదానిగా కృణోతు = చేయుఁగాక ॥

తా॥ ఏ వాయువు భక్తులకు నిచ్చుకొఱకు బంగారము హస్తమందుఁ గలవాఁడై తూర్పు మొదలగు దిక్కులయందు వ్యాపించి సంచరించుచున్నాఁడో, యన్నప్రదుఁడగు నట్టి యగ్నిహోత్రునకు స్నేహితుండగు వాయువు నిన్ను నా యందెల్లప్పుడు ప్రేమగలదానిగాఁ జేయుఁగాక॥

మూ॥ ఏక మిషే విష్ణు స్త్వా న్వేతు। ద్వే ఊర్జే విష్ణు స్త్వాన్వేతు।
త్రీణి వ్రతాయ విష్ణు స్త్వాన్వేతు। చత్వారి మాయోభ
వాయ విష్ణు స్త్వాన్వేతు। పంచ పశుభ్యో విష్ణు స్త్వాన్వేతు।
షడృతుభ్యో విష్ణు స్త్వాన్వేతు। సప్త సప్తభ్యో హోత్రాభ్యో
విష్ణు స్త్వాన్వేతు॥

పద॥ ఏకం। ఇషే। విష్ణుః। త్వా। అను। ఏతు। ద్వే। ఊర్జే। విష్ణుః। త్వా। అను। ఏతు॥ త్రీణి। వ్రతాయ। విష్ణుః। త్వా। అను। ఏతు॥ చత్వారి। మాయోభ వాయ। విష్ణుః। త్వా। అను। అను। ఏతు॥ పంచ। పశుభ్యః। విష్ణుః। త్వా। అను। ఏతు॥ షట్। ఋతుభ్యః। విష్ణుః। త్వా। అను। ఏతు॥ సప్తభ్యః। హోత్రాభ్యః విష్ణుః। త్వా। అను। ఏతు॥

టీక॥ ఏకం = ఒక యడుగును, ఇషే=అన్న సమృద్ధికలుగుటకొఱకు, త్వా= నిన్ను, విష్ణుః=విష్ణుమూర్తి, అన్వేతు= అనుసరించి నడచుఁగాక, ఊర్జే= బలము కలుగుట కొఱకు, ద్వే = రెండడుగులను, త్వా=నిన్ను, విష్ణుః=విష్ణుమూర్తి, అన్వేతు = అనుసరించి నడచుఁ గాక, వ్రతాయ= కర్మముకొఱకు, త్రీణి = మూడడుగులు, త్వా=నిన్ను, విష్ణుః=విష్ణుమూర్తి, అన్వేతు=అనుసరించి నడచుగాఁక, మాయోభవాయ=కర్మసంబంధమైన సుఖముకొఱకు, త్వా=నిన్ను విష్ణుః=విష్ణుమూర్తి అన్వేతు= అనుసరించి నడచుగాఁక॥ పశుభ్యః=పశుసమృద్ధి కొఱకు, పంచ= అయిదడుఁలు, త్వా=నిన్ను, విష్ణుః=విష్ణుమూర్తి, అన్వేతు= అనుసరించినడచుగాక, ఋతుభ్యః = ఋతుసంపత్తులకొఱకు, షట్ = ఆఱడుగులను, విష్ణుః = విష్ణుమూర్తి, త్వా = నిన్ను, అన్వేతు = అనుసరించినడచుఁగాక, సప్తభ్యః = ఏడుగురైన, హోత్రాభ్యః = హోతలకొఱకు, త్వా = నిన్ను, సప్త = ఏడడుగులను, విష్ణుః = విష్ణుమూర్తి, అన్వేతు = అనుసరించినడచుఁగాక.

తా॥ ఓ చిన్నదానా! నీవు నన్ననుసరించి నడువుము. విష్ణుమూర్తి నీవు నడచు మొదటియడుగువలన అన్నమును, రెండవయడుగువలన బలమును, మూడవ యడుగువలన కర్మమును, నాలుగవయడుగువలన కర్మసుఖమును, అయిదవయడుగు వలన పశుసమృద్ధిని, ఆఱవయడుగువలన ఋతుసంపత్తును, ఏడవయడుగువలన యజ్ఞ మును జేయించుటకు హోత, ప్రశాస్త, బ్రాహ్మణాచ్ఛంసి, పోత, నేష్ట, అచ్ఛా వాక, అగ్నీధ్రు లను నేడుగురు ఋత్విక్కులను గలుగఁ జేయుఁగాక॥

మూ॥ సఖా సప్తపదా భవ సఖాయౌ సప్తపదా బభూవ సఖ్యం తే గమేయగ్ం సఖ్యాత్తే మా యోషగ్ం సఖ్యాన్మే మా యోష్ఠా స్సమయావ సంకల్పావహై సం ప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ। ఇష మూర్జ మభిసంవసానౌ సం నౌ మనాగ్ంసి సం వ్రతా సము చిత్తా న్యాకరం। సా త్వ మస్యమూహ మ మూహ మస్మి సా త్వం ద్యౌ రహంపృథివీ త్వగ్ం రే తోఽహగ్ం రేతో భృ త్త్వం మ నోఽహ మస్మి వా క్త్వగ్ం సామాఽ హ మస్మ్యృ క్త్వగ్ం సా మా మనువ్రతా భవ పుగ్ంసే పుత్త్రాయ వేత్తవై శ్రియై పుత్త్రాయ వేత్తవ ఏహి సూనృతే॥

పదవి॥ సఖా । సప్తపదా । భవ । సఖాయౌ । సప్తపదా । బభూవ । సఖ్యం । తే । గమేయం । సఖ్యాత్ । తే । మా । యోషం । సఖ్యాత్ । మే । మా । యోష్ఠాః । సం । అయావ । సంకల్పావహై । సం । ప్రియౌ । రోచిష్ణూ । సుమనస్యమానౌ । ఇషం । ఊర్జం । అభి । సంవసానౌ । సం । నౌ । మనాంసి । సం । వ్రతాః । సం । ఉ । చిత్తాని । ఆకరం । సా । త్వం । అసి । అమః ।అహం । అమః । అహం । అస్మి । సా । త్వం । ద్యౌః । అహం । పృథివీ । త్వం । రేతః । అహం । రేతోభృత్ । త్వం ! మనః । అహం । అస్మి । వాక్ । త్వం । సామ । అహం । అస్మి । ఋక్ । త్వం । సా । మాం । అనువ్రతా । భవ । పుంసే । పుత్త్రాయ । వేత్తవైః । శ్రియై । పుత్త్రాయ । వేత్తవే । శ్రియై । పుత్రాయా । వేత్తవే । ఏహి । సూనృతే ॥

టీక॥ సప్తపదా=ఏడడుగులు కూడ, నడచినదాన వై, సఖా = స్నేహితురాలవు, భవ = అగుము, సప్తపదా = ఏడడుగులు కూడ నడచిన మన మిద్దఱము, సఖాయౌ=స్నేహితులము, బభూవ=అయ్యెదము, తే=నీయొక్క, సఖ్యం=స్నేహమును, గమేయం=పొందెదను, తే=నీయొక్క, సఖ్యాత్= స్నేహమువలన, మా యోషం=వియోగమును బొందను, మే=నాయొక్క, సఖ్యాత్ = స్నేహమువలన, మా యోష్ఠాః=వియోగమును బొందకుము, సంప్రియౌ=పరస్పరము ప్రేమగలవారమై, రోచిష్ణూ = అనుకూలమైనదాంపత్యముచే బ్రకాశించువారమై, సుమనస్యమానౌ=

మంచిమనస్సులుగలవారమై, ఇషం=అన్నమును, ఊర్జం=బలమును, అభిసంవసానౌ=కలసి యనుభవించువారమై, సమయావ = కలిసికొందము, సంకల్పావహై = ఈ కార్య మిట్లు చేయవలయు నని యాలోచించుకొందుము, నౌ = మనయొక్క మనాంసి=మనస్సులను, సమాకరం=కలిసికొనినట్లుగాఁజేసికొందము, తథా=ఆ ప్రకారముగా, వ్రతాని=వ్రతములను, చిత్తాని=బాహ్యేంద్రియములను, సమాకరం=కలిసికొనినట్లుగాఁజేసికొందము, త్వం=నీవు, సా=ఋగ్వేదము, అసి=అయితివి, అహం=నేను, అమః=సామవేదము, అస్మి=అయితిని, అహం=నేను, అమః=సామవేదము, అస్మి=అయితిని, త్వం=నీవు, సా=ఋగ్వేదము, అసి=అయితివి, అహం=నేను, ద్యౌః=ఆకాశమయితిని, త్వం=నీవు, పృథివీ=భూమి వైతివి, అహం=నేను, రేతః=వీర్యమునుంచువాఁడను, త్వం=నీవు, రేతోభృత్=రేతస్సును భరించుదానవు, అహం=నేను, మనః=మనస్సును, అస్మి=అయితిని, త్వం=నీవు, వాక్=వాక్కువు, అసి=అయితివి, అహం=నేను, సామ=సామవేదము, అస్మి=అయితిని, త్వం=నీవు, ఋక్=ఋగ్వేదము వయితివి, సా=అటువంటి, త్వం=నీవు, మాం=నన్నుగురించి, అనువ్రతా=అనుకూలమైనవ్రతముగలదానవై, భవ=అగుము, సూనృతే=సత్యవాక్కులుగలదానా!, పుంసేపుత్రాయవేత్తవై=పురుషసంతానమును, పొందుటకొఱకును, శ్రియై పుత్రాయవేత్తవే=భాగ్యముగలసంతానముపొందుటకొఱకును, ఏహి=ఇటురమ్ము॥

తా॥ ఓ చిన్నదానా! మనమిద్దఱము ఏడడుగులు కూడ నడుచుటవలన స్నేహముగలవారమైతిమి. కనుక నీ స్నేహమును బొందితిని. నీ స్నేహమునుండి నిన్ను విడువను. నా స్నేహమునుండి నన్ను విడువకుము. మనమిద్దఱము పరస్పరము ప్రేమగలవారమై యనుకూలమైన దాంపత్యము లభించుటచేఁ బ్రకాశించువారమై మంచిమనస్సులు గలవారమై సమానమైనయాహారబలములు గలవారమై యీ కార్య మిట్లు చేయవలయునని యాలోచనఁ జేసికొనుచు మన యుభయుల మనస్సుల నేకము చేసికొని ధర్మకార్యాదులను జేయుచుఁ గూడియుందుము. నేను సామవేదమును నీవు ఋగ్వేదమయితివి. అనఁగా ఋగ్వేదసామవేదములవలెనే యకవినాభావముగా నుందుము. సంయోగక్రియనుబట్టి, యూర్ధ్వమందుడుటంచే, సాకాశ సమానుండను. నీవుక్రిందుగనుండుటచే భూమితోసమానురాల వైతివి. నేను వీర్యము నుంచువాఁడను. నీ వారేతస్సును గ్రహించుదానవు. ఇంద్రియములలోఁ బ్రధానమైన

మనస్సునే నైతిని. ఆ మనస్సువలన రాఁబడినవాక్కు నీ వైతివి. ఓ సత్యవాక్కులుం గలదానా! అట్టువంటి నీవు నేఁ జేయు ధర్మకార్యములకు ననుకూలమైనదాన వై యుండుము. నీవలన భాగ్యముగలకుమారుని బొందవలయునని గాని నిట్టురమ్ము ॥

ఇతి తృతీయఖండ స్సమాప్తః

---

## —♦ అథ చతుర్థఖండప్రారంభః ♦—

మూ॥ సోమాయ జనివిదే స్వాహా ॥

పదవి॥ సోమాయ । జనివిదే । స్వాహా ॥

టీక॥ జనివిదే=వధువును బొందిన, సోమాయ = చంద్రునికొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను.

తా॥ ముందుగా ఈ వధువును బొందిన చంద్రునికొఱకు ఆజ్యాదిహవిస్సు నిచ్చుచున్నాను.

మూ॥ గంధర్వాయ జనివిదే స్వాహా॥

పదవి॥ గంధర్వాయ । జనివిదే స్వాహా ॥

టీక॥ జనివిదే = ఆ చంద్రునియనంతర మీవధువును బొందిన, గంధర్వాయ= విశ్వావసుఁ డనుగంధర్వునికొఱకు, స్వాహా = హవిస్సు, నిచ్చుచున్నాను.

తా॥ చంద్రుఁడు పొందినపిమ్మట వధువును బొందినవిశ్వావసుఁ డనుగంధర్వుని కొఱకు హవిస్సు నిచ్చుచున్నాను.

మూ॥ అగ్నయే జనివిదే స్వాహా ॥

పదవి॥ అగ్నయే । జనివిదే । స్వాహా ॥

టీక॥ జనివిదే = గంధర్వునియనంతరము వధువును బొందిన, అగ్నయే=అగ్ని హోత్రునికొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను.

తా॥ గంధర్వుని యనంతరము వధువును బొందిన యగ్నిహోత్రునికొఱకు హవిస్సు నిచ్చుచున్నాను.

మూ॥ కన్యలా పితృభ్యో యతీ పతిలోక మవ దీక్షామదాస్థ స్వాహా॥

పదవి॥ కన్యలా। పితృభ్యః। యతీ। పతిలోకం। అవ। దీక్షాం। అదాస్థ। స్వాహా॥

టీక॥ కన్యలా=కన్యక, పితృభ్యః = తండ్రిగృహములనుండి, పతిలోకం = భర్తృవంశమునుగుఱించి, యతీ = వెళ్ళుచున్నదై, దీక్షాం = కన్యకావ్రతమును, అవాదాస్థ = సమాప్తినిపొందించుచున్నది॥

తా॥ ఈ చిన్నది కన్యకావ్రతమును సమాప్తిని బొందించి వివాహమును జేసికొని పిమ్మట తండ్రిగృహమునుండి పెనిమిటియొక్కగృహమునకు వెళ్ళుచున్నది.

మూ॥ ప్రేతో ముంచాతి నాముత స్సుబద్ధా మముత స్కరత్।
యథేయ మింద్ర మీఢ్వ స్సుపుత్రా సుభగా సతీ॥

పదవి॥ ప్ర। ఇతః। ముంచాతి। న। అముతః। సుబద్ధాం। అముతః। కరత్। యథా। ఇయం। ఇద్ర। మీఢ్వః। సుపుత్రా। సుభగా। సతీ॥

టీక॥ ఇంద్ర = ఓయింద్రుడా! మీఢ్వః = వర్షముకురియజేయు, త్వం = నీవు, ఇమాం = ఈ చిన్నదానిని, ఇతః = ఈ తండ్రిగృహమునుండి, ప్రముంచాతి = విడిచిపెట్టించుము, అముతః = ఈ పెనిమిటిగృహమునుండి, నప్రముంచాతి = విడిచిపెట్టింపకుము, కింతు = ఇక నేమంటే, యథా = ఏ ప్రకారముగాను, ఇయం = ఈ స్త్రీ, సుపుత్రా = మంచికుమారులుగలదై, సుభగా = ఐశ్వర్యముగలది, సతీ = అగునో, తథా = ఆ ప్రకారముగాను, అముతః = ఈ పెనిమిటిగృహమునందు సుబద్ధాం = అనురాగముచే బంధింపఁబడినదానిగా, కరత్ = చేయుము.

తా॥ వర్షమును గురిపించి సస్యములను వృద్ధిపొందించునట్టి యో యింద్రుఁడా! ఈ చిన్నదానిని వివాహము చేసికొనినపిమ్మటఁ బుట్టినింటిపై నపేక్షలేనిదానిగాను, పెనిమిటిగృహమునందే యపేక్షగలిగి ప్రేమగలదానిగాను యోగ్యులైనతనయులుగలదానిగాను భాగ్యముగలదానిగాను జేయుము.

మూ॥ ఇమాం త్వ మింద్ర మీఢ్వ స్సుపుత్రాగ్ం సుభగాం *
దశా స్యాం పుత్రా నాధేహి పతి మేకాదశం కృధి॥

---

* కురుకృణుఇతివాపాఠః

ప॥ ఇమాం। త్వం। ఇంద్ర। మీఢ్వః। సుపుత్రాం। సుభగాం। కురు। దశ। అస్యాం। పుత్రాన్। ఆధేహి। పతిం। ఏకాదశం। కృధి॥

టీక॥ ఇంద్ర = ఓ యింద్రుఁడా! మీఢ్వః = వర్షము కురియఁజేయు, త్వం= నీవు, ఇమాం = ఈ చిన్నదానిని, సుపుత్రాం = యోగ్యమైన తనయులుగలదాని గాను, సుభగాం = భాగ్యముగలదానిగాను, కురు = చేయుము, అస్యాం = ఈ స్త్రీ యందు, దశ = పదుగురైన, పుత్రాన్ = తనయులను, ఆధేహి =ఉంచుము, పతిం = పెనిమిటినైన, మాం = నన్ను, ఏకాదశం = పదునొకండవవానిగా, కృధి = చేయుము.

తా॥ ఓ యింద్రుఁడా! ఈ స్త్రీని యోగ్యమైనతనయులుగలదానిగాను భాగ్యము గలదానిగాను చేసి దీనియందు దీర్ఘాయుష్మంతులైన పదుగురుతనయులను గలుగఁజేసి పుత్త్రులయొక్క సంఖ్యచే బదునొకండవవానిగా ననినన్ను జీవింపజేయుము.

మూ॥ అగ్నిరైతు ప్రథమో దేవతానాగ్ం సో స్యై ప్రజాం
ముంచతు మృత్యుపాశాత్। త దయగ్ం రాజా వరుణో ను
మన్యతాం య థేయగ్ స్త్రీ పౌత్త్రమఘం న రోదాత్॥

పదవి॥ అగ్నిః। ఆ। ఏతు। ప్రథమః। దేవతానాం। సః। అస్యై। ప్రజాం। ముంచతు మృత్యుపాశాత్। తత్। అయం। రాజా। వరుణః। అను మన్యతాం। యథా। ఇయం। స్త్రీ। పౌత్రం। అఘం। న। రోదాత్।

టీక॥ దేవతానాం=దేవతలలో, ప్రథమః=మొదటివాఁడైన, అగ్నిః=అగ్ని హోత్రుఁడు, ఐతు=వచ్చుగాక, సః=ఆ యగ్నిహోత్రుఁడు, అస్యై=ఈ చిన్న దానియొక్క, ప్రజాం=సంతానమును, మృత్యుపాశాత్=మృత్యుసంబంధమైన త్రాటి వలన, ముంచతు=విడిచిపెట్టించుఁగాక, అనఁగా బహుకాలము జీవించియుండునట్లు చేయుఁగాక, ఇయం=ఈ, స్త్రీ=ఆఁడుది, యథా=ఏ ప్రకారముగా, మోచితా= మృత్యువువలన విడిచిపెట్టించఁబడినదై, పౌత్రం=పుత్రసంబంధమైన, అఘం=వ్యసన మునుగుఱించి, నరోదాత్=దుఃఖించదో, అయం=ఈ, రాజా = రాజగు, వరుణః= వరుణదేవుఁడును, తత్ = ఆ యగ్నిచేఁ జేయఁబడినకార్యమునే, అనుమన్యతాం= అంగీకరించుగాక॥

తా॥ దేవతలలో మొదటివాఁడగు యగ్నిహోతృఁడు వచ్చి యీ చిన్నదియు యీ చిన్నదానియొక్క సంతానమును మృత్యువును జెందకుండునట్లు చేసి యీమెకు పుత్త్రసంబంధమైనదుఃఖమును గలుఁగకుండునట్లు చేయుఁగాక. ప్రభువగు వరుణదేవుఁడును అగ్నిహోతృనిచేఁ జేయఁబడిన యీ కార్యమునే అంగీకరించుఁగాక.

మూ॥ ఇమా మగ్ని స్త్రాయతాం గార్హపత్యః ప్రజా మస్యై నయతు దీర్ఘమాయుః । అశూన్యోపస్థా జీవతా మస్తు మాతా పౌత్రమానంద మభిప్రబుధ్యతా మియం ॥

పదవి॥ ఇమాం । అగ్నిః । త్రాయతాం । గార్హపత్యః । ప్రజాం । అస్యై । నయతు । దీర్ఘం । ఆయుః । అశూన్యోపస్థా । జీవతాం । అస్తు । మాతా । పౌత్రం । ఆనందం । అభి । ప్ర । బుధ్యతాం । ఇయం ॥

టీక॥ గార్హపత్యః = వివాహసంబంధమైన, అగ్నిః = అగ్నిహోతృఁడు, ఇమాం = ఈ స్త్రీని, త్రాయతాం = రక్షించుఁచుగాక, అస్యై = ఈ చిన్నదానియొక్క, ప్రజాం = సంతానమును, దీర్ఘం = విశేషమైన, ఆయుః = ఆయుర్దాయమును, నయతు = పొందించుఁగాక, ఇయం = ఈ స్త్రీ, అశూన్యోపస్థా = పుత్రులచే నలంకరింపఁబడిన తొడలుగలదై, జీవతాం = చిరకాలము జీవించియుండు పుత్రులకు, మాతా = తల్లి, అస్తు = అగుఁగాక, ఇయం = ఈ స్త్రీ, పౌత్త్రం = పుత్రసంబంధమైన, ఆనందం = సంతోషమును, అభిప్రబుధ్యతాం = పొందుఁగాక॥

తా॥ వివాహసంబంధమైన యగ్నిహోత్రము ఈ చిన్నదానిని ఈ చిన్నదానికిఁ గలుగుసంతానమును దీర్ఘాయుర్దాయమొసఁగి రంక్షించుఁగాక. ఈ చిన్నదానియొక్క తొడలు తనయులచే నలంకరింపఁబడుఁగాక. ఈ చిన్నదాని సంతానము చిరకాలము జీవించియుండుటచే తత్సంబంధమైన సంతోషమును ఈ చిన్నది యెల్లప్పుడు పొందుచుండుఁగాక.

మూ॥ మా తే గృహే నిశి ఘోష ఉత్థా దన్యత్ర త్వ ద్రుదత్య స్సంవిశంతు। మా త్వం వికే శ్యుర ఆవధిష్ఠా జీవపత్నీ పతిలోకే విరాజ పశ్యంతీ ప్రజాగ్ం సుమనస్యమానాం॥

పదవి॥ మా । తే । గృహే । నిశి । ఘోషః । ఉత్థాత్ । అన్యత్ర । త్వత్ । రుదత్యః । సం । విశంతు । మా । త్వం । వికేశీ । ఉరః । ఆవధిష్ఠాః । జీవపత్నీ । పతిలోకే విరాజ । పశ్యంతీ । ప్రజాం । సుమనస్యమానాం॥

టీక॥ తే=నీయొక్క, గృహే=గృహమునందు, నిశి=రాత్రియందు, ఘోషః=రోదనధ్వని, మోత్థాత్=పుట్టకుండుఁగాక, రుదత్యః=ఏడ్చునట్టుస్త్రీలు, త్వత్=నీకంటె, అన్యత్ర = మఱియొకస్థలమునందు, సంవిశంతు = నివసింతురుగాక। త్వం = నీవు, వికేసీ = తలవిరియబోసికొనినదానవై, మావధిష్ఠాః = కొట్టుకొనకుము। జీవపత్నీ=జీవించియుండు పెనిమిటిగలదానవై, పతిలోకే=పెనిమిటియొక్కగృహము నందు, సుమనస్యమానాం=క్షేమముగల, ప్రజాం=సంతానమును, పశ్యంతీ=చూచు చున్నదానవై, విరాజ=ప్రకాశించుము.

తా॥ ఓ చిన్నదానా! మన గృహమందు రాత్రియందైనను రోదనధ్వని పుట్ట కుండుఁగాక. రోదనముచేయువారెవరైన నుండిరేని వారు నీవుండుచోటున నుండక దూరముగా మఱియొకస్థలమందుండుఁగాక. నీవు తల విరియఁబోసికొని యే కారణముచేతనైనను వక్షస్థలమును గొట్టుకొనకుము. యోగ్యమైన సంతాన మును బొంది యా సంతానమును జిరకాలము జీవించనుండు పెనిమిటిని జూచి సంతోషించుచుఁ బ్రకాశించుచుండుము.

మం॥ ద్యౌస్తే పృష్ఠగ్ం రక్షతు వాయు రూరూ అశ్వినౌ చ
స్తనం ధయంతగ్ం సవి తాభిరక్షతు । ఆవాససః పరిధానా
ద్బృహస్పతి ర్విశ్వేదేవా అభిరక్షంతు పశ్చాత్ ॥

పదవి॥ ద్యౌః । తే । పృష్ఠం । రక్షతు । వాయుః । ఊరూ । అశ్వినౌ । చ, స్తనం । ధయంతం । సవితా । అభి । రక్షతు । ఆ । వాససః । పరిధానాత్ । బృహస్పతిః । విశ్వే । దేవాః । అభి । రక్షంతు । పశ్చాత్ ॥

టీక॥ తే=నీయొక్క, పృష్ఠం = వెనుకటిభాగమును, ద్యౌః = ఆకాశము, రక్షతు=రక్షించుఁగాక, వాయుః=వాయువు, తే=నీయొక్క, ఊరూ=తొడలను రక్షతు=రక్షించుఁగాక, అశ్వినౌచ = అశ్వినీదేవతలు, స్తనం=స్తనములను, రక్ష తాం=రక్షించుఁగాక, సవితా=సూర్యుఁడు, ధయంతం=కుమారుని, అభిరక్షతు=

రక్షించుగాక, బృహస్పతిః=బృహస్పతి, పరిధానాత్=ధరించిన, ఆవాససః=వస్త్రమువలన, (వస్త్రమును) అభిరక్షతు=రక్షించుగాక, విశ్వేదేవాః = విశ్వేదేవతలు, పశ్చాత్=వెనుకభాగమును, అభిరక్షంతు=రక్షించుగాక ॥

తా॥ ఓ చిన్నదానా! నీ కటిప్రదేశమును ఆకాశమును, తొడలను వాయువును, స్తనములను అశ్వినీదేవతలును, కుమారుని సూర్యుడు. ధరించిన వస్త్రమును బృహస్పతియు, వెనుకభాగమును, విశ్వేదేవతలును రక్షింతురుగాక.

మూ॥ అప్రజస్తాం పౌత్రమృత్యుం పాప్మాన ముత వాఽఘం శీర్ష్ణః
స్రజ మి వోన్ముచ్య ద్విషద్భ్యః ప్రతిముంచామి పాశం॥

పదవి॥ అప్రజస్తాం । పౌత్రమృత్యుం । పాప్మానం । ఉత । వా । అఘం । శీర్ష్ణః । స్రజం । ఇవ । ఉన్ముచ్య । ద్విషద్భ్యః । ప్రతిముంచామి । పాశం॥

టీక॥ అప్రజస్తాం=సంతానము లేకపోవుటను, పౌత్రమృత్యుం, పుత్రసంబంధమైనమరణమును, పాప్మానం=పాపమును, ఉత=ఇంతియే కాదు, అఘం=పాపమువల్లనైనవ్యసనమును, శీర్ష్ణః=శిరస్సునుండి, స్రజమివ=మాలికనువలెనే, ఉన్ముచ్య=తీసి, ద్విషద్భ్యః, శత్రువులకొఱకు, పాశమివ=పాశమునువలెనే, ప్రతిముంచామి=విడిచిపెట్టించుచున్నాను.

తా॥ సంతానము లేకపోవుటయు పుత్రులు కలిగి నశించుటయు మఱి యితరమైన పాపముగాని ఆ పాపనిమిత్తమైన వ్యసనముగాని మొదలగు నే దోషములు కలవో యట్టి దోషములను శిరస్సునుండి మాలికను తీసి వృక్షము మొదలగువానియం దుంచినరీతిగా బంధించునట్టి త్రాటినివలెనే నా శత్రువుల కొఱకు విడిచి పెట్టుచున్నాను.

మూ॥ ఇమం మే వరుణ శ్రుధీహావ మద్యా చ మృడయ త్వా
మవస్యు రాచకే॥

పదవి॥ ఇమం । మే । వరుణ । శ్రుధి । హావం । అద్య । చ । మృడయ । త్వాం । అవస్యుః । ఆచకే॥

టీక॥ వరుణ = ఓ వరుణుడా! మే=నాయొక్క, ఇమం=ఈ, హావం=పిలుపును, శ్రుధి=వినుము, అద్యాచ=ఇప్పుడే, మృడయ=సుఖపెట్టుము, అవస్యుః=రక్షణమును గోరినవాడనై, త్వాం=నిన్ను, ఆచకే=స్తోత్రముజేయుచున్నాను.

తా॥ ఓవరుణదేవుఁడా! నేను నిన్నుఁబిలుచునట్టి పిలుపును విని నన్నిప్పుడే సుఖపెట్టుము. నన్ను రక్షించుటకొఱకు నిన్ను స్తోత్రము చేయుచున్నాను.

మం॥ తత్త్వా యామి బ్రహ్మణా వందమాన స్తదాశాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ంస మాన ఆయుః ప్రమోషీః॥

పదవి॥ తత్ । త్వా । యామి । బ్రహ్మణా । వందమానః । తత్ । ఆశాస్తే । యజమానః । హవిర్భిః । అహేడమానః । వరుణ । ఇహ । బోధి । ఉరుశంస । మా । నః । ఆయుః । ప్రమోషీః ॥

టీక॥ వరుణ = వరుణుఁడా! ఉరుశంస = అనేకులు స్తోత్రము చేయఁదగినవాఁడా! నః = మాయొక్క, ఆయుః = ఆయుర్దాయమును, మాప్రమోషీః = హీనపఱుపకుము, అహేడమానః = కోపములేనివాఁడవై, ఇహ = ఈ కర్మమునందు, నేజేయు స్తోత్రమును, బోధి = తెలిసికొనుము, తత్ = అనంతరము, త్వా = నిన్ను, యామి = నా యభిలాషములను కోరుచున్నాను, యజమానః = యజమానుఁడు, బ్రహ్మణా = వేదముచేతను, వందమానః = నమస్కరించుచున్నవాఁడై, హవిర్భిః = ఆజ్యాదిహవిస్సులచేఁ దృప్తిపఱుచుచు, తత్ = నేగోరునట్టిదానినే, ఆశాస్తే = కోరుచున్నాఁడు.

తా॥ అందఱిచేఁగొనియాడఁదగిన యోవరుణుఁడా! మా యాయుర్దాయమును భంగపఱుపకుము. మేము చేయునట్టికర్మములయందు మా పిలుపును గోపములేనివాఁడవై వినుము. అనంతరము నా మనస్సునందుండు కోరికలను వేఁడుచున్నాను. కర్మములను జేయుప్రతియజమానుఁడును నేగోరునట్టిదానినే కోరుచున్నాఁడు.

మం॥ త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడో వయాసిసీష్ఠాః యజిష్ఠో వహ్నితమ శ్శోశుచానో విశ్వాద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్యస్మత్॥

పదవి॥ త్వం । నః । అగ్నే । వరుణస్య । విద్వాన్ । దేవస్య । హేడః । అవ । యాసిసీష్ఠాః । యజిష్ఠః । వహ్నితమః । శోశుచానః । విశ్వా ద్వేషాంసి । ప్రముముగ్ధి । అస్మత్ ॥

టీక॥ అగ్నే=ఓయగ్నిహోత్రుఁడా!, దేవస్య=దేవుఁడైన, వరుణస్య=వరుణు నకు, నః=మావిషయమై, యత్=ఏ, క్రోధః=కోపములుకలదో, తం=ఆ కోపమును, అవయాసిసీష్ఠాః=మళ్లిపోవులాగునఁ జేయుము, యజిష్ఠః=మిక్కిలిపూజింపఁబడిన వాఁడవై, వహ్నితమః=హవిస్సులను మోయుచున్నవాఁడవై, శోశుచానః=మిక్కిలి ప్రకాశించుచు, విశ్వాద్వేషాంసి=శత్రువులకు మాయందుండిన్ని విరోధములను అస్మత్=మాకలన, ప్రముముగ్ధి=విడిచిపెట్టించుము.

తా॥ ఓయగ్నిహోత్రుఁడా ! వరుణదేవునకు మాయందుండుకోపమును బోఁ గొట్టుము. యజ్ఞాదికార్యములయందుఁ బూజింపఁబడువాఁడవును, దేవతలహవిస్సును మోయుచుండెడివాఁడవును, మిక్కిలిప్రకాశించువాఁడవును నగునీవు శత్రువులం మాకుఁ జేయు విరోధకార్యములు మమ్ములనుబొందక వ్యర్థమగునట్లు చేయు చుండుము.

మూ॥ స త్వం నో అగ్నేఽవమో భ వోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ। అవయక్ష్వ నో వరుణగ్ం రరాణో వీహి మృడీకగ్ం సుహవో న ఏధి॥

పదవి॥ సః । త్వం । నః । అగ్నే । అవమః । భవ । ఊతీ నేదిష్ఠః । అస్యాః । ఉషసః । వ్యుష్టౌ । అవయక్ష్వనః । వరుణం । రరాణః । వీహి । మృడీకం । సుహవః । నః । ఏధి॥

టీక॥ అగ్నే=ఓయగ్నిహోత్రుఁడా! అవమః=దేవతలలో మొదటివాఁడవును, సః=ఆ పూర్వోక్తమైన, త్వం=నీవు, నః=మాయొక్క, ఊతీ నేదిష్ఠః=రక్షించుటకై సమీపమందుండువాఁడవై, భవ=అగుము, అస్యాః=ఈ, ఉషసః=ప్రాతఃకాలము యొక్క, వ్యుష్టౌ=ఆవిర్భావము కలిగియుండఁగా అనఁగా నిప్పుడే అనుట, రక్ష= రక్షింపుము, వరుణం=వరుణుని, అవయక్ష్వ=కోపము వదలువానిగాఁ జేయుము, నః=మాకొఱకు రరాణః=ఇష్టముల నిచ్చుఁగాక, మృడీకం=సుఖపెట్టుహవిస్సును, వీహి=భక్షించుఁగాక, సుహవః=మంచివాహనముగలవాఁడవై వచ్చి, నః=మమ్ము లను, ఏధి=వృద్ధిపొందించుము॥

తా॥ ఓ యగ్నిహోత్రుఁడా ! దేవతలలో మొదటివాఁడవును ఆ ప్రసిద్ధమైన నీవు మమ్ములను రక్షించుటకొఱకు ఎల్లప్పుడును మావద్ద నుండుము. వరుణుని

మాయందుఁ గోపములేనివానిగాఁ జేయుము. యజ్ఞాదులయందు మేమిచ్చునట్టి యాజ్యాదిహవిస్సును భుజియించి మంచివాహనముగలవాఁడవై వచ్చి మాకోర్కె- లను నిండింపుము.

మం॥ త్వ మగ్నే అయా స్యయాస న్మనసా హితః। అయాసన్ హవ్య మూహిషేఽయా నో ధేహి భేషజం॥

పదవి॥ త్వం । అగ్నే । అయాః । అసి । అయాః। సన్ । మనసా । హితః । అయాః । సన్ । హవ్యం । ఊహిషే । అయాః । నః । ధేహి ॥ భేషజం॥

టీక॥ అగ్నే=ఓయగ్నిహోత్రుఁడా! త్వం=నీవు, అయాః=భక్తులచే బొంద దగినవాఁడవై, అసి=అయితివి, అయాస్సన్=భక్తులచేఁ బొందదగినవాఁడవగుచు, మనసా=మనస్సుచేత, హితః=ధ్యానింపఁబడుచున్నావు, అయాస్సన్=భక్తులచేఁ బొందదగినవాఁడవగుచు, హవ్యం=మావంటివారిచే నియ్యఁబడెడి యాజ్యాదిహ విస్సును, ఊహిషే=దేవతలకొఱకు మోసికొని పోవుచున్నావు, అయాః=భక్తులచేఁ బొందదగిననీవు, నః=మాకొఱకు, భేషజం=దుఃఖనివృత్తికరమైన యౌషధమును, ధేహి=కలుగఁజేయుము.

తా॥ ఓ యగ్నిహోత్రుఁడా! నీవు భక్తులచే బొందదగినవాఁడవు గాన నిన్ను మేము మనస్సుచే ధ్యానించుచున్నాము. మాచే నియ్యఁబడు ఆజ్యాదిహ విస్సును దేవతలకొఱ కిచ్చినట్టివాఁడవు. దుఃఖనివృత్తికరమైనమందును మాకుఁ గలుగఁజేయుము.

ఇతిచతుర్థః ఖండ స్సమాప్తః

---

## —♦ పంచమఖండ ప్రారంభః ♦—

మం॥ ఆతిష్ఠేమ మశ్మా న మశ్మేవత్వగ్గ్ స్థిరా భవ। అభి తిష్ఠ పృతన్యత స్సహస్వ పృతనాయతః ॥

పదవి॥ ఆతిష్ఠ । ఇమం । అశ్మానం । అశ్మా । ఇవ । త్వం ॥ స్థిరా । భవ। అభి । తిష్ఠ । పృతన్యతః । సహస్వ । పృతనాయతః ॥

టీక॥ ఇమం=ఈ, అశ్మానం=రాతిని, ఆతిష్ఠ=అధిష్ఠించుము, త్వం=నీవు, అశ్మేవ=రాయివలెనే, స్థిరా=శాశ్వతమైనదానవై, భవ = ఉండుము, పృతన్యతః=

యుద్ధముచేయఁగోరికగలవారిని, అభితిష్ఠ=ఎదుర్కొనుము, పృతనాయతః=యుద్ధము చేయుచుండెడివారిని, సహస్వ=సహింపుము.

తా॥ ఓ చిన్నదానా! నీవు ఈ రాతిని నధిష్ఠించుము. నీవు రాయివలెనే శాశ్వతముగా నుండుము. యుద్ధముచేయువారల నెదుర్కొని వారి యార్భాటమును సహించి యుద్ధముచేయుము.

మూ॥ ఇయం నా ర్యుపబ్రూతే కుల్పా న్యావపంతికా । దీర్ఘాయు రస్తు మే పతి ర్జీవాతు శరద శ్శతం॥

పదవి॥ ఇయం । నారీ । ఉప । బ్రూతే । కుల్పాని। ఆవపంతికా । దీర్ఘాయుః । అస్తు । మే । పతిః । జీవాతు । శరదః ॥ శతం॥

టీక॥ ఇయం = ఈ, నారీ = స్త్రీ, కుల్పాని = పేలాలను, ఆవపంతికా = హోమమునుచేయుచున్నదై, మే = నాయొక్క, పతిః = పెనిమిటి, దీర్ఘాయుః = చిరాయువుగలవాఁడై, అస్తు = అగుఁగాక, శతం = నూఱైన, శరదః = సంవత్సరములను, జీవాతు = బ్రతికియుండుఁగాక, ఇతి = ఈలాగునని, ఉపబ్రూతే = పలుకుచున్నది॥

తా॥ ఈ చిన్నది పేలాలను హోమముచేయుచు నా భర్త చిరాయువు గలవాఁడై నూఱుసంవత్సరముల పర్యంతము జీవించి యుండవలయు నని మనంబునఁ దలఁచుచున్నది.

మూ॥ తుభ్య మగ్రే పర్యవహ న్సూర్యాం వహతునాసహ । పునః పతిభ్యో జాయాం దా అగ్నే ప్రజయా సహ ॥

పదవి॥ తుభ్యం । అగ్రే । పర్యవహన్ । సూర్యాం । వహతునా । సహ । పునః । పతిభ్యః । జాయాం । దాః । అగ్నే । ప్రజయా । సహ ॥

టీక॥ అగ్నే=ఓ యగ్నిహోత్రుడా!, తుభ్యం=నీకొఱకు, అగ్రే=ముందుగా, సూర్యాం=వివాహాధిష్టానదేవతయగుసూర్యయనుదానిని, వహతునాసహ=పిత్రుపులమందుండినచిన్నదానితోఁ గూడ, పర్యవహన్=ఇచ్చిరి, పునః=ఇప్పుడు, పతిభ్యః=పెనిమిటినైననాకొఱకు, ప్రజయాసహ=సంతానముతోఁ గూడ, జాయాం=భార్యగా, దాః=ఇమ్ము.

తా॥ ఓయగ్నిహోతృఁడా! ఈ చిన్నదానిని దండ్రిమొదలగువారు వివాహాధిష్ఠానదేవత యగునార్యయనుదేవతతోఁ గూడ బూర్వమందు నీ కిచ్చిరి. ఇప్పు డీచిన్నదానిని నాకు భార్యగాఁజేసి దీనియందు నావలన సంతానము పొందునట్లు చేయుము.

మూ॥ పునః పత్నీ మగ్ని రదా దాయుషా సహ వర్చసా దీర్ఘాయు
రస్యా యః పతి స్స ఏతు శరద శ్శతం॥

పదవి॥ పునః। పత్నీం। అగ్నిః। అదాత్। ఆయుషా। సహ। వర్చసా। దీర్ఘాయుః। అస్యాః। యః। పతిః। సః॥ ఏతు। శరదః। శతం॥

టీక॥ పునః=తిరిగి, అగ్నిః=అగ్నిహోతృఁడు, ఆయుషా=ఆయుర్దాయము తోడను, వర్చసాసహ=వర్చస్సుతోడను, పత్నీం=భార్యను, అదాత్=ఇచ్చుఁగాక, అస్యాః=ఈ స్త్రీయొక్క, యః=ఏ, పతిః=పెనిమిటి గలఁడో, సః=అతఁడు, దీర్ఘాయుః=చిరకాలాయుర్దాయముగలవాఁడై, శతం=నూరైన, శరదః=సంవత్సరములు ఏతు=జీవించియుండుగాక.

తా॥ అగ్నిహోత్రుఁడు ఈ చిన్నదానిని దీర్ఘాయువు కాంతి గలదానిఁగాఁజేసి తిరిగి నాకొఱకు భార్యగా నిచ్చుఁగాక. ఈ చిన్నదానియొక్క పెనిమిటియు చిరకాలాయువు గలిగి నూఱుసంవత్సరముల పర్యంతము జీవించియుండుఁగాక.

మూ॥ విశ్వాః ఉత త్వయా వయం ధారా ఉదన్యా ఇవ అతిగాహే
మహి ద్విషః॥

పదవి॥ విశ్వాః। ఉత। త్వయా। వయం। ధారాః। ఉదన్యాః। ఇవ। అతిగాహేమహి। ద్విషః.

టీక॥ ఉత=ఇంతే కాదు, అగ్నే=ఓయగ్నిహోతృఁడా! వయం=మేము, త్వయా=నీసహాయముతోఁగూడినవారమై, వృషభాదయః=ఎద్దులు మొదలగునవి, ఉదన్యాః=జలసంబంధమైన, ధారాఃఇవ=ప్రవాహములనువలెనే, విశ్వాః=సమస్తమైన, ద్విషః=శత్రువులను, అతిగాహేమహి=అతిక్రమించి యుండఁగలము.

తా॥ ఓయగ్నిహోతృఁడా! మేము నీసహాయముగలవారమై యెద్దులు మొదలగునవి జలప్రవాహములను వలెనే సమస్తమైనశత్రువులను లక్ష్యముచేయక యతిక్రమించి యుండఁగలము.

మూ॥ ఆతిష్ఠే మమ శ్మాన మశ్మేవ త్వగ్గ్ స్థిరా భవ ॥

ఈ మంత్రమునకు గతంబున అర్థము మొదలగునవి చెప్పఁబడియుండెను.

మూ॥ అర్యమణం ను దేవం కన్యా అగ్ని మయక్షత । స ఇమాం దేవో అధ్వరః ప్రేతో ముంచాతి నాముత స్సుబద్ధా మముత స్కరత్ ॥

పదవి॥ అర్యమణం । ను । దేవం । కన్యాః । అగ్నిం । అయక్షత । సః । ఇమాం । దేవః । అధ్వరః । ప్ర । ఇతః । ముంచాతి । న । అముతః । సుబద్ధాం । అముతః । కరత్.

టీక॥ అర్యమణం = శీఘ్రముగా సంచరించునట్టి, అగ్నిందేవం = అగ్నిదేవుని, కన్యాః = స్త్రీలు, పూర్వం = మును పు, అయక్షత = పూజించిరి, అధ్వరః = హింసింపని, సః = ఆ, దేవః = అగ్ని దేవుఁడు, ఇమాం = ఈ స్త్రీని, ఇతః = ఈ తండ్రి గృహమునుండి, ముంచాతి = విడిచి పెట్టించుఁగాక, అముతః = భర్తృగృహమువలన, నముంచాతి=విడిచిపెట్టింపకుండుఁగాక, కింతు = ఇఁక నేమనిన, అముతః = పెనిమిటి గృహమునందు, ఇమాం = ఈ స్త్రీని, సుబద్ధాం = మిక్కిలి అనురాగముగలదానిగా, కరత్ = చేయుఁగాక.

తా॥ పూర్వమందు స్త్రీలు అగ్నిహోతృని బూజించి తమ కిష్టమైనభర్తలను బొందిరి. లోకోపకారకుఁడైనయట్టియగ్నిహోతృఁడీ చిన్నదానిని వివాహమైన పిమ్మటఁ దండ్రిగృహమునం దపేక్షవదిలించి భర్తృగృహమునకుఁ బంపి యచ్చటనే విశేషానురాగము గలదానిగాఁ జేయుచుండుఁగాక.

మూ॥ తుభ్య మగ్రే పర్యవహా॥౯॥పునః పత్నీ మగ్ని రదాత్ ॥౧౦॥ విశ్వా ఉత త్వయా వయం ॥౧౧॥ ఆతిష్ఠేమమ శ్మానమశ్మేవ త్వగ్గ్ స్థిరా భవ॥

యీ మంత్రములకు అర్థము మొదలగునవి మున్ను చెప్పఁబడినవి॥

మూ॥ త్వ మర్యమా భవసి యత్కనీనాం నామ స్వధావ త్స్వర్యం బిభర్షి అంజంతి వృక్షగ్ం సుధితం న గోభి ర్య ద్దంపతీ సమనసా కృణోషి ॥

పదవి॥ త్వం । అర్యమా ! భవసి । యత్ । కనీనాం । నాను । స్వధావత్ । స్వర్యం ॥ బిభర్షి । అంజంతి । వృక్షం । సుధితం । న । గోభిః । యత్ । దంపతీ । సమనసా । కృణోషి.

టీక॥ యత్=ఏ హేతువువలన కనీనాం=కన్యకలకు, స్వధావత్=అన్నయుక్తమైన, స్వర్యం=స్వర్గఫలమును, బిభర్షి=ధరించితివో, తత్=ఆ హేతువు వలన, త్వం=నీవు, అర్యమా=దాతవు, భవసి=అయియుంటివి, యథా=ఏ ప్రకారముగాను గోభిః=ఆజ్యాదులచేత, వృక్షం=వృక్షము, నసుధితం=వృద్ధిహొందదో, వృక్షం=వృక్షము జలేన=జలముచేత, యథా=ఏ ప్రకారముగాను, అంజంతి=తడుపుదురో, యత్=ఏ హేతువువలన, దంపతీ=భార్యాభర్తలను, సమనసా=సమాన మనస్సుగలవారినిగా, కృణోషి=చేయుచున్నావో, తత్=ఆ హేతువువలన, నీవు దాతవు.

తా॥ ఓ యగ్నిహోతృడా! ఏ హేతువువలన స్త్రీలును వేమను స్వధా స్వాహా శబ్దయుక్తములైన హవిస్సులు స్వర్గము నీ యధీనములైనవో వృక్షము ఆజ్యాదులచే పెరుగక జలముచే నే రీతిఁ బెరుగునో ఆ తీరుగా నెట్లు దంపతులను అన్యోన్యాను రాగము గలవారినిగాఁ జేయుచున్నావో ఆ హేతువువలన నీవు దేవతలలో దాతవై యుంటివి.

మూ॥ తుభ్య మగ్రే పర్యవహన్ ॥౧౮॥ పునః పత్నీ మగ్నిరదాత్ ॥
మూ॥ విశ్వా ఉత త్వయా వయం ॥

యీ మంత్రములకు అర్థాదులు మున్నె చెప్పఁబడినవి.

మూ॥ ప్రత్వా ముంచామి వరుణస్య పాశా ద్యేన త్వాబధ్నా
త్సవితా సుకేతః। ధాతు శ్చ యోనౌ సుకృతస్య లోకే
స్యోనం తే సహ పత్యా కరోమి ॥

పదవి॥ ప్ర । త్వా । ముంచామి । వరుణస్య । పాశాత్ । యేన । త్వా । అబధ్నాత్ । సవితా । సుకేతః । ధాతుః । చ । యోనౌ । సుకృతస్య । లోకే । స్యోనం । తే । సహ । పత్యా । కరోమి॥

టీక॥ సవితా=అన్నిఁటిని ప్రేరేపణఁజేయువాఁడును, సుకేతః=మంచిచిత్తము గలవాఁడు నగు వరుణుఁడు, యేన=ఏ పాశముచే, త్వా=నిన్ను, అబధ్నాత్=బం

ధించెనో, వరుణస్య=వరుణదేవునియొక్క, తస్మాత్=ఆ, పాశాత్=రజ్జువువలన, త్వా=నిన్ను, ప్రముంచామి=విడిచిపెట్టించుచున్నాను, సుకృతస్య=పుణ్యమునకు యోనౌ=కారణమైన, ధాతుః=బ్రహ్మయొక్క, లోకే=లోకమునందు, పత్యా=పెనిమిటితోనైన, మయాసహ=నాతోఁగూడ, తే=నీకు, స్యోనం=సుఖకరమగుస్థానమును, కరోమి=చేయుచున్నాను.

తా॥ ఓ చిన్నదానా! వరుణదేవుఁడేపాశముచే నిన్ను బంధించెనో యట్టి పాశమునుండి నిన్ను వదలించునట్లుగా ఈ త్రాటిని విప్పుచున్నాను గాన కల్మషరహితులమై మన మిద్దఱము పుణ్యములచే సుఖమును గలుగఁజేయునట్టిబ్రహ్మలోకమునందు వసింపఁగలము.

మూ॥ ఇమం విష్యామి వరుణస్య పాశం య మబధ్నీత సవితా సుశేవః। ధాతుశ్చ యోనౌ సుకృతస్య లోకేఽరిష్టాం త్వా సహ పత్యా కృణోమి॥

పదవి॥ ఇమం॥ విష్యామి । వరుణస్య । పాశం । యం । అబధ్నీత । సవితా । సుశేవః । ధాతుః । చ । యోనౌ । సుకృతస్య । లోకే । అరిష్టాం । త్వా । సహ । పత్యా । కృణోమి.

అ॥ సవితా=అన్నింటిని ప్రేరేపణజేయువాఁడును, సుశేవః=భర్తులకు సుఖమునిచ్చువాఁడు నగువరుణుఁడు, యం=ఏ పాశమును అబధ్నీత=బంధించెనో, వరుణస్య=వరుణునియొక్క, ఇమం=ఈ, పాశం=పాశమును, విష్యామి=విప్పుచున్నాను, సుకృతస్య=పుణ్యమునకు, యోనౌ=కారణమైన, ధాతుః=బ్రహ్మయొక్క, లోకే=లోకమునందు, పత్యాసహ=పెనిమిటితోనైన నాతోఁగూడ, త్వాం=నిన్ను, అరిష్టాం=నాశనములేనిదానిగా, కృణోమి=చేయుచున్నాను.

తా॥ అన్ని జీవములను ప్రేరేపించువాఁడును భర్తులకు సుఖమునిచ్చువాఁడు నగు వరుణదేవుఁడే పాశముచే బంధించెనో ఆ పాశమునుండి నిన్ను విడిపించునట్లు నీ నడుమునుండి త్రాటిని విప్పుచున్నాను. కాఁబట్టి పుణ్యమునకుఁ గారణభూతమైన బ్రహ్మలోకమునందు మన మిద్దఱము నాశములేనివారమై యుందుము.

మూ॥ అయా శ్చాఽగ్నే స్యనభిశ స్తి శ్చ సత్య మి త్వ మయా అసి।
అయసా మనసా ధృతో య సా హవ్య మూహిషే. యా
నో ధేహి భేషజం॥

ప॥ అయాః । చ । అగ్నే । అసి । అనభిశ స్తిః । చ । సత్యం । ఇ । త్వం । అయాః । అసి । అయసా । మనసా । ధృతః । అయసా । హవ్యం । ఊహిషే । అయాః । నః । ధేహి । భేషజం॥

టీక॥ అగ్నే=ఓ యగ్నిహోతుఁడా! త్వం=నీవు, అయాశ్చ, భక్తులచే బొందతగినవాడవు, అసి=అయితివి, అనభిశ స్తిః=దోషరహితుఁడవు, అసి=అయితివి, అయాః=పొందదగినవాఁడవు, అసి=అయితివి, సత్యం=నిజము, అయసా= నీయం దుంచఁబడిన, మనసా=మనస్సుచేత, ధృతః=ధ్యానముచేయబడితివి, అయసా=మా యందు నీకున్న మనస్సుచేత, హవ్యం=మాచే నీయబడిన హావిస్సును, ఊహిషే=దేవ తలకొఱకు వహించుచున్నావు, అయాః=భక్తులను బొందునట్టి నీవు, నః=మాకొఱకు భేషజం=సుఖరూపమైనయౌషధమును, ధేహి=కలుగఁజేయుము.

తా॥ ఓ యగ్నిహోతుఁడా! నీవు భక్తులను బొందువాఁడవును దోషరహి తుఁడవు నైతివి. నీయందున్నట్టిమనస్సుతో నిన్ను ధ్యానించుచున్నాము. నీవును నీ మనస్సును మాయం దుంచి మాచే నియ్యఁబడు నాజ్యాదిహవిస్సులను దేవతల కిచ్చుటకొఱకు మోసికొని పోవుచున్నావు. కాఁబట్టి భక్తులయందు ప్రేమగలవో యగ్నిహోతుఁడా! నీవు మాకొఱకు సుఖస్వరూపమైన యౌషధమును గలుగఁ జేయుము॥

ఇతి పంచమఖండ స్సమాప్తః

---

## —♦ అథ షష్ఠఖండః ప్రారభ్యతే ♦—

మూ॥ సత్యే నోత్త భితా భూమి స్సూ ర్యే ణోత్త భితా ద్యౌః । ఋతే నాదిత్యా స్తిష్ఠంతి దివి సోమో అధి శ్రితః॥

పదవి॥ సత్యేన । ఉత్ । తభితా । భూమిః । సూర్యేణ । ఉత్ । ద్యౌః । ఋతేన । ఆదిత్యాః । తిష్ఠంతి । దివి । సోమః । అధి । శ్రితః॥

టీక॥ భూమిః=భూమి, సత్యేన=సత్యముచేతను, ద్యౌః=ఆకాశము, సూర్యేణ=సూర్యునిచేతను, ఉత్తభితా=పట్టుకోబడినదై, తిష్ఠతి=ఉంచున్నది, ఆదిత్యాః=సూర్యులు, ఋతేన=యజ్ఞముచేతను, ఉత్తభితాః= పట్టుకోబడినవారై, తిష్ఠంతి=ఉంచున్నారు, సోమః=చంద్రుఁడు, దివి=స్వర్గమునందు, అధిశ్రితః=అధిష్ఠించియుండెను.

తా॥ సత్యము నాధారముచేసికొని భూమియు, సూర్యు నాధారముచేసికొని యాకాశమును, యజ్ఞము నాధారముచేసికొని ద్వాదశాదిత్యులును, స్వర్గము నాధారము చేసికొని చంద్రుఁడును నే ప్రకారముండిరో ఓ యగ్నిహోత్రుఁడా! ఆ ప్రకారమే నీవును మమ్ముల నాధారముచేసికొని యుండుము.

మూ॥ యుంజంతి బ్రధ్న మరుషం చరంతం పరితస్థుషః । రోచంతే రోచనా దివి॥

పదవి॥ యుంజంతి । బ్రధ్నం । అరుషం । చరంతం । పరి । తస్థుషః । రోచంతే । రోచనాః । దివి॥

టీక॥ పురుషాః = మనుష్యులు, బ్రధ్నం = పెద్దదైనదియు, అరుషం = శీఘ్రముగా నడవఁగలదియు, తస్థుషః = స్థిరపదార్థములను, పరి = విడిచిపెట్టి, చరంతం = సంచరించెడు, అశ్వం = అశ్వమును, దివి = ఆకాశమునందు, రోచనాః = నక్షత్రములు మొదలగునవి, యావత్ = ఎంతపర్యంతము, రోచంతే = ప్రకాశించుచున్నవో, తావత్ = అంతపర్యంతము, యుంజంతి = కూర్చుచున్నారు. అనఁగా అధిష్ఠించుచున్నారనుట.

తా॥ నక్షత్రములు ఆకాశమునం దెంతకాలమునివసించియుండునో అంతపర్యంతము మనుష్యులు యజ్ఞాదిశుభకార్యములయందు పెద్దదియుఁ జక్కఁగా నడవఁగలదియు స్థావరపదార్థములను విడిచిపెట్టి సంచరించునట్టి యశ్వమును ఆయత్తపఱుతురుగాక.

మూ॥ యోగే యోగే తవ స్తరం వాజే వాజే హవామహే । సఖాయ ఇంద్ర మూతయే ॥

పదవి॥ యోగే । యోగే । తవ స్తరం । వాజే । వాజే । హవామహే । సఖాయః । ఇంద్రం । ఊతయే ॥

టీక॥ వాజేవాజే = ప్రతియుద్ధము ప్రాప్తించినదగుచుండఁగా, యోగే యోగే = ఎప్పుడెప్పుడు రథములకు అశ్వములను గూర్చుచుందురో, తదా =అప్పుడు, సఖాయః = స్నేహితులమైన, వయం = మేము, తవస్తరం = వృద్ధిగలిగియుండిన, ఇంద్రం = దేవేంద్రుని, ఊతయే = రక్షించుటకొఱకు, హవామహే = పిలుచుచున్నాము.

తా॥ ఎప్పుడైనను యుద్ధము సంభవించి రథములకు నశ్వములను గూర్చి ప్రయాణమగునప్పుడు మేము రక్షించుటకొఱకు బలవంతుండగు దేవేంద్రుని బిలుచుచున్నాము.

మూ॥ సుకిగ్ంశుకగ్ం శల్మలిం విశ్వరూపగ్ం హిరణ్యవర్ణగ్ం సువృత్తగ్ం సుచక్రం। ఆరోహవ ధ్వమృతస్య లోకగ్గ్ స్యోనం పత్యే వహతుం కృణుష్వ॥

పదవి॥ సుకింశుకం । శల్మలిం । విశ్వరూపం । హిరణ్యవర్ణగ్ం । సువృత్తం । సుచక్రం । ఆరోహ । వధు । అమృతస్య । లోకం । స్యోనం । పత్యే । వహతుం । కృణుష్వ॥

టీక॥ హేవధు=ఓచిన్నదానా! సుకింశుకం=శోభస్కరమైన యాకులుగలదియు, శల్మలిం=బూరుగకృత్తుచేఁ జేయబడినదియు, విశ్వరూపం=అనేకరూపములు గలదియు, హిరణ్యవర్ణం=ప్రకాశించు కాంతిగలదియు, సువృత్తం=చక్కఁగా నడచునదియు, సుచక్రం=మంచిచక్రములుగలదియు నగురథమును, ఆరోహ= అధిష్ఠించుము, అమృతస్య=మృతినొందనివారియొక్క, లోకం=స్థానమును, ఆరుహ్య=అధిష్ఠించి, పత్యే=పెనిమిటికైన, మహ్యం=నాకొఱకు, స్యోనం=సుఖకరమైన, వహతుం=స్త్రీధనమును, కృణుష్వ=స్థాపనఁజేయుము.

తా॥ ఓ చిన్నదానా! శోభస్కరమైన యాకులుగలదియు బూరుగచెట్టుచేఁ జేయఁబడినదియు ననేక వర్ణములుగలదియు బంగారుకాంతిగలదియు జక్కఁగా నడచునదియు మంచిచక్రములు గలదియు నగురథము నెక్కి దీర్ఘాయుష్మంతుఁడనైన వారియొక్కస్థానమును అధిష్ఠించి నన్ను సుఖపెట్టునట్టి నీ స్త్రీస్వభావమును స్థిరపఱచుకొనుము.

మూ॥ ఉ దుత్తర మారోహంతీ వ్యస్యంతీ పృతన్యతః మూర్ధానం పత్యు రారోహ ప్రజయాచ విరాడ్భవ॥

పదవిభాగం॥ ఉత్ । ఉత్తరం । ఆరోహంతీ । వ్యస్యంతీ । పృతన్యతః । మూర్ధానం । పత్యుః । ఆరోహ । ప్రజయా । చ । విరాట్ । భవ ॥

టీక॥ ఉత్తరం=శ్రేష్ఠమైనరథమును, ఉదారోహంతీ = పైకినెక్కినదానవై, పృతన్యతః=యుద్ధముచేయఁగోరికగలవారిని, వ్యస్యంతీ=అనేకవిధములుగా జిమ్ముచు, పత్యుః=పెనిమిటియైన నాయొక్క, మూర్ధానం=శిరస్సును, ఆరోహ=అధిష్ఠించుము, ప్రజయాచ=సంతానముచేతను, విరాట్=ప్రకాశించుదానవు, భవ=అగుము.

తా॥ ఓచిన్నదానా! శ్రేష్ఠమైన రథము నెక్కినదానవై యుద్ధముచేయ దలంపుగలవారిని అనేకవిధములుగా దటిమివేయుచు నాకుఁబ్రధానురాలవుగానుండి సంతానముగలదాన వై ప్రకాశించుచుండుము.

మూ॥ సమ్రాజ్ఞీ శ్వశురే భవ సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ ననాందరి సమ్రాజ్ఞీ భవ సమ్రాజ్ఞీ అధి దేవృషు ॥

పదవి॥ సమ్రాజ్ఞీ । శ్వశురే । భవ । సమ్రాజ్ఞీ । శ్వశ్ర్వాం । భవ । ననాందరి । సమ్రాజ్ఞీ । భవ । సమ్రాజ్ఞీ । అధి । దేవృషు ॥

టీక॥ శ్వశురే = మామయందు, సమ్రాజ్ఞీ = ప్రేమగలదానవై, శ్వశ్ర్వాం = అత్తయందు, సమ్రాజ్ఞీ = ప్రేమగలదానవు, భవ = అగుము, ననాందరి = పెనిమిటి యొక్కతోఁబుట్టువునందును, సమ్రాజ్ఞీ = ప్రేమగలదానవై, దేవృషు = పెనిమిటి యొక్క సహోదరులయందు, సమ్రాజ్ఞీ = ప్రేమగలదానవు, భవ = అగుము.

తా॥ మామయందును, అత్తయందును, ఆఁడుబిడ్డలయందును, బావమఱదుల యందును, ప్రేమగలదాన వగుము.

మూ॥ స్నుషాణాగ్ శ్వశురాణాం ప్రజాయాశ్చ ధనస్య చ। పతీనాం చ దేవృణాంచ సజాతానాం విరాడ్భవ॥

పదవి॥ స్నుషాణాం । శ్వశురాణాం । ప్రజాయాః । చ । ధనస్య । చ । పతీనాం । చ । దేవృణాం । చ । సజాతానాం । విరాట్ । భవ.

టీక॥ స్నుషాణాం = కోడండ్రకును, శ్వశురాణాం = అత్తమామలకును, ప్రజాయాశ్చ = సంతానమునకును, ధనస్య = ధనమునకును, పతీనాం = పెనిమిటియైన

సాతును, దేవృణాం = బావమఱదులకును, సజాతానాం = మఱియు మావంశమందుఁ బుట్టినవారికిని, విరాట్ = ఆధారముగాఁ బ్రకాశించుదానవు, భవ = అగుము.

తా॥ ఓచిన్నదానా! కోడండ్రను అత్తమామలను సంతానమును పెనిమిటి నైననన్ను బావమఱదులను మఱియు మావంశమునందు బుట్టినవారిని పోషించుచు భాగ్యముచే బ్రకాశించుచుండుము.

మూ॥ నీలలోహితే భవతః కృత్యాసక్తి ర్వ్యజ్యతే ఏధంతేఽస్యా జ్ఞాతయః పతి ర్బంధేషు బధ్యతే॥

పదవి॥ నీలలోహితే । భవతః । కృత్యాసక్తిః । వ్యజ్యతే । ఏధంతే । అస్యాః । జ్ఞాతయః । పతిః । బంధేషు । బధ్యతే.

టీక॥ నీలలోహితే=నలుపుఎఱుపురంగులుగలవి, భవతః=అగుచున్నవి, కృత్యాసక్తిః=పరులచేఁబ్రయోగింపఁబడినక్రియకు బ్రతిఘాతము, వ్యజ్యతే=ఆవిర్భావమగును, అస్యాః=ఈ చిన్నదానియొక్క, జ్ఞాతయః=జ్ఞాతులు, ఏధంతే=వృద్ధిపొందుదురు, పతిః=పెనిమిటి, బంధేషు=పాశము లనఁదగిన కార్యములవిషయమై, అనఁగా స్నేహములవిషయమై, బధ్యతే=కట్టఁబడు చుండవలయును.

తా॥ ఓచిన్నదానా! ఉత్తరపుదిక్కున నలుపు దక్షిణపుదిక్కున యెఱుపు గలనూత్రములను ధరించుచుంటివి. ఈ సూత్రములు పరులచే నీయందుఁ బ్రయోగింపఁబడుపరాభవ కార్యములను మళ్ళింపఁజేయును. నీ జ్ఞాతులు బంధువులు మొదలగువారు వృద్ధిపొందుదురుగాక. పెనిమిటినైననేను బద్ధుఁడనుగాఁదగిన స్నేహకార్యములవిషయమై బద్ధుఁడనై యుండుఁగాక.

మూ॥ యేవధ్వ శ్చంద్రం వహతుం యక్ష్మా యంతి జనాగ్ం అను పున స్తా న్యజ్ఞియా దేవా నయంతు యత ఆగతాః॥

పదవి॥ యే । వధ్వః । చంద్రం । వహతుం । యక్ష్మాః । యంతి । జనాన్ । అను । పునః । తాన్ । యజ్ఞియాః । దేవాః । నయంతు । యతః । ఆగతాః.

టీక॥ యక్ష్మాః=క్షయరోగులనిచెప్పఁదగిన, యే=ఏ చోరులు, వధ్వః=ఈ చిన్నదానియొక్క, చంద్రం=సంతోషకరమైనది యు, వహతుం=తండ్రికులము వలన వచ్చినధనమును, యంతి=అపహరించుచున్నారో, తాన్=ఆ దొంగలను,

యతః=ఎక్కడనుండి, ఆగతాః=వచ్చిరో, తతః=అక్కడనుండి, యజ్ఞియాః=యజ్ఞములయందు హవిస్సులను భుజియించెడు, దేవాః=దేవతలు, పునః=తిరిగి జనానను మనుష్యులసమీపమును, నయంతు=పొందింతురుగాక.

తా॥ ఈ చిన్నది తండ్రిగృహమునుండి తెచ్చినట్టి సంతోషకరమైన యే ధనము కలదో యట్టిధనమును రోగములవలెనే నిందింపదగినచోరు లపహరించిరేని వారెచ్చటనుండి వచ్చిరో అక్కడనుండి వారిని యజ్ఞమునందు వచ్చుదేవతలు తెచ్చి మనుష్యులయెదుట నుంచుదురుగాక.

మూ॥ మా విద న్పరిపంథినో య ఆ సీదంతిదంపతీ సుగేభి దుఃర్గ మతీతా మపద్రాం త్వరాతయః.

పదవి॥ మా । అవిదన్ । పరిపంథినః । యే । ఆ । సీదంతి । దంపతీ । సుగేభిః । దుర్గం । అతీతాం । అపద్రాంతు । అరాతయః.

టీక॥ యే=ఏ, పరిపంథినః=మార్గమును అనుసరించి అపహరింప గోరికగలవారై దంపతీ=ఈ భార్యాభర్తలను గుఱించి, ఆసీదంతి అభిముఖముగా రాఁదలచియుండిరో, తత్=ఆ చోరులు, ఏతత్=ఈ స్థలమును, మావిదన్=గుర్తెఱుగకుందురుగాక, ఏతౌ=ఈ దంపతులు, సుగేభిః=సుఖకరమైన మార్గములచేత, దుర్గం=దాటశక్యము గాని ప్రదేశమునైనను, అతీతాం=దాటివెళ్ళుదురుగాక, అరాతయః=శత్రువులు, అపద్రాం=పాఱిపోవుదురుగాక.

తా॥ ఏ దొంగ లీ దంపతు లేతెంచునట్టి మార్గము నావరించియుండి సొమ్ము మొదలగువాని నపహరింపదలచిరో వారి స్థలమును దెలిసికొనకుందురుగాక. ఈ దంపతులు దాటశక్యముగాని ప్రదేశమునైనను సులభమైనమార్గములచే దాటిపోదురుగాక. శత్రువులు తమప్రయత్నములు వ్యర్థమౌటచే పాఱిపోదురుగాక.

మూ॥ సుగం పంథాన మారుక్ష మరిష్టగ్ స్వస్తివాహనం యస్మి న్వీరో నరిష్య త్యన్యేషాం విందతే వసు॥

పదవి॥ సుగం । పంథానం । ఆరుక్షం । అరిష్టం । స్వస్తివాహనం । యస్మిన్ । వీరః । న । రిష్యతి । అన్యేషాం । విందతే । వసు ।

టీక॥ వీరః = నా సంబంధమైన యోధుఁడు, యస్మిన్ = ఏ మార్గమందు, నరిష్యతి=కష్టపడఁడో, అన్యేషాం= ఇతరులయొక్క అనఁగా చోరులయొక్క, వసు=

ధనమును, విందతే= పొందునో, సుగం= సుఖముగా వెళ్లదగినదియు, అరిష్టం= బాధ నుకలిగింపనదియు, స్వస్తివాహనం= గుఱ్ఱము మొదలగునవి సుఖముగా వెళ్లుటకుఁదగినదియు, తం= ఆ పూర్వోక్తమైన, పంథానం= మార్గమును, అరుక్షం= అధిష్ఠించితిని అనఁగా నవలంబించితిని.

తా॥ నా భృత్యుఁడే మార్గంబున బాధనొందక నా విరోధులధనమును వారిం పఁగలఁడో సుఖకరమైనదియు, గుఱ్ఱము మొదలగువాహనములకుఁ గష్టమును గలిగింపనదియు, నాశములేనిదియు నైనమార్గంబున వెళ్లుచుంటిమి.

ఇతి షష్ఠఖండ స్సమాప్తః

---

మూ॥ తా మన్దసానా మనుషో దురోణ అధత్తంగ్ రయిం దశవీరం వచస్యవే। కృతం తీర్థగ్ం సుప్రిపాణగ్ం శుభస్పతి స్థాణుం పథేష్ఠా మపదుర్మతిగ్ం హతం ॥

పదవి॥ తా । మందసానా । మనుషః।దురోణే । అధత్తం । రయిం । దశవీరం। వచస్యవే । కృతం । తీర్థం । సుప్రిపాణం । శుభస్పతీ । స్థాణుం । పథేష్ఠాం । అప । దుర్మతిం । హతం॥.

టీక॥ మందసానా= స్తోత్రార్హులైన, తా= ఆయశ్వినీదేవతలు, వచస్యవే= స్తుతింపఁబడినవారై, మనుషః= మనుష్యునియొక్క, దురోణే= గృహమందు, దశ వీరం= పదిమందితనయులతో గూడిన, రయిం= ధనమును, అధత్తం= ఇత్తురుగాక, శుభస్పతి= వర్షరూపమైనజలమునకుఁ బాలకులైనయశ్వినీదేవతలు, మార్గే= మార్గ మునందు, తీర్థం= జలములు, సుప్రిపాణం= సుఖముగాఁబానము చేయఁదగినదానిఁగా, కృతం= చేయుదురుగాక, పథేష్ఠాం= మార్గమందున్న, స్థాణుః= కొయ్యలు మొదలగువానిని, దుర్మతిం= దుష్టబుద్ధిగల చోరులు మొదలగువారిని, అపహతం= వెళ్లఁగొట్టుదురుగాక ॥

తా॥ స్తుతింపఁదగినయశ్వినీదేవతలు మాచే స్తుతింపఁబడినవారై పదిమంది కుమాళ్లను ధనమును కలిగింతురుగాక. మార్గమందుఁ ద్రాగుటకుఁ దగిన జలమును నిర్మింతురుగాక, మార్గప్రతిబంధకమైనట్టి కొయ్యలను రాళ్లను తస్కరులను దొలగింతురుగాక.

మూ॥ అయం నో మహ్యాః పారగ్ స్వస్తి నేష ద్వనస్పతిః। సీరా న
సుతరా భవ దీర్ఘాయుత్వాయ వర్చసే॥

పదవి॥ అయం। నః। మహ్యాః। పారం। స్వస్తి। నేషత్। వనస్పతిః।
సీరా। నః। సుతరా। భవ। దీర్ఘాయుత్వాయ। వర్చసే.

టీక॥ వనస్పతిః=వృక్షముచేఁజేయఁబడిన, అయం=ఈ, నః = మాయొక్క,
నౌః=ఓడ, మహ్యాః=పెద్దదియగునదియొక్క, పారం=అవతలితీరమును, నేషత్=
పొందించుఁగాక, సీరా= 'సీర' యనెడి యోనదీ! దీర్ఘాయుత్వాయ = దీర్ఘాయు
ర్దాయముకొఱకును, వర్చసే=కాంతికొఱకును, నః=మాకు, సుతరా = సులభముగా
దాటఁదగినదానవై, భవ=అగుము.

తా॥ కొయ్యచేఁ జేయఁబడి వనస్పతివికారమైన యీ యోడ పెద్దదియగు
నదియొక్క యవ్వలితీరమును దాటించుఁగాక. 'సీర' యనఁబడెడి యోడా!
సులభముగా మమ్మును దాటించి మాకు దీర్ఘాయుర్దాయమును గాంతిని గలిగింపుము.

మూ॥ అస్య పారే నిర్ బుథస్య జీవా జ్యోతి రశీమహి। మహ్యా
ఇంద్ర స్వస్త్రయే.

పదవి॥ అస్య। పారే। నిర్ బుథస్య। జీవాః। జ్యోతిః। అశీమహి।
మహ్యా। ఇంద్రః। స్వస్త్రయే.

టీక॥ నిర్ బుథస్య=దాటఁదగిన, అస్య=ఈ నదియొక్క, పారే=తీరమందు,
జీవాః=బ్రతికియున్నవారమై, ప్రాప్తాః=చేరిన, వయం=మేము, జ్యోతిః = అభయ
మును, అశీమహి=పొందితిమి, ఇంద్రః=ఇంద్రుఁడు, కమహ్యా=అధికమైన, స్వస్త్రయే=
శుభముకొఱకు, భవతు=అగుఁగాక.

తా॥ దాటవలసిన యీ నదిని దాటి యవ్వలియొడ్డును జేరినవారమై మే
మేమియు నాపత్తును బొందక నిర్భయుల మైతిమి. ఇంద్రుఁడును మాకు విశేష
మైన శుభమును జేయుచుండుఁగాక.

మూ॥ య దృతే చి దభిశ్రిషః పురా జత్రృభ్య ఆతృదః। సంధాతా
సంధిం మఘవా పురోవసు ర్నిష్కర్తా విహ్రుతం పునః॥

పదవి॥ యత్। ఋతే। చిత్। అభిశ్రిషః। పురా। జత్రృభ్యః। ఆతృదః।
సంధాతా। సంధిం। మఘవా। పురోవసుః। నిష్కర్తా। విహ్రుతం। పునః॥

టీక॥ యత్=ఏ కారణమువలన, మఘవా=దేవేంద్రుఁడు, పురా=ముందు గానే, ఋతేచిత్=శ్మశానము మొదలగునవి లేకయె, అభిశ్రిషః = విడిపోయిన భాండాదికమును, జతుభ్యః=లక్క మొదలగు వానిచే, ఆతృదః=దృఢముగాఁ జేసెనో, సంధిం=కూర్చఁదగినవస్తువును, సంధాతా=కూర్చఁగలఁడో, విహ్రుతం=నష్ట మైనవస్తువును, పునః= తిరిగి, నిష్కర్తా=కూర్చగలఁడో, తస్మై=ఆ యింద్రుని కొఱకు, స్వాహా=హావిస్సు నిచ్చుచున్నాను.

తా॥ శ్మశానపురాళ్ళు మొదలగునవి గల మార్గమునందు రథము పోవుటచే రథాదికమునకు భంగము కలుగునని పూర్వమే లక్క మొదలగువానిచే దృఢము చేసినవాఁడును విడిపోయిన పదార్థమును దిరిగి కూర్చఁదగినవాఁడును నూతనముగాఁ గూర్చఁదగిన వస్తువులను గూర్చఁదగినవాఁడు నగు దేవేంద్రునికొఱకు హవిస్సు నిచ్చుచున్నాను.

మూ॥ ఇడా మగ్నే పురుదగ్ంసగ్ం సనిం గోః శ్శశ్వ త్తమగ్ం హావ మానాయ సాధ స్యా న్న సూనుస్తనయో విజా వాగ్నే సా తే సుమతి ర్భూ త్వస్మే ॥

పదవి॥ ఇడాం । అగ్నే । పురుదంసం । సనిం । గోః । శశ్వత్తమం । హావమా నాయ । సాధ । స్యాత్ । నః । సూనుః । తనయః । విజావా । అగ్నే । సా । తే । సుమతిః । భూత్ । అస్మే ॥

టీక॥ అగ్నే = ఓయగ్నిహోత్రుఁడా ! ఇడాం = అన్నమును, పురుదంసం = మిక్కిలి కొనియాడఁదగిన, గోః = ఆవులయొక్క, సనిం = దానమును, హావమా నాయ = నిన్నుఁ బిలుచుచున్న, మహ్యం = నాకొఱకు, శశ్వత్తమం = మాటిమాటికి, సాధ = కలుగఁజేయుము, విజావా = పవిత్రస్వభావముగల, సూనుః = కుమారుఁ డును, తనయః = మనుమఁడును, నః = మాకు, స్యాత్ = అయ్యెని, అగ్నే = అగ్ని హోత్రుఁడా ! కింబహునా = అనేకము చెప్పుటచే నేమి ప్రయోజనము ? తే = నీయొక్క, సా = ఆ ప్రసిద్ధమైన, సుమతిః = అనుగ్రహబుద్ధి, అస్మే = మావిష యమై, భూత్ = అగుఁగాక॥

తా॥ ఓయగ్నిహోత్రుఁడా! అన్నము అనఁగా అందఱచేఁ గొనియాడబడుటకుఁ దగినగోసమూహము నిమ్మని నిన్ను బ్రార్థించుచున్న మాకు గలుగఁజేయుము. కుమా

రుని, పనుమని, గలుగఁజేసి పవిత్రమైన స్వభావము గలవారినిగా జేయుము. ఇది అది యని చెప్పనేల ? నీ యనుగ్రహమును మాయందు వ్యాపింపఁజేసి సమస్తమును గలుగఁజేయుము.

మూ॥ ఇమమ్మేవరుణ॥ ౭ ॥ తత్త్వాయామి॥ ౮ ॥ త్వన్నో అగ్నే ॥౯॥ సత్వన్నో అగ్నే ॥౧౦॥ త్వమగ్నే అయాసి॥

ఈ మంత్రములకు అర్థము పదచ్ఛేదను తాత్పర్యము మొదలగునవి పూర్వమే చెప్పఁబడినవి.

మూ॥ యే గంధర్వా అప్సరసశ్చ దేవీ రేషు వృక్షేషు వానస్పత్యే ష్వాసతే శివా స్తే అస్యై వధ్వై భవంతు మాహిగ్ంసిషు ర్వహతు మూహ్యమానాం॥

పదవి॥ యే । గంధర్వాః । అప్సరసః । చ । దేవీః । ఏషు। వృక్షేషు।వానస్ప త్యేషు । ఆసతే । శివాః । తే । అస్యై । వధ్వై । భవంతు । మా । హింగ్ సిషుః । వహతుం । ఊహ్యమానాం॥

టీక॥ యే = ఏ, గంధర్వాః = గంధర్వులును, అప్సరసశ్చ = అప్సరస్త్రీలును, సంతి = కలరో, వానస్పత్యేషు=పూసికాయునట్టి, ఏషు = ఈ, వృక్షేషు=పనస, మామిళ్ళు మొదలగు చెట్లయందు, దేవీః=ఏ దేవతలుకలరో, తే=ఆ సమస్తమైన దేవతలును, అస్యై = ఈ, వధ్వై= చిన్నదానికొఱకు, శివాః = మంగళకరులు, భవంతు=అగుదురుగాక, ఊహ్యమానాం=తండ్రి గృహమునుండి తీసికొనిరాఁబడు నట్టి, వహతుం=స్త్రీ ధనమును, మాహిగ్ంసిషుః=నశింపఁజేయ కుందురుగాక.

తా॥ గంధర్వులును అప్సరస్త్రీలును పూసికాసెడు చెట్లయొక్క యధిదేవత లెవరు కలరో వారందఱును మార్గమునం దీ చిన్నదానికిఁ గష్టములను గలిగింపక తండ్రియొక్క గృహమునుండి తెచ్చుకొనునట్టి ధనమును హరింపఁజేయ కుందురు గాక,

మూ॥ యా ఓషధయో యా నద్యో యాని ధన్వాని యే వనా। తే త్వా వధు ప్రజావతీం ప్ర త్వే ముంచం త్వగ్ంహాసః ॥

పదవి॥ యాః । ఓషధయః । యాః, నద్యః । యాని । ధన్వాని । యే । వనాని । తే, త్వా । వధు । ప్రజావతీం । ప్ర । త్వా । ముంచంతు । అంహాసః ॥

టీక॥ యాః=ఏ, ఓషధయః=లతావిశేషములు, యాః=ఏ, నద్యః=నదులు, యాని=ఏ, ధన్వాని=నిర్జలప్రదేశములు, యే=ఏ, వనాని=వనములు, అతిక్రాంతాః=దాటఁబడినవో, హేవధు=ఓ చిన్నదానా!, తే=ఆ ప్రదేశముయొక్క యధిష్ఠానదేవతలు, త్వా=నిన్ను, ప్రజావతీం=సంతానము కలదానిగాఁ, జేయుఁగాక, త్వా=నిన్ను, అంహసః=పాపమువలన, ప్రముంచంతు=విడిపింతురుగాక.

తా॥ ఓ చిన్నదానా! మనచే దాటఁబడిన యే లతలు, నదులు, నిర్జలప్రదేశములు వనములు కలవో ఆ ప్రదేశముల కధిష్ఠానదేవత లెవరు కలరో వారందఱును నిన్నుఁ బాపమునుండి విడిపించి సంతానము కలదానిగాఁ జేయుదురుగాక.

మూ॥ సంకాశయామి వహతుం బ్రహ్మణా గృహై రఘోరేణ
చక్షుషా మైత్రేణ పర్యాణద్ధం విశ్వరూపం య దస్యాగ్
స్యోనం పతిభ్య స్సవితా కృణోతు తత్ ॥

పదవి॥ సంకాశయామి । వహతుం । బ్రహ్మణా । గృహైః । అఘోరేణ । చక్షుషా । మైత్రేణ । పర్యాణద్ధం । విశ్వరూపం । యత్ । అస్యాం । స్యోనం । పతిభ్యః । సవితా । కృణోతు । తత్.

టీక॥ వహతుం=తండ్రియొక్క గృహమునుండి తీసికొనివచ్చిన స్త్రీ ధనమును, గృహైః=నా సంబంధమైన యిండ్లతోఁగూడ, బ్రహ్మణా=వేదమంత్రముచేత, సంకాశయామి=చూపించుచున్నాను, ఏషా=ఈ చిన్నది, అఘోరేణ=క్రూరముకానిదియు, మైత్రేణ=స్నేహముతోఁగూడినదియునగు, చక్షుషా=దృష్టిచే, పశ్యతు=చూచుగాక, పర్యాణద్ధం=బంధువులు మొదలగువారిచే కానుకగా నియ్యఁబడి యలంకరింపఁబడినదై, విశ్వరూపం=అనేకరూపములు గలిగి, అస్యాం=ఈ చిన్నదానియందు, యత్=ఏ యాభరణాదులు కలవో, తత్=ఆ యాభరణాదులను, సవితా=సూర్యుఁడు, పతిభ్యః=పెనిమిటియైన నా కొఱకు, స్యోనం=సంతోషకరమైనదానిగా, కృణోతు=చేయుచుండుఁగాక.

తా॥ ఈ చిన్నది తండ్రిగృహమునుండి దీసికొనివచ్చిన ధనముతోఁ గూడ నా గృహముల నీ చిన్నదానికి జూపించుచున్నాను. కఠినముకానిదియు ప్రేమగలదియునగు చూపుతో ఈ చిన్నది చూచుగాక. ఈ చిన్నదాని బంధువులచే

యాభరణాదు లిచ్చి యలంకరించి పంపిరో ఆ యాభరణాదులు నాకును నా సహోదరులు మొదలగువారికిని సంతోషము జేయుగాక.

మం॥ ఆ వా మగన్ సుమతి ర్వాజినీ వసూ న్యశ్వినా హృత్సు కామాగ్ం అయగ్ంసత అభూతం గోపా మిథునా శుభస్పతీ ప్రియా ఆర్యమ్ణో దుర్యాగ్ం అశీమహి॥

పదవి॥ ఆ॥ వాం । అగన్ । సుమతిః । వాజినీవసూ। ని । అశ్వినా । హృత్సు। కామాన్ । అయంసత । అభూతం । గోపా । మిథునా । శుభస్పతీ । ప్రియా । అర్యమ్ణః। దుర్యాం । అశీమహి ॥

టీకః అశ్వినా = ఓ యశ్వినీదేవతలారా!, వాం = మీయిద్దఱయొక్కయు, సుమతిః = అనుగ్రహబుద్ధి, అస్మాన్ = మమ్ములను, అగన్ = పొందినది, వాజినీవసూ = హవిస్సే ధనముగాగల యశ్వినీదేవతలారా ?, హృత్సు= మా మనస్సులయందుండెడి, కామాన్ = కోరికలు, న్యయంసత = నిశ్చితఫలము గల వయ్యెను, శుభస్పతీ = జలమును పాలించువారును, అర్యమ్ణః = సూర్యునకు, ప్రియా = మిత్రులునైన, వాం=మీ రిద్దఱుకు, మిథునా = దంపతులమైనమమ్ములను, పథి = మార్గమునందు, గోపా = రక్షించువారు, అభూతం = అయితిరి, దుర్యాన్ = మా గృహములను, అశీమహి = ప్రవేశించితిమి ॥

తా॥ హవిస్సే ధనముగాగల యో యశ్వినీదేవతలారా! మీ యనుగ్రహము మాయందుఁ గలుగుటచే మా మనస్సునందుండు కోరికలు సఫలమయిన వయ్యెను. జలపాలకులును సూర్యునకు మిత్రులును అగుమీరు మార్గమునందు మమ్ములను గాపాడుటచే నే యాపదయులేక మా గృహములలో బ్రవేశింపఁగలిగితిమి ॥

మం॥ అయం నో దేవ స్సవితా బృహస్పతి రింద్రాగ్నీ మిత్రావరుణా స్వస్తయే । త్వష్టా విష్ణుః ప్రజయా సగ్ం రరాణః కామ ఆయాతం కామాయ త్వా విముంచతు॥

పదవి॥ అయం । నః । దేవః । సవితా । బృహస్పతిః । ఇంద్రాగ్నీ । మిత్రావరుణా । స్వస్తయే । త్వష్టా । విష్ణుః । ప్రజయా । సం । రరాణః । కామే । ఆయాతం । కామాయ । త్వా । విముంచతు ॥

టీక॥ నః = మాకు, కామే = కోరికగలుగుచుండ గా, ఇహ = ఇక్కడకు, ఆయాతం = వచ్చిన, త్వా = నిన్ను, అయం = ఈ దేవః = దేవుఁడగు, సవితా= సూర్యుఁడు, బృహస్పతిః = గురుఁడు, ఇంద్రాగ్నీ = ఇంద్రుఁడును అగ్నిహోత్రుఁడును, మిత్రావరుణా = మిత్రుఁడను సూర్యుఁడును వరుణుఁడును, త్వష్టా = బ్రహ్మయూఁ, విష్ణుః= విష్ణుమూర్తియు, ప్రజయా=సంతానముచేత, సంరరాణః = మిక్కిలి క్రీడింపఁజేయువా రై, స్వస్తయే = సుఖస్థితికొఱకును, కామాయ = స్వేచ్ఛగా సంచరించుకొఱకును, విముంచతు = విడిచిపెట్టుదురు గాక॥

తా॥ ఓగుణ్ణమా! నా మనోభీష్టముచే ని న్నిక్క యిక్కడకుఁ దీసికొని వచ్చితిని కాన నీ విప్పుడు స్వేచ్ఛగా విహరించి సుఖముగా నుండుము. సూర్యుఁడును, బృహస్పతియు, ఇంద్రుఁడు, అగ్నియు, మిత్రుఁడును వరుణుఁడును, బ్రహ్మయు విష్ణువు మొదలగువారు నీకు సంతానముగలుగఁ జేసి సుఖపెట్టుదురు గాక.

ఇతి సప్తమఖండ స్సమాప్తః

---

—♦ అ థాఽష్టమఖండప్రారంభః ♦—

మం॥ శర్మ వ ర్మేద మాహ రాఽస్యై నార్యా ఉపస్థిరే। సినీవాలి ప్రజాయతా మియం భగస్య సుమతా అసత్ ఇతిపాధోద్యర్శ్యాతె తాఽవసత్.

ప॥ శర్మ । వర్మ । ఇదం । ఆహర । అస్యై । నార్యాః। ఉపస్థిరే। సినీవాలి, ప్రజాయతాం । ఇయం । భగస్య । సుమతౌ । అసత్.

టీక॥ శర్మ=సుఖకరమైన, ఇదం=ఈ, వర్మ=కవచమును, అస్యై=ఈ। నార్యాః=స్త్రీయొక్క, ఉపస్థిరే=ధరించుటనిమిత్తమై, ఆహర=తీసికొనిరమ్ము, సినీవాలి=చంద్రకళతోఁగూడిన యో యమావాస్యా! ఇయం=ఈ చిన్నది, భగస్య=, సూర్యునియొక్క, సుమతౌ=అనుగ్రహముకలుగుచుండఁగా, ప్రజాయతాం=సం సంతానముకలది, అసత్=అగుఁగాక.

తా॥ ఈ చిన్నది ధరించుకొఱకు సుఖకరమైనకవచమును తెండు. ఓ చంద్రకళతోఁగూడినయమావాస్యా నీయనుగ్రహమువలనను సూర్యునియనుగ్రహమువలనను ఈ చిన్నది సంతానవంతురా లగుగాక॥

మూ॥ గృహాన్ భద్రాన్త్సుమనసః ప్రపద్యే వీరఘ్నీ వీరవత స్సువీరాన్ ఇరాం వహతో ఘృత ముక్షమాణా స్తే ష్వహ గ్ం సుమనా స్సంవిశామి.

పదవి॥ గృహాన్ । భద్రాన్ । సుమనసః । ప్రపద్యే । అవీరఘ్నీ । వీరవతః । సువీరాన్ । ఇరాం । వహతః । ఘృతం । ఉక్షమాణాః । తేషు । అహం । సుమనాః । సం । విశామి॥

టీక॥ భద్రాన్ = మంగళకరములగునవియు, సుమనసః = మంచిమనస్సుతోఁ గూడినవియు, బావలు మొదలగువారియొక్క సంతానముతోఁ గూడియుండినవియూ, సువీరాన్ = అధికపరాక్రముగలభటులు గలవియు, ఇరాం = అన్నమును, వహతః = కలిగియున్నవియు, ఘృతం = నేతిని, ఉక్షమాణాః = (ద్వితీయార్థమందుఁబ్రథమ) అచ్చటచ్చట ప్రదర్శించునవియునగు, గృహాన్ = ఇండ్లను, ప్రపద్యే = పొందఁగలను, తేషు = అటువంటిగృహములయందు, అహం = నేను, అవీరఘ్నీ = పుత్త్రులనుహింసింపనిదాననై, సుమనాః = మంచిమనస్సుగలదాన నగుచు, సంవిశామి = ప్రవేశించుచున్నాను.

తా॥ వివాహసంబంధమైన చిహ్నములు కలవగుటచే మంగళప్రద మగు నవియు అత్తమామలు మొదలగువారి చిన్నదానిని జూచి సంతోషచిత్తులగుటచే మంచిమనస్సుగలవియు బావలు మొదలగువారియొక్క పుత్త్రులతోఁ గూడియుండి నవియు అధికబలముగల రక్షకభటులతోఁ గూడియుండినవియు అన్నసమృద్ధిగల వియు బ్రాహ్మణభోజనాదులయందు నేలమీఁద నిటునటువ్యాపించియుండు నేతితో గూడియుండినవియు నగునిండ్లలో మంచిమనస్సుగలదాననై ప్రవేశించెదను. ఏమ్మట నేయాపత్తు లేనిసంతానముకలిగినదాననై యుందును.

మూ॥ ఆగన్గోష్ఠం మహిషీ గోభి రశ్వై రాయుష్మత్పత్నీ ప్రజయా స్వర్విత్ బహ్వీం ప్రజాం జనయతీగ్ం సురత్నేమ మగ్ని గ్ం శతహిమా స్సపర్యాత్॥

పదవి॥ ఆగన్ । గోష్ఠం । మహిషీ । గోభిః । అశ్వైః । ఆయుష్మత్పత్నీ । ప్రజయా । స్వర్విత్ । బహ్వీం । ప్రజాం । జనయంతీం । సురత్నా । ఇమం । అగ్నిం । శతహిమాః । సపర్యాత్.

టీక॥ అయుష్మత్పత్నీ=చిరాయుష్మంతుఁడైన పెనిమిటిగల, మహిషీ=నా భార్య, గోభిః=ఆవులతోడను, అశ్వైః=గుఱ్ఱములతోడను, గోష్ఠం=నా గృహమును గూర్చి, ఆగన్=వచ్చినదై, బహ్వీం=విశేషమైన, ప్రజాం=సంతానమును, జనయంతీం=కనునదై, (ప్రథమార్థే ద్వితీయా) ప్రజయా=సంతానముచేత, స్వర్విత్=స్వర్గమును బొందఁగలది యగుచు, సురత్నా=అధికమైనధనము కలది యగుచు, ఇమం= ఈ, అగ్నిం=గార్హపత్యాగ్నిని, శతహిమాః=నూఱుసంవత్సరములు, సపర్యాత్= పరిచర్యఁజేయుఁగాక.

తా॥ ఈ చిన్నది చిరాయువుగలభర్తగలది యై తల్లిదండ్రు లిచ్చినయావులు గుఱ్ఱములు వీనితోడ నా గృహమునకు వచ్చినది యగుచు, విశేషమైనసంతానము గలది యగుచు, "అపుత్రస్య గతి ర్నాస్తి" యనున్యాయంబున సంతానము గలది యగుటచే స్వర్గలోకమును బొందగలదియు విశేషమైనభాగ్యము గలదియు నై ఈ గార్హపత్యాగ్నిని నూఱుసంవత్సరములపర్యంతము సేవించుచు చిరజీవియై యుండుఁ గాక.

మూ॥ అయ మగ్ని గృహపతి స్సుసగ్ంసత్పుష్టివర్ధనః । యథా భగ స్యాభ్యాం దద ద్రయిం పుష్టి మథో ప్రజామ్ ॥

పదవి॥ అయం । అగ్నిః । గృహపతిః । సుసంసత్పుష్టివర్ధనః । యథా భగస్య । ఆభ్యాం । దదత్ । రయిం । పుష్టిం । అథః । ప్రజాం ॥

టీక॥ అయం=ఈ, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, గృహపతిః=నా గృహమును రక్షించువాఁడై, సుసంసత్పుష్టివర్ధనః = సభయొక్కయు నాయొక్కయు వృద్ధిని బోషించువాఁడై, భగస్యయథా=భగునకువలెనే, అనఁగా దేవతలకువలెనే, ఆభ్యాం= దంపతులమైన మన యిద్దఱకొఱకును, రయిం=ధనమును, పుష్టిం=వృద్ధిని, అథః=అనంతరము, ప్రజాం=సంతానమును, దదత్=ఇచ్చుఁగాక.

తా॥ ఈ అగ్నిహోత్రుఁడు మా గృహమును రక్షించువాఁడై మా సంఘమునకును, మాకును బుష్టి నొసంగువాఁడై దేవతలకు వలెనే మనయిద్దఱకొఱకును ధనమును సంతానమును బుష్టిని గలుగఁజేయుఁగాక.

మూ॥ ప్రజయా ఆభ్యాం ప్రజాపత ఇంద్రాగ్నీ శర్మ యచ్ఛతం । య దైనయో ర్న ప్రమీయాతా ఉభయో ర్జీవతోః ప్రజాః॥

పదవి॥ ప్రజాయై । అభ్యాం । ప్రజాపతే । ఇంద్రాగ్నీ । శర్మ । యచ్ఛతం । యథా । ఏనయోః । న । ప్రమీయాతై । ఉభయోః । జీవతోః । ప్రజాః ॥

టీక॥ ప్రజాపతే=ఓబ్రహ్మ!, అభ్యాం=ఈ మా యిద్దఱయొక్క, (షష్ఠ్యర్థేఽత చతుర్థీ,) ప్రజాయై=సంతానముకొఱకు, శర్మ=సుఖమును, యచ్ఛ=ఇమ్ము, ఇంద్రాగ్నీ=ఇంద్రాగ్నులారా! యువాం=మీరిద్దఱు; శర్మ=సుఖమును, యచ్ఛత=ఇండు, యథా=ఏ ప్రకారముగా, ఏనయోః=ఈ, ఉభయోః=ఇద్దఱును, జీవతోః=బ్రతికి యున్నవారగుచుండఁగా, ప్రజాః=సంతానము, నప్రమీయాతై=మృతినొందదో ॥

తా॥ ఓబ్రహ్మ! ఓఇంద్రుఁడా! ఓయగ్నీ! దంపతుల మైన మే మిద్దఱము బ్రతికియుండునంతపర్యంతము మా సంతానము మృతినొందకుండురీతి రక్షించి వారికి సుఖమును గలుగఁజేయుము.

మూ॥ తేన భూతేన హవిషాయ మాప్యాయతాం పునః । జాయాం యా మస్మా ఆవాఃను స్తాగ్ం రసే నాభివర్థతాం ॥

పదవి॥ తేన । భూతేన । హవిషా । అయం । అప్యాయతాం । పునః । జాయాం । యాం । అస్మై । ఆవాఃనుః । తాం । రసేన । అభి । వర్థతాం ॥

టీక॥ తేన=అటువంటి, భూతేన=పొందఁబడిన, హవిషా = హవిస్సుచేత, అయం=ఈ అగ్నిహోతుఁడు, పునః=మాటిమాటికి, అప్యాయతాం=తృప్తినొందుఁగాక, అస్మై=ఈ నాకొఱకు, యాం=ఏస్త్రీని, జాయాం=భార్యగాను, ఆవాఃనుః=ఇచ్చిరో, తాం=ఆ భార్యను, రసేన = ఆజ్యాదిరసముచేతను, అభివర్థతాం=వృద్ధినిబొందించుఁగాక.

తా॥ యజ్ఞాదికర్మముల మాటిమాటికి నే నిచ్చునట్టి ఆజ్యాదిహవిస్సుచేఁ దృప్తి నొంది యగ్నిహోతుఁడు నాకు భార్యగా సేర్పడియున్న స్త్రీకి ఆజ్యాదులను గలుగఁజేసి పోషించుచుండుగాక.

మూ॥ అభివర్థతాం పయ సాభి రాష్ట్రేణ వర్థతాం । రయ్యా సహస్రపోష సే మాకాస్తా మనపేక్షితా ॥

పదవి॥ అభివర్థతాం । పయసా । అభి । రాష్ట్రేణ । వర్థతాం । రయ్యా । సహస్రపోషసా । ఇమా । స్తాం । అనపేక్షితా ॥

టీక॥ ఇయం=ఈ స్త్రీ, పయసా = క్షీరములచేతను, అస్మాన్=మమ్ములను, అభివర్ధతాం=వృద్ధి నొందించుగాక, రాష్ట్రేణ = గృహక్షేత్రాదులచేతను, అభివర్ధతాం=వృద్ధి నొందించుగాక, సహస్రపోషసా = అనేకులను పోషింపజాలిన, రయ్యా=ధనముచేతను, అభివర్ధతాం=వృద్ధి నొందించుగాక, ఇమౌ=ఈ దంపతులు, అనపేక్షితౌ=ఇతరాపేక్షలేనివారై, స్తాం=ఉందురుగాక.

తా॥ ఈ చిన్నది మమ్ములను క్షీరములు, గృహక్షేత్రాదులు, ధనము, మొదలగువానిచే పోషించుచుండుగాక, అనగా నవియన్నియు సమృద్ధిగా నుండుగాక యని యర్థము. ఈ దంపతుల కన్నియు సమృద్ధిగా కలుగజేసి యన్యాపేక్ష లేకుండునట్లు చేయవలయును.

మం॥ ఇహైవ స్తంమావియోష్టంవిశ్వమాయుర్వ్యశ్నుతం । మహ్యా
ఇంద్రస్స్వస్తయే ॥

పదవి॥ ఇహ । ఏవ । స్తం । మా । వియోష్టం । విశ్వం । ఆయుః । వ్యశ్నుతం । మహ్యై । ఇంద్రః । స్వస్తయే ॥

టీక॥ అంతరాత్మానౌ=ఓ అంతఃకరణలారా, ఇహైవ=ఈగృహములందే, స్తం=ఉండుడు, మావియోష్టం=విడిచిపెట్టి పోకుడు, విశ్వం=అధికమైన, ఆయుః=ఆయుర్దాయమును, అనగా నూటపదియాఱుసంవత్సరములు, వ్యశ్నుతం=పొందుడు, ఇంద్రః=దేవేంద్రుడు, మహ్యై=విశేషమైన, స్వస్తయే=మీ సుఖస్థితికొఱకు, భవతు=అగుగాక.

తా॥ ఈ మంత్రమునందు దంపతులిద్దఱు తమయంతఃకరణములతో చెప్పుచున్నారు. ఓ మనస్సులారా! ఈ గృహమందే నివసించి యుండుడు. విడిచిపెట్టి పోకుడు. పరమాయుర్దాయమైన నూటపదియాఱు సంవత్సరములపరియంతము జీవించియుందురుగాక. ఇంద్రుడును మీ సుఖముకొఱకు బ్రయత్నపడుగాక॥

మం॥ ధ్రువైధి పోష్యా మయి మహ్యం త్వాఽదాద్బృహస్పతిః ।
మయా పత్యా ప్రజావతీ సంజీవ శరద శ్శతం. ॥

పదవి॥ ధ్రువా । ఏధి । పోష్యా । మయి । మహ్యం । త్వా । అదాత్ । బృహస్పతిః । మయా । పత్యా । ప్రజావతీ । సం । జీవ । శరదః । శతం. ॥

టీక॥ హేవధు=ఓచిన్నదానా! త్వం=నీవు, మయా=నాచేతను, పోష్యా=పోషింపఁబడదగినదానవై, మయి=నాయందు, ధ్రువా=నిశ్చలమైనభక్తి కలదానవై, ఏధి=వృద్ధుపొందుము, బృహస్పతిః=బృహస్పతి, త్వా=నిన్ను, మహ్యాం=నాకొఱకు, అదాత్=ఇచ్చెను, పత్యా=పెనిమిటినైన, మయా=నాచేత, ప్రజావతీ=సంతానముకలదానవై, శతం=నూఱు, శరదః=సంవత్సరములు, సంజీవ=మిక్కిలిజీవించుము.

తా॥ ఓచిన్నదానా! నీవు నావలనఁ బోషింపఁబడుచు నాయందు నిశ్చలమైన భక్తి కలదానవై వృద్ధిపొందుము. బృహస్పతి నిన్ను నాకొఱకిచ్చెను. కాఁబట్టి నావలన సంతానమును బొంది నీవు నూఱుసంవత్సరముల పర్యంతము జీవింపుము.

మ॥ త్వష్టా జాయా మజనయ త్త్వష్టా స్యై త్వాం పతిం। త్వష్టా సహస్ర మాయూగ్ంషి దీర్ఘమాయుః కృణోతు వాం॥

పదవి॥ త్వష్టా । జాయాం । అజనయత్ । త్వష్టా । అస్యై । త్వాం । పతిం । త్వష్టా । సహస్రం । ఆయూంషి । దీర్ఘం । ఆయుః । కృణోతు । వాం.

టీక॥ త్వష్టా=బ్రహ్మ, ఇమాం=ఈ స్త్రీని, జాయాం=భార్యనుగా, అజనయత్=పుట్టించెను, త్వష్టా=బ్రహ్మ, అస్యై=ఈ చిన్నదానికొఱకు, త్వాం=నిన్ను పతిం=పెనిమిటినిగా, అజనయత్=పుట్టించెను, త్వష్టా=బ్రహ్మ, వాం=మీ యిద్దఱికొఱకు, సహస్రం=అనేకమైన, ఆయూంషి, ధనములను, దీర్ఘం=విశేషమైన, ఆయుః=ఆయుర్దాయమును, కృణోతు=చేయుచుండుగాక.

తా॥ ఓ యంతఃకరణమా! బ్రహ్మ యీ చిన్నదానిని నాకు భార్యఁగాఁ బుట్టించెను. నన్ను ఈ చిన్నదానికి పెనిమిటిగా బుట్టించెను. ఆ బ్రహ్మదేవుడు మా యిద్దఱకును విశేషమైనధనము గలుగజేసి చిరాయుర్దాయమును జేయుగాక.

మ॥ ఇమం మే వరుణ ॥౧౨॥ తత్త్వా యామి ॥౧౩॥ త్వ న్నో అగ్నే ॥౧౪॥ స త్వ న్నో అగ్నే ॥౧౫॥ త్వ మగ్నే అయాసి॥

ఈ మంత్రములకు పదవిభాగమును అర్థమును తాత్పర్యము మొదలగునవియు పూర్వమే చెప్పఁబడినవి.

ఇతి అష్టమఖండః సమాప్తః

## —♦ అథ నవమఖండప్రారంభః ♦—

మూ॥ ఇహ గావః ప్రజాయధ్వ మిహాశ్వా ఇహపూరుషాః।
ఇహో సహస్రదక్షిణో రాయస్పోషో నిషీదతు॥

పదవి॥ ఇహ । గావః । ప్రజాయధ్వం । ఇహ । అశ్వాః । ఇహ । పూరుషాః । ఇహో । సహస్రదక్షిణః । రాయస్పోషః । నిషీదతు॥

టీక॥ హేగావః = ఓధేనువులారా!, ఇహ = ఈ గృహమునందు, ప్రజాయధ్వం = ప్రసవింపుఁడు, ఇహ=ఇక్కడ, అశ్వాః = ఓ గుఱ్ఱములారా!, పూరుషాః=పురుషులారా!, ప్రజాయధ్వం = ప్రసవింపుఁడు, అనఁగా ప్రసవకారణము కండు. ఇహో = ఇక్కడనే, సహస్రదక్షిణః = విశేషముగా ధర్మముజేయుటకు తగిన, రాయస్పోషః = ధనవృద్ధి, నిషీదతు = ఉండుఁగాక॥

తా॥ ఓ ధేనువులారా! ఓ గుఱ్ఱములారా! ఓ పురుషులారా! ఈ గృహములందే సంతానము కలవారలై కుటుంబవృద్ధిగలిగి ధనవృద్ధిగలిగియుందురు గాక॥

మూ॥ సోమేనాదిత్యా బలిన స్సోమేన పృథివీ దృఢా అథో నక్షత్రాణా మేషా ముపస్థే సోమ ఆధితః॥

పదవి॥ సోమేన । అదిత్యాః । బలినః । సోమేన । పృథివీ । దృఢా । అథః। నక్షత్రాణాం । ఏషాం । ఉపస్థే । సోమః । అధితః॥

టీక॥ అదిత్యాః=దేవతలు, సోమేన = సోమరసముచేత, బలినః = బలముగలవారు, పృథివీ =భూమి, సోమేన =లతావిశేషములచేత, దృఢా = బలముగలది, అథః = అనంతరము, ఏషాం ఈ, నక్షత్రాణాం =నక్షత్రములయొక్క, ఉపస్థే= తొడయందు, అధితః = ఉంచబడెను, ఏవం= ఈ ప్రకారముగా, తవ=నీయొక్క, ఉపస్థే = తొడయందు, అయం = ఈ, బాలః = పిల్లవాఁడు, ఉపవిశతు= కూర్చుండుఁగాక॥

తా॥ దేవతలు సోమపానముచే బలముగలవారైరి. భూమియు సోమలత మొదలగువానిచే దృఢముగలదై యున్నది. ఈ నక్షత్రములయొక్క తొడయందనఁగా సమీపమునందు చంద్రుఁడును ఏర్పఱుపఁబడెను. ( ఇక్కడ సోమశబ్దము

చంద్రపరముగాను లతాపరముగాను శ్లేషింపఁబడినది ) ఈ ప్రకారము ఈ పిల్లవాఁడు నీ తొడయందుఁ గూర్చుండుఁగాక యని యొకపిల్లవానిని వధువుతొడయందుఁ గూర్చుండఁ బెట్టవలయును॥

మూ॥ ప్రస్వ స్థః ప్రేయం ప్రజయా భువనే శోచేష్ట॥

ప॥ ప్రస్వః । స్థ । ప్ర । ఇయం । ప్రజయా । భువనే । శోచేష్ట॥

టీక॥ హేఫలాని = ఓఫలములారా! యుయం=మీరు, ప్రస్వః = ప్రసవించుస్వభావముగలవారు, స్థ = అయితిరి, తథా = ఆ ప్రకారముగా, ఇయం = ఈ స్త్రీ, భువనే = ఈ లోకమునందు, ప్రజయా = సంతానముచేత, శోచేష్ట = ప్రకాశించుఁగాక.

తా॥ ఓ ఫలములారా! మీరేప్రకారముగా చెట్లను బుట్టించుస్వభావము గలవారలో ఆ ప్రకారమే యీ చిన్నదియు సంతానముగలదై ప్రకాశించుఁగాక అని ఆ పిల్లవానికి ఫలముల నియ్యవలయును.

మూ॥ ఇహ ప్రియం ప్రజయా తే సమృధ్యతా మస్మిన్గృహే గార్హపత్యాయ జాగృహి। ఏనా పత్యా తన్వగ్ం సగ్ం సృజ స్వాఽధా జీవ్రి * విదథ మావదాసి॥

పదవి॥ ఇహ । ప్రియం । ప్రజయా । తే । సమృధ్యతాం । అస్మిన్ । గృహే । గార్హపత్యాయ । జాగృహి । ఏనా । పత్యా । తన్వం । సం । సృజస్వ । అథ । జీవ్రీ । విదథం । ఆవదాసి.

టీక॥ ఇహ = ఈ గృహమునందు, ప్రజయా = సంతానముచేత, తే = నీకు, ప్రియం = ప్రీతి, సమృధ్యతాం = అధికము కాఁబడుఁగాక, అస్మిన్ = ఈ, గృహే = గృహమునందు, గార్హపత్యాయ = గృహపతిధర్మముకొఱకు, జాగృహి= జాగ్రతగలదాన వగుము, ఏనా = ఈ, పత్యా = పెనిమిటినైన నాతోడ, తన్వం=నీ శరీరమును, సంసృజస్వ =సంభోగకాలమందు గలిసికొనునట్లు చేయుము, అథ = అనంతరము, జీవ్రి = ముసలిదాన వగుచు, విదథం=అనేకవిషయములను, తనయాదీనాం= పుత్త్రులు మొదలగువారికి, ఆవదాసి = చెప్పుచుండుము.

---

* విదద మితి వా పాఠః.

తా॥ ఓ చిన్నదానా! ఈ గృహమునందు నివసించి కాపురముచేయుచు సంతానసమృద్ధిగలదాన వగుము. ఈ గృహమునందుండియే గృహస్థునిధర్మ మగు నతిథ్యభ్యాగతులనుఁ బూజించుచుండుము. పెనిమిటినైన యీ నాతోడను సంభోగకాలమందు ఆలింగనాదులచే నీ శరీరమును నా శరీరముతోఁ గూర్చుచుండుము. అనంతరము ముసలిదాన వగుచు ఈ కార్య మిట్లుజేయువలయు నని నీ పుత్త్రిలు మనుమలు మొదలగువారికి బోధించుచుండు.

మూ॥ సుమంగలీ రియం వధూ రిమాగ్ం సమేత పశ్యత। సౌభాగ్య
మస్యై దత్వా యాఽథాఽస్తం విపరేతన॥

పదవి॥ సుమంగలీః । ఇయం । వధూః । ఇమాం । సమేత । పశ్యత । సౌభాగ్యం । అస్యై । దత్వాయ । అథ । అస్తం । విపరేతేన ॥

టీక॥ ఇయం=ఈ, వధూః=ఆడుది, సుమంగలీః = చిరకాలము సువాసినీత్వమును బొందుఁగాక, ఇమాం=ఇటువంటిస్త్రీని, సమేత=వచ్చి, పశ్యత = చూతురుగాక, అస్యై=ఈ చిన్నదానికొఱకు, సౌభాగ్యం=భాగ్యమును, దత్వా = ఇచ్చి, అథ=అనంతరము, అస్తం=మీమీ యిండ్లకు, విపరేతన=స్వేచ్ఛగా వెళ్ళుదురుగాక.

తా॥ బహుకాలమువఱకు సువాసినీత్వముగలిగియుండెడి యీ చిన్నదానిని మీరందఱు వచ్చి చూచి యీ చిన్నదానికొఱకు ఆయుర్భాగ్యముల నొసఁగి యనంతరము మీ యిండ్లకు స్వేచ్ఛగా జనుఁడు. వివాహమును జూడవచ్చిన వారి నుద్దేశించి యీ మంత్రము చెప్పంబడినది.

మూ॥ ధ్రువక్షితి ర్ధ్రువయోని ర్ధ్రువ మసి ధ్రువత స్థితం । త్వం
నక్షత్రాణాం మే ధ్యసి స మా పాహి పృతన్యతః॥

పదవి॥ ధ్రువక్షితిః । ధ్రువయోనిః । ధ్రువం । అసి । ధ్రువతస్థితం । త్వం । నక్షత్రాణాం । మేధీ । అసి । సః । మా । పాహి । పృతన్యతః ॥

టీక॥ ధ్రువక్షితిః= నాశరహితమైన నివాసము గలదానవు, ధ్రువయోనిః= నాశములేని కారణము గలదానవు, త్వం=నీవు, ధ్రువతస్థితం=ఇతరనక్షత్రములకు నాశరహితత్వమును సూచించుచు, ధ్రువం=నాశములేనిదానవు, అసి = అయితివి, నక్ష

త్రాణాం=నక్షత్రములకు, త్వం=నీవు, మేధీ=కట్టుకొయ్యవు, అసి=అయితివి, సః=అటువంటి, త్వం=నీవు, మాం=నన్ను, పృతన్యతః=యుద్ధముచేయువారివలన, పాహి=రక్షింపుము.

తా॥ ఓ ధ్రువనక్షత్రమా! నీవు నాశనములేని నివాసము కలదానవును, నాశములేని కారణము గలదానవునై నీవు నాశనములేనిదాన వగుచు ఇతర నక్షత్రములు స్థిరపదమును బొందుటకు మార్గదర్శి వయితివి. నక్షత్రము లన్నియు నిన్ను నాధారము జేసికొని నీ చుట్టుతిరుగుచున్నవి. కాంబట్టి నీవు మాతో యుద్ధముజేయుటకు నెవరైన వచ్చి రేని వారివలన మాకు బాధ కలుగకుండునట్లు చేయుము.

మం॥ సప్తఋషయః ప్రథమాం కృత్తికానా మరుంధతీం। య ద్ధ్రువ
తాగ్ం హ నిన్యుః షట్కృత్తికా ముఖ్యయోగం వహం
తీయ మస్మాక మేధ త్వష్టమీ.

పదవి॥ సప్త । ఋషయః । ప్రథమాం । కృత్తికానాం । అరుంధతీం । యత్ । ధ్రువతాం । హ । నిన్యుః । షట్ । కృత్తికాః । ముఖ్యయోగం । వహంతీ। ఇయం । అస్మాకం । ఏధతు । అష్టమీ ॥

టీక॥ యత్=ఎప్పుడు, సప్తఋషయః=ఏడుగురుమునులును, కృత్తికానాం=ఈ మునులయొక్క ఏడుగురుభార్యలలో, అరుంధతీం=వసిష్ఠునిభార్యయగు అరుంధతీదేవిని, ప్రథమాం=ముందుగా గణనంజేయందగినదానిగాను, ధ్రువతాం=నాశరహితురాలను గాను, నిన్యుః=పొందించిరో అనంగా నెంచిరో, తదా=అప్పుడు, షట్కృత్తికాః=అరుంధతికాక మిగిలిన యారుగురు, ముఖ్యయోగం=అరుంధతియందగ్రగణ్యత్వము, వహంతి=భావించిరి, తథా=ఆ ప్రకారముగా, ఇయం = ఈ చిన్నది, అస్మాకం=మాకు, అష్టమీ=ఎనిమిదవది యగుచు, ఏధతు=వృద్ధిపొందుంగాక.

తా॥ కశ్యపుండు మొదలగు నేడుగురు మునులును తమ యేడుగురు భార్యలలో నరుంధతీదేవి యగ్రగణ్యురాలనియు, మనస్సునం దైనను వ్యభిచారాదిగుణములు లేని దగుటచే నిశ్చలమైనదనియు దలంచిరి. అందువలన అరుంధతికాక తక్కిన యారుగురు స్త్రీలు అరుంధతిని దమలో నగ్రగణ్యురా లనుభావము వహించిరి. ఆ తీరుననే యీ చిన్నదానిని ఆ యేడుగురికిం బిమ్మట నెనిమిదవదానిగాను

బవిత్రమైనదానిగాను దలచితిమి గాన ఈ చిన్నది వృద్ధిపొందుగాక. ఇచ్చట భర్త సప్తఋషులకు బిమ్మట దా నెనిమిదవఋషి నని భావించుకొన్నట్లు అర్థాత్తు సిద్ధించుచున్నది.

మూ॥ సదసస్పతి మద్భుతం ప్రియ మింద్రస్య కామ్యం। సనిం మేధా మయాశిషం.

పదవి॥ సదసస్పతిం। అద్భుతం। ప్రియం। ఇంద్రస్య। కామ్యం। సనిం। మేధాం। అయాశిషం.

టీక॥ అద్భుతం = గొప్పవాడును, ఇంద్రస్య = దేవేంద్రునకు, ప్రియం = ఇష్టుడును, కామ్యం = ప్రార్థింపదగినవాడు నగు సదసస్పతిం= అగ్నిహోత్రుని గుఱించి, సనిం = దానమును, మేధాం = జ్ఞానమును, అయాశిషం = యాచించుచున్నాను.

తా॥ గొప్పవాడును దేవేంద్రునకు స్నేహితుడును ప్రార్థింపదగినవాడు నగు అగ్నిహోత్రుని దానమును జ్ఞానమును నాకు కలుగఁజేయుటకొఱకు యాచించుచున్నాను.

మూ॥ ఉ ద్దీప్యస్వజాతవే దోఽపఘ్న న్నిర్ ఋతిం మమ। పశూగ్ శ్చ మహ్య మావహ జీవనం చ దిశో దిశ॥

పదవి॥ ఉత్। దీప్యస్వ। జాతవేదః। అపఘ్నన్। నిర్ ఋతిం। మమ। పశూన్। చ। మహ్యం। ఆవహ। జీవనం। చ। దిశః। దిశ.

అ॥ హేజాతవేదః = ఓయగ్నిహోత్రుడా! మమ = నాయొక్క, నిర్ ఋతిం = ఘాతుకసమూహమును, అపఘ్నన్ = నశింపఁజేయుచు, ఉద్దీప్యస్వ = మిక్కిలి ప్రకాశింపుము, మహ్యం = నాకొఱకు, పశూంశ్చ=పశువులను, ఆవహ= తెమ్ము, దిశః = అన్నిదిక్కులను, జీవనం = నాకొఱకు జీవనమును, దిశ = ఇమ్ము.

తా॥ ఓ యగ్నిహోత్రుడా। నన్ను హింసింపఁదలఁచిన క్రూరు లెవ్వరు గలరో వారిని నశింపఁజేసి నీవు ప్రకాశింపుము. నా కొఱకుఁ బశువులను గలుగఁ జేయుము. నే నేదిక్కున కేగినను నిరభ్యంతరముగా జీవనముండునట్లు చేయుము.

మూ॥ మా నో హిగ్ంసీ జ్ఞాతవేదో గా మశ్వం పురుషం జగత్। అబిభ్ర దగ్న ఆగహి శ్రియా మా పరిపాతయ॥

పదవి॥ మా । నః । హింసీత్ । జాతవేదః । గాం । అశ్వం । పురుషం । జగత్ । అబిభ్రత్ । అగ్నే । ఆగహి । శ్రియా । మా । పరి । పాతయ ॥

టీక॥ హే జాతవేదః=ఓ యగ్నిహోత్రుఁడా !, నః=మమ్ములను, మాహింసీత్=హింసచేయకుము, గాం=ఆవును, అశ్వం=గుఱ్ఱమును, పురుషం=మనుష్యుని, జగత్=మఱియు, నితరమైన పదార్థమును, దేహి=కలుగఁజేయుము, అగ్నే=ఓ యగ్నిహోత్రుఁడా ! అబిభ్రత్=దేవతల కొఱకు నిచ్చు హవిస్సును గ్రహింపక, ఆగహి=నావద్దకురమ్ము, శ్రియా=లక్ష్మిచేత, మా=నన్ను, పరిపాతయ (పరిపాలయ)=రక్షింపుము.

తా॥ ఓ యగ్నిహోత్రుఁడా ! మమ్ములను హింసచేయక పశువులను గుఱ్ఱములను మనుష్యులను మఱియు నితరమైన యన్నిపదార్థములను గలుగఁజేయుము. దేవతలకొఱ కిచ్చునట్టి హవిస్సును గ్రహింపక ముందు నా వద్దకు వచ్చి నాకు భాగ్యము నొసఁగి రక్షింపుము.

ఇతి నవమఖండ స్సమాప్తః.

---

## —♦ అథ దశమఖండ ప్రారంభః ♦—

మం॥ ఉదీ ష్వాఽతో విశ్వావసో నమ సేడామహే త్వా । అన్యామిచ్ఛ ప్రఫర్వ్యగ్ం సం జాయాం పత్యా సృజ ॥

పదవి॥ ఉదీష్వ । అతః । విశ్వావసో । నమసా । ఈడామహే । త్వా । అన్యాం । ఇచ్ఛ । ప్రఫర్వ్యం । సం । జాయాం । పత్యా । సృజ ॥

టీక॥ విశ్వావసో=విశ్వావసువను గంధర్వుఁడా !, అతః = ఈదండమునుండి, ఉదీష్వ=లెమ్ము, త్వా=నిన్ను, నమసా = నమస్కారముచేత, ఈడామహే=యాచించుచున్నాము, ప్రఫర్వ్యం=నూతనవయస్సుగల, అన్యాం=మఱియొక చిన్నదానిని, ఇచ్ఛ=కోరుము, ఏనాం=ఈ చిన్నదానిని, పత్యా=పెనిమిటియైన నాతోడ, జాయాం=భార్యనుగా, సంసృజ=కూర్చుము.

తా॥ విశ్వావసు వనెడి యో గంధర్వుఁడా ! యిక్కడే నుండి లేచి వెళ్ళుము. నీకొఱకు నమస్కారముచేసి నిన్నొకటి యాచించుచున్నాను. అది యేదనఁ

గా ఈ చిన్నదానిని నాకు భార్యగా విడిచిపెట్టి నీవు యౌవనావిర్భావమగుచున్న మఱియొక చిన్నదాని వహింపుము.

మూ॥ ఉదీ ష్వాఽతః పతివతీ హ్యేషా విశ్వావసుం నమసా గీర్భి
ర్ఈట్టే । అన్యా మిచ్ఛ పితృషదం వ్యక్తాగ్ం స తే భాగో
జనుషా తస్య విద్ధి ॥

పదవి॥ ఉదీర్ష్వ । అతః । పతివతీ । హి । ఏషా । విశ్వావసుం । నమసా । గీర్భిః । ఈట్టే । అన్యాం। ఇచ్ఛ । పితృషదం । వ్యక్తాం । సః । తే । భాగః । జనుషా । తస్య । విద్ధి ॥

టీక॥ అతః = ఇక్కడనుండి, ఉదీర్ష్వ = లెమ్ము, ఏషా = ఈ చిన్నది, పతివతీహి = పెనిమిటికలదైనదికదా, నమసా=నమస్కారముచేతను, గీర్భిః=స్తోత్రములచేతను, త్వాం = నిన్ను, ఈట్టే = యాచించుచున్నాను, పితృషదం = వివాహముకానిదగుటచే తండ్రిగృహమునందున్నదియు, వ్యక్తాం = వివాహముచేయుటకు నావిర్భావమగుచున్న యౌవనముగలదియు నగు, అన్యాం = మఱియొకస్త్రీని, ఇచ్ఛ = కోరుము, సః = అది, తే = నీయొక్క, జనుషా = జన్మముచే, భాగః= భాగమైనది, తస్య=దానిని, (ద్వితీయార్థేషష్ఠీ), విద్ధి = పొందుము.

తా॥ ఓ గంధర్వుడా! ఇక్కడనుండి లెమ్ము. ఈ చిన్నది నన్ను వివాహము చేసికొనిన దగుటచే పెనిమిటి గలదైనది. కాబట్టి విశ్వావసు వనుపేరు గల నీకు నమస్కారస్తోత్రములను జేసి వేడుకొనుచున్నాను, వివాహముకానిది యగుటచే తండ్రిగృహమునందే యున్నదియు వివాహముజేయుట కావిర్భవించుచున్న యౌవనము గలదియు నగు మఱియొక స్త్రీని గోరుము. అట్టి స్త్రీలే నీకు భాగలబ్ధలై యుండిరి. కాబట్టి అట్టి స్త్రీని బొందుము.

మూ॥ అగ్నే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తి రసి।
బ్రాహ్మణ స్త్వా నాధకామః ప్రపద్యేయాఽస్యాం పతిఘ్నీ
తనూః ప్రజాఘ్నీ పశుఘ్నీ లక్ష్మిఘ్నీ జారఘ్నీ మ స్యైతాం
కృణోమి స్వాహా॥

పదవి॥ అగ్నే । ప్రాయశ్చిత్తే । త్వం । దేవానాం । ప్రాయశ్చిత్తిః । అసి । బ్రాహ్మణః । త్వా । నాధకామః । ప్రపద్యే । పతిఘ్నీ । తనూః । ప్రజాఘ్నీ । పశుఘ్నీ । లక్ష్మిఘ్నీ । జారఘ్నీం । అస్యై । తాం । కృణోమి । స్వాహా.

టీక॥ ప్రాయశ్చిత్తే=నశించిన కర్మముల ననుసంధానము చేయునట్టి, అగ్నే= ఓ యగ్నిహోత్రుడా! త్వం=నీవు, దేవానాం=దేవతలలో, ప్రాయశ్చిత్తిః=నశించిన కర్మములను సంధానము చేయువాఁడవు, అసి=అయితివి, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడనైన, అహం=నేను, నాథకామః=ప్రభువును గోరినవాడనై, త్వాం=నిన్ను, ప్రపద్యే=పొందితిని, అస్యాం=ఈ స్త్రీయందు, పతిఘ్నీ=పెనిమిటిని నశింపుజేయు నట్టిదియు, ప్రజాఘ్నీ=సంతానమును నశింపుజేయునట్టిదియు, పశుఘ్నీ=పశువులను నశింపుజేయునట్టిదియు, లక్ష్మిఘ్నీ=సంపత్తును నశింపుజేయునట్టిదియు, యా=ఏ తనూః=శరీరముకలదో, అస్యై=ఈ స్త్రీయొక్క, తాం=ఆ శరీరమును, జారఘ్నీం= ఉపపతిని నశింపుచేయునదిగా, కృణోమి=చేయుచున్నాను, అని, స్వాహా=హోమముచేయుచున్నాను.

తా॥ కర్మభ్రష్టులను దిరిగి కర్మములయం దధికారము కలవారిఁగాఁ జేయు వాఁడా! నీవు దేవతలలో నశింపజేయబడినకర్మములను దిరిగి చేయించువాఁడవైతివి. బ్రాహ్మణుండనైననేను నిన్ను ప్రభువుగాఁ గోరి యాశ్రయించితిని. పెనిమిటిని జంపునట్టివియు సంతానమును చంపునట్టివియు పశువులను చంపునట్టివియు సంపత్తును నశింపచేయునట్టివియు నగు అమంగళకరములగురేఖలుగాని అవయవలోపములుగాని యేవి యీస్త్రీయందుఁ గలవో అవి యన్నియు ఈ చిన్నదానికి విటుఁడున్నయెడల వానిని నశింపుచేయునవిగాఁజేయుము.

మూ॥ వాయో ప్రాయశ్చిత్తే॥ ఆదిత్య ప్రాయశ్చిత్తే॥ ప్రజాపతే
ప్రాయశ్చిత్తే ॥

పదవి॥ వాయో । ప్రాయశ్చిత్తే॥ ఆదిత్య । ప్రాయశ్చిత్తే । ప్రజాపతే । ప్రాయశ్చిత్తే.

టీక॥ ప్రాయశ్చిత్తే=భ్రష్టకర్మలనుకర్మయోగ్యతలవారిగాఁజేయు, వాయో= వాయువా, ప్రాయశ్చిత్తే=కర్మభ్రష్టులను దిరిగియోగ్యులనుగాఁ జేయు, ఆదిత్య= సూర్యుఁడా! ప్రజాపతే=ఓబ్రహ్మ॥

తా॥ ఈ మూఁడుమంత్రములలో వాయువును సూర్యుని బ్రహ్మను సంబోధన జేయుట మిగిలినయన్నిపదములకు మొదటిమంత్రములో అర్థాదులు చెప్పఁబడియె.

మూ॥ ప్రసవ శ్చోపయామ శ్చ కాట శ్చా ర్ణవ శ్చ ధర్ణ
సిశ్చ ద్రవిణం చ భగ శ్చాంతరిక్షం చ సింధు శ్చ సముద్రశ్చ
సరస్వాగ్ శ్చ విశ్వవ్యచా శ్చ తే యం ద్విష్మో యశ్చ నో
ద్వేష్టి త మేషాం జంభే దధ్మ స్వాహా॥

పదవి॥ ప్రసవః । చ । ఉపయామః। చ। కాటః । చ। అర్ణవః। చ। ధర్ణ సిః । చ । ద్రవిణం । చ । భగః । చ । అంతరిక్షం । చ । సింధుః । చ । సము ద్రః । చ । సరస్వాన్ । చ । విశ్వవ్యచాః । చ । తే । యం । ద్విష్మః । యః । చ । నః । ద్వేష్టి । తం । ఏషాం । జంభే । దధ్మః । స్వాహా ॥

టీక॥ ప్రసవశ్చ = అనుజ్ఞయు, ఉపయామశ్చ = పృథివియు, కాటశ్చ = లింగరూపమగురుద్రుఁడును, అర్ణవశ్చ = మడుగు, ధర్ణసిశ్చ = ధర్ణసియను పేరుగలగ్రామము, ద్రవిణంచ = ధనము, భగశ్చ = భగుఁడను సూర్యుఁడు । అంత రిక్షంచ = ఆకాశము, సింధుశ్చ = సింధు వనునదియు, సముద్రశ్చ = సముద్రము, సరస్వాన్ = సరస్వత్తను దేవత । విశ్వవ్యచాశ్చ = దేవేంద్రుఁడు, తే = అనఁబడు ప్రసిద్ధులగు నేదేవతలు కలరో, వయం = మేము, యం=ఎవని, ద్విష్మః=ద్వేషించు చున్నామో, యశ్చ = ఎవఁడు, నః = మమ్ములను, ద్వేష్టి = ద్వేషించుచున్నాఁడో, తం = వానిని, ఏషాం = ఈదేవతలయొక్క, జంభే=దంతములయందు, భక్షణాయ= భక్షించుటకొఱకు, దధ్మః = ఉంచుచున్నాము.

తా॥ అనుజ్ఞ భూమి, రుద్రుఁడు, మడుగు, ధర్ణ యనుగ్రామము, ధనము, భగుఁ డను సూర్యుఁడు, ఆకాశము, సింధు వను నది, సముద్రము, సరస్వత్తు అను దేవత, ఇంద్రుఁడు అనఁబడెడి యే దేవతలు కలరో అ దేవతలచే మమ్ముల నెవఁడు దూషించుచున్నాఁడో వానిని మే మెవ్వని దూషించుచున్నామో వానిని భక్షింపఁ జేయుచున్నాము.

మూ॥ మధు శ్చ మాధవ శ్చ శుక్ర శ్చ శుచి శ్చ నభ శ్చ నభస్య
శ్చేష శ్చోర్జ శ్చ సహ శ్చ సహస్య శ్చ తప శ్చ తపస్య
శ్చ తే యం ద్విష్మో య శ్చ నో ద్వేష్టి త మేషాం జంభే
దధ్మ స్వాహా ॥

పదవి॥ మధుః । చ । మాధవః। చ। శుక్రః । చ । శుచిః । చ । నభః । చ। నభస్యః । చ । ఇషః । చ। ఊర్జః । చ । సహః । చ । సహస్యః । చ। తపః । చ। తపస్యః। చ । తే । యం । ద్విష్మః । యః । చ । నః । ద్వేష్టి । తం । ఏషాం । జంభే । దధ్మః । స్వాహా॥

టీక॥ మధుః=చైత్రమాసము, మాధవః = వైశాఖమాసము, శుక్రః = జ్యేష్ఠ మాసము, శుచిః = ఆషాఢమాసము, నభః = శ్రావణమాసము, నభస్యః =భాద్రపద మాసము, ఇషః = ఆశ్వయుజమాసము, ఊర్జః=కార్తికమాసము, సహః=మార్గశీర్ష మాసము, సహస్యః=పుష్యమాసము, తపః=మాఖమాసము, తపస్యః=ఫాల్గునమాసము, అను, తే=ప్రసిద్ధమైన యేమాసములుకలవో, ఏషాం=ఈమాసాధిదేవతలయొక్క, జంభే =దంతములయందు, వయం=మేము, యం = ఎవనిని, ద్విష్మః = ద్వేషించుచున్నా మొ, యః = ఎవడు, నః=మమ్ములను, ద్వేష్టి=ద్వేషించుచున్నాడో, తం=వానిని, భక్షణాయ = భక్షించుటకొఱకు, దధ్మః= ఉంచుచున్నాము.

తా॥ చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తికము, మార్గశీర్షము, పుష్యము, మాఘము, ఫాల్గుణము అను ప్రసిద్ధములయిన యే మాసములు కలవో ఆ మాసములు భక్షించుటకొఱకు మమ్ములను దూషించువానిని, మేము దూషించువానిని, ఆ మాసాధిదేవతల దంతములలో నుంచుచున్నాము.

మూ॥ చిత్తం చ చిత్తి శ్చాఽకూతం చాఽకూతి శ్చాఽధీతం చాఽ
ధీతి శ్చ విజ్ఞాతం చ విజ్ఞానం చ నామ చ క్రతుశ్చ దర్శశ్చ
పూర్ణిమాస శ్చ తే యం ద్విష్మో య శ్చ నో ద్వేష్టి త
మేషాం జంభే దధ్మ స్స్వాహా ॥

పదవి॥ చిత్తం । చ । చిత్తిః । చ। ఆకూతం । చ । ఆకూతిః । చ । ఆధీతం। చ । అధీతిః । చ । విజ్ఞాతం । చ । విజ్ఞానం । చ । నామ । చ। క్రతుః । చ । దర్శః । చ । పూర్ణిమాసః । చ । తే । యం । ద్విష్మః । యః । చ । నః । ద్వేష్టి । తం । ఏషాం । జంభే । దధ్మః ॥

టీక॥ చిత్తంచ = అంతఃకరణమును, చిత్తించ = అంతఃకరణవ్యాపారమును, ఆకూతంచ=అభిప్రాయమును బొందినపదార్థమును, ఆకూతిఃచ = అభిప్రాయమును,

అధీతంచ=చదువఁబడువిద్యను, అధీతిశ్చ = చదువుట, విజ్ఞాతంచ=తెలిసికొనఁబడిన విషయమును, విజ్ఞానంచ=తెలిసికొనుజ్ఞానమును, నామచ=పేరును, కర్మణఃచ=రూపమును, దర్శఃచ = ఇష్టివిశేషము, పూర్ణమాసః = పౌర్ణమియందుఁ జేయఁబడు నట్టియిష్టి అనునట్టి, తే = ప్రసిద్ధమైనవి యేవిగలవో, ఏషాం = వానియొక్క, జంభే = (జాత్యేకవచనము) దంతములయందు, వయం=మేము, యం = ఎవనిని, ద్విష్మః=ద్వేషించుచున్నామో, యః=ఎవఁడు, నః=మమ్ములను, ద్వేష్టి=ద్వేషించుచున్నాఁడో, తం=వానిని, దధ్మః=ఉంచుచున్నాము.

తా॥ అంతఃకరణము, అంతఃకరణవ్యాపారము, అభిప్రాయము, అభిప్రాయముగల పదార్థము, చదువుట, చదువఁబడిన విద్య తెలిసికొనుట, తెలిసికొనబడిన విషయము, నామము, రూపము, దర్శపూర్ణమాసేష్టు లన బడునవి యేవిగలవో వానియొక్క అధిదేవతలెవరు గలరో వారు మాకు విరోధులైన వారిని భక్షించుటకొఱకా దేవతల దంతములయందుంచుచున్నాము.

మూ॥ భూ స్స్వాహా ॥౧౧॥ భువ స్స్వాహా ॥౧౨॥ సువస్స్వాహా ।
॥౧౩॥ ఓగ్ స్వాహా ॥

పదవి॥ భూః। స్వాహా। భువః । స్వాహా । సువః । స్వాహా । ఓం । స్వాహా .

టీక॥ భూః=భూలోకము, భువః=భువర్లోకము, సువః=సువర్లోకము, ఓం=బ్రహ్మ, ఏత్=వీరు, తృప్యతు=నే జేయు కర్మములవలన సంతోషమును బొందుదురు గాక, అని, స్వాహా=హోమమును జేయుచున్నాఁడు.

తా॥ నే జేయు కర్మములవలన భూలోక భువర్లోక సువర్లోక బ్రహ్మలు సంతోషింతురుగాక యని హోమము జెయుచున్నాఁడు.

ఇతి దశమఖండ స్సమాప్తః

---

## అథైకాదశఖండ ప్రారంభః

మూ॥ అపశ్యం త్వా మనసా చేకితానం తపసో జాతం తపసో
విభూతం ఇహ ప్రజామి హారయిగ్ం రరాణః ప్రజాయస్వ
ప్రజయా పుత్రకామ ॥

పదవి॥ అపశ్యం । త్వా । మనసా । చేకితానం । తపసః । జాతం । తపసః । విభూతం । ఇహ । ప్రజాం । ఇహ । రయిం । రరాణః । ప్రజాయస్వ । ప్రజయా । పుత్రకామః॥

టీక॥ త్వాం = నిన్ను, చేకితానం = నాయభిప్రాయమునుఁ గ్రహింగినవాని గాను, తపసః = గర్భాధానము మొదలు గాఁగల షోడశకర్మము లనెడుతపస్సువలన, జాతం = పుట్టినవానిఁ గాను, తపసః = భిక్షాచర్యము మొదలగుతపస్సుచే, విభూతం= ఐశ్వర్యముగలవానిఁ గాను, మనసా= మనస్సుచే, అపశ్యం=చూచితిని, పుత్రకామ= పుత్త్రులయందు గోరికగలవాఁడా ! ఇహ = ఈ గృహమునందే, ప్రజాం = సంతానమును, రయిం = ధనమును, రరాణః = ఇచ్చువాఁడ వై, ప్రజయా = సంతానముచేత, ప్రజాయస్వ = పుట్టుము.

తా॥ నా యభిప్రాయమును దెలిసినవానిఁగాను, వేదోక్తషోడశకర్మములచే సంస్కరింపఁబడుటచే తపస్సువలనఁబుట్టినవానిఁగాను, భిక్షాచర్య మొదలగునవిచేసి వేదాభ్యాసము చేయుటచే ఐశ్వర్యము గలవానిగాను, అనఁగా బ్రాహ్మణునకు వేదమేసంపత్తని యభిప్రాయము మనస్సుచేఁ జూచితిని అనఁగాగ్రహించితిని. సంతానాపేక్ష గలిగియున్ననీవు నాయందు సంతానమును బుట్టించి యైశ్వర్యమును గలుగజేయుము అని భార్య పెనిమిటితోఁ జెప్పుచున్నది.

మూ॥ అపశ్యం త్వా మనసా దీధ్యానాగ్ం స్వాయాం *తనూ ఋత్వియె నాధమానాం ఉప మా ముచ్చా యువతి ర్బభూయాః ప్రజాయస్వ ప్రజయాపుత్రకామే॥

పదవి॥ అపశ్యం । త్వా । మనసా । దీధ్యానాం । స్వాయాం । తనూ । ఋత్వియే । నాధమానాం । ఉప । మాం । ఉచ్చా । యువతిః ! బభూయాః । ప్రజాయస్వ । ప్రజయా । పుత్త్రకామే॥

టీక॥ త్వాం=నిన్ను, దీధ్యానాం=నాయందలి భక్తిచే నన్ను ధ్యానించుదానవుగాను, స్వాయాంతనూ = నీ శరీరమందు, ఋత్వియే=ఋతుకాలమందైనగర్భమందు, నాధమానాం=కోరికగలదానిఁగాను, మనసా=మనస్సుచేత, అపశ్యం=చూచి

---

* తనూగ్ం ఋత్వియే ఇతి వా పాఠో దృశ్యతే.

తిని, యువతిః=యౌవనముగల నీవు, మాం=నన్ను, ఉచ్చా=సంభోగకాలమందు పైననున్నవానిఁగా, ఉపబభూయాః=అనుభవింపుము, పుత్రకామే = పుత్త్రిలను గోరుదానా ! ప్రజయా=సంతానముచేత, ప్రజాయస్వ=పుట్టుము.

(మాతాపితృ శుక్లశోణిత సంబంధము కలిగియుండుటచే పుత్త్రరూపముగా జనన ముభయులయందు వర్తించుచున్నది.)

తా॥ నాయందలి భక్తిచే నన్ను ధ్యానించుదానవుగాను, ఋతుకాలమం దేర్పడు గర్భధారణమందపేక్షగలదానవుగాను, నిన్ను నేఁదెలిసికొంటిని. యౌవనము గల నీవు నాతో సంభోగించితివేని నీవు సంతానము కలుగును.

మూ॥ స మంజంతు విశ్వేదేవా స్స మాపో హృదయాని నౌ । సం మాతరిశ్వా సం ధాతా స ము దేష్ట్రీ దిదేష్టు నౌ॥

పదవి॥ సం । అంజంతు । విశ్వేదేవాః । సం । ఆపః । హృదయాని । నౌ । సం । మాతరిశ్వా । సం । ధాతా । సం । ఉ । దేష్ట్రీ । దిదేష్టు । నౌ ॥

టీక॥ విశ్వేదేవాః=విశ్వేదేవతలు, నౌ=మన యిద్దఱయొక్కయు, హృదయాని=హృదయములను, సమంజంతు = స్నేహముగలవిగాఁ జేయుఁగాక, ఆపః= ఉదకములు, సమంజంతు=స్నేహముగలవిగాఁ జేయుఁగాక, మాతరిశ్వా=వాయువు, సమనక్తు=స్నేహముగలవిగాఁ జేయుఁగాక, ధాతా=బ్రహ్మ, సమనక్తు=స్నేహము గలవిగాఁ జేయుఁగాక, దేష్ట్రీ=సంభాషణమును జేయించు సరస్వతి, నౌ=మన యిద్దఱను, సందిదేష్టు=సంభోగకాలమం దనుకూలమైన సంభాషణ గలవారినిగా మనలను జేయుచుండుఁగాక యని యర్థము.

తా॥ విశ్వేదేవతలు జలములు వాయువు బ్రహ్మ వీరు మన మనస్సులను స్నేహముతోఁ గూడినవిగాఁ జేయుదురుగాక. సరస్వతి మనలను అనుకూలమైన సంభాషణ గలవారినిగాఁ జేయుఁగాక.

మూ॥ ప్రజాపతే తన్వం మే జుషస్వ త్వష్ట దేవేభి స్సహసామ ఇంద్ర । విశ్వై ర్దేవై రాతిభి । స్సగంరరాణః పుగంసాం బహూనాం మాతర స్స్యామ॥

పదవి॥ ప్రజాపతే । తన్వం । మే । జుషస్వ । త్వష్టః । దేవేభిః । సహసామః । ఇంద్ర । విశ్వైః । దేవైః । రాతిభిః । సం । రరాణః । పుంసాం । బహూనాం । మాతరః । స్యామ ॥

టీక॥ ప్రజాపతే = ఓబ్రహ్మ, మే = నాయొక్క, తన్వం = శరీరమును, జుషస్వ = ప్రవేశించుము, త్వష్టః = ఓత్వష్టప్రజాపతీ !, సహసామః=రూపనిర్మాణమందు సమర్థుఁడవైన, త్వం=నీవు, దేవైః=దేవతలతోఁగూడ, మే= నాయొక్క, తన్వం = శరీరమును, జుషస్వ = ప్రవేశింపుము, ఇంద్ర = ఓయింద్రుఁడా !, రాతిభిః = నీకుమిత్రులైన, విశ్వైః = సమస్తమైన, దేవైః = దేవతలతోఁగూడ, మే = నాయొక్క, తన్వం =శరీరమును, ప్రవిశ్య = ప్రవేశించి, సంరరాణః = మాయొక్క కోర్కెల నిమ్ము, ఆవాం = మేమిద్దఱము, బహూనాం=అనేకులైన, పుంసాం = పురుషులకు, మాతరః= (పితృశబ్దమునకు ఏకశేషవృత్తిగాని మాతృశబ్దమునకులేదు, ఇది ఛాందసము) తల్లిదండ్రులము, స్యామ = అయ్యెదము.

తా॥ ఓప్రజాపతీ ! త్వష్ట అనఁబడెడి యో బ్రహ్మ ! ఇంద్రుఁడా ! మీరందఱును మీకు స్నేహితులైన సమస్తమైనదేవతలతోఁ గూడ నా శరీరమందుఁ బ్రవేశించి నాకు బలమును కలిగింపుఁడు. నా కోర్కెల నన్నియు నొసఁగుడు. మా కనేకులైనతనయులు జనియించునట్లు చేయుఁడు.

మూ॥ ఆ నః ప్రజాం జనయతు ప్రజాపతి రా జరసాయ సమనక్త్వర్యమా అదుర్మంగలీః పతిలోక మావిశ శన్న ఏధి ద్విపదే శం చతుష్పదే॥

పదవి। ఆ । నః । ప్రజాం । జనయతు । ప్రజాపతిః । ఆజరసాయ । సమనక్తు । అర్యమా । అదుర్మంగలీః । పతిలోకం । ఆవిశ । శం । నః।ఏధి । ద్విపదే । శం । చతుష్పదే॥

టీక॥ ప్రజాపతిః=బ్రహ్మ, నః=మా యిద్దఱకు, ప్రజాం=సంతానమును, ఆజనయతు=పుట్టించుఁగాక, అర్యమా=సూర్యుడు, ఆజరసాయ=ముదిమిపర్యంతము, ఆవాం=మమ్ములను, సమనక్తు=స్నేహముగలవారినిగా జేయుఁగాక, త్వం=నీవు, అదుర్మంగలీః=అమంగళములులేనిదానవగుచు అనఁగా, సువాసినివిగా నున్నదానవగుచు, పతిలోకం=పెనిమిటిసైననాయొక్కగృహమును, ఆవిశ=నివసించియుండుము,

నః=మాకొఱకు, శం=సుఖమును, ద్విపదే=రెండుపాదములు గలమనుష్యులు మొద
లగువారికొఱకు, శం=సుఖమును, చతుష్పదే=నాలుగుపాదములు గలపశువులు
మొదలగువానికొఱకు, శం=సుఖమును, ఏధి=వృద్ధిపొందించుము.

తా॥ బ్రహ్మ మాకు సంతానమును గలిగించుఁగాక. సూర్యుఁడు మేము బ్రతికియుండునంతపర్యంతము మమ్ములను స్నేహము గలవారినిగాఁ జేయుఁగాక. నీవు చిరకాలమువరకు సువాసిగా నుండి మాకును ఇతరులైనమనుష్యులకును పశువులు మొదలగువానికిని సుఖమును కలుఁగఁజేయుచుండుము.

మ॥ తాం పూషం ఛ్ఛివతమా మేరయస్వ యస్యాం బీజం మను
ష్యా వపంతి యా న ఊరూ ఉశతీవిస్రయాతై యస్యా
ముశంతః ప్రహారేమ శేఫం,

పదవి॥ తాం । పూషన్ । శివతమాం । ఏరయస్వ । యస్యాం । బీజం । మనుష్యాః । వపంతి । యా । నః । ఊరూ । ఉశతీ । విస్రయాతై । యస్యాం । ఉశంతః । ప్రహారేమ । శేఫం.

టీక॥ పూషన్=ఓసూర్యుడా! తాం=అపూర్వోక్తమైన నా భార్యను, శివతమాం=అనుకూలమైనదానిఁగా, కృత్వా=చేసి, ఏరయస్వ=నావద్దకుఁ బ్రేరేపింపుము, మనుష్యాః=మనుష్యులు, యస్యాం=ఏ స్త్రీయందు, బీజం=వీర్యమును, వపంతి=ఉంచుచున్నారో, యా=ఏ స్త్రీ, ఉశతీ=కోరుచున్నదై, ఊరూ=తొడలను విస్రయాతై=విడఁనట్లుగాఁజేయుచున్నదో, వయం=మేము, ఉశంతః=కోరుచున్నవారమై, యస్యాం=దేనియందు, శేఫం=శిశ్నమును, ప్రహారేమ=ప్రయోగించుచున్నామో. అని వెనుకకన్వయము.

తా॥ ఓ సూర్యుడా! స్త్రీలయందుఁ బురుషులు శుక్లమును విడిచిపెట్టుటచే సంతానము కలుగును. కాఁబట్టి యే స్త్రీ యపేక్ష గలదై సంభోగాదులకు దగిన ప్రయత్నసన్నాహములను జేయుచుండునో యట్టి నా భార్యను నా కనుకూలమైన దానిగాఁజేసి నా వద్దకుఁ బంపించుము. ఇంతకంటె స్పష్టముగాఁ జెప్పుట విరుద్ధముగా నుండునుగానఁ జెప్పలేను.

ఇతి ఏకాదశఖండః సమాప్తః

## —♦ అథ ద్వాదశఖండ ప్రారంభః ♦—

మూ॥ ఆరోహోరు ముపబర్హస్వ బాహుం పరిష్వజస్వ జాయాగ్ం
సుమనస్యమాన। తస్యాం పుష్యతం మిథునౌ సయోనీ
బహ్వీం ప్రజాం జనయంతౌ సరేతసా॥

పదవి॥ ఆరోహ। ఊరుం। ఉప। బర్హస్వ। బాహుం। పరిష్వజస్వ। జాయాం। సుమనస్యమానః। తస్యాం। పుష్యతం। మిథునౌ। సయోనీ। బహ్వీం। ప్రజాం। జనయంతౌ। సరేతసా॥

టీక॥ ఆత్మక్=ఓ ఆత్మా! ఊరుం=తొడను, ఆరోహి=అధిష్ఠించుము, బాహుం=హస్తమును, ఉపబహర్స్వ=చాపుము, తస్యాం=దానియందు, సుమనస్యమానః=ప్రేమగలవాఁడవై, జాయాం=భార్యను, పరిష్వజస్య=ఆలింగనము చేసికొనుము, పుష్యతం=(మీరిద్దఱు) పుష్టిగలిగి యుండుఁడు, మిథునౌ=మీరు దంపతులై, సయోనీ=కలిసికొనిన యుపస్థేంద్రియములు కలవారై, సరేతసా=వీర్యముతోఁగూడినవారలగుచు, బహ్వీం=విశేషమైన, ప్రజాం=సంతానమును, జనయంతౌ=పుట్టించుచుండుడు.

తా॥ పురుషుఁడు తన ఆత్మతోఁ జెప్పుచున్నాఁడు. ఓ ఆత్మా! భార్యయందు ప్రేమగలవాఁడవై కటి ప్రదేశము నధిష్ఠించి బాహువులను జాచి భార్యను ఆలింగనము చేసికొనుము. ఇప్పుడు తమ యిద్దఱనుగూర్చి చెప్పుచున్నాఁడు. మీరిద్దఱు దంపతులై పుష్టిగలవారగుచు సంభోగించి వీర్యమును గ్రహించినవారలై, సంతానమును బుట్టించుచుండుఁడు.

మూ॥ ఆద్రీఽయారణ్యా యత్రామంథ త్పురుషం పురుషేణ
శక్రః। త దేతౌ మిథునౌ సయోని ప్రజయామృతే నేహ
గచ్ఛతం॥

పదవి॥ ఆద్రీఽయా।అరణ్యా। యత్ర। అమంథత్। పురుషం। పురుషేణ। శక్రః। తత్। ఏతౌ। మిథునౌ। సయోనీ। ప్రజయా। అమృతేన। ఇహ। గచ్ఛతం॥

టీక॥ ఆద్రీఽయా=చేతితోఁ దడపఁబడిన, అరణ్యా=అరణిచేత, అగ్నిం=అగ్నిహోత్రమును, యత్ర=ఏ ప్రకారముగా, అమంథత్=మథించెనో, శక్రః=

దేవేంద్రుఁడు, పురుషేణ=పురుషరూపమేఢ్రముచే, పురుషం=పురుషుఁడగు గర్భస్థజంతువును, అమంథత్=తరిచెనో, తత్=ఆప్రకారముగా, మిథునా=దంపతులైన, ఏతా=ఈ మీ రిద్దఱు, సయోనీ=కలిసికొనినవారలై, ప్రజయా = సంతానముచే, అమృతేన=అమృతముచేత, ఇహ=ఇక్కడను, గచ్ఛతం=పొందుఁడు.

తా॥ మా ఆత్మలారా! యజ్ఞాదికము సందరణిచే మథించి యగ్ని నెట్లు పుట్టించెదరో యా తీరున దేవేంద్రుఁడు సంతానమును గలుగఁజేయుటకు రతివ్యాపారమును గుఱించి ప్రోత్సాహపఱచుచున్నాఁడు. గాన దంపతులైన మీ రిద్దఱును సంభోగించుటకుఁ గలిసికొనినవారలై యమృతమువలెనే శ్రేయస్కరమగు సంతానమును బొందుదురుగాక.

మూ॥ అహం గర్భ మదధా మోషధీ ష్వహం విశ్వేషు భువనే
ష్వంతః । అహం ప్రజా అజనయం పితృణామహం జనిభ్యో
అవరీషు పుత్రాన్॥

పదవి॥ అహం । గర్భం । అదధాం । ఓషధీషు । అహం । విశ్వేషు । భువనేషు । అంతః । అహం । ప్రజాః । అజనయం । పితృణాం । అహం । జనిభ్యః । అవరీషు । పుత్రాన్.

టీక॥ అహం = నేను, ఓషధీషు = ఓషధులయందు, గర్భం = బీజమును, అదధాం = ధరించితిని, అహం = నేను, విశ్వేషు = సమస్తములైన, భువనేషు=లోకములయందు, అంతః = లోపలను, స్థితః = ఉంటిని, అహం = నేను, పితృణాం = పితృదేవతలయొక్క, అర్థాయ = ప్రయోజనముకొఱకు, ప్రజాః = సంతానమును, అజనయం = పుట్టించుచున్నాను, అహం = నేను, జనిభ్యః = ఈ నా భార్యవలనను, అవరీషు = ఇతరులైనసోదరులు మొదలగువారియందునను, పుత్రాన్ = పుత్రులను, అజనయం = పుట్టించుచున్నాను.

తా॥ శ్రౌతస్మార్తకర్మములయం దియ్యఁబడినహవిస్సువలన క్రమముగా ఓషధులయందు ప్రవేశించుటచే ఓషధులయొక్కగర్భమునకు నేనే కారణమైనవాఁడను. అనఁగా నగ్నియందుంచబడిన హవిస్సులు సూర్యునింజేరి వృష్టిరూపముగా నోషధులం బ్రవేశించును. అంతరాత్మగా సమస్తభూతములయందును నేనే నిండియున్నవాఁడను. పితృదేవతలఋణమును దీర్చుకొనుటకు నేనే సంతానమును బుట్టించుచున్నా

ను. ఈ నా భార్యయందు నేనే సంతానమును బుట్టించుచున్నాను. నా తన యులవలనఁ గోడండ్రియందు సంతానము గలుగుటచే దానికి గారణమైనవాఁడను నేనే.

మూ॥ పుత్రిణేమా కుమారిణా విశ్వ మాయు ర్వ్యశ్నుతం ఉభా హిరణ్యపేశసా వీతిహోత్రా కృతద్వసూ॥

పదవి॥ పుత్రిణా (పుత్రిణౌ) । ఇమా (ఇమౌ) । కుమారిణా (కుమారిణౌ) । విశ్వం । ఆయుః । వ్యశ్నుతం । ఉభా (ఉభౌ) । హిరణ్యపేశసా । వీతిహోత్రా (వీతిహోత్రౌ) । కృతవసూ ॥

టీక॥ ఇమా=ఈ, ఉభౌ=దంపతులు, పుత్రిణౌ=కుమారులు గలవారై, కుమారిణౌ=కుమారికలు గలవారై, హిరణ్యపేశసౌ=బంగారువంటిరూపముగలవారై, వీతిహోత్రా=హవిస్సుచేత హోమముఁజేయువారై, కృతవసూ=సంపాదింపఁబడిన ధనము గలవారై, విశ్వం=విశేషమైన, ఆయుః=ఆయుర్దాయమును, వ్యశ్నుతం=పొందుదురుగాక.

తా॥ ఓ ఆత్మా! ఈ దంపతు లిద్దఱును కుమారులు కుమారికలు గలవారై బంగారువంటి కాంతి గలవారై యజ్ఞము మొదలగు కర్మములను జేయువారై ధనమును సంపాదించినవారై పరమాయుర్దాయమైన నూటపదియాఱు సంవత్సరములపర్యంతము జీవింతురుగాక.

మూ॥ దశస్యం త్వామృతాయకం శ మూధో రోమశగ్ం హధో దేవేషు కృణుతో దువః ॥

పదవి॥ దశస్యం । త్వా । అమృతాయకం । శం । ఊధః । రోమశం । హధః । దేవేషు । కృణుతః । దువః ॥

టీక॥ దశస్యంత్వా=యాచకుల కోర్కెలనిచ్చుచు, అమృతాయకం=దేవత్వమును బొందుటకొఱకు, రోమశం=రోమములచేవ్యాప్తమైన, ఊధః=ఉపస్థేంద్రియములను, శంహధః=కలిసికొనునట్టుజేయుఁడు, దేవేషు=దేవతలవిషయమై, దువః=పరిచర్యను, కృణుతః = చేయుదురుగాక. రోమములు రాకపూర్వ ముపస్థభోగ యోగ్యముకాదని యభిప్రాయము.

తా॥ ఓ దంపతులారా! యాచకులకోరికలఁ దీర్చుచు పితృఋణమును దీర్చి స్వర్గలోకంబున స్థిరముగా నుండుకొరకు సంతానమును బడయుటకై సంభోగింపుఁడు. పిమ్మట సంతానము గలవారై స్వర్గలోకంబుననుండి దేవతలను సేవింపుచుండుఁడు.

ఇతి ద్వాదశఖండ స్సమాప్తః

—♦ అథ త్రయోదశఖండప్రారంభః ♦—

మూ॥ విష్ణు ర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పింశతు ఆసించతు ప్రజాపతి ర్ధాతా గర్భం దధాతు తే.

పదవి॥ విష్ణుః । యోనిం । కల్పయతు । త్వష్టా । రూపాణి । పింశతు । ఆసించతు । ప్రజాపతిః । ధాతా । గర్భం । దధాతు । తే॥

టీక॥ విష్ణుః=విష్ణుమూర్తి, తే=నీయొక్క, యోనిం=భగమును, కల్పయతు=గర్భాధానమునకు సమర్థమైన దానిగాఁ జేయుఁగాక, ప్రజాపతిః=నవబ్రహ్మలలో నొకబ్రహ్మ, ఆసించతు=నన్నావేశించి నాచేత వీర్య ముంచఁబడునట్లు చేయుఁగాక, ధాతా=బ్రహ్మ, తత్=ఆ వీర్యమును, గర్భం=పిండాకృతిగా, దధాతు=చేయుఁగాక. త్వష్టా=ఒకబ్రహ్మ, తస్య=ఆ పిండమునకు, రూపాణి=శిరస్సు మొదలగు నవయవములను పింశతు=ఏర్పఱచి స్ఫుటమగునట్లుగాఁ జేయుఁగాక.

తా॥ ఓచిన్నదానా! నీ భగమును విష్ణుమూర్తి సంభోగమునకు నర్హమగునట్టు చేయును. నవబ్రహ్మలలో నొకఁడు నీయందు నావలన రేతస్సు విడువబడునట్టు చేయును. ఒకబ్రహ్మ ఆ రేతస్సును బిండమగునట్టు చేయును. ఒకబ్రహ్మ యాపిండమునకు నవయవముల నేర్పఱచి ప్రకాశించునట్టు చేయును.

మూ॥ గర్భం ధేహి సినీవాలి గర్భం ధేహి సరస్వతి గర్భం తే అశ్వినౌ దేవా వాధత్తాం పుష్కరస్రజా॥

పదవి॥ గర్భం । ధేహి । సినీవాలి । గర్భం । ధేహి । సరస్వతి । గర్భం । తే । అశ్వినా । దేవా । ఆధత్తాం । పుష్కరస్రజా । (పుష్కరస్రజౌ)॥

టీక॥ సినీవాలి=చంద్రకళతోఁగూడినయమావాస్యచే నధిష్ఠింపఁబడినదానా! సరస్వతి=సరస్వతిచే నధిష్ఠింపబడినదానా!, గర్భం=గర్భమును, ధేహి=ధరింపుము, పుష్కరస్రజౌ=పద్మమాలలనుధరించిన, అశ్వినౌ=అశ్వినులను, దేవౌ=దేవతలు తే=నీకు, గర్భం=గర్భమును, ఆధత్తాం=చేయుదురుగాక.

తా॥ సినీవాలిచేతను సరస్వతిచేతను ఆవేశింపఁబడిన యో చిన్నదానా! అశ్వినీదేవతులు సకలకోర్కెల నిచ్చునట్టి పద్మమాలికలను ధరించినవారై నీవు గర్భమును ధరించుటకు బ్రయత్నము చేయుచున్నారు గాన నీవు గర్భమును ధరింపుము.

మూ॥ హిరణ్యయీ అరణీ య న్నిర్మంథతో అశ్వినా తం తే గర్భగ్ం హవామహే దశమే మాసి సూతవే॥

పదవి॥ హిరణ్యయీ । అరణీ । యం । నిర్మంథతః । అశ్వినా (అశ్వినౌ) । తం । తే । గర్భం । హవామహే । దశమే । మాసి । సూతవే.

టీక॥ హిరణ్యయీ=బంగారుచేఁ జేయఁబడిన, అరణీ=అరణిచేత, యం=ఏ గర్భమును, నిర్మంథతః=మథించుటవలన, అశ్వినా=అశ్వినీదేవతలు పుట్టిరో, తే=నీయొక్క, గర్భం=గర్భమును, తం=అటువంటిదానిగాను, దశమే=పదియవదగు, మాసి=మాసమునందు, సూతవే=కనుటకొఱకు, హవామహే=కోరుచున్నాము.

తా॥ బంగారపుటరణిచే మథించిసరీతిగా గర్భమును మథించుటవలన ఏ యశ్వినీదేవతలు పుట్టిరో అట్టి యశ్వినీదేవతలు వలెనే రూపసంపత్తు గల తనయులను బదియవమాసంబునఁ గనుము.

మూ॥ య థేయం పృథివీ మహీ తిష్ఠంతీ గర్భ మాదధే ఏవం త్వం గర్భ మాధత్స్వ దశమే మాసి సూతవే॥

పదవి॥ యథా । ఇయం । పృథివీ । మహీ । తిష్ఠంతీ । గర్భం । ఆదధే । ఏవం । త్వం । గర్భం । ఆధత్స్వ । దశమే । మాసి । సూతవే॥

టీక॥ మహీ=పెద్దదియగు, ఇయం=ఈ, పృథివీ=భూమి, తిష్ఠంతీ=ఉన్నదగుచు, గర్భం=సస్యరూపగర్భమును, యథా=ఏ ప్రకారముగా, ఆదధే=ధరించెనో, ఏవం=ఈ, (ఆ) ప్రకారముగా, త్వం=నీవు, దశమే=పదియవదగు, మాసి=మాసమునందు, సూతవే=కనుటకొఱకు, గర్భం=గర్భమును, ఆధత్స్వ=ధరింపుము.

తా॥ ఈ విశాలమైనభూమి వర్షము కురియుటచే సస్యరూప మగుగర్భము నెట్లు ధరించెనో, ఆ విధముగా నే నీవు గర్భమును ధరించి పదియవది యగుమాసంబునఁ బ్రసవింపుము.

మూ॥ యథా పృథి వ్యగ్నిగర్భా ద్యౌ ర్య థేంద్రేణ గర్భిణీ వాయు ర్యథా దిశాం గర్భ ఏవం గర్భం దధామి తే॥

పదవి॥ యథా । పృథివీ । అగ్నిగర్భా । ద్యౌః । యథా । ఇంద్రేణ । గర్భిణీ। వాయుః । యథా । దిశాం । గర్భః । ఏవం । గర్భం । దధామి । తే॥

టీక॥ యథా=ఏప్రకారముగాను, పృథివీ= భూమి, అగ్నిగర్భా=అగ్నిహోత్రుఁడుఁగర్భమందుగలదయ్యెనో, యథా = ఏప్రకారము గాను, ద్యౌః = స్వర్గము, ఇంద్రేణ = దేవేంద్రునిచేత, గర్భిణీ = గర్భముగల దయ్యేనో, వాయుః =వాయువు దిశాం = దిక్కులకు, గర్భః = గర్భమయ్యెనో, ఏవం = ఈ ప్రకారముగాను, తే = నీకు, గర్భం = గర్భమును, దధామి = చేయుచున్నాను.

తా॥ భూమి యగ్నిహోత్రు నే ప్రకారముగ గర్భమందు ధరించెనో, స్వర్గ లోకము దేవేంద్రునే ప్రకారముగ గర్భమందు ధరించెనో దిక్కులు వాయువు నేప్రకారముగ గర్భమందు ధరించెనో యాతీరున బుత్త్రుని గర్భమందు ధరింపుము.

మూ॥ విష్ణో శ్రేష్ఠేన రూపే ణాస్యాం నార్యాం గవీన్యాం । పుమాంసం గర్భ మాధేహి దశమే మాసి సూతవే॥

పదవి॥ విష్ణో । శ్రేష్ఠేన । రూపేణ । అస్యాం । నార్యాం । గవీన్యాం । పుమాంసం । గర్భం । ఆధేహి । దశమే । మాసి । సూతవే॥

టీక॥ విష్ణో = ఓవిష్ణుమూర్తీ ! శ్రేష్ఠేన = శ్రేష్ఠమైన, రూపేణ = రూపముతోఁగూడిన, పుమాంసం = పురుషుఁడగు, గర్భం = గర్భస్థజంతువును, గవీన్యాం = కోరఁదగిన, అస్యాం = ఈ, నార్యాం=స్త్రీయందు, దశమే = పదియవదగు, మాసి= మాసమునందు, సూతవే = కనుటకొఱకు, ఆధేహి = చేయుము.

తా॥ ఓ విష్ణుమూర్తీ ! ప్రేమింపఁదగిన యీ చిన్నదానియందు శ్రేష్ఠమైన రూపము గల పుత్త్రుని బదియవ మాసమునందుఁ గనునట్లు చేయుము.

మూ॥ నేజమేష పరాపత సపుత్త్రః పున రాపత । అస్యై మే పుత్త్రకామాయై గర్భ మాధేహి యః పుమాన్ ॥

పదవి॥ నేజమేష । పరాపత । సపుత్త్రః । పునః । ఆపత । అస్యై । మే । పుత్త్రకామాయై । గర్భం । ఆధేహి । యః । పుమాన్ ॥

టీక॥ నేజమేష=నేజమేష అను పేరుగల, రోగగ్రహమా !, పరాపత= పాఱిపొమ్ము, పునః=తిరిగిరాఁదలచితివేని, సపుత్త్రః=పుత్త్రునితోఁ గూడినదానవై ఆపత=రమ్ము, యః=ఏ గర్భము, పుమాన్=పురుషుఁడగునో, తం=అట్టి, గర్భం=

గర్భమును, మే=నాయొక్క భార్యయై, పుత్రకామాయై=పుత్రులను గోరుచున్న, అస్యై=ఈ స్త్రీకొఱకు, ఆధేహి=చేయుము.

తా॥ 'నేజమేష' యనఁబడెడియో గ్రహమా! గర్భమందుండు శిశువును హింసఁజేయఁదలచితి వేని నిక్కడనుండి పాఱిపొమ్ము. ఇచ్చట నుండఁదలచెద వేని హింసఁజేయకుము. ఈ నా భార్య పుత్రులను గోరుచున్నది, గాన, బుత్త్రిని గలుగఁజేయుము.

మూ॥ వ్యస్య యోనిం ప్రతి రేతో గృహాణ పుమా న్పుత్రో ధీయ
తాం గర్భే అంతః తం మాతా దశమాసో భిభర్తి సజాయ
తాం వీరతమస్స్వానాం ॥

పదవి॥ వ్యస్య । యోనిం । ప్రతి । రేతః । గృహాణ । పుమాన్ । పుత్రః । ధీయతాం । గర్భే । అంతః । తం । మాతా । దశ । మాసః । బిభర్తి । సః । జాయతాం । వీరతమః । స్వానాం ॥

టీక॥ యోనిం=భగమును, వ్యస్య=విశాలపఱచి, రేతః=వీర్యమును, ప్రతిగృహాణ=గ్రహింపుము, తే=నీయొక్క, అంతః=లోపలను, గర్భే=గర్భమందు, పుత్రః=పున్నామనరకమునుండి విడిపించు, పుమాన్ = పురుషుఁడు, ధీయతాం= ధరింపఁబడుఁగాక, మాతా = తల్లి, తం = ఆ గర్భమును, దశమాసః = పదిమాసములను, బిభర్తి= ధరించుచున్నది, సః=ఆ పురుషుఁడు, స్వానాం=స్వకీయమైనవారిలో, వీరతమః=పరాక్రమవంతుఁడు, జాయతాం=అగుగాక.

తా॥ ఓ చిన్నదానా! నీవు యోనివి విశాలపఱిచి రేతస్సును గ్రహింపుము. ఆ రేతస్సు గర్భమందుఁ బుత్త్రిరూపముగా ఘనీభవించును. ఆ గర్భమును దల్లి పదిమాసముల పర్యంతము భరించుచున్నది. ఆ పురుషుఁడు తనవారిలోఁ బరాక్రమవంతుఁ డగుఁగాక.

మూ॥ ఆ తే గర్భో యోని మేతు పుమా న్బాణ ఇవేషుధిం ।
ఆవీ రోఽజాయతాం పుత్ర స్తే దశమాస్యః ॥

పదవి॥ ఆ । తే । గర్భః । యోనిం । ఏతు । పుమాన్ । బాణః । ఇవ । ఇషుధిం । ఆ + వీరః । అజాయతాం । పుత్రః । తే । దశమాస్యః ॥

టీక॥ తే=నీయొక్క, యోనిం=యోనినిగుఱించి, పుమాన్=పురుషుఁడగు, గర్భః=గర్భము, ఇషుధిం=అంబులపొదినిగుఱించి, బాణఇవ=బాణమువలెనే, ఏతు= వచ్చుఁగాక, తే=నీయొక్క, పుత్త్రః = తనయుఁడు, దశమాస్యః = పదిమాసములు గర్భమందు ధరింపఁబడినవాఁడై, వీరః = పరాక్రమవంతుఁడగుచు, అజాయతాం = పుట్టుఁగాక.

తా॥ అంబులపొదిని బాణమువలెనే నీయోనిని బురుషుఁడు ప్రవేశించి నీ గర్భమందుఁ బదిమాసములపర్యంతము వృద్ధిపొంది యనంతరము పరాక్రమము గలవాఁడుగాఁ బుట్టుఁగాక.

ఇతి త్రయోదశఖండ స్సమాప్తః

———

—♦ అథ చతుర్దశఖండ ప్రారంభః ♦—

మూ॥ కరోమి తే ప్రాజాపత్య మా గర్భ యోని మేతు తే।
అనూనః పూర్ణో జాయతా మశ్లోణో౽ పిశాచధీతః॥

పదవి॥ కరోమి । తే । ప్రాజాపత్యం । ఆ । గర్భః । యోనిం । ఏతు । తే । అనూనః । పూర్ణః । జాయతాం । అశ్లోణః । అపిశాచధీతః ॥

టీక॥ అహం=నేను, ప్రాజాపత్యం=ప్రజాపతిసంబంధమగు కర్మమును, తే= నీకొఱకు, కరోమి=చేయుచున్నాను, గర్భః=గర్భము, తే=నీయొక్క, యోనిం= యోనినిగూర్చి, ఏతు=వచ్చుఁగాక, సః=ఆ గర్భము, అనూనః=తక్కువగానిఅవ యవములు గలదియగుచు, పూర్ణః=గర్భమందుఁబదిమాసములు వృద్ధిపొందిన దగుచు అశ్లోణః=కుంటిచెవుడు మొదలగునవిలేనిదగుచు, అపిశాచధీతః=పిశాచము మొదలగు వానిచే బాధింపబడనిదై, జాయతాం=పుట్టుఁగాక.

తా॥ ప్రజాపతిసంబంధమైనకర్మము నవఁగా సంభోగమును జేయుచున్నాను గాన జీవము నీయోనిని బ్రవేశించినదై పదిమాసములు పెరిగి సంపూర్ణమైన యవ యవములు గలదియగుచు కుంటి చెవుడు మూఁగ మొదలగునవి లేనిదై పిశాచము మొదలగువానిచేఁ బీడింపఁబడక పుట్టుఁగాక.

మూ॥ పుమాగ్ స్తే పుత్రో నారి తం పుమా ననుజాయతాం।
తాని భద్రాణి బీజా న్యృషభా జనయంతు నౌ॥

పదవి॥ పుమాన్ । తే । పుత్త్రః । నారి । తం । పుమాన్ । అను జాయతాం । తాని । భద్రాణి । బీజాని । ఋషభాః । జనయంతు । నః.

టీక॥ నారి = ఓ స్త్రీ! పుమాన్ పుత్త్రః = కుమారుఁడు, జాయతాం= పుట్టుఁగాక, తం = ఆ కుమారుని, అను = అనుసరించి, పుమాన్ = పురుషుఁడు, జాయతాం = పుట్టుగాక, ఋషభాః = సమర్థులగు ప్రజాపతి మొదలగు వారు, తాని = అటువంటి, భద్రాణి = మంగళప్రదములగు, బీజాని = వీర్యములను, నః = మా యిద్దఱకు, జనయంతు = పుట్టింతురు గాక॥

తా॥ ఓ స్త్రీ! ముందుగాను, బిమ్మటను నీకుఁ దనయులే పుట్టుచుందురు గాక. ప్రజాపతి మొదగువారు మా యిద్దఱకు మంగళప్రదములగు వీర్యములను గలుగఁ జేయుదురు గాక॥

మం॥ యాని భద్రాణి బీజా న్యృషభా జనయంతి నః । తైస్త్వం పుత్త్రా న్విందస్వ సా ప్రసూ ర్ధేనుకా భవ॥

పదవి॥ యాని । భద్రాణి । బీజాని । ఋషభాః । జనయంతి । నః । తైః । త్వం । పుత్త్రాన్ । విందస్వ । సా । ప్రసూః । ధేనుకా । భవ॥

టీక॥ ఋషభాః = ప్రజాపతి మొదలగువారు, భద్రాణి = మంగళకరములగు, యాని = ఏ, బీజాని = బీజములను, నః=మనకు, జనయంతి = పుట్టించుచున్నారో, తైః = ఆ బీజములచేత, త్వం = నీవు, పుత్త్రాన్=తనయులను, విందస్వ= పొందుము, సా = అపూర్వోక్తమైన, త్వం = నీవు, ప్రసూః = ఈనిన, ధేనుకా = ఆవువలెనే, భవ = ఉండుము.

తా॥ ఓ చిన్నదానా! ప్రజాపతి మొదలగువారు మంగళప్రదములగు నే వీర్యములను మన యిద్దఱకుఁ గలుగఁజేసిరో ఆ వీర్యములచే నీవు పుత్త్రులను బొంది యావు తన దూడలకు నే రీతి పాలిచ్చి పోషించునో యా తీరున నీ తనయులకు క్షీరముల నిచ్చి పోషింపుము.

మం॥ కామ ప్రసమృధ్యతాం మహ్యామపరాజిత మేవ మే। యం కామం కామయే దేవ తం మే వాయో సమర్ధయ॥

పదవి॥ కామప్రం । ఋధ్యతాం । మహ్యం। అపరాజితం । ఏవ । మే । యం । కామం । కామయే । దేవ । తం । మే । వాయో । సమర్ధయ॥

టీక॥ మే = నాయొక్క, ఇదం = ఈ, కర్మ = కర్మము, మహీం = సాకొఱకు, కామప్రిం = కోరికలనుబూర్తిగ నిచ్చునదై, అపరాజితమేవ = వ్యర్థము కానిదగుచు, ఋధ్యతాం = సమృద్ధిని బొందుఁగాక, దేవ = దేవుఁడవగు, వాయో = వాయువా! యం = ఏ, కామం = పుత్త్రుఁడు జనియించవలయునను కోరికను, కామయే = కోరుచున్నానో, మే = నాయొక్క, తం = ఆ కోరికను, సమర్ధయ = సిద్ధించునట్లు చేయుము.

తా॥ నేఁ జేయునట్టి యీ కర్మము కోరికల నిచ్చునదియు, వ్యర్థము కానిదియు నగుఁగాక. ఓ వాయువా! పుత్త్రులు కావలయు నని నేఁ గోరునట్టి కోరికను సఫలమైనదానిఁగాఁ జేయుము.

మూ॥ అనుహావం పరిహావం పరీవాదం పరిక్షుపం । దుస్స్వప్నం దురుదితం త ద్ద్విషద్భ్యో దిశా మ్యహం ॥

పదవి॥ అనుహావం । పరిహావం । పరీవాదం । పరిక్షుపం । దుస్స్వప్నం । దురుదితం । తత్ । ద్విషద్భ్యః । దిశామి । అహం ॥

టీక॥ అనుహావం = వెనుకఁ బిలుచుటయు, పరిహావం = అంతటఁ బిలుచుటయు, పరీవాదం = నిందించుటయు, పరిక్షుపం = దగ్గు తుమ్ము మొదలగునవియు, దుస్స్వప్నం = దుష్టమైనస్వప్నము, దురుదితం = అయోగ్యమైనరోదనము మొదలయిన యే దుశ్శకునములు కలవో, తత్ = దానిని, జాత్యేకవచనం, అహం = నేను, ద్విషద్భ్యః = శత్రువులకొఱకు, దిశామి = ఇచ్చుచున్నాను.

తా॥ శుభకార్యములఁగూర్చి పోవుచుండఁగా ప్రతిబంధకములైన (1) వెనుకఁబిలుచుట, (2) అన్నిప్రక్కలనుండి పిలుచుట, (3) నిందసంభవించుట, దగ్గు తుమ్ము మొదలగునవి తటస్థించుట, చెడుకలఁగనుట, రోదనమువినుట, మొదలగు నే దుశ్శకునములు కలవో వాని నన్నిటిని నా శత్రులను జెందునట్లు చేయుచున్నాను.

మూ॥ అనుహూతం పరిహూతగ్ం శకునే ర్య ద శాకునం। మృగస్య సృత మక్ష్ణయా త ద్ద్విషద్భ్యోదిశా మ్యహం॥

పదవి॥ అనుహూతం । పరిహూతం । శకునేః । యత్ । అశాకునం । మృగస్య । సృతం । అక్ష్ణయా । తత్ । ద్విషద్భ్యః । దిశామి । అహం॥

టీక॥ అనుహూతం = వెనుక పిలువఁబడుటయు, పరిహూతం = అన్నిదిక్కులనుండి పిలువబడుటయు, శకునేః = పక్షిసంబంధమగు, యత్ = ఏ, అశానసం = దుశ్శకునము, మృగస్య = మృగముయొక్క, అక్షయాసురితం = అపసవ్యముగా నడుచుటయు మొదలగునవి యేవి కలవో, తత్ = అది (అవి) ద్విషద్భ్యః = శతృవుల కొఱకు, అహం = నేను, దిశామి = ఇచ్చుచున్నాను.

తా॥ వెనుకనుండి పిలువఁబడుట, యన్నిదిక్కులనుండి పిలువఁబడుట, పక్షులు మృగములు వీనిసంబంధమగు నపసవ్యగమనము. మొదలగువానివలన నే దుశ్శకునము సంభవించునో యా దుశ్శనము నా శతృవులను జెందుచుండుఁగాక.

మూ॥ ఆరా త్తే అగ్ని ర స్త్వారా త్పరశు రస్తు తే నివాతే త్వాఽ
భివర్షతు స్వ స్తి తేఽస్తు వనస్పతే స్వ స్తి మేఽస్తు వనస్పతే॥

పదవి॥ ఆరాత్ । తే । అగ్నిః । అస్తు । ఆరాత్ । పరశుః । అస్తు । తే । నివాతే । త్వా । అభివర్షతు । స్వస్తి । తే । అస్తు । వనస్పతే । స్వస్తి । మే । అస్తు । వనస్పతే ॥

టీక॥ వనస్పతే = ఓవృక్షమా ! తే = నీకు, ఆరాత్ = దూరమందు, అగ్నిః = అగ్నిహోతృఁడు, అస్తు = ఉండుఁగాక, తే = నీకు, ఆరాత్ = దూరమందు, పరశుః = గొడ్డలి, అస్తు = ఉండుఁగాక, నివాతే = వాయువులేకుండఁగా, త్వా = నిన్ను గురించి, అభివర్షతు = వర్షము కురియుఁగాక, వనస్పతే = ఓవృక్షమా ! తే = నీకొఱకు, స్వస్తి = శుభము, అస్తు = అగుఁగాక, వనస్పతే = ఓవృక్షమా ! మే = నాకొఱకు, స్వస్తి = శుభము, అస్తు = అగుఁగాక॥

తా॥ ఓవృక్షమా ! నీ వగ్నిచే దహింపఁబడక గొడ్డలిచే నఱుకఁబడక* గాలిలేనివర్షముచేఁ బెరిఁగి శోభస్కరముగా వృద్ధిపొందుము. నాకు శుభ మగుచుండుఁగాక॥

మూ॥ నమ శ్శకృత్సదే రుద్రాయ నమో రుద్రాయశకృత్సదే ।
గోష్ఠ మసి నమ స్తే అస్తు మా మా హిగ్ంసీః ॥

---

* ( గాలి యుండినచో వృక్షమునకు భంగము కలిగించును గాన )

పదవి॥ నమః । శకృత్సదే । రుద్రాయ । నమః । రుద్రాయ । శకృత్సదే । గోష్ఠం । అసి । నమః । తే । అస్తు । మా । మా । హిగ్ంసీః॥

టీక॥ శకృత్సదే = గోమయనివాసుండగు, రుద్రాయ = రుద్రునికొఱకు, నమః = నమస్కారము, (నమోరుద్రాయ పునరుక్తిః) శకృత్ = గోమయమా!, గోష్ఠం = ఆవులయందున్నదానవు, అసి = అయితివి, తే = నీకొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుఁగాక, మా = నన్ను, మా హిగ్ంసీః = బాధపెట్టకుము.

తా॥ గోమయమందు నివాసుండగు అనఁగా బవిత్రస్వరూపుఁడగురుద్రుని కొఱకు నమస్కారముఁజేసెద. ఓ గోమయమా! నీవు గోవులయందున్నదానవైతివి. కావున గోవులు నన్ను హింసింపనట్లు నీవును నన్ను హింసింపకుము.

మ॥ సి గసి నసి వజ్రో నమ స్తే అస్తు మా మా హింగ్ సీః॥

పదవి॥ సిక్ । అసి । న । అసి । వజ్రం । నమః । తే । అస్తు । మా । మా । హిగ్ంసీః॥

టీక॥ సిక్ = వస్త్రములయంచుతో సమానమైనదానవు, అసి = అయితివి, వజ్రః = వజ్రాయుధము, నసి(నాసి) = కావు, తే = నీకొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుఁగాక, మా = నన్ను, మా హిగ్ంసీః=బాధపెట్టకుము.

తా॥ ఓ గోమయమా! వస్త్రముయొక్క యంచువలె మృదువైనదానవైతివి వజ్రాయుధమువలె తీక్ష్ణమైనదానవు కావు. కాన నీకు నమస్కారముఁ జేసెద నన్ను హింసింపకుము.

మ॥ ఉద్గా తేవ శకునే సామ గాయసి బ్రహ్మపుత్ర ఇవ సవనేషు
శగ్ంససి స్వస్తి న శ్శకునే అస్తు ప్రతి న స్సుమనా భవ॥

పదవి॥ ఉద్గాతా । ఇవ । శకునే । సామ । గాయసి । బ్రహ్మపుత్రః । ఇవ । సవనేషు । శంససి । స్వస్తి । నః । శకునే । అస్తు । ప్రతి । నః । సుమనాః । భవ॥

టీక॥ హే శకునే = ఓ పక్షీ, ఉద్గాతేవ = ఉద్గాతవలెనే, సామ=సామవేదమును, గాయసి=గానముఁజేయుచున్నావు, బ్రహ్మపుత్రఇవ = బ్రాహ్మణాచ్ఛంసియను బుుత్విక్కువలెనే, సవనేషు=యజ్ఞములవిషయమై, శంససి = చెప్పు

చున్నావు, నః=మాకొఱకు, స్వస్తి = శుభము, అస్తు = అగుఁగాక, నః ప్రీతి = మమ్ములఁగూర్చి, త్వం = నీవు, సుమనాః = మంచి మనస్సుగలదానవు, భవ = అగుము,

తా॥ ఓ పక్షీ! శ్రవణానందముగా నీవు ధ్వనిఁజేయుట యజ్ఞమునం దుద్గాతసామవేదమును గానముఁ జేసినట్లువలెనే యుండెను. "బ్రాహ్మణాచ్ఛంసి" యని ఋత్విక్కు యజ్ఞమునందు వేదము సూత్రములు మొదలగునవి పల్కి యజ్ఞమును జేయించినట్లువలెనే యుండెను గాన మాయందుఁ బ్రేమగలదాన వై మాకు మేలును గలుగఁజేయుచుండుము.

ఇతి చతుర్దశఖండ స్సమాప్తః.

---

## —♦ అథ పంచదశఖండ ప్రారంభః ♦—

మూ॥ ప్రాత రగ్నిం ప్రాత రింద్రగ్ం హవామహే ప్రాతర్మిత్రా
వరుణా ప్రాత రశ్వినా। ప్రాత ర్భగం పూషణం బ్రహ్మణ
స్పతిం ప్రాత స్సోమ ముత రుద్రగ్ం హువేమ ॥

పదవి॥ ప్రాతః। అగ్నిం। ప్రాతః। ఇంద్రం। హవామహే। ప్రాతః। మిత్రావరుణా। ప్రాతః। అశ్వినా। ప్రాతః। భగం। పూషణం। బ్రహ్మణస్పతిం। ప్రాతః। సోమం। ఉత। రుద్రం। హువేమ॥

టీక॥ ప్రాతః = ఉదయమున, అగ్నిం = అగ్నిహోత్రుని, ప్రాతః = ఉదయమున, ఇంద్రం = దేవేంద్రుని, ప్రాతః = ఉదయమున, మిత్రావరుణా=సూర్యవరుణులను, ప్రాతః = ఉదయమున, అశ్వినా = అశ్వినీదేవతలను, హవామహే= పిలుచుచున్నాము, ప్రాతః = ఉదయమున, భగం = భగుఁడనుసూర్యుని, పూషణం = పూషణుఁడనుసూర్యుని, బ్రహ్మణస్పతిం = బృహస్పతిని, ప్రాతః = ఉదయమున, సోమం = చంద్రుని, ఉత = ఇంతియేకాదు, రుద్రం = రుద్రుని, హువేమ = పిలుచుచున్నాము.

తా॥ ఉదయమున స్నానసంధ్యావందనాదికృత్యములను జేసి యగ్నిహోత్రమును జేయుచు అగ్ని, ఇంద్రుడు, మిత్రావరుణులు, అశ్వినులు, భగుడు, పూషణుడు,

బృహస్పతి, చంద్రుఁడు, రుద్రుఁడు మొదలగు దేవతలను గుఱించి హోమముఁ జేయుచున్నాను.

మూ॥ ప్రాత ర్జితం భగముగ్రిగ్ం హువేమ వయం పుత్ర మదితే
ర్యో విధర్తా ఆధ్రశ్చి ద్యం మన్యమాన స్తురశ్చి ద్రాజా చి
ద్యం భగం భ క్షీ త్యాహ॥

పదవి॥ ప్రాతః । జితం । భగం । ఉగ్రం । హువేమ । వయం । పుత్రం । అదితేః । యః । విధర్తా । ఆధ్రః । చిత్ । యం । మన్యమానః । తురః । చిత్ । రాజా । చిత్ । యం । భగం । భక్షీ । ఇతి । ఆహ.

టీ॥ ప్రాతః = ఉదయమునుండియు, జితం = ప్రకాశించువాఁడును, ఉగ్రం = తీక్ష్ణుఁడైన, భగం = భగుఁడను సూర్యుని, వయం = మేము, హువేమ, పిలుచుచున్నాము, యః = ఎవఁడు, విధర్తా = అంతయును ధరించి యున్నాఁడో, తం = అట్టివంటి, అదితేః = అదితియొక్క, పుత్రం = కుమారుడైన భగుని, హువేమ=పిలుచుచున్నాము, ఆధ్రశ్చిత్=దరిద్రుఁడైనను, తురశ్చిత్= త్వరపడుచున్నవాఁడైనను, రాజాచిత్=రాజైనను, యం=ఏ,భగం=భగుడను సూర్యుని, మన్యమానః=తలచుచున్నవాఁడై, యం=ఏ, భగం=భగుడను సూర్యుని, భక్షి=సేవింపవలయును, ఇతి = ఈ (యని వెనుక కన్వయము) ఆహ = పలుకుచున్నాఁడో.

తా॥ ఏ భగుఁడు వర్షము మొదలగువానిచేఁ బ్రపంచము నంతయు ధరించి యున్నాఁడో దరిద్రుఁడైనను త్వరతోఁ గూడినవాఁడైనను రాజైనను ఏభగుని ధ్యానించుచు నందఱచే భగుఁడు సేవింపఁబడఁదగినవాఁ డని చెప్పుచున్నారో, యుదయమునుండియుఁ బ్రకాశించువాఁడును నితరులచేఁ దిరస్కరింపఁబడనివాఁడు నగు ఆ భగుఁడను సూర్యుని బిలుచుచున్నాము.

మూ॥ భగ ప్రణేత ర్భగ సత్యరాధో భ గేమాం ధియముదవదద
న్నః భగ ప్రణో జనయ గోభీ రశ్వై ర్భగ ప్రనృభి ర్నృవంత
స్స్యామ ॥

పదవి॥ భగ । ప్రణేతః । భగ । సత్యరాధః । భగ । ఇమాంధియం । ఉదవ । దదత్ । నః । భగ । ప్ర । నః । జనయ । గోభిః । అశ్వైః । భగ । ప్ర । నృభిః । నృవంతః । స్యామ ॥

టీక॥ ప్రణేతః = అంతకు నియామకుఁడవైన, భగ = భగుఁడనఁబడెడియో సూర్యుఁడా !, భగశబ్దముయొక్క పునఃపునరుక్తి యాదరార్థము, సత్యరాధః =సత్య మేధనముగాఁగల, త్వం = నీవు, ఇమాం = ఈ, ధియం = (శత్రువులను బాధింప వలయు ననెడి) యా యిచ్ఛనుగుఱించి, ఉదవ= లెమ్ము, నః = మాకు, దదత్ = ఇష్టములను ఇమ్ము, భగ=ఓభగుఁడా !, గోభిః =ఆవులచేతను, అశ్వైః =గుఱ్ఱముల చేతను, నః = మమ్ములను, ప్రజనయ = సమృద్ధి గలవారినిగాఁ జేయుము, భగ = ఓభగుఁడా !, నృభిః = దాసీదాసజనముచేత, నృవంతః = అనేకజనము కలవారము, ప్రస్యామ = మిక్కిలి యగుదుము.

తా॥ ఓభగుఁడా ! శత్రువులను నశింపఁ జేయవలయు ననెడు నా కోరికను నెఱవేర్చుటకు లేచి యిటురమ్ము. నీవు ప్రపంచమున కంతయు నియామకుఁడవు సత్యమం దాసక్తి గలవాఁడవు గాన నిన్ను వేఁడుచున్నాను. నా యిష్టముల నిమ్ము. ఓభగుఁడా ! మాకుఁ బశువులను గుఱ్ఱములను సమృద్ధిగాఁ గలుగఁజేసి దాసీదాసవర్గ మును గలుగఁజేసి జను లనేకులు నాయింట నుండునట్లు చేయుము.

మూ॥ ఉ తేదానీం భగవంత స్స్యా మోత ప్రపిత్వ ఉత మధ్యే అహ్నాం । ఉ తోదితా మఘవం త్సూర్యస్య వయం దేవా నాగ్ం సుమతౌ స్యామ ॥

పదవి॥ ఉత । ఇదానీం । భగవంతః । స్యామ । ఉత । ప్రపిత్వే । ఉత । మధ్యే । అహ్నాం । ఉత । ఉదితా । మఘవన్ । సూర్యస్యం । వయం । దేవానాం । సుమతౌ । స్యామ ॥

టీక॥ ఉత = ఇంతియేకాదు, ఇదానీం = ఇప్పుడు, ఉత = ఇంతియేకాదు, ప్రపిత్వే = సాయంకాలమందును, ఉత = ఇంతియేకాదు, మధ్యేఅహ్నాం = మధ్యా హ్నమందును, ఉత = ఇంతియేకాదు, సూర్యస్య = సూర్యునియొక్క, ఉదితా = ఉదయము కలుగుచుండఁగా, మఘవన్ = ధనముగలవాఁడా ! దేవానాం = దేవతల యొక్క, సుమతౌ = అనుగ్రహబుద్ధియందు, స్యామ = అయితిమి ॥ అనఁగా నను గ్రహము పొందితిమి, వయం = మేము, భగవంతః = భగుడనుసూర్యుని సేవించు వారము, స్యామ = అయితిమి.

తా॥ ధనముగల యో భగుఁడా! ప్రాతఃకాలమందును మధ్యాహ్నమందును సాయంకాలమందును మఱియు నన్నికాలములయందును భగుఁడనుసూర్యుని సేవించుటచే భగవంతుల మైతిమి. మఱియు భగునియనుగ్రహమువలన సమస్తదేవతల యనుగ్రహముగలవార మైతిమి.

మూ॥ భగ ఏవ భగవాగ్ం అస్తు దేవా స్తేన వయం భగవంత
స్స్యామ। తం త్వా భగ సర్వ ఇజ్జోహవీమి స నో భగ
పుర ఏతా భ వేహ॥

పదవి॥ భగః । ఏవ । భగవాన్ । అస్తు । దేవాః । తేన । వయం । భగవంతః । స్యామ । తం । త్వా । భగ । సర్వః । ఇత్ । జోహవీమి । సః । నః । భగః । పురః । ఏతా । భవ । ఇహ ॥

టీక॥ దేవాః = ఓదేవతలారా! భగఏవ = భగుఁడయ్యేవే, భగవాన్ = భగవంతుఁడు, అస్తు = అగుఁగాక, తేన = ఆ భగునిచేత, వయం = మేము, భగవంతః = భగవంతులము, స్యామ = అయితిమి, భగ = ఓభగుఁడా! తం = అటువంటి, త్వా = నిన్ను, సర్వః = సమస్తజనము, జోహవీమి = సేవించుచున్నది. (పురుషవ్యత్యయః) భగ = ఓభగుఁడా! సః = అటువంటి, త్వం = నీవు, ఇహ = ఈ కర్మమునందు, నః = మాయొక్క, పురః = ముందు, స్థితః = ఉండినవాఁడవై, ఏతా = ప్రేరేపణఁజేయువాఁడవు, భవ = అగుము.

తా॥ భగశబ్దమునకు భగుఁడు అనియును షడ్గుణైశ్వర్యసంపత్తు అనియును రెండర్థములు. ఇక్కడ అర్థశ్లేషచేఁజెప్పఁబడుచున్నది. ఓదేవతలారా! భగుఁడు భగవంతుఁడు. ఆ భగునిచే మేము భగవంతుల మైతిమి. ఓభగుఁడా! అటువంటి నిన్ను సర్వజనులు సేవించుచున్నారు. అట్టిభగవంతుఁడవైన నీవు మేము చేయు నట్టికర్మమునందు మాముందుండి మాకు సహాయుఁడవై ప్రేరేపించుచుండుము.

మూ॥ స మధ్వరా యోషసో నమంత దధిక్రావేవ శుచయే
పదాయ అర్వాచీనం వసువిదం భగం నో రథ మి వాశ్వా
వాజిన ఆవహంతు॥

పదవి॥ సం । అధ్వరాయ । ఉషసః । నమంత । దధిక్రావా । ఇవ । శుచయే । పదాయ । అర్వాచీనం । వసువిదం । భగం । నః । రథం । ఇవ । అశ్వాః । వాజినః । ఆవహంతు॥

టీక॥ ఉషసః = ఉషఃకాలములు, శుచయే = పరిశుద్ధమైన, పదాయ = స్థానముకొఱకు, దధిక్రావేవ = సూర్యుఁడువలెనే, అధ్వరాయ = అగ్నిహోత్రములకొఱకు, సమనమంత = ప్రియత్నపడుఁగాక, వాజినః = వేగముగల, అశ్వాః= గుఱ్ఱములు, రథమివ = రథమునువలెనే, వసువిదం = ధనసంపత్తు గల, భగం = భగుని, నః = మాకు, అర్వాచీనం = అభిముఖునిగా, ఆవహంతు = పొందించుఁగాక.

తా॥ సూర్యుఁడెట్లు పవిత్రము చేయుటకొఱకుఁ బ్రియత్నించునో యా తీరుననే ప్రాతఃకాలములు గృహస్థులచే అగ్నిహోత్రములను జేయించుటకొఱకుఁ బ్రియత్నపడుఁగాక. వేగముగల గుఱ్ఱములు రథమును వహించి యజమానునెదుట దాని నెట్లు పెట్టునో యా తీరుననే యుషఃకాలములు ధనప్రదుఁడగు భగుని మా యెదుటఁ బెట్టుఁగాక.

మూ॥ అశ్వావతీ ర్గోమతీ ర్న ఉషాసో వీరవతీ స్సద ముచ్ఛంతు
భద్రాః ఘృతం దుహానా విశ్వతః ప్రపీనా యూయం
పాత స్వస్తిభి స్సదా నః॥

పదవి॥ అశ్వావతీః। గోమతీః । నః । ఉషాసః । వీరవతీః। సదం। ఉచ్ఛంతు । భద్రాః । ఘృతం । దుహానాః । విశ్వతః । ప్రపీనాః । యూయం । పాత । స్వస్తిభిః । సదా । నః ॥

టీక॥ ఉషాసః = ఉషఃకాలములు, అశ్వావతీః = గుఱ్ఱములు గలవియై, గోమతీః = పశువులుగలవియై, వీరవతీః = తనయులుగలవియై, నః = మమ్ములఁ గూర్చి, సదం = ఎల్లప్పుడు, ఉచ్ఛంతు = ఉద్భవించుఁగాక, హే ఉషాసః = ఓ యుషఃకాలములారా! భద్రాః = మంగళప్రదములైన, యూయం = మీరు, ఘృతం = నేతిని, దుహానాః = పితుకువారలై, విశ్వతః = అంతటను, ప్రపీనాః=

వృద్ధిపొందుచున్నవారలై, సదా = ఎల్లప్పుడు, నః = మమ్ములను, స్వస్తిభిః = శుభములచేత, పాత = రక్షింపుడు.

తా॥ ఓ యూపః కాలములారా! మీ రుదయించుచున్నవారలై యెల్లప్పుడు మమ్ములను గుణ్ణములు గలవారిగను, పశువులు గలవారిగాను, తనయులు గలవారిగాను, జేయుఁడు. మంగళప్రదములైనమీరు పాలు, ఘృతము, మొదలగువాని నొసఁగుచుఁ బ్రపంచము నందంతట వృద్ధిపొందుచు మాకు శుభముల నొసఁగుచు నెల్లప్పుడు మమ్ములను రక్షింపుఁడు.

ఇతి పంచదశఖండ స్సమాప్తః.

---

## —♦ అథ షోడశఖండప్రారంభః ♦—

మూ॥ ఇమాం ఖనా మ్యోషధీం వీరుధం బలవత్తమాం యయా
సపత్నీం బాధతే యయా సంవిందతే పతిం॥

పదవి॥ ఇమాం । ఖనామి । ఓషధీం । వీరుధం । బలవత్తమాం । యయా । సపత్నీం । బాధతే । యయా । సం । విందతే । పతిం॥

టీక॥ వీరుధం = అనేకవిధములుగానల్లుకొనునట్టియు, బలవత్తమాం = మిక్కిలిబలముగలదియునగు, ఇమాం = ఈ, ఓషధీం =లతావిశేషమును, ఖనామి=త్రవ్వుచున్నాను, యయా = ఏతీఁగచేత, సపత్నీం = సవతిని, బాధతే = బాధించుచున్నదో, యయా = ఏతీఁగచేత, పతిం = పతిని, సంవిందతే = బాగుగాఁబొందుచున్నదో (అనివెనుకకన్వయము).

తా॥ ఏ లతావిశేషముచే సవతిని బాధించి పెనిమిటిని బొందునో యనేకవిధములుగా నల్లుకొనునదియు బలముగలదియునగు లతావిశేషమును ద్రవ్వుచున్నాను అని భార్య భర్తృవశ్యకర్మమును జేయుచున్నది.

మూ॥ ఉత్తానపర్ణె సుభగే సహమానే సహస్వతి సపత్నీం మే పరా
ధమ పతిం మే కేవలం కృధి॥

పదవి॥ ఉత్తానపర్ణె । సుభగే । సహమానే । సహస్వతి । సపత్నీం । మే । పరాధమ । పతిం । మే । కేవలం । కృధి॥

టీక॥ ఉత్తానపర్ణే = ఎత్తబడిన ఆకులుగలిగి, సుభగే = సౌభాగ్యమునొసంగుచు, సహమానే = సవతిని, సహించుచు, సహస్వతీ = మిక్కిలి బలముగలిగియుండెడి రో లతావిశేషమా!, మే = నాయొక్క, సపత్నీం = సవతిని, పరాధమ = పాఱఁదోలుము, మే = నాకు (నాయందు) పతిం = పెనిమిటిని, కేవలం = ముఖ్యముగాఁ బ్రేమకలవానినిగా, కృధి = చేయుము.

తా॥ ఎత్తబడినయాకులును సౌభాగ్యమునిచ్చుటయు సవతులనెదురించుటయు మిక్కిలిబలమునుగల రో లతావిశేషమా! నా సవతిని పాఱఁదోలి నా పెనిమిటికి నాయందనురాగము స్థిరముగా నుండునట్లు చేయుము.

మూ॥ ఉత్తరాహ ముత్తరఉత్తరేదుత్తరాభ్యః। అథాసపత్నీ యా మమాధరా సాఽధరాభ్యః॥

పదవి॥ ఉత్తరా। అహం। ఉత్తరే। ఉత్తరా। ఇత్। ఉత్తరాభ్యః। అథ। సపత్నీ। యా। మమ। అధరా। సా। అధరాభ్యః॥

టీక॥ ఉత్తరే = ఉత్కృష్టమైనదానా!, ఉత్తరా = అధికురాలనైన, అహం = నేను, ఉత్తరాభ్యః = అధికులకంటె, ఉత్తరా = అధికురాలను, భూయాసం = అయ్యెదను, మమ = నాకు, యా = ఏ, సపత్నీ = సవతికలదో, సా = ఆ సవతి, అధరాభ్యః = తక్కువవారికంటె, అధరా = తక్కువది, భవతు = అగుఁగాక!

తా॥ ఉత్కృష్టమైన లతావిశేషమా! స్వతస్సిద్ధముగా నధికురాలనైన నేను నీ సహాయముచే నుత్తములకంటె నుత్తమురాలనయ్యెదను. నా సవతి హీనులకంటె హీనురాలగుఁగాక॥

మూ॥ న హ్యస్యై నామ గృహ్ణామి నో అస్మిన్ రమతే జనే। పరామేవ పరావతగ్ం సపత్నీం నాశయామసి॥

పదవి॥ న। హి। అస్యై। నామ। గృహ్ణామి। నో। అస్మిన్। రమతే। జనే। పరాం। ఏవ। పరావతం। సపత్నీం। నాశయామసి॥

టీక॥ అస్యై = ఈ సవతియొక్క, నామ = పేరిని, న గృహ్ణామి = గ్రహించను, సా = ఆ సవతి, అస్మిన్ = ఈ, జనే = మనుష్యునియందు, నో రమతే = ఇష్టమైనదికాదు, పరామేవపరావతం = మిక్కిలి దూరమందుండుఁగాక, సపత్నీం = సవతిని, నాశయామసి = నశింపుచేయుచున్నాను.

తా॥ సవతి నా కిష్టమైనది కాకపోవుటచే దానిపేరు నైనను స్మరింపను. అది దూరముగా వెళ్లఁగొట్టబడుఁగాక లేదా దానిని నశింపుచేయుచున్నాను.

మూ॥ అహ మస్మి సహమానా ऽథ త్వ మసి సా సహీః ఉభే
సహస్వతీ భూత్వా సపత్నీం మే సహావహై॥

పదవి॥ అహం । అస్మి । సహమానా । అథ । త్వం । అసి । సా । సహీః । ఉభే । సహస్వతీ । భూత్వా । సపత్నీం । మే । సహావహై.

టీక॥ అహం = నేను, సహమానా = సవతులను నిరాకరించుదానను, అస్మి = అయితిని, అథ = అనంతరము, సా = ఆ పూర్వోక్తమైన, త్వం = నీవు, సహీః = సహించుదానవు, అసి = అయితివి, ఉభే = మనమిద్దఱము, సహస్వతీ భూత్వా = బలముగలవారమై, మే = నాయొక్క, సపత్నీం = సవతిని, సహావహై = నిరాకరింపఁగలము.

తా॥ ఓ లతావిశేషమా! నా సవతిని నేను నిరాకరింప సమర్థురాలను. నీవు సమర్థురాలవు. గాన మన మిద్దఱ మేకీభవించి నా సవతిని వెళ్లఁగొట్టెదము.

మూ॥ ఉప తేऽధాగ్ం సహమానా మభి త్వాऽధాగ్ం సహీయసా
మా మను ప్ర తే మనో వత్సం గౌ రివ ధావ త్పథా వా
రివ ధావత్ ॥

పదవి॥ ఉప । తే । అధాం । సహమానాం । అభి । త్వా । అధాం । సహీయసా । మాం । అను । ప్ర । తే । మనః । వత్సం । గౌః । ఇవ । ధావత్ । పథా । వాః । ఇవ । ధావత్.

టీక॥ తే = నీయొక్క, ఉపాధాం = సమీపమందున్నట్టి, సహమానాం = సహనముగల, మాం = నన్ను, త్వామభిధాం = నీ సమీపమందున్న, ఇమాం = ఈ స్త్రీని, సహీయసా = సహనముగలమనస్సుచే, దృష్ట్వా = చూచి, తే = నీయొక్క, మనః = మనస్సు, గౌః = ఆవు, వత్సమివ = దూడనుగూర్చివలెనే, వాః = ఉదకము, పథేవ = పల్లపుమార్గమునువలెనే, మామను = నన్నుగూర్చి, ప్రధావత్ = పఱుగెత్తి కొనివచ్చుఁగాక.

తా॥ దూడనుగూర్చి యావుపలెనే జలము పల్లమునకు వెళ్ళినట్లుగా మా యిద్దరిలో నాయందు అనురాగము కలవాఁడ వగుము.

ఇతి షోడశఖండ స్సమాప్తః

---

—♦ అథ సప్తదశఖండప్రారంభః ♦—

మూ॥ ఉ దసౌ సూర్యో అగా దుదయం మామకో భగః అహం త
ద్విద్వలా పతి మభ్యసాక్షి విషాసహిః॥

పదవి॥ ఉత్ । అసౌ । సూర్యః । ఉదయం । మామకః । భగః । అహం । తత్ । విద్వలా । పతిం । అభి । అసాక్షి । విషాసహిః ॥

టీక॥ అసౌ = ఈ సూర్యుఁడు, యథా = ఏప్రకారముగా, ఉదగాత్ = ఉదయించి వృద్ధిపొందుచున్నాఁడో, తథా = ఆప్రకారముగా, అయం = ఈ, మామకః = నాసంబంధమైన, భగః = ఐశ్వర్యము, ఉదగాత్ = వృద్ధిపొందుఁగాక, తత్ = ఆ కారణమువలన, అహం = నేను, విద్వలా = తెలిసికొనినదాననై, విషాసహిః = మిక్కిలి సహించుదాననై, పతిం = పెనిమిటిని, అభ్యసాక్షి = స్వాధీనమును జేసికొనియొదను.

తా॥ ఈ సూర్యుఁ డుదయించి వృద్ధిపొందునట్లుగా వృద్ధిపొందు, నా భాగ్యమును బట్టి యోర్పుగలదాన నై తెలివిగలదాన నై నా పెనిమిటిని స్వాధీనము చేసికొనియొదను.

మూ॥ అహం కేతు రహం మూ ర్ధాఽహ ముగ్రా వివాచనీ మమే
దనుక్రతుం పతి స్సేహానాయా ఉవాచ రేత్॥

పదవి॥ అహం । కేతుః । అహం । మూర్ధా । అహం । ఉగ్రా । వివాచనీ । మమ । ఇత్ । అను । క్రతుం । పతిః । సేహానాయాః । ఉవ (ఉప) । ఆచరేత్ ॥

టీక॥ అహం = నేను, కేతుః = రెండువంశములకు ప్రధానురాలనగుదును గాక, అహం = నేను, మూర్ధా = ఉన్నతస్థానమం దుండునుగాక, అహం = నేను, ఉగ్రా = చుఱుకుఁదనముగలదాన నగుఁగాక, అహం = నేను, వివాచనీ = నిర్ణయము చేయగలదాన నగుఁగాక, పతిః = నా పెనిమిటి, సేహానాయాః = సమర్థు

రాలవైన, మమేత్ = నాయొక్క, క్రతుం = క్రియను, అను = అనుసరించి, ఉపాచరేత్ = ఆచరించుచుండుఁగాక.

తా॥ నేనే మాతాపితృవంశముల రెంటిని దరింపఁజేయు సంతానము గలదానవై స్త్రీలలో నగ్రగణ్యురాలనై చులుకుగలదాననై యిది యిట్లు జేయవలయునని నిర్ణయించి చెప్పఁగలదాన నగుఁగాక. నా పెనిమిటి నేఁజేయు సద్వ్యాపార మనుసరించియే నడుచుకొనుచుండుఁగాక.

మూ॥ మమ పుత్రా శ్శత్రుహణోఽథో మే దుహితా విరాట్ ।
ఉతాహ మస్మి సంజయా పత్యౌ మే శ్లోక ఉత్తమః ॥

పదవి॥ మమ । పుత్రాః । శత్రుహణః । అథః । మే । దుహితా । విరాట్ । ఉత । అహం । అస్మి । సంజయా । పత్యౌ । మే । శ్లోకః । ఉత్తమః ॥

టీక॥ మమ = నా యొక్క, పుత్రాః = తనయులు, శత్రుహిణః = శత్రువులను సంహరించువారగుఁగాక, అథః = అనంతరము, మే = నా యొక్క, దుహితా = కూతురు, విరాట్ = ప్రకాశించునదగుఁగాక, ఉత = ఇంతియే కాదు, అహం = నేను, సంజయా = సవతులను, మిక్కిలి జయించుదాన నగుఁగాక, పత్యౌ = పెనిమిటికి, మే = నాయొక్క, ఉత్తమః = శ్రేష్ఠమైన, శ్లోకః = పొగడ్త, భవతు = అగుఁగాక.

తా॥ నా తనయులు శత్రువులనుజయించువార లగుదురుగాక. నా కూతురు సౌందర్యసుగుణాదులచేఁ బ్రకాశించుఁగాక. నేను నా సవతుల నందఱను జయించుదాన నగుఁగాక. నా పెనిమిటి నన్ను శ్లాఘించు చుండుఁగాక ॥

మూ॥ యే నేంద్రో హవిషా కృత్వ్యభవ ద్దివ్యుత్తమః । అహం త దక్రి దేవా అసపత్నా కి లాభవం ॥

పదని॥ యేన । ఇంద్రః । హవిషా । కృతీ । అభవత్ । దివి । ఉత్తమః । అహం । తత్ । అక్రి । దేవాం । అసపత్నా । కిల । అభవం ॥

టీక॥ యేన = ఏ, హవిషా = హవిస్సుచేత, ఇంద్రః = దేవేంద్రుఁడు, కృతీ = కృతకృత్యుఁడు, అభవత్ = ఆయెనో, దివిచ=స్వర్గమందునను, ఉత్తమః= శ్రేష్ఠుఁడు, అభవత్ = ఆయెనో, అహం = నేను, తత్ = ఆ హవిస్సును, అక్రి=

చేసితిని, దేవాః = దేవతలారా! తస్మాత్ = ఆ కారణమువలన, అహం = నేను, అసపత్నా = సవతిలేనిదానను, అభవం కిల = అయితిని గదా.

తా॥ ఏ హవిస్సుచే దేవేంద్రుఁడు సార్థకజన్ముఁడై స్వర్గలోకంబున దేవతలలో నుత్తముఁడాయెనో, ఆ హవిస్సు నాచేత నియ్యఁబడినది గాన ఓ దేవతలారా! మీ యనుగ్రహమువలన నేను సవతిలేనిదాన నయ్యెదను.

మూ॥ అసపత్నా సపత్నిఘ్నీ జయన్త్యభిభూవరీః । ఆవృక్షి సర్వాసాగ్ం రాధో వర్చో అస్థేయసా మివ ॥

పదవి॥ అసపత్నా । సపత్నిఘ్నీ । జయంతీ । అభిభూవరీః । ఆవృక్షి । సర్వాసాం । రాధః । వర్చః । అస్థేయసాం । ఇవ ॥

టీక॥ అహం = నేను, అసపత్నా = విరోధులులేనిదాననై, సపత్నిఘ్నీ=సవతులను వెళ్ళఁగొట్టుదానను, జయంతీ = జయస్వభావము గలదానను, అభిభూవరీః = విరోధులను తిరస్కరించుదానను, భూయాసం = అయ్యెదను, అస్థేయసామివ = దార్ఢ్యములేనివారియొక్కవలెనే, సర్వాసాం = సమస్తస్త్రీలయొక్క రాధః = ధనమును, వర్చః=కాంతిని, ఆవృక్షి=ఆకర్షించి పొందుదాన నయ్యెదను.

తా॥ నేను శత్రువులు లేనిదానను సవతులు లేని దానను జయము గలదానను విరోధులను దిరస్కరించుదాన నయ్యెదను. దుర్బలులయొక్క ధనము మొదలగు వానినివలెనే సమస్తస్త్రీలయొక్క ధనమును కాంతిని ఆకర్షింపఁగలదాన నయ్యెదను.

మూ॥ స మజైష మిమా అహాగ్ం సపత్నీ రభిభూవరీః యథాహ మస్య వీరస్య విరాజామి ధనస్య చ ॥

పదవి॥ సం । అజైషం । ఇమాః । అహం । సపత్నీః । అభిభూవరీః । యథా । అహం । అస్య । వీరస్య । విరాజామి । ధనస్య । చ॥

టీక॥ యథా = ఏప్రకారముగా, అహం = నేను, ఇమాః = ఈ, సపత్నీః = సవతులను, అభిభూవరీః = తిరస్కరించు దాననై, సమజైషం =జయించెదనో, తథా = ఆప్రకారముగా, అహం = నేను, అస్య = ఈ, వీరస్య = నా పెనిమిటియొక్క, ధనస్యచ = ధనమునకును, విరాజామి = అధిపతినై ప్రకాశించెదను.

తా॥ ఈ నా సవతుల నెట్లు తిరస్కరించి జయించెదనో ఆప్రకారమే నా పెనిమిటియొక్క ధనము మొదలగు వానికి నేనే అధికారముగలదాన నయ్యెదను.

ఇతి సప్తదశఖండ స్సమాప్తః

---

## —♦ అథాష్టాదశఖండ ప్రారంభః ♦—

మూ॥ అక్షీభ్యాం తే నాసికాభ్యాం కర్ణాభ్యాం చుబుకా దధి।
యక్ష్మగ్ం శీర్షణ్యం మస్తిష్కా జ్జిహ్వాయా వివృహామి తే॥

పదవి॥ అక్షీభ్యాం । తే । నాసికాభ్యాం । కర్ణాభ్యాం । చుబుకాత్ । అధి । యక్ష్మం । శీర్షణ్యం । మస్తిష్కాత్ । జిహ్వాయాః । వివృహామి । తే॥

టీక॥ తే = నీయొక్క, అక్షీభ్యాం = నేత్రములచేతను, నాసికాభ్యాం = ముక్కురంధ్రములచేతను, కర్ణాభ్యాం = చెవులచేతను, చుబుకాత్ = గడ్డమువలనను, మస్తిష్కాత్=కపాలమధ్యయందుండుమాంసమువలనను, జిహ్వాయాః = నాలుకవలనను సంభవించినదియు, శీర్షణ్యం = శిరస్సువలనసంభవించినదియూనగు, తే=నీయొక్క, యక్ష్మ = క్షయరోగమును, వివృహామి= స్పృశించి పోఁగొట్టుచున్నాను.

తా॥ ఓచిన్నదానా! నీ నేత్రములయందుఁగాని ముక్కునందుఁగాని చెవులయందుఁగాని గడ్డమందుగాని, శిరస్సునందుఁగాని, కపాలమధ్యమందుగాని, నాలుకయందుగాని, యుండు నీ క్షయరోగమును నీయవయవములను స్పృశించుటచేఁ బోఁగొట్టుచున్నా నని వరుఁడు చెప్పుచున్నాఁడు.

మూ॥ గ్రీవాభ్య స్త ఉష్ణిహాభ్యః కీకసా భ్యోఽనూక్యాత్ । యక్ష్మం
దోషణ్య మగ్ంసాభ్యాం బాహుభ్యాం వివృహామి తే॥

పదవి॥ గ్రీవాభ్యః । తే । ఉష్ణిహాభ్యః । కీకసాభ్యః । అనూక్యాత్ । యక్ష్మం । దోషణ్యం । అంసాభ్యాం । బాహుభ్యాం । వివృహామి । తే॥

టీక॥ తే =నీయొక్క= గ్రీవాభ్యః, కంఠమువలనను=ఉష్ణిహాభ్యః కంఠమందుండు నాడులవలనను, కీకసాభ్యః = ఎముకలవలనను, అనూక్యాత్ = వెన్నెముకలవలనను, అంసాభ్యాం=మూపురములవలనను, బాహుభ్యాం= చేతులవలనను సంభవించినదియు, దోషణ్యం = బాహులలో నొక ప్రదేశమువలన సంభవించినదియునగు, తే = నీ యొక్క, యక్ష్మం = క్షయరోగమును, వివృహామి = స్పృశించి పోఁగొట్టు చున్నాను.

తా॥ నీ కంఠమందును కంఠనాడులయందును ఎముకలయందును వెన్నెముక యందును బాహులయందును మూపురములయందును సంభవించిన క్షయరోగమును స్పృశించి పోఁగొట్టుచున్నాను.

మూ॥ ఆంత్రేభ్య స్తే గుదాభ్యో వనిష్ఠో ర్హృదయా దధి యక్ష్మం
మతస్నాభ్యాం యక్నః ప్లాశిభ్యో వివృహామి తే ॥

పదవి॥ ఆంత్రేభ్యః । తే । గుదాభ్యః । వనిష్ఠోః । హృదయాత్ । అధి । యక్ష్మం । మతస్నాభ్యాం । యక్నః । ప్లాశిభ్యః । వివృహామి । తే.

టీక॥ తే = నీ యొక్క, ఆంత్రేభ్యః = పేగులవలనను గుదాభ్యః = యోనినాడులవలనను, వనిష్ఠోః = పేగులయందుండు స్థూలప్రదేశము వలనను, హృదయాత్ = హృదయమువలనను, మతస్నాభ్యాం = పచ్చికాయలవలెనుండు తిత్తులవలనను, యక్నః= కడుపులోని మాంసమువలనను ప్లాశిభ్యః = పొత్తికడుపు వలనను, సంభవించిన, తే = నీయొక్క యక్ష్మం = క్షయరోగమును, వివృహామి= స్పృశించి పోగొట్టుచున్నాను.

తా॥ నీ ప్రేగులు యోనియందునాడులు పేగులయందుండు స్థూలప్రదేశము హృదయము, పచ్చికాయలవలెనుండు తిత్తులు, మాంసము, పొత్తికడుపు మొదలగు వానివలనఁ గలుగు నీ క్షయరోగమును నేను స్పృశించి పోఁగొట్టుచున్నాను.

మూ॥ ఊరుభ్యాం తేఽష్ఠీవద్భ్యాం జంఘాభ్యాం ప్రపదాభ్యాం
యక్ష్మగ్గ్ శ్రోణీభ్యాం భాసదా ద్ధ్వగ్ంససో వివృహామి తే॥

పదవి॥ ఊరుభ్యాం । తే । అష్ఠీవద్భ్యాం । జంఘాభ్యాం । ప్రపదాభ్యాం । యక్ష్మం । శ్రోణీభ్యాం । భాసదాత్ । ధ్వంససః । వివృహామి । తే.

టీక॥ తే = నీయొక్క, ఊరుభ్యాం = తొడలవలనను, అష్ఠీవద్భ్యాం = మోకాళ్లవలనను, జంఘాభ్యాం = పిక్కలవలనను, ప్రపదాభ్యాం = పాదములవలనను, శ్రోణిభ్యాం = పిఱుదులవలనను, భాసదాత్ = గుహ్యప్రదేశమం దుండెడి యవయవ విశేషమువలనను, ధ్వంససః = నాభివలనను సంభవించిన, తే = నీయొక్క, యక్ష్మం = క్షయరోగమును, వివహామి = స్పృశించి పోఁగొట్టుచున్నాను.

తా॥ నీ తొడలు, మోకాళ్ళు, పిక్కలు, పాదములు, పిఱుదులు, గుహ్యస్థానమందుండు నొకానొక అవయవము, నాభి మొదలైనయవయవములవలన సంభవించిన నీ క్షయరోగమును నేను స్పృశించి పోఁగొట్టుచున్నాను.

మూ॥ మేహనా ద్వలంకరణా ల్లోమభ్య స్తే నఖేభ్యః। యక్ష్మగ్ం సర్వస్మా దాత్మన స్త మిమం వివృహామి తే॥

పదవి॥ మేహనాత్ । ఉ । అలంకారణాత్ । లోమభ్యః। తే । నఖేభ్యః । యక్ష్మం । సర్వస్మాత్ । ఆత్మనః । తం । ఇమం । వివృహామి । తే॥

టీక॥ అలంకరణాత్ = అలంకార భూతమైన, మేహనాత్ = కటిప్రదేశమువలనను, లోమభ్యః = కేశములవలనను, తే = నీ యొక్క నఖేభ్యః = గోళ్లవలనను, కించ = ఇంతయేగాదు, తే = నీయొక్క, సర్వస్మాత్ = సమస్తమైన, ఆత్మనః = శరీరమువలనను, సంభవించిన, తం = ఆ పూర్వోక్తమైన, ఇమం = ఈ, యక్ష్మం = క్షయరోగమును, వివృహామి = స్పృశించి పోఁగొట్టుచున్నాను.

తా॥ నీకు నలంకారమైన కటిప్రదేశము, వెండ్రుకలు, గోళ్లు, మఱియు నివియే గాక చెప్పఁబడని యే యవయవము లున్నవో వానివలనను సంభవించిన నీ క్షయరోగమును నేను స్పృశించి పోఁగొట్టుచున్నాను.

మూ॥ అంగా దంగా ల్లోమ్నో లోమ్నో జాతం పర్వణి పర్వణి యక్ష్మగ్ం సర్వస్మా దాత్మన స్త మిమం వివృహామి తే.

ప॥ అంగాత్ । అంగాత్ । లోమ్నః । లోమ్నః । జాతం । పర్వణి। పర్వణి। యక్ష్మం । సర్వస్మాత్ । ఆత్మనః । తం । ఇమం । వివృహామి । తే.

టీక॥ తే=నీయొక్క, అంగాదంగాత్ = ప్రతియవయవమువలనను, లోమ్నః లోమ్నః = ప్రతికేశమువలనను, పర్వణిపర్వణి = అవయవములయొక్క ప్రతిసంధియందును, సర్వస్మాత్ = అంతయునైన, ఆత్మనః = శరీరమువలనను, జాతం= పుట్టిన,

తం = ఆ ప్రసిద్ధమైన, ఇమం = ఈ, యక్ష్మం = క్షయరోగమును, వివృహామి= స్పృశించి పోఁగొట్టుచున్నాను.

తా॥ నీ శరీరమునం దుండుప్రతి యవయవమునందును ప్రతి వెండ్రుకయందునను అవయవముల యొక్క ప్రతి సంధి ప్రదేశమునందునను మఱియు నీ శరీరమందెక్కడ నైనను బుట్టిన క్షయరోగమును నేను స్పృశించి పోగొట్టుచున్నాను.

మూ॥ పరాదేహి శాబల్యం బ్రహ్మభ్యో విభజా వసు కృత్యైషా పద్వతీ భూత్వా జాయా విశతే పతిం ॥

పదవి॥ పరాదేహి । శాబల్యం । బ్రహ్మభ్యః । విభజా (విభజ) । వసు । కృతీ। ఏషా । పద్వతీ । భూత్వా । జాయా । విశతే । పతిం.

టీక॥ శాబల్యం = చిత్రవర్ణముగలవస్త్రమును, పరాదేహి = విడిచిపెట్టుము, బ్రహ్మభ్యః= బ్రాహ్మణులకొఱకు, వసు= ధనమును, విభజ= విభజించియిమ్ము, ఏషా= ఈ, జాయా= నీభార్య, కృతీ= కృతకృత్యురాలై, పద్వతీ= పాదచారియై, పతిం= పెనిమిటివైననిన్ను, విశతే= పొందుచున్నది.

తా॥ చిత్రవర్ణ వస్త్రమును బరిత్యజింపుము. నీ వద్దనుండు ధనమును బ్రాహ్మణులకొఱకుఁ బంచి యిమ్ము. నీ భార్య సార్థకజన్మముగలదై పాదచారియై నీవద్ద కేతెంచుచున్నది.

మూ॥ అశ్లీలా తనూ ర్భవతి రుశతీ పాప యాఽముయా । పతి ర్య ద్వధ్వై వాససా స్వ మంగ మభిధిత్సతి ॥

పదవి॥ అశ్లీలా । తనూః । భవతి । రుశతీ । పాపయా । అముయా । పతిః । యత్ । వధ్వై । వాససా । స్వం । అంగం । అభిధిత్సతి ॥

టీక॥ అముయా = ఈ, పాపయా = పాపకార్యముచేత, తనూః = పెనిమిటియొక్క శరీరము, అశ్లీలా = సంపత్తులేనిది, భవతి = అగుచున్నది, రుశతీ = హింసఁజేయునది, భవతి = అగుచున్నది. పతిః = పెనిమిటి, వధ్వై = వధువు యొక్క, వాససా = వస్త్రముచేత, స్వం = తనసంబంధమైన, అంగం = శరీరమును, పరిధిత్సతియది = ధరించుకొఱకు నిచ్ఛగలవాఁడాయెనా, అని వెనుక కన్వయము.

తా॥ భార్యాసంబంధమైన వస్త్రమును జెనిమిటి ధరింపఁ గోరినట్లాయెనా వాని కాయురారోగ్యభాగ్యములు నశించును గాన ఈ నింద్యమైన కార్య మెన్నటికిని జేయఁగూడదు.

మూ॥ కూ్రిర మేత త్కటుక మే త దపాష్ఠవ ద్విషవ న్నైతద త్తవే సూర్యాంయః ప్రత్యక్షం విద్యాత్స ఏత త్ప్రతిగృహ్ణీయాత్ ॥

పదవి॥ కూ్రిరం । ఏతత్ । కటుకం । ఏతత్ । అపాష్ఠవత్ । విషవత్ । న । ఏతత్ । అత్తవే । సూర్యాం । యః । ప్రత్యక్షం । విద్యాత్ । సః । ఏతత్ । ప్రతిగృహ్ణీయాత్ ॥

టీక॥ ఏతత్ = ఈ వస్త్రము, కూ్రిరం = నశింపుజేయునది, ఏతత్ = ఈ వస్త్రము, కటుకం = వ్యతిరేకమైనది, ఏతత్ = ఈ వస్త్రము, అపాష్ఠవత్ = ప్రతికూలమైనది, విషవత్ = అనుకూలముగాని, ఏతత్ = ఈవస్త్రము, అత్తవే = ఉపయోగించుటకొఱకు, నభవతి = తగినది కాదు, యః = ఎవఁడు, సూర్యాం = 'సూర్య' యను వివాహాధిష్ఠానదేవతను, ప్రత్యక్షం = ప్రత్యక్షముగా, విద్యాత్ = తెలిసికొనెనో, సః = వాఁడు, ఏతత్ = ఈ వస్త్రమును, ప్రతిగృహ్ణీయాత్ = గ్రహించవలయును.

తా॥ ఈ వస్త్రము అనర్థకారియగునది కాఁబట్టి యెవరును ధరింపఁ గూడదు. అలాగైన ఈ వస్త్రమును ధరింప నర్హు లెవ రంటె రేని, వివాహసంబంధ మగుమంత్రముల యర్థము నంతయుఁ దెలిసికొని వివాహాధిష్ఠానదేవత యగు 'సూర్య' యను దేవత నెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁ డీవస్త్రము ధరింప నర్హుండు.

మూ॥ ఆశసనం విశసన మధో అధి విచర్తనం । సూర్యాయాః పశ్య రూపాణి తాని బ్రహ్మోత శగ్ంసతి ॥

పదవి॥ ఆశసనం । విశసనం । అధః । అధి । విచర్తనం । సూర్యాయాః । పశ్యరూపాణి । తాని । బ్రహ్మ । ఉత । శంసతి ॥

టీక॥ ఆశసనం = కూలము మొదలగువానిచే బొడవఁబడినదియు, విశసనం = చర్మములను వేఱుగాఁ జేసినదియు, విచర్తనం = చర్మవిసర్జన చేయఁబడినదియు నగు, ఏతత్ = ఈ వస్త్రము, నార్హతి = ధరించుటకుఁ దగినది కాదు, సూర్యాయాః = 'సూర్య' యను దేవతయొక్క, పశ్యరూపాణి = చూడఁదగినరూపములు

లేవి కలవో, బ్రహ్మ = బ్రాహ్మణుఁడు, తాని = ఆ రూపములను, ఉత = లెస్స
గా, శంసతి = చెప్పుచున్నాఁడు.

తా॥ శూలము మొదలగువానిచే, బాడిచి చర్మములనుఁ దీసివేసి పిమ్మట వచ్చినప్రత్తివలన నుద్భవించిన యీ వస్త్రము ధరించుటకు నర్హము కాదు. కావన వివాహాధిష్ఠానదేవత యగు సూర్యనెఱిఁగిన బ్రాహ్మణుండు ధరించును.

ఇతి అష్టాదశఖండ స్సమాప్తః

# ద్వితీయమంత్ర ప్రశ్న ప్రారంభః

—— :o: ——

మూ॥ ఉష్ణేన వాయ వుదకే నే హ్యాదితిః కేశా న్వపతు॥

పదవి॥ ఉష్ణేన । వాయో । ఉదకేనా । ఏహి । అదితిః । కేశాన్ । వపతు॥

టీక॥ హేవాయో= ఓ వాయువా!, ఉష్ణేన= వేడియైన, ఉదకేన= జలముతోడ, ఏహి= రమ్ము, అదితిః= అదితియను దేవత, కేశాన్= వెండ్రుకలను, వపతు= ఖడించుఁగాక॥

తా॥ ఓ వాయువా అదితి కేశములను ఖండించును గాన నీవు వేడియైన జలమును దీసికొని రావలయును.

మూ॥ ఆప ఉందంతు జీవసే దీర్ఘాయుత్వాయ వర్చసే । జ్యోక్చ
సూర్యం దృశే॥

ప॥ ఆపః । ఉందంతు । జీవసే । దీర్ఘాయుత్వాయ । వర్చసే । జ్యోక్ । చ । సూర్యం । దృశే ॥

అ॥ జీవసే= జీవించుకొఱకును, దీర్ఘాయుత్వాయ= దీర్ఘాయుర్దాయము కలుగుట కొఱకును, వర్చసే= కాంతికొఱకును, జ్యోక్= చాలా కాలము, సూర్యం= సూర్యుని, దృశేచ= చూచుటకొఱకును, అస్యశిరః= ఈ పిల్లవానియొక్క శిరస్సును, ఆపః= ఉదకములు, ఉదంతు = తడుపును గాక॥

తా॥ దీర్ఘాయుర్దాయము కలిగి చిరకాలము సూర్యుని దర్శించుచు కాంతి గలవాఁడై యుండుటకొఱకు నుదకము లీ పిల్లవానిశిరస్సును తడుపును గాక॥

మూ॥ యే నా వప త్సవితా క్షురేణ సోమస్య రాజ్ఞో వరుణస్య
విద్వాన్ తేన బ్రహ్మాణో వప తేద మ స్యాఽయుష్మా
న్జరదష్టి ర్యథా సదయ మసౌ ॥

పదవి॥ యేన । అవపత్ । సవితా । క్షురేణ । సోమస్య । రాజ్ఞః । వరుణస్య । విద్వాన్ । తేన । బ్రహ్మాణః । వపత । ఇదం । అస్య । ఆయుష్మాన్ జరదష్టిః । యథా । అసత్ । అయం । అసౌ.

టీక॥ విద్వాన్ = నేర్పరియగు, సవితా = సూర్యుడు, యేన=ఎటువంటి, క్షురేణ = కత్తిచేత, సోమస్య = చంద్రునియొక్కయు, రాజ్ఞః = రాజగు, వరుణస్య = వరుణునియొక్కయు, శిరః = శిరస్సును, అవపత్=వపనముజేసెనో, హే|బ్రహ్మాణః = ఓ బ్రాహ్మణులారా!, తేన = అటువంటి కత్తిచేత, అస్య = ఈ పిల్లవానియొక్క, ఇదం=ఈ శిరస్సును, వపత=నాచేవపనము జేయింపుడు, అయం=బ్రహ్మచారియగు, అసౌ=ఈ పిల్లవాడు, ఆయుష్మాన్=ఆయుష్మంతుడై, జరదృష్టిః=ముదిమిచే నల్పాహారముగలవాడై, యథా=ఏప్రకారము, అసత్=అవునో ఆ ప్రకారముగా జేయుడని ముందుకన్వయము.

తా॥ నేర్పరియగు సూర్యుడు సోమునియొక్కయు వరుణునియొక్కయు శిరస్సుల నెటువంటి కత్తితో వపనముజేసెనో ఓ బ్రాహ్మణులారా! అటువంటి కత్తితో బ్రహ్మచారియగు ఈ పిల్లవాడు ముదిమిగలిగి చిరజీవియై యుండు రీతి ఈ పిల్లవాని శిరస్సును నాచే వపనము జేయింతురుగాక.

మూ॥ యేన పూషా బృహస్పతే రగ్నే రింద్రస్య చాఽయుషే వపత్।
తేన నాఽస్యాయుషే వప సౌ శ్లోక్యాయ స్వస్తయే॥

పదవి॥ యేన । పూషా । బృహస్పతేః। అగ్నేః । ఇంద్రస్య । చ । ఆయుషే। అవపత్ । తేన । అస్య । ఆయుషే । వప । సౌశ్లోక్యాయ । స్వస్తయే. ।

టీక॥ పూషా = సూర్యుడు, యేన = ఎటువంటికత్తిచేత, బృహస్పతేః = బృహస్పతియొక్కయు, అగ్నేః = అగ్నిహోత్రునియొక్కయు, ఇంద్రస్యచ = యింద్రునియొక్కయు, శిరః = శిరస్సును, ఆయుషే = దీర్ఘాయుర్దాయముకలుగుటకొఱకు, అవపత్ = వపనముచేసెనో, తేన = అటువంటికత్తిచేత, అస్య = ఈ పిల్లవానియొక్క, శిరః = శిరస్సును, ఆయుషే = ఆయుర్దాయముకొఱకు, సౌశ్లోక్యాయ = మంచికీర్తికలుగుటకొఱకును, స్వస్తయే = సుఖముగానుండుటకొఱకును, వప = వపనము చేయింపుమా.

తా॥ సూర్యుడేకత్తిచేత బృహస్పతియొక్కయు అగ్నిహోత్రునియొక్కయు ఇంద్రునియొక్కయు శిరస్సులను ఆయుర్దాయముకొఱకు వపనము చేసెనో (ఓప్రా దయమా!) అటివంటికత్తిచేత ఈపిల్లవానియొక్క శిరస్సును ఆయుర్దాయముకొఱకును మంచికీర్తికొఱకును సుఖముగా నుండుటకొఱకును నాచే వపనము చేయింపుమా.

మూ॥ యేన భూయశ్చరా త్యయం జ్యోక్చ పశ్యాతి సూర్యం తే
నాఽస్యాఽయుషే వప సౌ శ్లోక్యాయ స్వస్తయే॥

పదవి॥ యేన । భూయః । చరాతి । అయం । జ్యోక్ । చ । పశ్యాతి । సూర్యం । తేన । అస్య । ఆయుషే । వప । సౌశ్లోక్యాయ । స్వస్తయే.

టీక॥ యేన= ఏ కత్తిచేతవపనముచేయఁబడినవాఁడై, అయం=ఈబ్రహ్మచారి, భూయః= చిరకాలము, చరాతి = ప్రవర్తించుచున్నాఁడో, జ్యోక్చ = బహుకాలము, సూర్యం = సూర్యుని, పశ్యాతి = చూచుచున్నాఁడో॥ ఉత్తరార్థము మున్నె చెప్పఁబడినది॥

తా॥ ఏకత్తిచేత వపనముచేయఁబడినవాఁడై యీ బ్రహ్మచారి చిరకాలము జీవించి యెప్పుడును సూర్యుని జూచునట్టివాఁ డగునో అటువంటి కత్తిచేత ఈ పిల్లవానియొక్క శిరస్సును ఆయుర్దాయముకొఱకును మంచికీర్తికొఱకును సుఖముగా నుండుటకొఱకును నాచే వపనము చేయింపుమా.

మూ॥ యేన పూషాబృహస్పతే రగ్నే రింద్రస్య చాయుషే వపత్
తేన తే వపా మ్యసాఽవాయుషా వర్చసా యథా జ్యో
క్సుమనా అసాః॥

పదవి॥ యేన । పూషా । బృహస్పతేః । అగ్నేః । ఇంద్రస్య । చ । ఆయుషే । అవపత్ । తేన । తే । వపామి । అసౌ । ఆయుషా । వర్చసా । యథా । జ్యోక్ । సుమనాః । అసాః॥

టీక॥ పూర్వార్థమునకు నర్థము మున్నె చెప్పఁబడినది. తేన = అటువంటికత్తిచేత, తే= నీయొక్క, శిరః= శిరస్సును, వపామి= వపనముచేయుచున్నాను, అసౌ= ఈ నీవు, యథా= ఏ ప్రకారముగా, ఆయుషా= ఆయుస్సుతోడను, వర్చసా= కాంతితోడనుగూడినవాఁడవై, జ్యోక్ = చిరకాలము, సుమనాః=మంచిమనస్సుగలవాడవై, అసాః= అయ్యెదవో॥

తా॥ సూర్యుఁ డేకత్తిచేత బృహస్పతియొక్కయు అగ్నిహోత్రునియొక్కయు ఇంద్రునియొక్కయు శిరస్సును ఆయుర్దాయముకొఱకు వపనముచేసెనో నీ వేప్రకా

రము చిరకాల మాయుర్దాయము గలవాఁడవును కాంతిగలవాడవునై మంచిమనస్సు గలవాఁడ వయ్యెదవో అట్లు అటువంటికత్తిచేత నీ శిరస్సును వపనము చేసెదను.

మూ॥ య త్క్షురేణ మర్చయతా సుపేశసా వప్త్రా వపసి కేశాన్ శుంధి శిరో మాఽస్యాఽయుః ప్రమోషీః॥

ప॥ యత్ । క్షురేణ । మర్చయతా । సు । పేశసా । వప్త్రా । వపసి । కేశాన్ । శుంధి । శిరః । మా । అస్య । ఆయుః । ప్రమోషీః॥

టీక॥ మర్చయతా = వాడికలిగి, సుపేశసా = మంచిరూపముచే ప్రకాశించు నట్టి, వప్త్రా = కత్తిచేత, అస్య = ఈ పిల్లవానియొక్క, కేశాన్ = వెంట్రుకలను, యత్ = ఎప్పుడు, వపసి = వపనముజేసితివో, తదా = అప్పుడు, అస్య = ఈపిల్లవాని యొక్క, శిరః = శిరస్సును, శుంధి = శుభ్రముగాఁజేయుము, అస్య = ఈపిల్లవాని యొక్క, ఆయుః = ఆయుర్దాయమును, మాప్రమోషీః = లోపముచేయకుము.

తా॥ వాడిగలదియు మంచిరూపముచే ప్రకాశించునట్టికత్తిచే ఈపిల్లవాని నాయుర్దాయభంగము లేకుండులాగున వపనము చేసి తలశుభ్రముగాఁ జేయుమని పిల్లవానితల్లి వపనముచేయువాని ప్రార్థించుచున్నది.

మూ॥ ఉప్త్వాయ కేశా న్వరుణస్య రాజ్ఞో బృహస్పతి స్సవితా సోమో అగ్నిః తేభ్యో నిధానం బహుధా న్వవింద న్నంతరా ద్యావా పృథివీ అప స్సువః॥

పదవి॥ ఉప్త్వాయ । కేశాన్ । వరుణస్య । రాజ్ఞః । బృహస్పతిః । సవితా । సోమః । అగ్నిః । తేభ్యః । నిధానం । బహుధా । అను । అవిందన్ । అంతరాద్యావాపృథివీ । అపః । సువః॥

టీక॥ బృహస్పతిః = బృహస్పతియు, సవితా = సూర్యుఁడును, సోమః = చంద్రుఁడును, అగ్నిః = అగ్నిహోత్రుఁడును, రాజ్ఞః = రాజైన, వరుణస్య = వరుణునియొక్క, కేశాన్ = వెండ్రుకలను, ఉప్త్వాయ = ఖండించి, అంతరాద్యావాపృథివీ = ఆకాశభూములయొక్క మధ్యప్రదేశమును, అపః = జలమును, సువః = స్వర్గలోకమును, తేభ్యః = ఆవెండ్రుకలనుంచుటకు, నిధానం = స్థానము

నుగాను, బహుధా = అనేకప్రకారములుగా, అన్వవిందన్ = క్రమముగా దెలిసికొనిరి.

తా॥ బృహస్పతియు సూర్యుఁడును చంద్రుఁడును అగ్నియు వరుణుని కేళము లను ఖండించి అంతరాళమును సర్వదిక్కుల నడిమిప్రదేశమును జలమును స్వర్గమును ఆవెంద్రికలనుంచుటకు స్థానముగా నెఱిఁగిరి.

---

## —♦ ద్వితీయఖండః ♦—

మూ॥ ఆయుర్దా దేవ జరసం గృణానో ఘృతప్రతీకో ఘృతపృష్ఠో
అగ్నే । ఘృతం పిబ న్నమృతం చారు గవ్యం పితేవ పుత్త్రం
జరసే న యేమం ॥

పదవి॥ ఆయుర్దాః । దేవ । జరసం । గృణానః । ఘృతప్రతీకః । ఘృతపృష్ఠః । అగ్నే । ఘృతం । పిబన్ । అమృతం । చారు । గవ్యం । పితా । ఇవ । పుత్త్రం । జరసే । నయ । ఇమం ॥

టీక॥ దేవ అగ్నే = ఓ అగ్నిదేవుఁడా! జరసం = స్తోత్రమును, గృణానః = గ్రహించునట్టి, త్వం = నీవు, ఘృతప్రతీకః = ఆజ్యమునుదహించునట్టి అవయవము కలవాఁడవును, ఘృతపృష్ఠః = వెనుకభాగమందుఆజ్యముగలవాఁడవునై, అమృతం= అమృతముతో సమానమైనదియు, చారు = రుచిగలదియు, గవ్యం = ఆవుసంబంధమైనఆజ్యమును, పిబన్ = పానముచేసినవాఁడవై, పుత్త్రం = తనయుని, పితేవ= తండ్రివలెనే, ఇమం = ఈ బ్రహ్మచారిని, జరసే = ముదిమినిగూర్చి, నయ=పొందించుమా॥

తా॥ ఓ అగ్నిహోతుృఁడా! స్తోత్రమును గ్రహించునట్టినీవు వెనుకభాగమందు ఆజ్యము గలవాఁడవై ఆజ్యమును పానముచేయుచు ఈబ్రహ్మచారిని తండ్రి తనయునివలెనే ముదిమిగలవానిగాఁ జేయుము అనఁగా దీర్ఘాయుర్దాయము గలవానిగాఁ జేయవలయు ననుట.

మూ॥ ఆతిష్ఠేమ మశ్మాన మశ్మేవ త్వగ్గ్ స్థిరో భవ అభితిష్ఠ
పృతన్యత స్సహస్వ పృతనా యతః.

పదవి॥ ఆతిష్ఠ । ఇమం । అశ్మానం । అశ్మా । ఇవ । త్వం । స్థిరః । భవ । అభి । తిష్ఠ । పృతన్యతః । సహస్వ । పృతనాః । యతః.

టీక॥ ఇమం=ఈ, అశ్మానం=రాతిని, ఆతిష్ఠ=ఎక్కుమా, త్వం=నీవు, అశ్మేవ=రాయివలెనే, స్థిరః=చిరకాలజీవిగా, భవ=ఉండుము, యతః=ఏ హేతువు వలన, పృతనాః=సేనలు, పృతన్యతః=యుద్ధము చేయఁగోరికగలవారలో ఆ హేతువు వలన సేనలను, అభితిష్ఠ=ఎదుర్కొనుమా, సహస్వ=జయించుమా.

తా॥ నీవు ఈ రాతి నధిష్ఠించి ఈ రాయివలెనే చిరకాలము జీవించుము. యుద్ధముచేయ గోరిక గలిగి వచ్చిన సేనల నెదుర్కొని యా సేనలను జయింపుమా.

మూ॥ రేవతీ స్త్వా వ్యక్ష్ణ న్కృత్తికా శ్చాఽకృంతగ్గ్ స్త్వా ధియోఽ
వయ న్నవ గ్నా అవృంజ న్త్సహస్ర మంతాగ్ం అభితో
అయచ్ఛన్॥

పదవి॥ రేవతీః । త్వా । వ్యక్ష్ణన్ । కృత్తికాః । చ । అకృంతన్ । త్వా । ధియః । అవయన్ । అవ । గ్నాః । అవృంజన్ । సహస్రం । అంతాన్ । అభితః । అయచ్ఛన్ ॥

టీక॥ త్వా = నిన్నుఁగూర్చి, వాసః = వస్త్రమును నేయుటకు, రేవతీః = రేవతులనెడు దేవతలు, వ్యక్ష్ణన్ = పత్తి నివిడదీసిరి, కృత్తికాశ్చ = కృత్తికలనెడు దేవతలును, త్వా = నిన్నుగూర్చి, అకృంతన్ = దారములనుజేసిరి, ధియః = బుద్ధులు అనెడు దేవతలు, అవయన్ = వస్త్రములను నేసిరి, గ్నాః = గ్నాలు అనెడు దేవతలు, అవావృంజన్ = వస్త్రములమధ్యను ఖండించిరి, సహస్రం = ఇతరమైన అనేక దేవతలు, అభితః = రెండుప్రక్కలను, అంతాన్ = అంచులను కమ్ములను, అయచ్ఛన్ = ఇచ్చిరి, అనఁగా ఉంచిరి.

తా॥ నీ నిమిత్తమై వస్త్రమును నేయఁ దలఁచి రేవతులు పత్తిని విడదీసిరి. కృత్తికలు దారములుగా వడికిరి. బుద్ధులు వస్త్రములుగా నేసిరి. గ్నాలు వడి

మికి నుత్తరించిరి. ఇతరమైన యనేకదేవతాస్త్రీలు రెండుప్రక్కలను అంచులును కమ్ములును గలుగునట్లు నిర్మించిరి.

మూ॥ దేవీ ర్దేవాయ పరిధీ సవితే్ర మహ త్త దాసా మభవ న్మహి త్వనం॥

పదవి॥ దేవీః। దేవాయ। పరిధీ। సవితే్ర। మహత్। తత్। ఆసాం। అభవత్। మహిత్వనం॥

టీక॥ దేవీః = (ఈ పదము పూర్వమంత్రముతో నన్వయము) దేవాయ = దేవుండగు, సవిత్రే = సూర్యునియొక్క (షష్ఠ్యర్థమందుచతుర్థి) పరిధీ = ధరించినకాలమందు॥ (సప్తమ్యర్థమందుప్రథమ) ఆసాం = ఈ దేవతలయొక్క, తత్ = ఆ, మహిత్వనం = మహిమ, మహత్ = విశేషమైనది, అభవత్ = ఆయెను.

తా॥ ఈ దేవతలయొక్క వస్త్రనిర్మాణశక్తి పూర్వమందు సూర్యునికి వస్త్రమును నిర్మాణముచేసినప్పుడు గలిగిన విశేషమహిమ కలది యగుంగాక.

మూ॥ యా అకృంత న్నవయన్ యా అతన్వత యాశ్చ దేవీ రంతా నభితో దదంత తా స్త్వా దేవీ జరసే సంవ్యయం త్వాయు ష్మా నిదం పరిధత్స్వ వాసః॥

పదవి॥ యాః। అకృంతన్। అవయన్। యాః। అతన్వత। యాః। చ। దేవీః। అంతాన్। అభితః। దదంత। తాః। త్వా। దేవీః। జరసే। సం। వ్యయంతు। ఆయుష్మాన్। ఇదం। పరిధత్స్వ। వాసః॥

టీక॥ యాః= ఏ, దేవీః= దేవతలు, అకృంతన్= పత్తినివిడదీసిరో, యాః= ఏ దేవతలు, అవయన్=వస్త్రమును జేసిరో, యాః=ఏ దేవతులు, అతన్వత=వస్త్రమును విస్తరింపజేసిరో, యాశ్చ=ఏ దేవతలు, అభితః=రెండుప్రక్కలయందును, అంతాన్=అంచులను కమ్ములను, దదంత=ఇచ్చిరో, తాః=అట్టువంటి, దేవీః=దేవతలు, త్వా=నిన్ను, జరసే=ముదిమికొఱకు, సంవ్యయంతు=వస్త్రమును ధరింపజేయుదురు గాక, ఆయుష్మాన్=ఆయుష్మంతుండవగునీవు, ఇదం=ఈ, వాసః=వస్త్రమును, పరిధత్స్వ=ధరింపుము.

తా॥ నీ నిమిత్తమైన వస్త్రమును గూర్చి యే దేవతలు ప్రత్తిని విడఁదీసిరో యే దేవతలు వస్త్రమును నేసిరో యే దేవతలు ఆ వస్త్రమును విశాలమైనదానిగా జేసిరో యే దేవతలు ఆ వస్త్రమునకు అంచులు మొదలగు వానిని గల్పించిరో యాయా దేవతలు నీవు దీర్ఘాయుష్మంతుఁడవగు రీతిని ఆ వస్త్రమును నీచే ధరింపఁ జేయఁగా నీవాయుష్మంతుడవై మాచే నియ్యఁబడు ఈ వస్త్రమును ధరింపుము.

మూ॥ పరి ధత్త ధత్త వాస సైనగ్ం శతాయుషం కృణుత దీర్ఘ మాయుః । బృహస్పతిః ప్రాయచ్ఛ ద్వాస ఏత థ్సోమాయ రాజ్ఞే పరిధాతవా ఉ ॥

పదవి॥ పరి । ధత్త । ధత్త । వాససా । ఏనం । శతాయుషం । కృణుత । దీర్ఘం । ఆయుః । బృహస్పతిః । ప్ర । అయచ్ఛత్ । వాసః । ఏతత్ । సోమాయ । రాజ్ఞే । పరిధాతవై । ఉ ॥

టీక॥ హే దేవ్యః = ఓ రేవతి మొదలగు దేవతలారా !, ఏనం = ఈపిల్లవానిని, వాససా = వస్త్రముచేతను, పరిధత్త = ధరింపఁజేయుఁడు, ధత్త =ధరింపజేయుఁడు, ఏనం = ఈపిల్లవానిని, శతాయుషం = నూఱుసంవత్సరములపర్యంతముజీవించువానిఁగా, కృణుత = చేయుఁడు, దీర్ఘం = విశేషమైన, ఆయుః = ఆయుస్సునుగురించి, ఏతత్ = ఈ, వాసః = వస్త్రమును, రాజ్ఞే = రాజయిన, సోమాయ = సోముని కొఱకు, పరిధాతవై = ధరించుటకొఱకు, బృహస్పతిః= బృహస్పతి, ప్రాయచ్ఛత్= ఇచ్చెను. ఉ అనుపదము నిరర్థక మైనది॥

తా॥ ఓ రేవతి మొదలగు దేవతలారా ! ఉపిల్లవానిచే వస్త్రమును ధరింపఁజేసి నూఱుసంవత్సరములపర్యంతము జీవించువానిగాఁ జేయుఁడు. ఈ వస్త్రమెట్టువంటి దనఁగా దీర్ఘాయుర్దాయనిమిత్తమై ధరించుటకుఁ గాను సోమునికొఱకు బృహస్పతిచే నియ్యబడినట్టువంటిది.

మూ॥ జరాం గచ్ఛాసి పరిధత్స్వ వాసో భవాఽకృష్టీనా మశభిస్తి పావా । శతం చ జీవ శరద స్సువర్చా రాయ శ్చ పోష ముపసంవ్యయస్వ॥

పదవి॥ జరాం । గచ్ఛాసి । పరిదత్స్వ । వాసః । భవ । అకృష్టీనాం । అభిశస్తిపావా । శతం । చజీవ । శరదః ।సువర్చాః । రాయః ।చ।పోషం । ఉప । సం। వ్యయస్వ ॥

టీక॥ ఇదం = ఈ, వాసః = వస్త్రమును, పరిధత్స్వ = ధరించుము, జరాం = క్రమముగా ముసలితనమును, గచ్ఛాసి = పొందుదువు, ఆకృష్టీనాం = బంధువులు మొదలగువారియొక్క, అభిశస్తిపావా, అభిశస్తి = మేలును, పావా = అపేక్షించువాఁడవు, భవ = అవుము, సువర్చాః = మంచికాంతిగలవాఁడవై, శతం = నూఱైన, శరదః = సంవత్సరములు, జీవ = బ్రతుకుము, రాయశ్చపోషం = ధనవృద్ధినిగూర్చి, ఉపసంవ్యయస్వ = ఎప్పుడును ప్రయత్నపడుము.

తా॥ ఈ వస్త్రమును ధరించుటచే నీవు ముదిమి వచ్చునంతవఱకు జీవించి యుందువు. బంధువులు మొదలగువారి మేలును గోరుచుండుము. మంచి కాంతిగల వాఁడవై, నూఱుసంవత్సరములపర్యంతము జీవింపుము ధనవృద్ధినిగూర్చి ప్రయత్నము చేయుము.

మం॥ పరీదం వాసో అధిధా స్స్వస్తయే౽భూ రాపీనా మభిశస్తి పావా । శతం చ జీవ శరదః పురూచీ ర్వసూనిచా౽ర్యో విభజా౽సి జీవన్ ॥

పదవి॥ పరి । ఇదం । వాసః । అధి । ధాః । స్వస్తయే । అభూః । ఆపీనాం । అభిశస్తిపావా । శతం । చ । జీవ । శరదః । పురూచీః । వసూని । చ । ఆర్యః । విభజాసి । జీవన్ ॥

టీక॥ ఇదం = ఈ, వాసః = వస్త్రమును, స్వస్తయే = సుఖముగానుండుట కొఱకు, పర్యధిధాః = ధరించినవాఁడవైతివి, ఆపీనాం = ఆప్తులు జ్ఞాతులు మొదలగువారియొక్క, అభిశస్తిపావా, అభిశస్తి = మేలును, పావా = కోరువాఁడవు, అభూః = అవుము, శతం = నూఱైన, శరదశ్చ = సంవత్సరములను, జీవ = బ్రతుకుము, ఆర్యః = అధిపతివై, జీవన్ = జీవించుచు, పురూచీః = అనేకవిధములైన, వసూని = ధనములను, విభజాసి = అర్థులకుఁ బంచిపెట్టుచుండుము.

తా॥ ఓ పిల్లవాఁడా! సుఖముగా నుండుటకొఱకే వస్త్రమును ధరించితివి. ఆప్తులందరి యొక్కయు మేలును అపేక్షించువాఁడ వగుము. నూఱు సంవత్సరములు జీవింపుము. అధిపతివై జీవించుచు విశేషమైన ధనములను అర్థులకు విభజించి యిచ్చుచుండుము.

మూ॥ ఇయం దురుక్తా త్పరిబాధమానా శర్మ వరూథం పునతీ న
ఆగాత్ ప్రాణాపానాభ్యాం బల మాభరంతీ ప్రియా దేవా
నాగ్ం సుభగా మేఖ లేయం ॥

పదవి॥ ఇయం । దురుక్తాత్ । పరి । బాధమానా । శర్మ । వరూథం। పునతీ। నః । ఆగాత్ । ప్రాణాపానాభ్యాం । బలం । ఆ । భరంతీ । ప్రియా । దేవానాం । సుభగా । మేఖలా । ఇయం ॥

టీక॥ ఇయం = ఈ, మేఖలా = మొలనూలు, దురుక్తాత్ = దుష్టప్రసంగములను, (ద్వితీయార్థమందు పంచమి), పరిబాధమానా=అంతటను బోఁగొట్టుచు, వరూథం = కోరఁదగిన, శర్మ = గృహమును, పునతీ = పవిత్రము జేయుచు, నః = మమ్ములను, ఆగాత్ = పొందెను, ఇయం = ఈ, మేఖలా = మొలనూలు, ప్రాణాపానాభ్యాం = ప్రాణ అపానవాయువుల కొఱకు, బలం = దార్ఢ్యమును, ఆభరంతీ = కలుగునట్లు జేయుచున్నదియు, దేవానాం = దేవతలకు, ప్రియా = ఇష్టమైనదియుఁ గనుక నే, సుభగా = మనోహరమైనది.

తా॥ దేవతలకు ప్రియమైన ఈ మొలనూలు నాచే ధరింపఁబడినదై ప్రాణవాయువునకు అపానవాయువునకు బలమును గలుగఁజేయుచు దుష్టప్రసంగములను బోఁగొట్టుచు నేను సంచరించుచున్న గృహమును బవిత్రము చేయుఁగాక.

మూ॥ ఋతస్య గోప్త్రీ తపసః పరస్పీ ఘ్నతీ రక్షః స్సహమానా
అరాతీః సా న స్సమంత మను పరీహి భద్రయా భర్తార
స్తే మేఖలే మా రిషామ ॥

పదవి॥ ఋతస్య । గోప్త్రీ । తపసః । పరస్పీ । ఘ్నతీ । రక్షః । సహమానా । అరాతీః । సా । నః । సమంతం । అను । పరి । ఇహి । భద్రయా । భర్తారః । తే । మేఖలే । మా । రిషామ ॥

టీక॥ మేఖలా=మొలనూలు, ఋతస్య = సత్యముయొక్క, గోప్త్రీ = కాపాడునదియు, తపసః = తపస్సునకు, పరస్పీ = మిక్కిలిరక్షకమైనదియు, రక్షః = రాక్షసులను=ఘ్నతీ, కొట్టునదియు, అరాతీః = శత్రువులను, సహమానా=తిరస్కరించునదియునైయున్నది, హే మేఖలే = ఓ మొలనూలా ! సా = ఆ ప్రసిద్ధమైన, త్వం =

నీవు, నః = మమ్ములను, సమంతం=అంతటను, అను = క్రమముగా, పరీహి = పొందితివి, భద్రయా = శోభస్కరమైన నీతో గూడినవారమై, వయం = మేము, మారిషామ = నశింపము, తే = నిన్ను ధరించినవారు, భర్తారః = అధిపతులు (కాఁగలరు).

తా॥ ఓ మొలనూలా! నీవు సత్యమును గాపాడుదానవును తపస్సును రక్షించుదానవును రాక్షసులను నశింపఁజేయుదానవును శత్రువులను జయించుదానవు నగుదువు. ఇట్టి మహిమగల నీవు క్రమముగా మమ్ముల నందఱను అధిష్ఠించితివి. నిన్ను ధరించుటచే మేము ఆపత్తులనుబొందము. నిన్ను ధరించినవారు అధిపతులు కాఁగలరు.

మూ॥ మిత్రస్య చక్షు ర్ధరుణం బలీయ స్తేజో యశస్వి స్థవిరగ్ం
సమిద్ధం అనాహనస్యం వసనం జరిష్ణు పరీదం వాజ్యజినం
దధేహం॥

పదవి॥ మిత్రస్య। చక్షుః। ధరుణం। బలీయః। తేజః। యశస్వి। స్థవిరం। సమిద్ధం। అనాహనస్యం। వసనం। జరిష్ణు। పరి। ఇదం। వాజి। అజినం। దధే। అహం॥

టీక॥ మిత్రస్య = సూర్యునకు, చక్షుః=నేత్రమైనదియు, బలీయః=విశేషమైన, తేజః = తేజస్సును, ధరుణం = ధరించునదియు, యశస్వి = ధరించువానికి కీర్తి నొసఁగునదియు, స్థవిరం = వృద్ధిబొందించునదియు, సమిద్ధం = ప్రకాశించునదియు, అనాహనస్యం = ధూర్తులకు బనికిరానిదియు, జరిష్ణు = ధరించువానికి ముదిమి వచ్చువరకుంటుటచే స్తోత్రపాత్రమగునదియు, వాజి = అన్నము నొసగునదియు నగు, ఇదం = ఈ, అజినం = కృష్ణాజినమును, వసనం = వస్త్రముగా అహం = నేను, పరిదధే = ధరించుచున్నాను.

తా॥ సూర్యునకు నేత్రమైనదియు విశేష తేజస్సును ధరించినదియు కీర్తినిచ్చునదియు వృద్ధి నిచ్చునదియు కాంతిగలదియు ధూర్తులకు బనికిరానిదియు అన్నమును గలుగజేయునదియు స్తోత్రపాత్రమగు ఈ కృష్ణాజినమును వస్త్రముగా, నేను ధరించుచున్నాను.

## —♦ తృతీయఖండః ♦—

మూ॥ ఆగంత్రా సమగన్మహి ప్ర సు మృత్యుంయుయోతన అరిష్టాస్సంచరేమహి స్వస్తి చరతా దిహ స్వస్త్యాగృహేభ్యః॥

పదవి॥ ఆగంత్రా। సం। అగన్మహి। ప్ర। సు। మృత్యుం। యుయోతన। అరిష్టాః। సం। చరేమహి। స్వస్తి। చరతాత్। ఇహ। స్వస్తి। ఆ। గృహేభ్యః॥

టీక॥ ఆగంత్రా = వచ్చుచున్నఆచార్యునితో, సమగన్మహి = కలిసికొంటిమి, మృత్యుం = మరణమును, ప్రసుయుయోతన = మిక్కిలిబాగుగాఁ బోఁగొట్టఁగలము, అరిష్టాః = ఆపత్తులులేనివారమై, సంచరేమహి = సంచరించెదము, ఆచార్యోఽపి = ఆచార్యుఁడును, స్వస్తి = శుభముగలవాఁడై, చరతాత్ = సంచరించుగాక, ఇహ = ఈబ్రహ్మచర్యమందు, ఆగృహేభ్యః = గృహస్థాశ్రమముపర్యంతము, మమాపి = నాకును, స్వస్తి = శుభము, భవతు = అగుఁగాక॥

తా॥ వచ్చుచున్నయాచార్యునితోఁ గూడి మేము మరణమును పోఁగొట్టుకొనెదము. ఆచార్యుఁడును నేనును ఆపత్తులు లేనివారమై సంచరించెదము. ఆచార్యునకును, ఇప్పుడు మొదలుకొని గృహస్థాశ్రమముపర్యంతము నాకును శుభ మగుఁగాక॥

మూ॥ సముద్రాదూర్మిర్మధుమాగ్ం ఉదార దుపాగ్ం శునా సమమృతత్వ మశ్యాం ఇమే నుతే రశ్మయ స్సూర్యస్య యేభి స్సపిత్వం పితరో న ఆయన్॥

పదవి॥ సముద్రాత్। ఊర్మిః। మధుమాన్। ఉదారత్। ఉప। అంశునా। సం। అమృతత్వం। అశ్యాం। ఇమే। ను। తే। సూర్యస్య। యేభిః। సపిత్వం। పితరః। నః। ఆయన్॥

టీక॥ ఊర్మిః = నన్ను ప్రోక్షించెడి తరంగజలము, సముద్రాత్ = సముద్రమువలనఁ దీసికొని రాఁబడినది, మధుమాన్ = సముద్రుఁడు, ఉదారత్ = నా సమీపమును బొందినవాఁడాయెను, అంశునా = దీప్తిగల యీతరంగజలముచే, అమృతత్వం = దేవత్వమును, సముపాశ్యాం = పొందెదను, నః = మాయొక్క, పితరః = పూర్వులైనఁ అంగిరసుఁడు మొదలగువారు, యేభిః = ఏ కిరణములచేతను,

సపీత్వం = దేవతలతోఁగూడ సమానసోమపానమును ఆయక్ = పొందిరో, సూర్యస్య = సూర్యునియొక్క, తే = ఆకిరణములు, ఇమే = ఈ సముద్రతరంగజలమే.

తా॥ నన్ను ప్రోక్షణచేసినజలము సముద్రోదకము గాన సముద్రుఁడు కాఁడు బ్రత్యక్ష మయ్యెను. ఈ జలప్రోక్షణచే దేవత్వమును బొందెదను. మా పూర్వులైన అంగిరసుఁడు మొదలగువారు సూర్యకిరణములకంటె వేఱు గాని యీ సముద్రజలముచే దేవతలతోఁ గూడ సమానమైన సోమపానమును జేసినవారైరి. యాభి రాదిత్య స్తపతి తాభిః పర్జన్యో వర్షతి - అదిత్యా జ్జాయతే వృష్టి రితి - ఈ ప్రమాణములచే సూర్యకిరణములకును జలమునకును అభేదాధ్యవసాయముగా అనఁగా భేదము లేదని యిచ్చటఁ జెప్పఁబడియెను.

మూ॥ అగ్నిష్టే హస్త మగ్రభీత్ ॥

పదవి॥ అగ్నిః । తే । హస్తం । అగ్రభీత్ ॥

టీక॥ అగ్నిః = అగ్నిహోత్రుఁడు, తే = నీయొక్క, హస్తం = హస్తమును, అగ్రభీత్ = గ్రహించెను.

తా॥ అగ్నిహోత్రుఁడు నిన్ను సంరక్షించుటకొఱకు నీహస్తమును బట్టుకొనెను.

మూ॥ సోమ స్తే హస్త మగ్రభీత్ ॥

పదవి॥ సోమః । తే । హస్తం । అగ్రభీత్ ॥

టీక॥ సోమః = చంద్రుఁడు, తే = నీయొక్క, హస్తం = హస్తమును, అగ్రభీత్ = గ్రహించెను.

తా॥ చంద్రుఁడు నీహస్తమును బట్టుకొనెను. సంరక్షించుటకొఱకు అనునది 11 వ మంత్రము వఱకు నన్వయించుకోఁ దగినది.

మూ॥ సవితా తే హస్త మగ్రభీత్ ॥

పదవి॥ సవితా । తే । హస్తం । అగ్రభీత్ ॥

టీక॥ సవితా = సూర్యుఁడు, తే = నీయొక్క, హస్తం = హస్తమును, అగ్రభీత్ = గ్రహించెను.

తా॥ సూర్యుఁడు నీ హస్తమును బట్టుకొనెను.

మూ॥ సరస్వతీ తే హస్త మగ్రభీత్ ॥

పదవి॥ సరస్వతీ । తే । హస్తం । అగ్రభీత్ ॥

టీక॥ సరస్వతీ = స్వరస్వతీదేవి, తే = నీయొక్క, హస్తం = హస్తమును అగ్రభీత్ = గ్రహించెను.

తా॥ సరస్వతి నీయొక్క హస్తమును గ్రహించెను.

మూ॥ పూషా తే హస్త మగ్రభీత్ ॥

పదవి॥ పూషా । తే । హస్తం । అగ్రభీత్ ॥

టీక॥ పూషా = ద్వాదశసూర్యులలో నొక సూర్యుఁడు, తే = నీయొక్క, హస్తం = హస్తమును, అగ్రభీత్ = గ్రహించెను.

తా॥ ద్వాదశసూర్యులలో పూషయను నొక సూర్యుఁడు నీ హస్తమును, గ్రహించెను.

మూ॥ బృహస్పతి స్తే హస్త మగ్రభీత్ ॥

పదవి॥ బృహస్పతిః । తే । హస్తం । అగ్రభీత్ ॥

టీక॥ బృహస్పతిః = బృహస్పతి, తే = నీయొక్క, హస్తం = హస్తమును అగ్రభీత్ = గ్రహించెను

తా॥ బృహస్పతి నీ హస్తమును గ్రహించెను.

మూ॥ అర్యమా తే హస్త మగ్రభీత్ ॥

పదవి॥ అర్యమా । తే । హస్తం । అగ్రభీత్ ॥

టీక॥ అర్యమా = ద్వాదశసూర్యులలో అర్యముఁడను సూర్యుఁడు, తే = నీయొక్క, హస్తం = హస్తమును, అగ్రభీత్ = గ్రహించెను.

తా॥ ద్వాదశసూర్యులలో అర్యముఁడను సూర్యుఁడు నీహస్తమును గ్రహించెను.

మూ॥ అగ్ంశు స్తే హస్త మగ్రభీత్ ॥

పదవి॥ అంశుః । తే । హస్తం । అగ్రభీత్ ॥

టీక॥ అంశుః = సూర్యకిరణము, తే = నీయొక్క, హస్తం = హస్తమును, అగ్రభీత్ = గ్రహించెను.

తా॥ సూర్యకిరణము నీయొక్క హస్తమును గ్రహించెను.

మూ॥ భగ స్తే హస్త మగ్రభీత్॥

ప॥ భగః॥ తే। హస్తం। అగ్రభీత్॥

టీ॥ భగః = ద్వాదశసూర్యులలో భగుఁడు అను సూర్యుఁడు తే నీయొక్క, హస్తం = హస్తమును, అగ్రభీత్ = గ్రహించెను.

తా॥ ద్వాదశసూర్యులలో భగుఁడు అను సూర్యుఁడు నీహస్తమును గ్రహించెను.

మూ॥ మిత్ర స్తే హస్త మగ్రభీత్॥

ప॥ మిత్రః। తే। హస్తం। అగ్రభీత్॥

టీక॥ మిత్రః = ద్వాదశసూర్యులలో మిత్రుఁడు అను సూర్యుఁడు, తే = నీయొక్క, హస్తం = హస్తమును, అగ్రభీత్ = గ్రహించెను.

తా॥ ద్వాదశసూర్యులలో మిత్రుఁ డనుసూర్యుఁడు నీ హస్తమును గహించెను.

మూ॥ మిత్రస్త్వ మసిధర్మణాగ్ని రాచార్యస్తవ॥

పదవి॥ మిత్రః। త్వం। అసి ధర్మణా అగ్నిః ఆచార్యః। తవ॥

టీక॥ ధర్మణా = ధర్మముచేతను, త్వం = నీవు, మిత్రః = సూర్యుడవు అసి = అగుచున్నావు, తవ = నీయొక్క, ఆచార్యః = గురువు, అగ్నిః = అగ్ని, హోతృనతో, సమానుఁడు.

తా॥ ధర్మముచేతను నీవు సూర్యునితో సమానమును నీ గురువు అగ్నిహోతృనితో సమానము నయితిరి.

మూ॥ అగ్నయే త్వా పరిదదా మ్యసౌ॥

పదవి॥ అగ్నయే। త్వా। పరి। దదామి। అసౌ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ!, త్వా = నిన్ను, అగ్నయే = అగ్నిహోత్రుని కొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను॥

తా॥ ఓబ్రహ్మచారీ! సంరక్షించుటకొఱకు నిన్ను అగ్నిహోతృన కిచ్చుచున్నాను.

మూ॥ సోమాయ త్వా పరిదదా మ్యసౌ॥

ప॥ సోమాయ । త్వా । పరి । దదామి । అసౌ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ ! త్వా = నిన్ను, సోమాయ =సోమునికొఱకు, పరిదామి = ఇచ్చుచున్నాను॥

తా॥ ఓబ్రహ్మచారీ ! నిన్ను చంద్రునికొఱ కిచ్చుచున్నాను.

మూ॥ సవిత్రే త్వా పరిదదా మ్యసౌ॥

పదవి॥ సవిత్రే । త్వా । పరి । దదామి । అసౌ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ !, త్వా = నిన్ను, సవిత్రే =సూర్యునికొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

తా॥ ఓబ్రహ్మచారీ ! నిన్ను సూర్యున కిచ్చుచున్నాను.

మూ॥ సరస్వత్యై త్వా పదరిదా మ్యసౌ॥

పదవి॥ సరస్వత్యై । త్వా । పరి । దదామి । అసౌ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ !, త్వా=నిన్ను, సరస్వత్యై, సరస్వతికొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

తా॥ ఓబ్రహ్మచారీ ! నిన్ను సరస్వతి కిచ్చుచున్నాను.

మూ॥ మృత్యవే త్వా పరిదదా మ్యసౌ॥

పదవి॥ మృత్యవే । త్వా । పరి । దదామి । అసౌ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ !, త్వా = నిన్ను, మృత్యవే = మృత్యువుకొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

తా॥ ఓబ్రహ్మచారీ !, నిన్ను మృత్యువున కిచ్చుచున్నాను.

మూ॥ యమాయత్వా పరిదదామ్యసౌ॥

పదవి॥ యమాయ । త్వా । పరి । దదామి । అసౌ ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ !, త్వా = నిన్ను, యమాయ = యమునికొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

తా॥ ఓబ్రహ్మచారీ ! నిన్ను యమునికొఱ కిచ్చుచున్నాను.

మూ॥ గదాయ త్వా పరిదదా మ్యసౌ॥

పదవి॥ గదాయ । త్వా । పరి । దదామి । అసౌ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ! త్వా = నిన్ను, గదాయ = గదయనుఆయుధముకొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

తా॥ ఓబ్రహ్మచారీ! నిన్ను గద యనుఆయుధముకొఱ కిచ్చుచున్నాను.

మూ॥ అంతకాయ త్వా పరిదదా మ్యసౌ॥

పదవి॥ అంతకాయ । త్వా । పరి । దదామి । అసౌ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ! త్వా = నిన్ను, అంతకాయ = అంతకునికొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

తా॥ ఓబ్రహ్మచారీ! నిన్ను సంహారముచేయు దేవునికొఱ కిచ్చుచున్నాను.

మూ॥ అద్భ్య స్త్వా పరిదదా మ్యసౌ॥

పదవి॥ అద్భ్యః । త్వా । పరి । దదామి । అసౌ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ!, త్వా=నిన్ను, అద్భ్యః= ఉదకములకొఱకు, పరిదదామి=ఇచ్చుచున్నాను.

తా॥ ఓబ్రహ్మచారీ నిన్ను ఉదకములకొఱ కిచ్చుచున్నాను.

మూ॥ ఓషధీభ్య స్త్వా పరిదదా మ్యసౌ॥

పదవి॥ ఓషధీభ్యః । త్వా । పరి । దదామి । అసౌ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ! త్వా = నిన్ను, ఓషధీభ్యః = ఓషధులకొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

తా॥ ఓబ్రహ్మచారీ! నిన్ను ఓషధులకొఱ కిచ్చుచున్నాను.

మూ॥ పృథివ్యై త్వా సవైశ్వానరాయై పరిదదా మ్యసౌ॥

పదవి॥ పృథివ్యై । త్వా । సవైశ్వానరాయై । పరి । దదామి । అసౌ॥

టీక॥ అసౌ = బ్రహ్మచారీ! త్వా = నిన్ను, సవైశ్వానరాయై = అగ్నిహోత్రముతోఁగూడిన, పృథివ్యై = భూమికొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

తా॥ ఓబ్రహ్మచారీ! నిన్ను అగ్నిహోత్రముతోఁ గూడనభూదేవి కిచ్చుచున్నాను.

మూ॥ దేవస్య త్వా సవితుః ప్రసవ ఉప నయేఽసౌ ॥

పదః॥ దేవస్య । త్వా । సవితుః । ప్రసవే । ఉప । నయే । అసౌ ॥

టీక॥ అసౌ = ఓబ్రహ్మచారీ ! దేవస్య = దేవుండగు, సవితుః = సూర్యుని యొక్క, ప్రసవే = అనుజ్ఞకలుగుచుండఁగా, త్వా = నిన్ను, ఉపనయే = నా సమీపమును బొందించుచున్నాను.

తా॥ ఓబ్రహ్మచారీ ! సూర్యుఁ డనుజ్ఞ నియ్యఁగా గాయత్రి నుపదేశించుట కొఱకు నా సమీపమునందు నిన్నుఁ గూర్చుండఁ బెట్టుకొనుచున్నాను. పైని మంత్ర ములయందుండు - అసౌ - అనుపదమునకు బ్రహ్మచారియొక్క నామమును సం బుద్ధిచే గ్రహింపవలయును. పిల్లవానిని పైని జెప్పఁబడిన దేవతలకొఱ కిచ్చుట సంరక్షణకొఱ కని తెలిసికొనవయును.

మూ॥ సుప్రజాః ప్రజయా భూయాః స్సువీరో వీరై స్సువర్చా వర్చసా సుపోషః పోషైః॥

పదవి॥ సుప్రజాః । ప్రజయా । భూయాః । సువీరః । వీరైః । సువర్చాః । వర్చసా । సుపోషః । పోషైః॥

టీక॥ ప్రజయా = సంతానముచేత, సుప్రజాః = మంచిసంతానముగలవాఁడ వును, వీరైః= పుత్రపౌత్రాదులచేత, సువీరః = యోగ్యులైన తనయాదులుగలవాఁ డవును, వర్చసా = కాంతిచేత, సువర్చాః = మంచి కాంతిగలవాఁడవును, పోషైః= వృద్ధులచేత, సుపోషః = మంచివృద్ధిగలవాఁడవును, భూయాః= అవుము॥

తా॥ మంచిసంతానము గలవాఁడవును యోగ్యులైనపుత్త్రులు గలవాఁడవును మంచి కాంతిగలవాఁడవును మంచివృద్ధి గలవాఁడవును అగుము.

మూ॥ బ్రహ్మచర్య మాగా ముప మా నయస్వ దేవేన సవిత్రా ప్రసూతః॥

పదవి॥ బ్రహ్మచర్యం । ఆగాం । ఉప । మా । నయస్వ । దేవేన । సవిత్రా । ప్రసూతః॥

టీక॥ అహం = నేను, బ్రహ్మచర్యం=వేదాభ్యాసము నిమిత్తమైన వ్రతమును, ఆగాం = పొందితిని = దేవేన = దేవుండగు, సవిత్రా= సూర్యునిచేత, ప్రసూతః=

అనుజ్ఞనుబొందినవాఁడవై, త్వం = నీవు, మా = నన్ను, ఉపనయస్వ = నీ సమీపము నకు తీసికొనుము.

తా॥ ఓఆచార్యుఁడా! నేను వేదాభ్యాసముకొఱకు బ్రహ్మచర్య వ్రతమును బూనితిని గాన నీవు సూర్యునిచే అనుజ్ఞనుబొంది వేదముపదేశించుకొఱకు నన్ను నీ సమీపమం దుంచుకొమ్మి అని వటువు ఆచార్యునితోఁ బలుకుచున్నాఁడు.

మూ॥ కో నామాఽ స్యసౌ నామాఽస్మి ॥

పదవి॥ కః । నామ । అసి । అసౌ । నామ । అస్మి ॥

టీక॥ త్వం = నీవు, కోనామ = ఏమిపేరుగలవాఁడవు, అసి = అయితివి, అని ఆచార్యుఁ డడుగుచున్నాడు, అహం = నేను, అసౌనామ = ఈ పేరుగల వాఁడను, అస్మి = అయితిని, అని వటువు తనకేర్పఱచియున్నపేరిని జెప్పు చున్నాఁడు.

తా॥ నీ పే రేమి యని యాచార్యుం డడుగఁగా నామకరణసమయంబున నేర్పఱచిన తనపేరిని వటువు చెప్పవలయును.

మూ॥ కస్య బ్రహ్మచా ర్యస్యసౌ ప్రాణస్య బ్రహ్మచా ర్య స్మ్యసౌ ॥

పదవి॥ కస్య । బ్రహ్మచారీ । అసి । అసౌ । ప్రాణస్య । బ్రహ్మచారీ । అస్మి । అసౌ ॥

టీక॥ అసౌ = ఓపిల్లవాఁడా! త్వం = నీవు, కస్య = ఎవనియొక్క, బ్రహ్మ చారీ = బ్రహ్మచర్యముగలవాఁడవు, అసి = అయితివి, అసౌ = ఈ నేను, ప్రా ణస్య = ఆత్మయొక్క, బ్రహ్మచారీ = బ్రహ్మచర్యము గలవాఁడను, అస్మి = అయితిని.

తా॥ ఓపిల్లవాఁడా! నీ వెందునిమిత్తము బ్రహ్మచర్యముఁ బూనితి వని యాచార్యుం డడుగఁగా నాత్మనుగుఱించి బ్రహ్మచర్యమును బూనితి నని వటువు చెప్పుచున్నాఁడు.

మూ॥ ఏష తే దేవ సూర్య బ్రహ్మచారీ తం గోపాయ స మా మృ
త్యైష తే సూర్య పుత్ర స్సదీర్ఘాయు స్స మా మృత యాగ్

స్వస్తి మగ్ని ర్వాయు స్సూర్య శ్చంద్రమా ఆపో ను సంచరంతి తాగ్ స్వస్తి మనుసంచరాఽసౌ ॥

ప॥ ఏషః । తే । దేవ । సూర్య । బ్రహ్మచారీ । తం । గోపాయ । సః । మా । మృత । ఏషః । తే । సూర్య । పుత్త్రః । సు । దీర్ఘాయుః । సః । మా । మృత । యాం । స్వస్తిం । అగ్నిః । వాయుః । సూర్యః । చంద్రమాః । అపః । ను । సం । చరంతి । తాం । స్వస్తిం । అను । సం । చర । అసౌ ॥

టీక॥ దేవ = దేవుండవగు, సూర్య = సూర్యుఁడా! ఏషః = ఈ వటువు, తే = నీయొక్క, బ్రహ్మచారీ = బ్రహ్మచర్య వ్రతముఁగలవాఁడు, తం = అటువంటి బ్రహ్మచారిని, గోపాయ = రక్షించుమా, సః = ఆబ్రహ్మచారి, మామృత = మరణమును బొందకుండుఁగాక, హేసూర్య = ఓసూర్యుఁడా! ఏషః = ఈ పిల్లవాఁడు, తే = నీయొక్క, పుత్త్రః = కుమారుఁడు, సః = ఆబ్రహ్మచారీ, సుదీర్ఘాయుః = మిక్కిలి దీర్ఘాయుర్దాయము గలవాఁడై, మామృత=అకాలమృత్యువును బొందకుండుఁగాక, అసౌ = ఓబ్రహ్మచారీ, అగ్నిః= అగ్నిహోత్రుఁడును, వాయుః=వాయువును, సూర్యః = సూర్యుఁడును, చంద్రమాః = చంద్రుఁడును, అపః = ఉదకములును, యాం = ఏ, స్వస్తిం = శుభమును, అను = క్రమముగా, సంచరంతి = కలిగి ప్రవర్తించుచున్నారో, త్వమపి = నీవును, తాం = అటువంటి, స్వస్తిం = శుభమును, అను = అనుసరించి, సంచర = ప్రవర్తింపుమా॥

తా॥ ఓసూర్యుఁడా! ఈ పిల్లవాఁడు నీసంబంధమైన బ్రహ్మచర్యమును బూని యున్నాఁడు; కాన ఈ బాలుని రక్షింపుము. ఓసూర్యుఁడా! ఇతండు నీ పుత్రునితో సమానుఁడు గాన దీర్ఘాయువు నొసఁగి అకాలమరణమును బొందింపకుము. ఓపిల్లవాఁడా! అగ్నియు వాయువును సూర్యుఁడును చంద్రుఁడును ఉదకములును ఎటువంటిశుభము కలిగి ప్రవర్తించుట కలుగుచున్నదో నీవును అటువంటిశుభము కలిగి ప్రవర్తింపుమని యాచార్యుఁడు పలుకుచున్నాఁడు.

మ॥ అధ్వనా మధ్వపతే శ్రేష్ఠ స్యాఽధ్వనః పార మశీయ॥

పదవి॥ అధ్వనాం । అధ్వపతే । శ్రేష్ఠస్య । అధ్వనః । పారం । అశీయ॥

టీక॥ అధ్వనాం = సమస్తసుఖములనెడు అధ్వపతే= మార్గములకు ప్రభు వగునో సూర్యుఁడా!, శ్రేష్టస్య=శ్రేయస్కరమైన, అధ్వనః=బ్రహ్మచర్యరును మార్గముయొక్క, పారం=అంతమును, అశీయ=పొందెదను.

తా॥ సుఖముల కధిపతి వగునో సూర్యుఁడా! నీయనుగ్రహమువలన శ్రేయస్కరమైన బ్రహ్మచర్యవ్రతమును సంపూర్తి నొందింపగలను అని బ్రహ్మచారి పలుకుచున్నాఁడు.

---

## —♦ అథ చతుర్థఖండః ప్రారభ్యతే॥ ♦—

మూ॥ యోగే యోగేతవస్తరం వాజే వాజే హవామహే ।
సఖాయ ఇంద్రమూతయే॥

పదవి॥ యోగే । యోగే । తవస్తరం । వాజే । వాజే । హవామహే । సఖాయః । ఇంద్రం । ఊతయే॥

టీక॥ యోగేయోగే, ప్రతికర్మయందునను, తవస్తరం=మిక్కిలి కొనియాడదగిన, ఇంద్రం=ఇంద్రుని, సఖాయః=స్నేహితులమైన మేము, వాజేవాజే=ప్రతియజ్ఞమందునను, ఊతయే=రక్షణకొఱకు, హవామహే=పిలుచున్నాము.

తా॥ ప్రతికర్మమునందును గొనియాడఁదగిన దేవేంద్రుని, మమ్ములను రక్షించుట కొఱకు ప్రతియజ్ఞమందును బిలుచుచున్నాము.

మూ॥ ఇమ మగ్న ఆయుషే వర్చసే కృధి ప్రియగ్ం రేతో వరుణ సోమ రాజన్ మాతేవాఽస్మా అదితే శర్మ యచ్ఛ విశ్వే దేవా జరదష్టి ర్యథాఽసతే॥

పదవి॥ ఇమం । అగ్నే । ఆయుషే । వర్చసే । కృధి । ప్రియం । రేతః । వరుణ । సోమ । రాజన్ । మాతా । ఇవ । అస్మై । అదితే । శర్మ । యచ్ఛ । విశ్వే దేవాః । జరదష్టిః । యథా । అసత్ ॥

టీక॥ హేఅగ్నే = ఓఅగ్నిహోత్రుఁడా ! ఇమం = ఈ పిల్లవానిని, ఆయుషే = ఆయువుకొఱకును, వర్చసే = వర్చస్సుకొఱకును, కృధి = చేయుము,

హేవరుణ = ఓవరుణుఁడా! రాజన్ = ప్రభుఁడవగు, సోమ=చంద్రుఁడా! ప్రియం= ఇష్టమైన, శేతః = సారమును, కృధి = కలుగజేయుము, హే అదితే = ఓ అదితీ ! అస్మై = ఈతనికి, మాతేవ = తల్లివలెనే, శర్మ = సుఖమును, యచ్ఛ = ఇమ్ము, హేవిశ్వేదేవాః = ఓవిశ్వేదేవతలారా! అయం = ఇతఁడు, జరదష్టిః = ముదిమి పొందువఱకు జీవించువాఁడై, యథా = ఏప్రకారముగా, అసత్ = అగునో, తథా= ఆప్రకారముగా యూయం = మీరు, శర్మ = సుఖమును, యచ్ఛత = ఇండు.

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా! ఈ పిల్లవానిని దీర్ఘాయువు వర్చస్సు గలవానిగాఁ జేయుము. ఓవరుణుఁడా! ఓచంద్రుఁడా! ఇతనిని గృహస్థునిగాఁ జేయుఁడు ఓ అదితీ! నీవు తల్లివలెనే సుఖము నిమ్ము. ఓవిశ్వేదేవతలారా! ఈ పిల్లవాడు. ముసలివాఁడగునంతవఱకు జీవించునట్లు మీ రీ పిల్లవానికి సుఖము నిండు.

మం॥ శతమిన్ను శరదో అంతి దేవా యత్రా నశ్చక్రా జరసం
తనూనాం పుత్రాసో యత్రపితరో భవంతి మా నో మధ్యా
రీరిష తాఽయుర్గంతోః ॥

పదవి॥ శతం । ఇ । ను । శరదః । అంతి । దేవాః । యత్ర । నః । చక్రః । జరసం । తనూనాం । పుత్రాసః । యత్ర । పితరః । భవంతి । మా । నః । మధ్యా । రీరిషత । ఆయుః । గంతోః ॥

టీక॥ దేవాః = ఓదేవతలారా! యూయం = మీరు, యత్ర = ఏశతాయుర్దాయముచే, నః = మాయొక్క, తనూనాం = శరీరములకు, జరసం = ముదిమిని, చక్రః = చేసితిరో, శతమిన్ను = అటువంటి నూఱుఅయిన, శరదః=సంవత్సరములు, అంతి = స్వల్పమైనవి, యత్ర = ఏకాలములో, పుత్రాసః = తనయులుగలవారమై, పితరః = వారికిఁదండ్రులము, భవంతి = అవుచున్నామో, (ఆ) గంతోః = కాల మృత్యువు సంభవించునంత వఱకును, నః = అట్టిమాయొక్క, ఆయుః = ఆయుస్సును, మధ్యా = నడిమి కాలములో, మారీరిషత = భంగము చేయకుందురుగాక.

తా॥ ఓ దేవతలారా! మీరు నూఱు సంవత్సరము లాయుర్దాయము నొసగి మమ్ముల ముదిమి కలుగునంతవఱకు జీవించువారినిగాఁ జేసినను ఆకాలము స్వల్పము. అదిగాక దారాపుత్రాదిపోషణముచే మా యాయుర్దాయమును వ్యర్థముగా వెళ్ళఁ

బుచ్చుచున్నాను గాన నకాల మృత్యువు సంభవించునంతవఱకు మధ్యకాలములో మా యాయువునకు భంగము కలుగనీయకుండు.

మూ॥ అగ్నిష్ట ఆయుః ప్రతరాం దధా త్వగ్నిష్టే పుష్టిం ప్రతరాం కృణోతు ఇంద్రో మరుద్భిర్ ॥ ఋతుధా కృణో త్వాదిత్యై స్తై వసుభి రాదధాతు॥

పదవి॥ అగ్నిః । తే । ఆయుః ప్రతరాం । దధాతు । అగ్నిః । తే । పుష్టిం ప్రతరాం । కృణోతు । ఇంద్రః । మరుద్భిః ఋతుధా । కృణోతు । ఆదిత్యైః । తే । వసుభిః । ఆ । దధాతు ॥

టీక॥ అగ్నిః = అగ్నిహోత్రుడు, తే = నీయొక్క, ఆయుః = ఆయుస్సును, ప్రతరాం = విశేషమైనదానిగా, దధాతు = చేయుఁగాక, అగ్నిః = అగ్నిహోత్రుఁడు, తే = నీయొక్క, పుష్టిం = పోషణమును, ప్రతరాం = వృద్ధిగలదానిఁగా, కృణోతు = చేయుఁగాక, ఇంద్రః = దేవేంద్రుఁడు, మరుద్భిః = దేవతలతోఁగూడ, ఋతుధా = ప్రతిఋతువునందునను, పుష్టిం = పోషణము, కృణోతు=చేయుఁగాక, సః = ఆయింద్రుఁడు, ఆదిత్యైః = ద్వాదశాదిత్యులతోడను, వసుభిః = అష్టవసువులతోడను, తే = నీయొక్క, పుష్టిం = పోషణమును, ఆదధాతు = ఎప్పుడును జేయుచుండఁ గాక॥

తా॥ అగ్నిహోత్రుఁడు నీ యాయుర్దాయమును బుష్టిని వృద్ధి యగునట్లు చేయుఁగాక. ఇంద్రుఁడు దేవతలతోడను ద్వాదశాదిత్యులతోడను అష్టవసువులతోడను గూడినవాఁడై ప్రతిఋతువునందునను ప్రతిక్షణమందునను నీ పోషణమును జేయుఁగాక॥

మూ॥ మేధాం మహ్య మంగిరసో మేధాగ్ం సప్తఋషయో దదుః మేధాం మహ్యం ప్రజాపతి ర్మేధా మగ్ని ర్దదాతు మే॥

పదవి॥ మేధాం । మహ్యం । అంగిరసః । మేధాం । సప్త । ఋషయః । దదుః, మేధాం । మహ్యం । ప్రజాపతిః । మేధాం। అగ్నిః । దదాతు । మే ॥

టీక॥ అంగిరసః = అంగీరసులు, మహ్యం = నాకొఱకు, మేధాం = జ్ఞాపకశక్తిగలబుద్ధిని, దదుః = ఇత్తురుగాక, సప్త = ఏడుగురైన, ఋషయః = కశ్యపుఁడు

కుండలగుమునీశ్వరులు, మేధాం = ధారణాశక్తిగలబుద్ధిని, దదుః = ఇత్తురుగాక, ప్రజాపతిః = బ్రహ్మ, మహ్యం = నాకొఱకు, మేధాం=మేధను, దదాతు = ఇచ్చుగాక, అగ్నిః= అగ్నిహోత్రుడు, మే = నాకొఱకు, మేధాం = మేధను దదాతు=ఇచ్చుగాక.

తా॥ అంగిరస్సులు సప్తర్షులు బ్రహ్మయు అగ్నిహోత్రుడును ధారణాశక్తి గలబుద్ధిని అనగా చెప్పినవిషయమును జ్ఞాపక ముంచుకొనగలిగినబుద్ధిని నాకు గలుగఁ జేయుదురు గాక॥

మూ॥ అప్సరాసు చ యా మేధా గంధర్వేషు చ య ద్యశః దైవీ యా మానుషీ మేధా సా మా మావిశతా దిహ ॥

పదవి॥ అప్సరాసు । చ । యా । మేధా । గంధర్వేషు । చ । యత్ । యశః । దైవీ । యా । మానుషీ । మేధా । సా । మాం । ఆ । విశతాత్ । ఇహ ॥

టీక॥ అప్సరాసుచ = అప్సరసలయందు, యా = ఏ, మేధా = బుద్ధికలదో, సా = ఆబుద్ధియును, గంధర్వేషుచ = గంధర్వులయందు, యత్ = ఏ, యశః = కీర్తికలదో, తత్ = ఆ కీర్తియును, మాం = నన్ను, ఆవిశతాత్ = పొందునుగాక, ఉత = ఇంతియే కాదు, దైవీ = దేవతలసంబంధమైనదియు, మానుషీ = మనుష్యసంబంధమైనదియు, యా = ఏ, మేధా=బుద్ధి, అస్తి = కలదో, సా = ఆ బుద్ధి, మాం = నన్ను, ఇహ = ఇప్పుడే, ఆవిశతాత్ = పొందునుగాక॥

తా॥ గంధర్వులయం దుండునట్టికీర్తియు అప్సరసలయం దుండునట్టి బుద్ధియు నాకు గలుగుఁగాక. ఇంత యే కాదు. దేవతలసంబంధమైనది గాని మనుష్యసంబంధమైనదిగాని బుద్ధి యంతయు నాకుఁ గలుగుఁగాక॥

మూ॥ ఇమం మే వరుణ శ్రుధీ హవ మద్యా చ మృడయ త్వా మవస్యు రాచ కే॥

పదవి॥ ఇమం । మే । వరుణ । శ్రుధీ । హవం । అద్య । చ । మృడయ । త్వాం । అవస్యుః । ఆచకే ॥

టీక॥ హేవరుణ = ఓవరుణుఁడా ! మే = నాయొక్క, ఇమం = ఈ, హవం = అపేక్షను, శ్రుధీ=వినుము, అద్యాచ = ఇప్పుడే, మాం=నన్ను, మృడయ=

సుఖపెట్టుము, అహం = నేను, త్వాం = నిన్ను, అవస్యుః = రక్షించువానిగాఁ గోరినవాఁడనై, ఆచకే = స్తోత్రముఁజేయుచున్నాను॥

తా॥ ఓవరుణుఁడా ! నిన్ను రక్షకునిగాఁ గోరి స్తోత్రము చేయుచున్నాను. గాన నా పిలుపును విని వచ్చి ఇప్పుడే నన్ను సుఖపెట్టుము.

మూ॥ తత్త్వా యామి బ్రహ్మణా వందమానస్త దాశాస్తే యజమానో హవిర్భిః । అహేడమానో వరుణేహబోధ్యురుశగ్ంస మా న ఆయుః ప్రమోషీః॥

పదవి॥ తత్ । త్వా । యామి । బ్రహ్మణా । వందమానః । తత్ । ఆశాస్తే । యజమానః । హవిర్భిః । అహేడమానః । వరుణ । ఇహ । బోధి । ఉరుశంస । మా । నః । ఆయుః । ప్రమోషీః ॥

టీక॥ ఉరుశంస = అనేకులచేస్తోత్రముజేయఁబడు, హేవరుణ = ఓవరుణుఁడా ! నః = మాయొక్క, ఆయుః = ఆయుర్దాయమును, మాప్రమోషీః = భంగపఱుపకుము, అహేడమానః = కోపములేనివాఁడవై, ఇహ = ఈ కర్మమునందు నాచేజెప్పఁబడుదానిని, బోధి = తెలిసికొనుము, తత్ = అనంతరమందు, త్వా = నిన్ను, యామి = పొందుచున్నాను, యజమానః= ప్రతియజమానుఁడు, బ్రహ్మణా= వేదముచే, వందమానః = స్తోత్రము చేయుచున్నవాఁడై, హవిర్భిః = ఆజ్యాదిహవిస్సులచేత తృప్తిపొందించుచున్నవాఁడై, తదేవ = నేనుకోరెడుదానినే, ఆశాస్తే = కోరుచున్నాఁడు.

తా॥ ఓవరుణుఁడా ! నా యాయుర్దాయమునకు భంగముఁకలిగింపకుము. నీవు కోపములేనివాఁడవై, నాప్రార్థనను వినుము. నేను గోరెడుదానిని అనంతరము యాచించెదను. ప్రతియజమానుఁడును నిన్ను ఆజ్యాదిహవిస్సులచేఁ దృప్తినొందించియు వేదములచే ప్రార్థించియు నేను గోరెడుదానినే కోరుచున్నాఁడు.

మూ॥ త్వం నో అగ్నే వరుణస్య విద్వాన్దేవస్య హేడో௨ వయాసిసీష్ఠాః యజిష్ఠో వహ్నితమ శ్శోశుచానో విశ్వా ద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్యస్మత్॥

పదవి॥ త్వం । నః । అగ్నే । వరుణస్య । విద్వాన్ । దేవస్య । హేడః । అవ । యాసిసీష్ఠాః । యజిష్ఠః । వహ్నితమః । శోశుచానః । విశ్వాద్వేషాంసి । ప్రముముగ్ధి । అస్మత్ ॥

టీక॥ హే అగ్నే = ఓఅగ్నిహోత్రుఁడా! విద్వాన్ = సమస్తమును దెలిసిన, త్వం = నీవు, దేవస్య = దేవుండగు, వరుణస్య = వరుణునికి, నః = మాయందు, హేడః = ఏ క్రోధము కలదో, తం = ఆక్రోధమును, అవయాసిసీష్ఠాః = విడిచి పెట్టునట్లు చేయుము, యజిష్ఠః = పూజింపఁబడినటువంటి, వహ్నితమః = అగ్నిహోత్రుఁడు శోశుచానః = ప్రకాశించుచున్నవాఁడై, విశ్వాద్వేషాంసి = శత్రువులకు మాయందుండు సమస్తమైనద్వేషములను, అస్మత్ = మా వల్లనుండి, ప్రముముగ్ధి = విడిచిపెట్టునట్లు చేయుఁగాక॥

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా! నీవు సమస్తమును దెలిసినవాఁడవు గాన వరుణునకు మాయందుండుకోపమును విడిచిపెట్టునట్లు చేయుము. అగ్నిహోత్రుఁడు మాచేఁ బూజింపఁబడి ప్రకాశించుచు శత్రువులకు ఇంతకు బూర్వము మాయందుండు సమస్తవైరములను వారు విడిచిపెట్టునట్లు చేయుఁగాక॥

మూ॥ స త్వం నో అగ్నేఽవమో భవోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ । అవయక్ష్వ నో వరుణగ్ం రరాణో వీహి మృడీకగ్ం సుహవో న ఏధి॥

పదవి॥ సః । త్వం । నః । అగ్నే । అవమః । భవ । ఊతీ । నేదిష్ఠః । అస్య । ఉషసః । వ్యుష్టౌ । అవ । యక్ష్వ । నః । వరుణం । రరాణః । వీహి । మృడీకం । సుహవః । నః । ఏధి॥

టీక॥ హే అగ్నే = ఓఅగ్నిహోత్రుఁడా! సః = ప్రసిద్ధుఁడవును, అవమః = దేవతలలో ప్రధానుఁడవును అగు, త్వం = నీవు, ఊతీ = రక్షించుటచే, నః = మా యొక్క, నేదిష్ఠః = సమీపమందుండువాఁడవు, భవ = అగుము, కదా = ఎప్పుడు, అస్య = ఈ, ఉషసః = ప్రాతఃకాలముయొక్క, వ్యుష్టౌ = ప్రారంభముగలుగుచుండఁగా, అనఁగా ఎప్పుడును అనుట, వరుణం = వరుణుని, అవయక్ష్వ = క్రోధములేనివానిఁగా ప్రార్థింపుము, త్వం = నీవు, నః = మాకొఱకు, రరాణః = సుఖములనిచ్చుచు, మృడీకం = మాచేనియ్యఁబడిన హవిస్సును, వీహి = భక్షింపుము, సుహవః =

శుభ్రప్రదమైన ఆహ్వానము గలవాఁడవై, నః = మమ్ములను, ఏధి = వృద్ధిపొందింపుము.

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా! దేవతలలో నగ్రగణ్యుఁడవుగాన నీవు మమ్ముల రక్షించుటకొఱకు మా సమీపమం దెప్పుడు నుండుము. వరుణుని మా యందుఁ గోపములేనివానిఁగాఁ జేసి మాకు సుఖముల నిచ్చుచు మే మిచ్చెడు నాజ్యాదిహవిస్సులను భక్షించి మమ్ముల వృద్ధిపొందించు చుండుము.

మం॥ త్వ మగ్నే అయా స్యయాస న్మనసా హితః। అయాసన్ హవ్య మూహిషే౽ యా నో ధేహి భేషజం॥

పదవి॥ త్వం। అగ్నే। అయాసి। అయాసన్। మనసా। హితః। అయాసన్। హవ్యం। ఊహిషే। అయాః। నః। ధేహి। భేషజం॥

టీః॥ హే అగ్నే = ఓ అగ్నిహోత్రుఁడా! త్వం = నీవు, అయాసి = భక్తులకుఁ బొందఁదగినవాఁడవై తివి, అయాసన్ = పొందఁదగినవాఁడవై, మనసా = మనస్సుచేత, హితః = నమస్కరింపఁబడుచున్నావు, అయాసన్ = పొందఁదగినవాఁడవై, హవ్యం = మాచే నియ్యబడు హవిస్సును, ఊహిషే = దేవతలకొఱకు వహించుచున్నావు, అయాః = పొందఁదగిన నీవు, నః = మాకొఱకు, భేషజం = హితరూపమయిన ఔషధమును, ధేహి = కలుగఁజేయుము.

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా! నీవు భక్తులకుఁ బొందదగినవాఁడవై వారిచే మనస్సునందే ధ్యానింపఁబడుచుంటివి. ఇట్లు భక్తులకు బొందఁదగిన నీవు ఇంద్రాది దేవతలకు మే మిచ్చెడు హవిస్సును దీసకొని వెళ్ళి యిచ్చుచు మాకు శుభములను గలుగఁజేయుము.

మం॥ రాష్ట్రభృ ద స్యాచార్యాసందీ మా త్వ ద్యోషం॥

పదవి॥ రాష్ట్రభృత్। అసి। ఆచార్యాసందీ। మా। త్వత్। యోషం॥

టీక॥ ఓ కూర్చా! త్వం=నీవు, రాష్ట్రభృత్=రాజ్యమును భరించుదానవు, అసి=అయితివి, ఆచార్యసందీ=ఆచార్యునకు ఆసనమైతివి, త్వత్=నీకంటె, మాయోషం=వేఱుగానుండను.

తా॥ ఓ కూర్చా! నీవు సమస్తమైన రాజ్యమును భరించుదానవు ఆచార్యులకు ఆసన మయితివి. కాన నేను నీమీద గూర్చుండెదను.

మూ॥ త త్సవితు ర్వరేణ్యం భర్గో దేవ స్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్॥

పదవి॥ తత్ । సవితుః । వరేణియం । భర్గః । దేవస్య । ధీమహి । ధియః। యః । నః । ప్ర । చోదయాత్ ॥

టీక॥ యః=ఏ సూర్యుఁడు, నః=మాయొక్క, ధియః=బుద్ధులను, ప్రచోదయాత్=ప్రేరేపణ చేయునో, తస్య=అటువంటి, దేవస్య=దేవుండగు, సవితుః = సూర్యునియొక్క, తత్=ప్రసిద్ధమైనదియు, వరేణియం=కోరదగినదగు, భర్గః= తేజస్సును, ధీమహి=ధ్యానించుచున్నాము.

తా॥ ఏ సూర్యుఁడు మాబుద్ధివృత్తులను ప్రేరేపణ జేయుచున్నాఁడో అటువంటి సూర్యుని యొక్క సమస్తపాపములను బోగొట్టి తేజస్సును ధ్యానించుచున్నాము.

మూ॥ అవృధ మసౌ సౌమ్య ప్రాణ స్వం మే గోపాయ॥

పదవి॥ అవృధం । అసౌ । సౌమ్య । ప్రాణ । స్వం । మే । గోపాయ॥

టీక॥ అసౌ=ఈ నేను, అవృధం=వృద్ధిగలవాఁడనైతిని, సౌమ్య=శరీరమధ్యమందుండెడి, ప్రాణ=ఓ ప్రాణమా! మే=నాయొక్క, స్వం=గాయత్రి రూపమైన ధనమును, గోపాయ=రక్షింపుము.

తా॥ గాయత్ర్యుపదేశముచే నేను శ్రీమంతుడనైతిని. ఓ ప్రాణమా! నా హృదయమందుండెడు గాయత్రిరూపమైన ధనమును గాపాడుచుండుము.

మూ॥ బ్రహ్మణ ఆణీ స్థః॥

పదవి॥ బ్రహ్మణ । ఆణీ । స్థః॥

టీక॥ బ్రహ్మణః = గాయత్రిరూపమైనమంత్రముయొక్క, ఆణీ = విడెడు స్థానములైన శ్రోత్రములారా! స్థః=ఉండుఁడు.

తా॥ ఓశ్రోత్రములారా! మీరు గాయత్రిరూప మైనమంత్రమును విడెడు స్థానములై యుండుఁడు.

చతుర్థః ఖండస్సమాప్తః

—♦ పంచమఖండ ప్రారంభః ♦—

మం॥ సుశ్రవ స్సుశ్రివసం మా కురు యథా త్వగ్ం సుశ్రివ స్సుశ్రవా అ స్యేవ మహగ్ం సుశ్రవ స్సుశ్రవా భూయాసం యథా త్వగ్ం సుశ్రివో దేవానాం నిధి గోపోఽ స్యేవ మహం బ్రాహ్మణానాం బ్రహ్మణో నిధి గోపో భూయాసం॥

పదవి॥ సుశ్రవః। సుశ్రవసం । మా । కురు । యథా । త్వం । సుశ్రివః । సుశ్రివాః । అసి । ఏవం । అహం । సుశ్రవః । సుశ్రవాః । భూయాసం । యథా । త్వం। సుశ్రివః । దేవానాం । నిధిగోపః । అసి । ఏవం । అహం । బ్రాహ్మణానాం । బ్రహ్మణః । నిధిః । గోపః । భూయాసం.

టీక॥ సుశ్రవః = ఓ పాలాశదండమా ! మా= నన్ను, సుశ్రివసం=చక్కఁగా వినువానిఁగా, కురు = చేయుము, సుశ్రివః = ఓపాలాశదండమా ! యథా = ఏ ప్రకారముగాను, త్వం = నీవు, సుశ్రివాః = చక్కఁగావినుదానవు, అసి = అయితివో, సుశ్రివః = ఓ పాలాశదండమా ! ఏవం = ఈ ప్రకారముగాను, అహం = నేను, సుశ్రవాః=చక్కఁగావినువాఁడనై, భూయాసం=అవుదును, సుశ్రవః=ఓపాలాశదండమా! త్వం=నీవు, యథా=ఏప్రకారముగాను, దేవానాం=దేవతలయొక్క, నిధిగోపః = యజ్ఞమును పాలించుదానవు, అసి = అయితివో, ఏవం = ఈ ప్రకారముగాను, అహం = నేను, బ్రాహ్మణానాం = బ్రాహ్మణులలో, నిధిః = నిధియైన, బ్రహ్మణః = వేదముయొక్క, గోపః = పాలకుఁడను, భూయాసం = అవుదును.

తా॥ ఓ పాలాశదండమా! నీ వే ప్రకారముగాను చక్కఁగా వినుదానవయితివో ఆ తీరుననే నన్నుఁ జక్కఁగా వినువానిఁగాఁ జేయుము. నీ వే ప్రకారముగాను దేవతల సంబంధమైన యజ్ఞములకు సాధనమై పాలించుచుంటివో, నిన్ను = ధరించుటచే, ఆ తీరుననే నేను బ్రాహ్మణులయొక్క శ్రేష్ఠమైన వేదాభ్యాసము చేసి వేదమును నిలుపువాఁడ నయ్యెదను.

మం॥ స్మృతం చ మే ఽ స్మృతం చ మే తన్న ఉభయం వ్రతం॥

పదవి॥ స్మృతం । చ । మే । అస్మృతం । చ । మే । తత్ । మే । ఉభయం । వ్రతం ॥

టీ॥ మే = నాకు, స్మృతంచ = మంచి విషయము నాలోచించుటయు, మే = నాకు, అస్మృతంచ = పనికిరాని కార్య విషయము ఆలోచింపకుండుటయు, తత్ = ఆ, ఉభయం = రెండును, మే = నాకు, వ్రతం = వ్రతములు, అనఁగా ఆచరింపఁదగినవి.

తా॥ సత్కార్యముల విషయమై ఆలోచించుటయు అసత్కార్యముల విషయమై ఆలోచింపకుండుటయు రెండును నేను గ్రహింపఁదగినవి.

మూ॥ నిందా చ మేఽనిందా చ మే త న్మ ఉభయం వ్రతం ॥

పదవి॥ నిందా । చ । మే । అనిందా । చ । మే । తత్ । మే । ఉభయం । వ్రతం ॥

టీక॥ నిందా = అయోగ్యకార్యములనుగుఱించి నిందించుటయు, అనిందా = దేవతాదులగుఱించి నిందించక పోవుటయు, (మిగిలినపదములకు అర్థము పైని మంత్రములోఁ జెప్పఁబడినది గాన 9 వ మంత్రమువలెనుఁ జెప్పఁదడదు).

తా॥ అయోగ్య కార్యములగుఱించి నిందించుటయు దేవతాదులగుఱించి నింద చేయకపోవుటయు రెండును నాకు వ్రతములే.

మూ॥ శ్రద్ధా చ మేఽశ్రద్ధా చ మే త న్మ ఉభయం వ్రతం ॥

పదవి॥ శ్రద్ధా । చ । మే । అశ్రద్ధా । చ । మే । తత్ । మే । ఉభయం । వ్రతం ॥

టీక॥ శ్రద్ధా = చేయఁదగినపనులవిషయమై ఆసక్తియు, అశ్రద్ధా = చేయఁగూడనిపనులవిషయమై ఆసక్తి లేకుండుటయు.

తా॥ మంచిపనులవిషయమై ఆసక్తియు, కూడనిపనులవిషయమై ఆసక్తి లేకుండుటయు రెండును నాకు వ్రతములే.

మూ॥ విద్యా చ మేఽవిద్యా చ మే త న్మ ఉభయం వ్రతం ॥

పదవి॥ విద్యా । చ । మే । అవిద్యా । చ । మే । తత్ । మే । ఉభయం । వ్రతం ॥

టీక॥ విద్యా = జ్ఞానమునుఁ దెలిసికొనుటయు, అవిద్యా = అనృతజడాత్మక మగుదానిని దెలిసికొనక పోవుటయు.

తా॥ సచ్చిదానందాత్మకమగు వస్తువును దెలిసికొనుటయు తదితరమైనదానిని దెలిసికొనకుండుటయు రెండును నాకు వ్రతములై యున్నవి.

మూ॥ శ్రుతం చ మేఽశ్రుతం చ మే తన్మ ఉభయం వ్రతం ॥

పదవి॥ శ్రుతం । చ । మే । అశ్రుతం । చ । మే । తత్ । మే । ఉభయం। వ్రతం ॥

టీక॥ శ్రుతం = వేదశాస్త్రముల వినుటయు, అశ్రుతం = పాషండాగమములను వినకుండుటయు.

తా॥ వేదశాస్త్రములను వినుటయు వేదబాహ్యములైన పాషండాగమములను వినకుండుటయు నివి రెండును నాకు వ్రతములు.

మూ॥ సత్యం చ మేఽనృతం చ మే తన్మ ఉభయం వ్రతం ॥

పదవి॥ సత్యం । చ । మే । అనృతం । చ । మే । తత్ । మే । ఉభయం । వ్రతం ॥

టీక॥ సత్యం = యథార్థమును బలుకుట, అనృతం = అసత్యమును బలుకుట.

తా॥ యథార్థమును బలుకుటయు తనయొక్కగాని యితరులయొక్కగాని ప్రాణములకు భంగము కలిగెడు వేళల నబద్ధమాడుటయు నివి రెండును నాకు వ్రతములు.

మూ॥ తపశ్చ మేఽతపశ్చ మే తన్మ ఉభయం వ్రతం ॥

పదవి॥ తపః । చ । మే । అతపః । చ । మే । తత్ । మే । ఉభయం । వ్రతం ॥

టీక॥ తపః = తపస్సును జేయుట, అతపః = తపస్సును జేయకుండుట ॥

తా॥ తపస్సును జేయుటయు శక్తిలేని సమయంబున తపస్సును జేయకుండుటయు నివి రెండును నాకు వ్రతములు.

మూ॥ వ్రతం చ మేఽవ్రతం చ మే తన్మ ఉభయం వ్రతం ॥

పదవి॥ వ్రతం । చ । మే । అవ్రతం । చ । మే । తత్ । మే । ఉభయం । వ్రతం॥

టీక॥ వ్రతం = అధ్యయనముచేయుట, అవ్రతం=అధ్యయనముచేయకుండుట.

తా॥ అధ్యయనము చేయుటయు, యేదైన నొకయాపత్తు తటస్థించినసమయంబున అధ్యయనము చేయకపోవుటయు నివి రెండును నాకు వ్రతములు.

మూ॥ యద్బ్రాహ్మణానాం బ్రహ్మణి వ్రతం యదగ్నేస్సేంద్రస్య సప్రజాపతికస్య సదేవస్య సదేవరాజస్య సమనుష్యస్య సమనుష్యరాజస్య సపితృకస్య సపితృరాజస్య సగంధర్వాప్సరస్కస్య యన్మ ఆత్మన ఆత్మని వ్రతం తే నాఽహాగ్ం సర్వవ్రతో భూయాసం.

పదవి॥ యత్ । బ్రాహ్మణానాం । బ్రహ్మణి। వ్రతం । యత్ । అగ్నేః । సేంద్రస్య । సప్రజాపతికస్య । సదేవస్య । సదేవరాజస్య । సమనుష్యస్య । సమనుష్యరాజస్య । సపితృకస్య । సపితృరాజస్య । సగంధర్వాప్సరస్కస్య । యత్ । మే। ఆత్మనః । ఆత్మని । వ్రతం । తేన । అహం । సర్వవ్రతః । భూయాసం.

టీక॥ బ్రాహ్మణానాం = బ్రాహ్మణులకు, బ్రహ్మణి = వేదవిషయమై, యత్ = ఏ, వ్రతం = వ్రతముకలదో, సేంద్రస్య = ఇంద్రునితోఁగూడినట్టియు, సప్రజాపతికస్య = బ్రహ్మతోఁగూడినట్టియు, సదేవస్య=దేవతలఁతో గూడినట్టియు సదేవరాజస్య=దేవేంద్రునితోఁగూడినట్టియు, సమనుష్యస్య=మనుష్యులతో గూడినట్టియు, సమనుష్యరాజస్య=మనుష్యులప్రభువుతోఁగూడినట్టియు, సపితృకస్య=పితృదేవతలతోఁగూడినట్టియు, సపితృరాజస్య=యమునితో గూడినట్టియు, సగంధర్వాప్సరస్కస్య, గంధర్వులతో అప్సరసలతోఁగూడినట్టియు, అగ్నేః = అగ్నిహోత్రునియొక్క, యత్=ఏ, వ్రతం=వ్రతముకలదో, మే=నాయొక్క, ఆత్మనః=జీవునకు, ఆత్మని=పరమాత్మవిషయమై, యత్=ఏ, వ్రతం=వ్రతముకలదో, తేన=అవైనిజెప్పఁబడినవ్రతములతో గూడినవాఁడనై, అహం=నేను, సర్వవ్రతః=సమస్త వ్రతములను జేసినవాఁడను భూయాసం=అగుదును.

తా॥ వేదమును గుఱించిన బ్రాహ్మణులయొక్క వ్రతమును శ్రోత్రత్వము స్పృజించుట, దాతృత్వము, దేవతలను రంజింపజేయుట, మంచివాక్యములు పలుకుట, ప్రజలను రక్షించుట, సంతానము కలుగునట్లుచేయుట ఓర్పుగా నుండుట, దేవతలను స్తోత్రముచేయుట, శుశ్రూషయందు నేర్పుగలుగుట మొదలగు గుణములు పొందుటకు ఇంద్రుఁడు మొదలగు సమస్తమైన దేవతలతోఁ సక్రమముగ గూడిన

అగ్నిహోత్రునియొక్క వ్రతమును పరమాత్మవిషయమై నా జీవునియొక్క వ్రతమును జేసినవాఁడనై యన్నివ్రతములను జేసినవాడ నగుదును.

మూ॥ ఉదాయుషా స్వాయు షోదోషధీనాగ్ం రసే నోత్పర్జన్యస్య శుష్మే ణోదస్థా మమృతాగ్ం అను॥

పదవి॥ ఉత్ । ఆయుషా । స్వాయుషా । ఉత్ । ఓషధీనాం । రసేన । ఉత్ । పర్జన్యస్య । శుష్మేణ । ఉత్ ॥ అస్థాం । అమృతాన్ । అను ॥

టీక॥ అహం = నేను, అమృతాన్ = దేవతలను, అను = అనుసరించి ధ్యానించుటకు, స్వాయుషా = స్వకీయమైన నూఱుసంవత్సరముల పరిమితిగల, ఉదాయుషా = ఆయుర్దాయముతోడను, ఉదోషధీనాం = ఓషధులయొక్క, రసేన = బలకరమైనరసముతోడను, పర్జన్యస్య = మేఘునియొక్క, ఉచ్ఛుష్మేణ = బలముతోడను, ఉదస్థాం = లేచుచున్నాను.

తా॥ నూఱుసంవత్సరములు పరిమితిగల నా యాయుర్దాయముతోడను, బలహేతువులగు ఓషధులరసము మేఘునిజలము వీనితోడను గూడినవాఁడనై దేవతలను ధ్యానముచేయుటకు లేచి నిలుచుండెదను.

మూ॥ త చ్చక్షు ర్దేవహితం పురస్తాచ్ఛుక్ర ముచ్చరత్ ॥

పదవి॥ తత్ । చక్షుః । దేవహితం । పురస్తాత్ । శుక్రం । ఉత్ । చరత్॥

టీక॥ చక్షుః = నేత్రములయందు, దేవహితం- దేవ = ఇంద్రునిచే, హితం= ఉంచఁబడినదియు, పురస్తాత్ = తూర్పుదిక్కున, ఉచ్చరత్ = బయలువెళ్ళుచున్నదియు, శుక్రం = శుభ్రమైన, తత్ = ఆ ప్రసిద్ధమైనసూర్యతేజస్సును.

మూ॥ పశ్యేమ శరద శ్శతం ॥

పదవి॥ పశ్యేమ । శరదః । శతం ॥

టీక॥ శతం = నూఱైన, శరదః = సంవత్సరములు, పశ్యేమ = చూచెదము.

తా॥ నేత్రములయందు దేవేంద్రునిచే నుంచఁబడినదియు తూర్పుదిక్కున నుదయించుచున్నదియు పరిశుద్ధమునైన సూర్యతేజస్సును నూఱుసంవత్సరములపర్యంతము చూచుచుందుము.

మూ॥ జీవేమ శరద శ్శతం ॥

పదవి॥ జీవేమ । శరదః । శతం ॥

టీక॥ శతం = నూరైన, శరదః = సంవత్సరములు, జీవేమ=బ్రతుదుకుదుము.

తా॥ సూర్యుని జూచుటచే నూరుసంవత్సరములు జీవింపఁగలము.

మూ॥ నందామ శరద శ్శతం ॥

పదవి॥ నందామ । శరదః । శతం ॥

టీక॥ శతం = నూరు, శరదః = సంవత్సరములు, నందామ = ఆనందింపఁగలము.

తా॥ నూరుసంవత్సరములపర్యంతము ఆనందించుచు నుండఁగలము.

మూ॥ మోదామ శరద శ్శతం ॥

పదవి॥ మోదామ । శరదః । శ్శతం ॥

టీక॥ శతం = నూరైన, శరదః = సంవత్సరములు, మోదామ = బ్రహ్మానందము పొందెదము.

తా॥ నూరుసంవత్సరములపర్యంతము బ్రహ్మానందమును బొందుచుందుము.

మూ॥ భవామ శరద శ్శతం ॥

పదవి॥ భవామ । శరదః । శతం ॥

టీక॥ శతం = నూరైన, శరదః = సంవత్సరములు, భవామ = సంపత్తుగలవారమై యుందుము.

తా॥ నూరుసంవత్సరములపర్యంతము సంపత్తుగలవారమై యుందుము.

మూ॥ శృణవామ శరద శ్శతం ॥

పదవి॥ శ్రుణవామ । శరదః । శతం ॥

టీక॥ శతం =నూరైన, శరదః = సంవత్సరములు, శృణవామ = వేదశాస్త్రములను వినుచుందుము.

తా॥ నూరుసంవత్సరములపర్యంతము వేదశాస్త్రములను వినుచుందుము.

మూ॥ ప్రిబ్రివామ శరద శ్శతం ॥

పదవి॥ ప్రి । బ్రివామ । శరదః । శతం ॥

టీక॥ శతం = నూరైన, శరదః = సంవత్సరములు, ప్రిబ్రివామ= చక్కఁగా మాట్లాడువారము కాఁగలము.

తా॥ నూఱు సంవత్సరముల పర్యంతము చక్కఁగా మాటలాడు చుండఁగలము.

మూ॥ అజీతా స్స్యామ శరద శ్శతం ॥

పదవి॥ అజీతాః । స్యామ । శరదః । శతం ॥

టీక॥ శతం = నూరైన, శరదః = సంవత్సరములు, అజీతాః = హింసింపఁబడనివారమై, స్యామ = అయ్యెదము.

తా॥ నూఱు సంవత్సరముల పర్యంతము హింసలేనివారమై యుండఁగలము.

మూ॥ జ్యోక్చ సూర్యం దృశే ॥

పదవి॥ జ్యోక్ । చ । సూర్యం । దృశే ॥

టీక॥ జ్యోక్ = చాలాకాలము, సూర్యం = సూర్యుని, దృశే = చూచుటకొఱకు, సమర్థాః = సమర్థుల మయ్యెదము.

తా॥ జీవించి యున్నంతకాలము అంధత్వములేక మంచి దృష్టిగలవారమై యుందుము.

మూ॥ యస్మిన్ భూతం చ భవ్యం చ సర్వేలోకా స్సమాహితాః ।
తేన గృహ్ణామి త్వా మహం మహ్యాం గృహ్ణామి త్వాత్వా
మహం ప్రజాపతినాత్వామహ్యాం గృహ్ణామ్యసౌ ॥

పదవి॥ యస్మిన్ । భూతం । చ । భవ్యం । చ । సర్వే । లోకాః । సమాహితాః । తేన । గృహ్ణామి । త్వాం । అహం । మహ్యాం । గృహ్ణామి । త్వాం । అహం । ప్రజాపతినా । త్వా । మహ్యాం । గృహ్ణామి । అసౌ ॥

టీక॥ యస్మిన్ = ఏ బ్రహ్మయందు, భూతంచ = గడచినవియు, భవ్యంచ= జరుగబోవునవియు, వర్తమానం = జరుగుచున్నవియు నగు, సర్వే = సమస్తమైన, లోకాః = లోకములు, సమాశ్రితాః = నిలిచియున్నవో, తేన = ఆ బ్రహ్మయొక్క ఆజ్ఞచే, అహం = నేను, త్వాం = నిన్ను, గృహ్ణామి = గ్రహించుచున్నాను, అహం = నేను, త్వాం = నిన్ను, మహ్యాం = నాకొఱకు, గృహ్ణామి = గ్రహించుచున్నాను, అసౌ = ఓఉపనయనవటో, త్వా = నిన్ను, మహ్యాం = నాకొరకు, ప్రజాపతినా = బ్రహ్మదేవునిచేత, గృహ్ణామి = గ్రహించుచున్నాను.

తా॥ జరిగినదియు జరుగుచున్నదియు జరుగంబోవునదియు నగుప్రపంచమునకు సృష్టికర్త యగుశ్రీబ్రహ్మయందు సమస్తలోకములు నిలిచియున్నవో ఆబ్రహ్మయొక్క అనుమతిచే నిన్ను సౌమనస్సునం దెప్పుడును ధ్యానముచేయుచుండెదను.

ఇతి పంచమఖండ స్సమాప్తః

---

## —♦ అథషష్ఠఖండ ప్రారంభః ♦—

మూ॥ పరి త్వాఽగ్నే పరిమృజా మ్యాయుషా చ ధనేనచ॥ సుప్రజాః ప్రజయా భూయాసగ్ం సువీరో వీరై స్సువర్చా వర్చసా సుపోషః పోషై స్సుగృహో గృహై స్సుపతిః పత్యా సుమేధా మేధయా సుబ్రహ్మ బ్రహ్మచారిభిః॥

పదవి॥ పరి । త్వా । అగ్నే । పరి । మృజామి । ఆయుషా । చ । ధనేన । చ॥ సుప్రజాః । ప్రజయా । భూయాసం । సువీరః । వీరైః । సువర్చాః । వర్చసా । సుపోషః । పోషైః । సుగృహః । గృహైః । సుపతిః । పత్యా । సుమేధాః । మేధయా । సుబ్రహ్మ । బ్రహ్మచారిభిః॥

అ॥ హేఅగ్నే = ఓ అగ్నిహోత్రుఁడా ! అహం = నేను, త్వా = నిన్ను, ఆయుషాచ = ఆయుర్దాయము చేతను, ధనేనచ = ధనముచేతను, పరిమృ

జామి = అంతటనుశోధించుచున్నాను, అహం = నేను, ప్రజయా = సంతానము చేత, సుప్రజాః = మంచిసంతానము గలవాఁడనై, వీరైః = తనయులచేత, సువీరః = మంచిపుత్త్రులుగలవాఁడనై, వర్చసా = కాంతిచేత, సువర్చాః = మంచి కాంతిగలవాడనై, పోషైః = వృద్ధులచేత, సుపోషః = మంచివృద్ధిగలవాఁడనై, గృహైః = గృహములచేత, సుగృహః = మంచిగృహములుగలవాడనై, పత్యా = రక్షించు ఆచార్యునిచేత, సుపతిః = మంచిపరిపాలకుఁడుగలవాఁడనై, మేధయా = జ్ఞాపకశక్తిగలబుద్ధిచేత, సుమేధాః = మంచిబుద్ధిగలవాఁడనై, బ్రహ్మచారిభిః = సహ పాఠకులైన బ్రహ్మచారులతోఁడ, సుబ్రహ్మ = మంచి వేదపఠనముగలవాఁడనై, భూయాసం = అగుదును.

తా॥ ఓఅగ్నిహోత్రుఁడా! ఆయుర్దాయమును ధనమును ప్రార్థించి నీవలన బుచ్చుకొనుటచే నీ భక్తవాత్సల్యమును బరీక్షించినవాఁడనైతిని. నేను మంచిసంతానముగలవాఁడను మంచిపుత్త్రులు గలవాడను మంచి కాంతిగలవాడఁను మంచివృద్ధి గలవాడఁను మంచిగృహములు గలవాఁడను మంచియాచార్యుఁడుగలవాఁడను మంచి జ్ఞాపకశక్తిగల బుద్ధిగలవాఁడను మంచి వేదపాఠము గలవాఁడను నీ యనుగ్రహముచే నయ్యెదను.

మ॥ అగ్నయే సమిధ మాహార్షం బృహతే జాతవేదసే యథా త్వ మగ్నే సమిధా సమిధ్య స ఏవం మా మాయుషా వర్చ సా । సన్యా మేధయా ప్రజయా పశుభి ర్బ్రహ్మవర్చసే నాఽ న్నాద్యేన సమేధయ॥

పదవి॥ అగ్నయే । సమిధం । ఆహార్షం। బృహతే । జాతవేదసే । యథా । త్వం । అగ్నే । సమిధా। సమిధ్యసే । ఏవం । మాం । ఆయుషా । వర్చసా । సన్యా । మేధయా । ప్రజయా । పశుభిః । బ్రహ్మవర్చసేన । అన్నాద్యేన । సం । ఏధయ॥

టీక॥ బృహతే=గొప్పవాఁడును, జాతవేదసే = పుట్టినధనముగలవాఁడునగు అగ్నయే = అగ్నిహోత్రునికొఱకు, సమిధం=సమిత్తును, ఆహార్షం = తెచ్చితిని, అగ్నే=ఓ అగ్నిహోత్రుఁడా! త్వం=నీవు, సమిధా=సమిత్తుచేత, యథా=ఏప్రకారముగాను, సమిధ్యసే=ప్రజ్వరిల్లెదవో, ఏవం=ఈ ప్రకారముగాను, మాం=నన్ను,

ఆయుషా=ఆయుర్దాయముచేతను, వర్చసా=వర్చస్సుచేతను, సన్యా=లాభముచేతను, మేధయా = జ్ఞాపకశక్తిగల బుద్ధిచేతను, ప్రజయా = సంతానముచేతను, పశుభిః = పశువులచేతను, బ్రహ్మవర్చసేన = బ్రహ్మవర్చస్సుచేతను, అన్నాద్యేన = అన్నము దినుటచేతను, సమేధయ=వృద్ధిపొందింపుము.

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా! గొప్పవాఁడవును ప్రజ్ఞగలవాడవునగు నీ కొఱకు సమిధను దెచ్చితిని. ఓ అగ్నిహోత్రుఁడా! ఈ సమిత్తుచే నీవెట్లు ప్రకాశించెదవో ఆ ప్రకారము నన్ను ఆయుస్సుచేతను వర్చస్సుచేతను లాభముచేతను జ్ఞాపకశక్తిగల బుద్ధిచేతను సంతానముచేతను పశువులచేతను బ్రహ్మవర్చను చేతను, అన్నభక్షణచేతను వృద్ధిపొందింపుము.

మూ॥ ఏధో స్యేధిషీమహి॥

పదవి॥ ఏధః । అసి । ఏధిషీమహి॥

టీక॥ ఏధః = అగ్నిప్రకాశించు సాధనము, అసి=అయితివి, ఏధిషీమహి= మేమును ప్రజ్వలింపజేయుచుంటిమి.

తా॥ ఓ ఇంధనమా! అగ్నిప్రజ్వరిల్లుటకు నీవు సాధనమైతివి. మేమును నిన్ను ప్రజ్వలింపజేయువారమైతిమి.

మూ॥ సమి దసి సమిాధిషీ మహి॥

పదవి॥ సమిత్ । అసి । సం । ఇధిషీమహి॥

టీక॥ త్వం = నీవు, సమిత్ = ఇంధనమైతివి, సమిధిషీమహి = నిన్ను ప్రజ్వలింపజేయు కర్తలమైతిమి.

తాత్పర్యము పైనఁజెప్పఁబడియెను.

మూ॥ తేజోఽసి తేజో మయి ధేహి ॥

పదవి॥ తేజః । అసి । తేజః । మయి । ధేహి ॥

టీక॥ తేజః = ప్రజ్వరిల్లుటకు సాధనమైనందున ప్రకాశకరము, అసి = అయితివి, తేజః = తేజస్సును, మయి = నాయందు, ధేహి = ఉంచుము.

తా॥ ఓ ఇంధనమా ! నీవు ప్రజ్వరిల్లుటకు సాధనమైతివి. అటువంటి నీవు తేజస్సు నాకుఁ గలుగఁజేయుము.

మూ॥ అపో అద్యా న్వచారిషగ్ం రసేన సమసృక్ష్మహి । పయస్వా
గ్ం అగ్న ఆగమం తం మా సగ్ం సృజ వర్చసా ॥

పదవి॥ అపః । అద్య । అను । అచారిషం । రసేన । సం । అసృక్ష్మహి । పయస్వాన్ । అగ్నే । ఆగమం । తం । మా । సం । సృజ । వర్చసా ॥

టీక॥ అద్య = ఇప్పుడు, అపః = సమిధలనుంచుట యను కర్మను, అను = క్రమముగా, అచారిషం = చేయుచున్నాను, రసేన = శ్రద్ధతో, సమసృక్ష్మహి = గూడినవాఁడనుగా నయ్యెదను, హే అగ్నే = ఓ అగ్నిహోత్రుఁడా ! అహం = నేను, పయస్వాన్=ఆజ్యాదిహవిస్సు గలవాఁడనై, త్వాం=నిన్నుఁగూర్చి, ఆగమం= వచ్చెదను, తం = అటువంటి, మా = నన్ను, వర్చసా = కాంతితోడ, సంసృజ = కూర్చుము.

తా॥ నేను శ్రద్ధగలవాఁడనై నీవు ప్రజ్వరిల్లుటకు నింధనముల నుంచుచుంటిని. ఆజ్యము మొదలగుహవిస్సు గలవాఁడనై ప్రతిదినంబును నీవద్దకు వచ్చుచుందును. కావున ఓ అగ్నిహోత్రుడా ! ఇట్టి నన్ను గాంతిగలవానిగాఁజేయుము.

మూ॥ స మ్మాఽగ్నే వర్చసా సృజ ప్రజయా చ ధనేన చ ॥

పదవి॥ సం । మా । అగ్నే । వర్చసా । సృజ । ప్రజయా ॥ చ । ధనేన । చ ॥

టీక॥ అగ్నే = ఓ అగ్నిహోత్రుఁడా ! మా = నన్ను, వర్చసా = వర్చస్సుతోడను, ప్రజయా = సంతానముతోడను, ధనేనచ । ధనముతోడను, సంసృజ = కూర్చుము.

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా ! నన్ను వర్చస్సు సంతానము ధనము కలవానిగాఁ జేయుము.

మూ॥ విద్యు న్మే అస్య దేవా ఇంద్రో విద్యా త్సహ ఋషిభిః ॥

పదవిః విద్యుత్ । మే । అస్య । దేవాః । ఇంద్రః । విద్యాత్ । సహ । ఋషిభిః ॥

టీక॥ దేవాః = దేవతలు, అస్య = ఈ, మే = నన్ను, ద్వితీయార్థమందు వష్టీ। విద్యుత్ (విద్యుః) గుర్తెఱుఁగుదురు గాక, ఇంద్రః = ఇంద్రుఁడు, సహర్షిభిః = మునీశ్వరులతోఁగూడ, విద్యాత్ = గుర్తెఱుంగుఁగాక.

తా॥ సమస్తమైనదేవతలును ఇంద్రుఁడును మునీశ్వరులును నేఁ జేయుకర్మలను జూచుచుందురు గాక ॥

మూ॥ అగ్నయే బృహతే నాకాయ ॥

పదవి॥ అగ్నయే । బృహతే । నాకాయ॥

టీక॥ బృహతే=గొప్పవాఁడును, నాకాయ=నాకుడనెడు పేరుగలవాఁడువగు, అగ్నయే=అగ్నిహోత్రునికొఱకు, ఏషా=ఈ, సమిత్=ఇంధనము, దీయతే=ఇయ్యబడుచున్నది.

తా॥ మహాత్ముండును నాకుడనెడు పేరుగలవాఁడునగు యగ్నిహోత్రునికొఱకు ఈ సమిధ ఇయ్యబడుచున్నది.

మూ॥ ద్యావా పృథివీభ్యాం ॥

పదవి॥ ద్యావా। పృథివీ। భ్యాం॥

తా॥ స్వర్గము భూలోకములకొఱకు ఈ సమిధను ఇచ్చుచున్నాను.

మూ॥ ఏషా తే అగ్నే సమత్తయా వర్ధస్వ చాఽప్యాయస్వ చ
త యాఽహం వర్ధమానో భూయాస మాప్యాయమాన శ్చ॥

పదవి॥ ఏషా । తే । అగ్నే । సమిత్ । తయా । వర్ధస్వ । చ । ఆప్యాయస్వ । చ । తయా । అహం । వర్ధమానః । భూయాసం । ఆప్యాయమానః । చ ॥

టీక॥ అగ్నే=ఓ అగ్నిహోత్రుఁడా !, తుభ్యం = నీకొఱకు, ఏషా = ఈ, సమిత్=ఇంధనము, దీయతే=ఇయ్యబడుచున్నది, తయా=ఆ సమిధచే, వర్ధస్వ = వృద్ధిపొందుము, ఆప్యాయస్వ=సంపూర్ణుడవగుము, అహం=నేను, తయా=ఆ సమిధచేత, వర్ధమానః=వృద్ధిపొందినవాడను, ఆప్యాయమానః=సంపూర్ణుడను, భూయాసం=అయ్యెదను.

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా ! ఈ సమిధను నీకిచ్చుచున్నాను. ఆ సమిధచే నీవు వృద్ధిపొంది సంపూర్ణుడవుకమ్ము. నేనును వృద్ధిపొంది సంపూర్ణుఁడనయ్యెదను.

మూ॥ యో మాగ్నే భాగినగ్ం సంత మథా భాగం చికీర్షత్యభాగ మగ్నే। తం కురు మా మగ్నే భాగినం కురు॥

పదవి॥ యః । మా । అగ్నే । భాగినం । సంతం । అథ । అభాగం । చికీర్షతి । అభాగం । అగ్నే । తం । కురు । మాం । అగ్నే । భాగినం । కురు.

టీక॥ అగ్నే = ఓ అగ్నిహోత్రుఁడా!, యః = ఎవఁడు, మా = నేను, భాగినం = భాగముగలవాఁడనై, సంతం = ఉన్నవాఁడనగుచుండఁగా, అథ = అనంతరము, అభాగం = భాగములేనివానిఁగా, చికీర్షతి = చేయనిచ్ఛయించుచున్నాఁడో, అగ్నే = ఓ అగ్నిహోత్రుఁడా, తం = వానిని, అభాగం = భాగములేనివానిఁగా, కురు = చేయుము, అగ్నే = ఓ అగ్నిహోత్రుఁడా! మాం=నన్ను, భాగినం = భాగముగలవానిఁగా, కురు = చేయుము.

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా! నేను భాగముగలవాఁడ నయి యుండఁగా నెవఁడు నన్ను భాగములేనివానిఁగాఁ జేయఁ దలఁచునో వానిని భాగములేనివానిఁగాఁ జేసి నన్ను భాగముగలవానిగాఁ జేయుము.

మూ॥ సమిధ మాధా యాఽగ్నే సర్వవ్రతో భూయాసం॥

పదవి॥ సమిధం । ఆధాయ । అగ్నే । సర్వవ్రతః । భూయాసం ॥

టీక॥ అగ్నే = ఓ అగ్నిహోత్రుఁడా! సమిధం = సమిత్తును, ఆధాయ = ఉంచి, సర్వవ్రతః = సమస్త వ్రతములను జేసినవాఁడను, భూయాసం = అయ్యెదను.

తా॥ ఓ యగ్నిహోత్రుఁడా! ఈ సమిధను నీయందుంచుటచే నేను సమస్తమైన వ్రతములను జేసి పరిపూర్ణమైనవాఁడ నయ్యెదను.

మూ॥ బ్రహ్మచా ర్య స్యపోశానకర్మ కురుమా సుషుప్థాః। భిక్షాచర్యం చరాఁచా ర్యాఽధీనో భవ ॥

పదవి॥ బ్రహ్మచారీ । అసి । అపోశాన । కర్మ । కురు । మా సుషుప్థాః । భిక్షాచర్యం । చర । ఆచార్యాధీనః । భవ ॥

టీక॥ బ్రహ్మచారీ = బ్రహ్మచర్యాశ్రమమును బొందినవాఁడవు, అసి = అయితివి, అపోశాన = నియమితాహారము కలవాఁడ వగుము, కర్మ = అగ్నిహో

త్రాది కర్మములను, కురు = చేయుము, మాసుషుప్థాః = పగలు నిద్రపోకుము, భిక్షాచర్యం = భిక్షము నెత్తుకొనుటను, చర = ఆచరింపుము, ఆచార్యాధీనః = గురువుయొక్క యాజ్ఞయందు, భవ = ఉండుము.

తా॥ ఓ పిల్లవాఁడా! నీవు బ్రహ్మచర్యాశ్రమము గలవాఁడ వయితివి. కావున నియతాహారము గలవాఁడ వగుము. అగ్నిహోత్రాది కర్మములను జేయుము. పగలు నిద్రపోకుము. భిక్ష మెత్తుకొని జీవింపుము. గురువునాజ్ఞలో నుండుము అని యాచార్యుఁ డుపదేశము చేయుచున్నాడు.

మూ॥ యస్య తే ప్రథమవాస్యగ్ం హరామ స్తంత్వా విశ్వే అవంతు దేవాః। తం త్వా భ్రాతరస్సువృధో వర్ధమానమనుజాయం తాం బహవ స్సుజాతం ॥

పదవి॥ యస్య । తే । ప్రథమవాస్యం । హరామః । తం । త్వా । విశ్వే । అవంతు । దేవాః । తం । త్వా । భ్రాతరః । సువృధః । వర్ధమానం । అను । జాయంతాం । బహవః । సుజాతం ॥

టీక॥ యస్య = ఏ, తే = నీయొక్క, ప్రథమవాస్యం = మొదటధరింపఁ బడిన వస్త్రమును, హరామః = తీసికొనుచున్నామో, తం = అటువంటి, త్వాం = నిన్ను, విశ్వేదేవాః = విశ్వేదేవతలు, లేక సమస్తమైన దేవతలును, అవంతు = రక్షింతురుగాక, వర్ధమానం = వృద్ధిపొందువాడవును, సుజాతం = యోగ్యమైన జననము గలవాడను, తం = అటువంటి, త్వాం=నిన్ను, సువృధః=యోగ్యమైన వృద్ధిగల వారును, బహవః = అనేకులైన, భ్రాతరః = నీసహోదరులు, అనుజాయంతాం = నిన్ననుసరించి పుట్టుచుందురుగాక.

తా॥ ఓ పిల్లవాఁడా! నీవు పూర్వము ధరించినవస్త్రమును మేము తీసికొంటిమి. ఇటువంటి నిన్ను విశ్వేదేవతలు రక్షింతురుగాక. మంచివృద్ధియు యోగ్యమైనజననమును నీవు ప్రాప్తించినట్లుగా నీసహోదరులును వృద్ధిగలవారై యనేకులుం బుట్టుదురుగాక ॥

ఇతి షష్ఠఖండస్సమాప్తః.

---

—♦ సప్తమ ఖండః ♦—

మం॥ ఇమగ్గ్ స్తోమ మర్హతే జాతవేదసే రథమివ సంమహేమా మనీషయా । భద్రా హి నః ప్రమతి రస్య సగ్ంస ద్యగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥

పదవి॥ ఇమం । స్తోమం । అర్హతే । జాతవేదసే । రథం । ఇవ । సం । మహేమ । మనీషయా । భద్రా । హి । నః । ప్రమతిః । అస్య । సంసది । అగ్నే । సఖ్యే । మా । రిషామ । వయం । తవ ॥

టీక॥ ఇమం = ఈ, స్తోమం = స్తుతిని, అర్హతే = పూజ్యుఁడవును, జాతవేదసే=పుట్టినజ్ఞానముగలవాఁడవునగు, నీ కొఱకు, మనీషయా=నాబుద్ధిచేత, తక్షః=వడ్లవాఁడు, రథమివ=రథమునువలెనే, సంమహేమ=చేయుచున్నాము, లేక నేర్పుకొనుచున్నాము, హి=ఏ కారణమువలన, భద్రా=శుభప్రదమైన, అస్య=ఈ అగ్నిహోత్రునియొక్క, ప్రమతిః=బుద్ధి, సంసది=సభయందు, నః=మా విషయమై, భూయాత్=అవునో, అగ్నే=ఓ అగ్నిహోత్రుఁడా!, తవ=నీయొక్క, సఖ్యే=స్నేహమందున్న, వయం=మేము, మారిషామ=హింసింపబడకుందుముగాక॥

తా॥ ఓ అగ్నిహోత్రుఁడా! వడ్లవాఁడు రథమును జేయురీతిని పూజ్యుండవును జ్ఞానముగలవాఁడవు నగు నీ సంబంధమైన స్తోత్రమును జేయుచుందుము లేక నేర్చుకొందుము. ఎందువల్ల ననఁగా శుభముల నొసఁగు నీ యంతఃకరణము యజ్ఞాదులను గుఱించిన ప్రీతి సభయందును మాయందు ప్రసరించుచున్నది. కాఁబట్టి నీ స్నేహము కలిగియున్న మాకు నెవరివల్లను హింస కలుగఁబోదు.

మం॥ త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషం । యద్దేవానాం త్ర్యాయుషం । తన్మే అస్తు త్ర్యాయుషం ॥

పదవి॥ త్ర్యాయుషం । జమదగ్నేః । కశ్యపస్య । త్రియాయుషం । యత్ । దేవానాం । త్రియాయుషం । తత్ । మే । అస్తు । త్రియాయుషం॥

టీక॥ జమదగ్నేః = జమదగ్నిమునీశ్వరునకు, యత్ = ఏ, త్ర్యాయుషం = బాల్యయౌవనవార్ధక్యరూపమైన మూడవస్థలుకలవో, కశ్యపస్య = కశ్యపునియొక్క,

యత్ = ఏ, త్రియాయుషం = మూడవస్థలుకలవో, దేవానాం = దేవతలయొక్క, యత్ = ఏ, త్రియాయుషం = మూడవస్థలుకలవో, తత్ = ఆ, త్రియాయుషం = మూడవస్థలును, మే = నాకు, అస్తు = కలుగుగాక॥

తా॥ జమదగ్నికిని కశ్యపునకును దేవతలకును బాల్యయౌవనవార్ధక్యరూపమైన యేమూడవస్థలు కలవో ఆ మూడవస్థలును నాకుఁ గలుగవలయు నని బాలుండు చెప్పు చున్నాఁడు.

మూ॥ శివో నామాఽసి స్వధితి స్తే పితా నమ స్తే అస్తు మా మా హిగ్ంసీః॥

పదవి॥ శివః । నామ । అసి । స్వధితిః । తే । పితా । నమః । తే । అస్తు । మా । మా । హింసీః ॥

టీక॥ త్వం = నీవు, శివోనామ = మంగళప్రదమైనదానవే, అసి = అయితివి, స్వధితిః = వజ్రాయుధము, తే = నీయొక్క, పితా = తండ్రి, తే = నీకొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుఁగాక, మా = నన్ను, మాహింసీః = హింసఁ జేయకుము.

తా॥ ఓక్షురమా ! నీవు వజ్రాయుధమువలన జనియించితివి గాన నీకు నమస్కారము చేసెదను. నీవు మంగళప్రదమైనదానవే గాన నన్ను బాధపెట్టకుము.

మూ॥ ఉష్ణేనవాయవుదకేనేత్యేషః॥

తా॥ 4 వ మంత్రము మొదలుకొని 11 వ మంత్రముపర్యంతము మున్ను చెప్పఁబడినది.

మూ॥ ఇద మహ మము ష్యాఽముష్యాయణస్య పాప్మాన ముపగూహా మ్యుత్తరోఽసౌ ద్విషద్భ్యః॥

పదవి॥ ఇదం । అహం । అముష్య । అముష్యాయణస్య । పాప్మానం । ఉప। గూహామి । ఉత్తరః । అసౌ । ద్విషద్భ్యః ॥

టీక॥ ఇదం = ఈ, అహం = నేను, అముష్య = ఇతనియొక్కయు, అముష్యాయణస్య = ఇతనివలన జన్మించువానియొక్కయు, పాప్మానం = పాపమును,

ఉపగూహామి = ప్రకటనకానిదానిగాఁ జేయుచున్నాను. అసౌ = ఇతఁడు, ద్విషద్భ్యః = శత్రువులకంటె, ఉత్తరః = అధికుఁడగుగాక ॥

తా॥ నే నితనియొక్కయు ఇతనిసంతానముయొక్కయు పాపమునుప్రకటము కానిదానిఁగాఁ జేయుదును. ఇతఁడు శత్రువులకంటె నధికుఁడగుఁగాక.

మూ॥ ఆపో హి ష్ఠామయోభువ ఇతి తిస్రోహిరణ్యవర్ణా శ్శుచయః పావకా ఇతి తిస్రః॥

మూ॥ ఆపో హి ష్ఠా మయోభువ స్తా న ఊర్జే దధాతన । మహే రణాయ చక్షసే॥

పదవి॥ ఆపః । హి । స్థః । మయోభువః । తాః । నః । ఊర్జే । దధాతన। మహే । రణాయ । చక్షసే॥

టీక॥ హేఆపః = ఓయుదకములారా ! యూయం= మీరు, మయోభువః= సుఖమునుకలుగఁజేయువారై, స్థః = ఉంటిరి, తాః = అటువంటిమీరు, నః=మాకు, ఊర్జే = అన్నముకొఱకు, ధత్త = ధరించితిరి, మహే=గొప్పదియై, రణాయ=మనోహరమైన, చక్షసే = దర్శనము (జ్ఞానము) కొఱకు, దధాతన=ధరించితిరి॥

తా॥ ఓ యుదకములారా ! మీరు సుఖమును గలుగఁజేయు వారైతిరి. మా నిమిత్తమైన యన్నమును ధరించి యుంటిరి. మనోహరమైన గొప్ప దృష్టిని గలుగఁజేయుఁడు.

మూ॥ యో వ శ్శివతమో రస స్తస్య భాజయ తేహ నః । ఉశతీ రివ మాతరః ॥

పదవి॥ యః । వః । శివతమః । రసః । తస్య । భాజయత । ఇహ । నః । ఉశతీః । ఇవ । మాతరః ॥

టీక॥ వః = మీ సంబంధమైన, యః = ఏ, శివతమః = మిక్కిలి శుభకరమగు, రసః = రసముకలదో, తస్య = ఆ రసముచేత, (తృతీయార్థమందుషష్ఠి,) నః = మనుష్యులను, ఇహ = ఈలోకమందు, ఉశతీః = ప్రేమ గలిగిన, మాతర ఇవ = తల్లులవలెనే, భాజయత = పోషించుచుందురుగాక ॥

తా॥ లోకములో పిల్లలను తల్లులు ప్రేమ గలవారై యే తీరున బోషింతురో ఆ తీరున సౌఖ్యమును గలుగఁజేయు మీసంబంధమైన రసముచేత మమ్ములను బోషింతురుగాక॥

మూ॥ తస్మా అరం గమామ వో యస్య క్షయాయజిన్వథ । ఆపో జనయథా చ నః॥

పదవి॥ తస్మై । అరం । గమామ । వః । యస్య । క్షయాయ । జిన్వథ । ఆపః । జనయథ । చ । నః॥

టీక॥ తస్మై = ఆరసముకొఱకు, వః = మిమ్ములను, అరం = శీఘ్రముగాను, గమామ = పొందెదము, యస్య = ఏరసముచేత, క్షయాయ = నశింపుగలమానివాసమును, జిన్వథ = సంతోషపెట్టఁగలరో, హేఆపః = ఓయుదకములాలా ! నః = మమ్ములను, పుత్త్రులు పౌత్రులు మొదలగుసంతానము గలవారినిగా, జనయథ=పుట్టించెదరుగాక॥

తా॥ ఏ రసముచే నశించునట్టి మా నివాసమును భంగము లేనిదానిగాఁ జేసెదరో అట్టి రసముకొఱకు మిమ్ములను వేఁడుచున్నాము. ఓ యుదకములారా ! మమ్ములను పుత్త్రులు పౌత్రులు మొదలగు సంతానము గలవారినిగాఁ జేయుఁడు.

మూ॥ హిరణ్యవర్ణా శ్శుచయః పావకా యాసు జాతః కశ్యపో యా స్విన్ద్రః । అగ్నిం యా గర్భం దధిరే విరూపా స్తా న ఆప శ్శగ్గ్ స్యోనా భవన్తు ॥

పదవి॥ హిరణ్యవర్ణాః । శుచయః । పావకాః । యాసు । జాతః । కశ్యపః। యాసు । ఇంద్రః । అగ్నిం । యాః । గర్భం । దధిరే । విరూపాః । తాః । నః । ఆపః । శం । స్యోనాః । భవంతు ॥

టీక॥ యాసు = ఏజలమందు, కశ్యపః = ప్రజాపతి, జాతః = పుట్టెనో, యాసు = ఏజలమందు, ఇంద్రః = మేఘుఁడు, జాతః = పుట్టెనో, యాః = ఏ, ఆపః = ఉదకములు, అగ్నిం = అగ్నిహోత్రుని, గర్భం = ఉదరమందుండు జంతువునుగాను, దధిరే = ధరించినవో, విరూపాః = అనేకరూపములు గలవియు, హిరణ్యవర్ణాః = బంగారు ఛాయగలవియు, శుచయః = పరిశుద్ధమైనవియు, పావకాః = పవిత్రమైనవియు, స్యోనాః = సుఖకరములైన, తాః= అట్టినట్టి, అపః=

ఉదకములు, నః = మాయొక్క, శం = సుఖమునుగురించి అనఁగా సుఖమిచ్చునవి, భవంతు = అగుఁగాక.

తా॥ బ్రహ్మయు మేఘుఁడును ఏ జలమందు జనియించిరో ఏ నీళ్ళలో అగ్నిహోత్రి ముండెనో ఏ నీళ్ళు మంచివర్ణముగలవియు పరిశుద్ధమైనవియు పవిత్రకరమైనవో అట్టి సుఖప్రదమైన నీళ్ళు మాకు సుఖమును గలిగించుఁగాక.

మూ॥ యసాగ్ం రాజా వరుణో యాతి మధ్యే సత్యానృతే అవ పశ్యఞ్ జనానాం మధుశ్చ్యుతశ్శుచయో యాః పావకా స్తా న ఆప శ్శగ్గ్ స్యోనా భవంతు॥

పదవి॥ యాసాం । రాజా । వరుణః । యాతి । మధ్యే । సత్యానృతే। అవ । పశ్యఞ్ । జనానాం । మధుశ్చ్యుతః । శుచయః । యాః । పావకాః । తాః । నః। ఆపః । శం । స్యోనాః । భవంతు ॥

టీక॥ యాసాం = ఏజలములకు, రాజా = ప్రభువగు, వరుణః = వరుణుఁడు, మధ్యే = జలమధ్యమందుండి; జనానాం = మనుష్యులయొక్క, సత్యానృతే=పుణ్యపాపములను, అవపశ్యఞ్ = చూచుచు, యాతి = వెళ్ళుచున్నాఁడో, యాః = ఏ యుదకములు, మధుశ్చ్యుతః = మధురరసమును వర్షించుచున్నవో, యాః = ఏయుదకములు, శుచయః = పరిశుద్ధమైనవో, యాః = ఏయుదకములు, పావకాః=పవిత్రమైనవో, స్యోనాః । సుఖకరములైన, తాః = ఆయుదకములు, నః=మాయొక్క, శం = సుఖమునుగురించి, భవంతు =అగుఁగాక॥

తా॥ జలాధిపతి యగువరుణుడే నీళ్లమధ్యమునునుండి మనుష్యులయొక్క పుణ్యపాపములను చూచుచున్నాఁడో, ఏ నీళ్లు మధురరసము గలవియు బరిశుద్ధమైనవియుఁ బవిత్రకరమైనవో ఆ నీళ్ళు మాకు సుఖమును గలుగఁజేయుఁగాక.

మూ॥ యాసాం దేవా దివి కృణ్వంతి భక్షుం యా అంతరిక్షే బహుధా భవంతి । యాః పృథివీం పయసోందంతి శుక్రా స్తా న ఆప శ్శగ్గ్ స్యోనా భవంతు॥

పదవి॥ యాసాం । దేవాః । దివి । కృణ్వంతి । భక్షుం । యాః । అంతరిక్షే। బహుధా । భవంతి । యాః । పృథివీం । పయసా । ఉందంతి । శుక్రాః । తాః। నః । ఆపః । శం । స్యోనాః । భవంతు॥

టీక॥ దివి = స్వర్గలోకంబున, దేవాః = దేవతలు, యాసాం = ఏయుదకములయొక్క, భక్షం = భక్షణమును, కృణ్వంతి = చేయుచున్నారో, యాః = ఏయుదకములు, అంతరిక్షే = ఆకాశమందు, బహుధా = అనేకవిధములుగా, భవంతి= అగుచున్నవో, యాః = ఏయుదకములు, పయసా = వృష్టిచే, పృథివీం = భూమిని, ఉందంతి = తడుపుచున్నవో, శుక్రాః = శుభ్రమైనవియు, స్యోనాః = సుఖకరములైన, తాః = అట్టివంటి, అపః = ఉదకములు, నః = మాయొక్క, శం = సుఖమును గుఱించి, భవంతు = అగుఁగాక॥

తా॥ స్వర్గలోకంబున దేవతలే జలమును త్రాగుచుందురో, ఏ జలంబులాకాశంబున అనేకవిధములై యున్నవో, ఏ జలంబులు శుభ్రమైనవియు సుఖకరములైనవో, అట్టినీళ్ళు మాకు సుఖమును గలుగఁజేయుఁగాక.

మూ॥ అన్నాద్యాయ వ్యూహధ్వం దీర్ఘాయు రహ మన్నాదో భూయాసం సోమో రాజాఽయ మాగమ త్స మే ముఖం ప్రవే క్ష్యసి భగేన సహ వర్చసా॥

పదవి॥ అన్నాద్యాయ । వ్యూహధ్వం । దీర్ఘాయుః । అహం । అన్నాదః । భూయాసం । సోమః । రాజా । అయం । ఆగమత్ । సః । మే । ముఖం । ప్రవేక్ష్యసి । భగేన । సహ । వర్చసా॥

టీక॥ అన్నాద్యాయ = అన్నమునుదినుటకొఱకు, వ్యూహధ్వం = మలినమును విడిచి వేఱుగా నుండుఁడు, అహం = నేను, దీర్ఘాయుః = దీర్ఘాయుర్దాయముకలవాఁడనై, అన్నాదః = అన్నమును దినువాఁడనై, భూయాసం = అయ్యెదను, రాజా = ప్రభువైన, అయం = ఈ, సోమః = చంద్రుఁడు అధిదేవతగాఁగల దంతకాష్ఠము, ఆగమత్ = వచ్చినది, సః = ఆదంతకాష్ఠము, భగేన = ఐశ్వర్యముతోడను, వర్చసా సహ = కాంతితోడను, మే = నాయొక్క, ముఖం = నోరిను, ప్రవేక్ష్యసి = ప్రవేశింపగలదు॥ ఇక్కడ ప్రథమపురుషయందు మధ్యమపురుష ప్రయోగింపఁబడినది.

తా॥ ఓ దంతములారా ! నే నన్నమును దిందును గాన మీరు మలినమును విడిచి యుందురు గాక. మలినము విడుచుటచే శుభ్రమైన దంతములు గలవాఁడనై దీర్ఘాయుర్దాయము గలవాఁడనై అన్నమును దిందును. చంద్రుఁడు అధిదేవ

తగాఁ గల యీ దంతకాష్ఠము నా నోటిలోఁ బ్రవేశించి వర్చస్సును భాగ్యమును గలుగఁజేయుఁగాక.

మూ॥ సోమస్య తనూ రసి తనువం మే పాహి సా మా తనూ రావిశ ॥

పదవి॥ సోమస్య । తనూః । అసి । తనువం । మే ! పాహి । సా । మా । తనూః । ఆవిశ ॥

టీక॥ హేవాసః = ఓ వస్త్రమా !, త్వం = నీవు, సోమస్య = చంద్రుని యొక్క, తనూః = శరీరము, అసి = అయితివి, త్వం = నీవు, మే = నాయొక్క, తనువం = శరీరమును, పాహి = రక్షింపుము, సా = అటువంటి, తనూః = శరీరము గల నీవు, మాం = నన్ను, ఆవిశ = ప్రవేశింపుము.

తా॥ ఓ వస్త్రమా ! చంద్రునివంటి యాకారముగల నీవు నా శరీరమును గప్పుటచే నన్ను రక్షింపుచుంటివి కాన నా యం దెల్లప్పుడు నుండుము.

మూ॥ నమో గ్రహాయ చ ॥

పదవి॥ నమః । గ్రహాయ । చ ॥

టీక॥ గ్రహాయ = గ్రహమను దేవతకొఱకు, నమః = నమస్కారము.

మూ॥ అభిగ్రహాయ చ॥

పదవి॥ అభిగ్రహాయ । చ

టీక॥ అభిగ్రహమను దేవతకొఱకు, నమః=నమస్కారము

మూ॥ నమ శ్శాకజంజభాభ్యాం నమ స్తాభ్యో దేవతాభ్యో యా అభిగ్రాహిణీః॥

పదవి॥ నమః । శాకజంజభాభ్యాం । నమః । తాభ్యః । దేవతాభ్యఃయాః । అభిగ్రాహిణీః ॥

టీక॥ శాకజంజభాభ్యాం=శాకము జంజభము అను దేవతలకొఱకు, నమః = నమస్కారము, యాః=ఎవరు, అభిగ్రాహిణీః=అభిగ్రాహిణులను దేవతులుకలరో, తాభ్యః=ఆ, దేవతాభ్యః=దేవతలకొఱకు, నమః=నమస్కారము

తా॥ గ్రహము, అభిగ్రహము, శాకము, జంజభము, అభిగ్రాహిణు లను అలంకారాధిదేవతలకు నమస్కారము చేసెదను.

మూ॥ అప్సరస్సు యో గన్ధో గన్ధర్వేషు చ య ద్యశః। దైవో
యో మానుషో గన్ధ స్స మా గన్ధ స్సురభి ర్జుషతాం॥

పదవి॥ అప్సరస్సు । యః । గన్ధః । గన్ధర్వేషు । చ । యత్ । యశః । దైవః । యః । మానుషః । గన్ధః । సః । మా । గన్ధః । సురభిః । జుషతాం

టీక॥ అప్సరస్సు=అప్సరస్త్రీలయందు, యః=ఏ, గన్ధః=గంధముగలదో, గన్ధర్వేషు చ=గంధర్వులయందు, యత్=ఏ, యశః=కీర్తిగలదో, దైవః=దేవతల సంబంధమైనదియు, మానుషః=మనుష్యులకు సంబంధమైనదియునగు, యః=ఏ గంధము కలదో, సురభిః=నాసికారంధ్రమున కింపైన, సః=ఆ సమస్తమైన, గన్ధః=గంధము, మా=నన్ను, జుషతాం=పొందుగాక.

తా॥ అప్సరస్త్రీలయందును గంధర్వులయందును ఏ గంధము కలదో అదియును మఱియు దేవతలయందుగాని మనుష్యులయందుగాని యే గంధముకలదో ఘ్రాణేంద్రియమున కింపైన ఆ సమస్తమైనసుగంధము న న్నాశ్రయించుగాక.

మూ॥ ఇయ మోషధే త్రాయమాణా సహమానా సహస్వతీ।
సా మా హిరణ్యవర్చసం బ్రహ్మవర్చసినం మా కరోతు॥

పదవి॥ ఇయం । ఓషధే । త్రాయమాణా । సహమానా । సహస్వతీ । సా । మా । హిరణ్యవర్చసం బ్రహ్మవర్చసినం । మా । కరోతు॥

టీక॥ ఇయం = ఈభూమి, ఓషధే = ఓషధులను, త్రాయమాణా = రక్షించునదియు, సహమానా = సమర్థమైనదియు, సహస్వతీ=బలముగలదియునగుయ్యెను, సా = అటువంటిభూమి, మా = నన్ను, హిరణ్యవర్చసం = బంగారువంటి కాంతిగల వానిగాను, బ్రహ్మవర్చసినం బ్రహ్మవర్చస్సుగలవానిగాను, కరోతు= చేయుఁగాక॥

తా॥ ఈ భూమి ఓషధులకు నాధారమయినదిగాను సమస్త కార్యములయందు సమర్థ మైనదిగాను బలముగలదిగా నున్నది. అటువంటిభూమి నన్ను బంగారు వలె ప్రకాశించువానిఁగాను బ్రహ్మవర్చస్సుగలవానిగాను జేయుఁగాక.

మూ॥ అపాశో స్యురో మే మాసగ్ంశారీ శ్శివో మోపతిష్ఠస్వ దీర్ఘాయుత్వాయ శతశారదాయ । శతగ్ం శరద్భ్య ఆయుషే వర్చసే జీవాత్వై పుణ్యాయ॥

పదవి॥ అపాశః । అసి । ఉరః । మే ॥ మా । సం । శారీః । శివః । మా । ఉప । తిష్ఠస్వ । దీర్ఘాయుత్వాయ । శతశారదాయ । శతం।శరద్భ్యః। ఆయుషే । వర్చసే । జీవాత్వై । పుణ్యాయ॥

టీక॥ అపాశః = పాశముకానిదానవు, అసి = అయితివి, మే = నాయొక్క, ఉరః = వక్షస్థలమును, మాసంశారీః = బాధపెట్టకుము, శతశారదాయ = నూఱు సంవత్సరముల పరిమితిగల, దీర్ఘాయుత్వాయ = దీర్ఘాయుర్దాయమును బొందుటకొఱకు, శివః = మంగళప్రదమైననీవు, మా=నన్ను, ఉపతిష్ఠస్వ = పొందుము, శతంశరద్భ్యః= నూఱుసంవత్సరములు పరిమితిగల, ఆయుషే = ఆయుస్సుకొఱకును, వర్చసే = వర్చస్సుకొఱకును, జీవాత్వై = జీవించుటకొఱకును, పుణ్యాయ = పుణ్యముకొఱకును, మా = నన్ను, ఉపతిష్ఠస్వ = పొందుము.

తా॥ ఓ పుష్పమాలికా ! నీవు బంధించునట్టి త్రాడువంటిదానవు గావు. కాన నా కంఠమందుంచఁబడి వ్రేలాడుచు నా వక్షస్థలమును బాధపెట్టకుము. నీవు శుభములు కలిగించుదానవు కాన దీర్ఘాయుర్దాయము కలుగుటకును వర్చస్సును సుఖముగా జీవించుటను పుణ్యము గలుగుటకును నన్నెప్పుడును బొంది యుండుము.

మూ॥ రేవతీ స్త్వా వ్యక్ష్ణ న్నిత్యైతాః॥

౨౭ వ మంత్రము మొదలుకొని 30 వ మంత్రమువఱకుఁ బూర్వము చెప్పబడినది.

ఇతి సప్తమఖండస్సమాప్తః

---

—♦ అథాష్టమఖండ ప్రారంభః ♦—

మూ॥ ఆయుష్యం వర్చస్యగ్ం సువీర్యగ్ం రాయస్పోష మాద్భిద్యం ఇదగ్ం హిరణ్యం జైత్ర్యాయా ఽవిశతాం మాం॥

పదవి॥ ఆయుష్యం । వర్చస్యం । సువీర్యం । రాయస్పోషం । ఔద్భిద్యం। ఇదం । హిరణ్యం । జైత్ర్యాయ । ఆ విశతాం । మాం ॥

టీక॥ ఆయుష్యం = ఆయుర్వృద్ధిని జేయునదియు, వర్చస్యం = కాంతిని గలుగఁజేయునదియు, సువీర్యం = మంచి పరాక్రమమును గలుగఁజేయునదియు, రాయస్పోషం = ధనమును వృద్ధినొందించు నదియు, ఔద్భిద్యం = కీర్తి నిచ్చు నదియు నగు, ఇదం = ఈ, హిరణ్యం = బంగారము, జైత్ర్యాయ = జయము కొఱకు, మాం = నన్ను, ఆవిశతాం = ప్రవేశించుఁగాక.

తా॥ ఆయుర్వృద్ధిని, కాంతిని, మంచి పరాక్రమమును, ధనాభివృద్ధిని, గీర్తిని గలుగఁజేయు బంగారము జయముకొఱకు నన్నుఁ బొందుఁగాక.

మూ॥ ఉచ్చై ర్వాది పృతనాజి సత్రా సాహం ధనం జయం సర్వా
స్సమృద్ధిః బుద్ధయో హిరణ్యే స్మిం త్సమాహితాః ॥

పదవి॥ ఉచ్చైః । వాది । పృతనాజి । సత్రా । సాహం । ధనం । జయం । సర్వాః । సమృద్ధిః । బుద్ధయః । హిరణ్యే । అస్మిన్ । సమాహితాః ॥

టీక॥ ఉచ్చైర్వాది = బిగ్గఱగా మాటలాడుటయు, పృతనాజి = సేనలతోఁ బ్రకాశించుటయు, సత్రాసాహం = సత్యము కలిగియుండుటయు, ధనంజయం = శత్రుసంబంధమైన ధనమును జయించుటయు, నాకుఁ గలుగుఁగాక, సమృద్ధిః = సంపూర్ణములైన, సర్వాః = సమస్తమైన, బుద్ధయః = సంపత్తులు, అస్మిన్ = ఈ, హిరణ్యే = బంగారమునందు, సమాహితాః = లెస్సగా నుండియున్నవి.

తా॥ ప్రౌఢముగా మాటలాడుటయు సేనలతోఁ బ్రకాశించుటయు సత్యము గలిగియుండుటయు శత్రుసంబంధమైన ధనమును జయించుటయు నాకుఁ గలుగుఁగాక. ఇది యది యని చెప్పనేల సమస్తమైన సంపత్తులును బంగార మెచ్చట నుండునో యచ్చటనే యుండఁగలవు.

మూ॥ శున మహగ్ం హిరణ్యస్య పితు రివ నామాఽగ్రభైషం ।
తం మా హిరణ్యవర్చసం పూరుషు ప్రియం కురు ॥

పదవి॥ శునం । అహం । హిరణ్యస్య । పితుః । ఇవ । నామ । అగ్రభైషం । తం । మా । హిరణ్యవర్చసం । పూరుషు । ప్రియం । కురు ॥

టీక॥ అహం = నేను, పితుః = తండ్రియొక్క, నామేవ = పేరునువలెనే, హిరణ్యస్య = బంగారముయొక్క, శునం = సుఖమును, అగ్రభైషం = గ్రహించియుంటిని, తం = అటువంటి, మా = నన్ను, హిరణ్యవర్చసం = బంగారువంటి కాంతిగలవానిగాను, పూరుషు = అనేకులకు, ప్రియం = ఇష్టమైనవానిఁగాను, కురు = చేయుము॥

తా॥ నేను నాతండ్రియొక్క పేరినివలెనే బంగారువలనఁ గలిగెడుసుఖమును గుర్తెఱుఁగుదును కాన నన్ను బంగారువలెఁ బ్రకాశించువానిగాను అందరికి నిష్టమైన వానిగాను జేయుము.

ము॥ ప్రియం మా దేవేషు కురు ప్రియం మా బ్రహ్మణే కురు।
ప్రియం విశ్వేషు శూద్రేషు ప్రియగ్ం రాజసు మా కురు॥

పదవి॥ ప్రియం। మా దేవేషు। కురు। ప్రియం। మా। బ్రహ్మణే। కురు। ప్రియం। విశ్వేషు। శూద్రేషు। ప్రియం। రాజసు। మా। కురు॥

టీక॥ మాం = నన్ను, దేవేషు = దేవతలకు, ప్రియం = ఇష్టమైనవానిఁగా, కురు = చేయుము, మా = నన్ను, బ్రాహ్మణే = బ్రాహ్మణులకు, ప్రియం = ఇష్టమైన వానిఁగా, కురు = చేయుము, మా = నన్ను, విశ్వేషు = కోమట్లకు, ప్రియం = ఇష్టమైనవానిఁగా, కురు = చేయుము, మా = నన్ను, శూద్రేషు = శూద్రులకు, ప్రియం = ఇష్టమైనవానిఁగా, కురు = చేయుము, మా = నన్ను, రాజసు = రాజులకు, ప్రియం = ఇష్టమైన వానిఁగా, కురు = చేయుము.

తా॥ ఓ బంగారమా! నన్ను దేవతలకును బ్రాహ్మణులకును క్షత్రియుల కును వైశ్యులకును శూద్రులకును ఇష్టమైనవానిఁగాఁ జేయుము.

ము॥ యాతిరశ్చీ నిపద్య సేఽహం విధరణీ ఇతి। తాం త్వా ఘృ
తస్య ధారయా యజే సగ్ంరాధనీ మహాం॥

పదవి॥ యా। తిరశ్చీ। నిపద్యసే। అహం। విధరణీ। ఇతి। తాం। త్వా। ఘృతస్య। ధారయా। యజే। సంరాధనీం। అహం॥

టీక॥ అహం = నేను, విధరణీఇతి = హోమవిఘ్నకారులను నివారించుచున్నానని, యా = ఏ నీవు, తిరశ్చీ = అడ్డముగా, నిపద్యసే = శయనించుచున్నా

పో, తాం = అటువంటి, త్వాం = నిన్ను, అహం = నేను, ఘృతస్య = ఆజ్యము యొక్క, ధారయా = ధారచేత, యజే = పూజించుచున్నాను.

తా॥ ఓ వాక్కా! హోమమును విఘ్నముచేయునట్టివారలను లోపలను ప్రవేశింపనీయక అడ్డముగా నుండియుండిన నిన్ను ఆజ్యధారచే బూజించు చున్నాను.

మూ॥ సగ్ంరాధస్యై దేవ్యై॥

పదవి॥ సంరాధస్యై । దేవ్యై॥

టీక॥ దేవ్యై = దేవతయగు, సంరాధస్యై= వాక్కునకొఱకు ఆజ్యము నిచ్చు చున్నాను.

తా॥ వాగ్దేవికొఱకు ఆజ్యము నిచ్చుచున్నాను.

మూ॥ ప్రసాధస్యై దేవ్యై॥

పదవి॥ ప్రసాధస్యై । దేవ్యై॥

టీక॥ దేవ్యై = దేవతయగు, ప్రసాధస్యై = అలంకారాధిదేవతకొఱకు ఆజ్యము నిచ్చుచున్నాను.

తా॥ అలంకారాధిదేవతకొఱకు ఆజ్యము నిచ్చుచున్నాను.

మూ॥ సంమార్జం చ విరాజం చాఽభిశ్రీర్యా చ నోగృహే । లక్ష్మీ రాష్ట్రస్య యా ముఖే తయా మా సగ్ం సృజామసి ॥

పదవి॥ సంమ్రాజం । చ । విరాజం । చ । అభి । శ్రీః । యా । చ । నః । గృహే । లక్ష్మీః । రాష్ట్రస్య । యా । ముఖే । తయా । మా । సం । సృజామసి ॥

టీక॥ నః = మాయొక్క, గృహే = గృహమందు, యాచ = ఏ, అభిశ్రీః= లక్ష్మికలదో, రాష్ట్రస్య = రాజ్యముయొక్క, ముఖే = ముఖమందు, యా = ఏ, లక్ష్మీః = లక్ష్మికలదో, తయా = ఆలక్ష్మిచేతను, మా = నన్ను, సంమార్జంచ = మిక్కిలి ప్రకాశించువానింగాను, విరాజంచ = అనేకవిధములగాఁ బ్రకాశించు వానింగాను, సంసృజామసి = సృజింపఁజేయుము ॥

తా॥ నే నుండుగృహంబునను నే నుండు దేశంబునను సంపత్తును గలుగఁజేసి యనేకవిధములుగా మిక్కిలి ప్రకాశించువానిగా నన్నుఁ జేయుము.

మూ॥ శుభికే శిర ఆరోహ శోభయంతీ ముఖం మమ । ముఖగ్ం
హి మమ శోభయ భూయాగ్ంసం చ భగం కురు ॥

పదవి॥ శుభికే । శిరః । ఆరోహ । శోభయంతీ । ముఖం । మమ । ముఖం । హి । మమ । శోభయ । భూయాంసం । చ । భగం । కురు ॥

టీక॥ శుభికే = ఓ మాలికా ! మమ = నాయొక్క, ముఖం = ముఖమును, శోభయంతీ = ప్రకాశింపజేయుచున్నదానవై, శిరః = తలను, ఆరోహ = అధిష్ఠించుము, మమ = నాయొక్క, ముఖంహి = ముఖమును, శోభయ = ప్రకాశింపజేయుము, భూయాంసం = అధికమైన, భగంచ = ఐశ్వర్యమును, కురు= చేయుము.

తా॥ మంగళప్రదమైన ఓ మాలికా ! నీవు నా శిరస్సునందుండి నా ముఖమును ప్రకాశింపఁచేయుచు విశేషమైన భాగ్యమును గలుగఁజేయుము.

మూ॥ యా మాహర జ్జమదగ్ని శ్శ్రద్ధాయై కామా యాఽన్యై । 
ఇమాం తా మపి నహ్యేఽహాం భగేన సహ వర్చస ॥

పదవి॥ యాం । ఆహరత్ । జమదగ్నిః । శ్రద్ధాయై । కామాయాన్యై । ఇమాం । తాం । అపి । నహ్యే । అహం । భగేన । సహ । వర్చసా॥

టీక॥ జమదగ్నిః = జమదగ్ని యను మునీశ్వరుఁడు, కామాయాన్యై = కోరుచున్న, శ్రద్ధాయై = శ్రద్ధయను దేవతకొఱకు, యాం = ఏ మాలికను, ఆహరత్ = తీసికొనివచ్చియిచ్చెనో, తాం = అటువంటి, ఇమాం = ఈమాలికను, అహం = నేను, భగేన = ఐశ్వర్యముతోడను, సహవర్చసా = వర్చస్సుతోడను, నహ్యే = శిరస్సునందు చుట్టుకొనుచున్నాను.

తా॥ జమదగ్నిమునీశ్వరుఁడు శ్రద్ధాదేవి కోరఁగా నేమాలికను దెచ్చియిచ్చెనో యటువంటిమాలికను నేను శిరస్సున ధరించుచున్నాను.

మూ॥ య దాంజనం త్రైకకుదం జాతగ్ం హిమవత ఉపరి । తేన వా
మాంజే తేజసే వర్చసే బలాయ చ॥

పదవి॥ యత్ । ఆంజనం । త్రైకకుదం । జాతం । హిమవతః । ఉపరి । తేన । వాం । అంజే । తేజసే । వర్చసే । బలాయచ॥

టీక॥ యత్ = ఏ, ఆంజనం కాటుక, త్రైకకుదం = త్రికకు_త్తనుపర్వతమందు కలిగెనో, యత్ = ఏ కాటుక, హిమవతః = హిమవత్పర్వతముయొక్క, ఉపరి = పై భాగంబున, జాతం = పుట్టినదో, తేన = ఆ కాటుకచేత, వాం = మిమ్ములను, తేజసే= కాంతికొఱకును, వర్చసే = వర్చస్సుకొఱకును, బలాయచ = బలముకొఱకును, అంజే= పూయుచున్నాను.

తా॥ ఏ కాటుక త్రికకుత్తు అనుపర్వతంబునను హిమవత్పర్వతమందును బుట్టినో, ఓ నేత్రములారా! అటువంటి కాటుక మీకుఁ బెట్టుచున్నాను.

ఇతి అష్టమఖండస్సమాప్తః

---

—♦ అథనవమఖండ ప్రారంభః ♦—

మూ॥ మయి పర్వతపూరుషం। మయి పర్వతవర్చసం। మయి పర్వతభేషజం। మయి పర్వతాయుషం॥

పదవి॥ మయి। పర్వతపూరుషం। మయి। పర్వతవర్చసం। మయి। పర్వత భేషజం। మయి। పర్వతాయుషం॥

టీక॥ పర్వతపూరుషం=పర్వతమందుట్టి పురుషత్వము, మయి=నాయందుండుఁ గాక, పర్వతవర్చసం = పర్వతమందున్నట్టి వర్చస్సు, మయి=నాయందుండుఁగాక, పర్వతభేషజం=పర్వతమందున్నట్టి యౌషధము, మయి = నాయందుండుగాక, పర్వతాయుషం=పర్వతమందున్నట్టి యాయుర్దాయము, మయి=నాయందుండుఁగాక.

తా॥ పర్వతమందున్నట్టి పౌరుషము వర్చస్సు ఔషధము ఆయుర్దాయము నాయందుండుఁగాక.

మూ॥ యన్మే వర్చః పరాగత మాత్మాన ముపతిష్ఠతు। ఇదం తత్పున రాదదే దీర్ఘాయుత్వాయ వర్చసే॥

పదవి॥ యత్। మే। వర్చః। పరాగతం। ఆత్మానం। ఉప। తిష్ఠతు। ఇదం। తత్। పునః। ఆదదే। దీర్ఘాయుత్వాయ। వర్చసే॥

టీక॥ పరాగతం = మళ్ళిపోయినట్టువంటి, మే = నాయొక్క, యత్=ఏ, వర్చః = కాంతిగలదో, తత్=ఆ కాంతి, ఆత్మానం=నన్ను, ఉపతిష్ఠతు = మఱల బొందుఁగాక, ఇదం=ఈ కాంతిని, దీర్ఘాయుత్వాయ=దీర్ఘాయుర్దాయము కలుగుటకును, వర్చసే=వర్చస్సుకొఱకును, పునః=తిరిగి, ఆదదే=గ్రహించుచున్నాను.

తా॥ ఈ వటువు నా ముఖమునుండి యే కాంతి తగ్గిపోయినదో ఆ కాంతిని దీర్ఘాయుర్దాయమును వర్చస్సును బొందుటకు అద్దమందు ప్రతిఫలించు నా యాత్మలోనికిఁ దీసికొనుచున్నాను.

మూ॥ ప్రతిష్ఠే స్థో దేవతానాం మాం మా సంతాప్తం ॥

పదవి॥ ప్రతిష్ఠే । స్థః । దేవతానాం । మాం । మా । సంతాప్తం ॥

టీక॥ దేవతానాం = దేవతలకు, ప్రతిష్ఠే = నడచుటకు సాధనములై, స్థః = అయితిరి, మాం = నన్ను, మా సంతాప్తం = సంతాపము గలవానిఁగాఁ జేయకుఁడు ॥

తా॥ ఓ పాదుకలారా! దేవతలు మొదలగు వారికిని నడచుటకు సాధనములుగా నుంటిరి. కాఁబట్టి నన్ను వేడిమి ముండ్లు మొదలగు బాధలు లేనివానిఁగాఁ జేయుఁడు.

మూ॥ ప్రజాపతే శ్శరణ మసి బ్రహ్మణ శ్ఛది ర్విశ్వజనస్య ఛాయాఽసి సర్వతో మా పాహి ॥

పదవి॥ ప్రజాపతేః । శరణం । అసి । బ్రహ్మణః । ఛదిః । విశ్వజనస్య । ఛాయా । అసి । సర్వతః । మా । పాహి ॥

టీక॥ ప్రజాపతేః = బ్రహ్మకు, శరణం = గృహమైనదానవు, అసి = అయితివి, బ్రహ్మణః = బ్రహ్మకు, ఛదిః = ఇంటికప్పువై, అసి = అయితివి, విశ్వజనస్య = సమస్తమైన మనుష్యులకును, ఛాయాసి = నీడ నిచ్చుదానవైతివి, మా= నన్ను, సర్వతః = అంతటను, పాహి = రక్షింపుము.

తా॥ ఓ ఛత్రమా! నీవు బ్రహ్మకు నిల్లుగాను ఇంటి కప్పుగా నుంటివి. ఇంతియే కాదు సమస్తమైన మనుష్యులకును నీడ నిచ్చుచుంటివి. కాన నా శరీరమున కంతకును నీడ నిచ్చి రక్షింపుము.

మూ॥ దేవస్య సవితుః ప్రస వేఽశ్వినో ర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యా మాదదే ద్విషతో వధా యేంద్రస్య వజ్రోఽసి వార్త్రఘ్న శ్శర్మ మే భవ యత్పాపం త న్నివారయ॥

పదవి॥ దేవస్య । త్వా । సవితుః । ప్రసవే । అశ్వినోః । బాహుభ్యాం । పూష్ణః । హస్తాభ్యాం । ఆదదే । ద్విషతః । వధాయ । ఇంద్రస్య । వజ్రః । అసి । వార్త్రఘ్నః । శర్మ । మే । భవ । యత్ । పాపం । తత్ । నివారయ॥

టీక॥ దేవస్య = దేవుఁడగు, సవితుః = సూర్యునియొక్క, ప్రసవే = అనుమతి కలుగుచుండఁగా, అశ్వినోః = అశ్వినీదేవతలయొక్క, బాహుభ్యాం = బాహువులచేతను, పూష్ణః = సూర్యునియొక్క, హస్తాభ్యాం చేతులచేతను, ద్విషతః = శత్రువులను, వధాయ = కొట్టుటకొఱకు, త్వాం = నిన్ను, ఆదదే = గ్రహించుచున్నాను. త్వం = నీవు, ఇంద్రస్య = ఇంద్రునియొక్క, వార్త్రఘ్నః = వృత్రాసురునిసంహరించిన, వజ్రః = వజ్రాయుధము, అసి = అయితివి, మే = నాయొక్క, శర్మ = సుఖమునుగూర్చి, భవ = ఉండుము, మే = నాయొక్క, యత్ = ఏ, పాపం = పాపముకలదో, తత్ = ఆ పాపమును, నివారయ = పోగొట్టుము.

తా॥ ఓదండమా ! సూర్యునియొక్క యంగీకారము కలుగఁగా నాకు శత్రుతుల్యములైన దుష్టమృగములు పక్షులు మొదలగువానిని గొట్టుటకు అశ్వినీదేవతలు అధిదేవతలుగాఁగల మోచేతులయొక్క పైభాగములచేతను సూర్యుఁడు అధిదేవతగాఁగల మోచేతికి దిగువభాగపుచేతులచేతను అనఁగా హస్తములచేతను నిన్ను ధరించెదను. వృత్రాసురుని సంహరించిన వజ్రాయుధము ఇంద్రునకేవిధముగా నున్నదో నీవు నాకు నట్టిదానవు. కాన నాయందుండు పాపమును బోఁగొట్టి నాకు సుఖమును గలుగఁజేయుము.

మూ॥ దేవీ ష్షడుర్వీ రురు ణః కృణోతవిశ్వేదేవా స ఇహ వీరయధ్వం । మా హాస్మహి ప్రజయా మా తనూభి ర్మారధామ ద్విషతే సోమరాజన్॥

పదవి॥ దేవీః । షట్ । ఉర్వీః । ఉరు । నః । కృణోత । విశ్వేదేవాః । ఇహ । వీరయధ్వం । మా । హాస్మహి । ప్రజయా । మా । తనూభిః । మా । రధామ । ద్విషతే । సోమ । రాజన్ ॥

టీక॥ ఉర్వ్యః = గొప్పవైనవియు, షట్ = ఆరైన, దేవీః = దిగ్దేవతలు, ఉరు = విస్తారమైనధనమును, నః = మాకు, కృణోత = చేయుదురుగాక, విశ్వే = సమస్తమైన, దేవాః = దేవతలు అయిన మీరు, ఇహ = ఈ నేఁ జేయుకర్మయందు, వీరయధ్వం = నన్ను బలవంతునిఁగాఁ జేయుఁడు, రాజన్ = రాజవైన, సోమ = ఓచంద్రుఁడా! ప్రజయా = సంతానముచేతను, తనూభిః = శరీరములచేతను, మాహాస్మహి = శూన్యులముగానుండము, ద్విషతే = శత్రువులకు, మారధామ = స్వాధీనులము కాము.

తా॥ తూర్పు మొదలగు నాలుగుదిక్కులును భూమియు ఆకాశము ఈయాఱుదిక్కులు మాకు విశేషమైనధనమును కలుగఁజేయుఁగాక. ఓ విశ్వేదేవతలారా! మీరు నేఁ జేయు ఈ కర్మయందు నన్ను బలవంతునిఁగాఁ జేయుఁడు. మేము సంతానమును శరీరమును విడిచి యుండము. మేము శత్రువులకు స్వాధీనులమై యుండము.

మ॥ రాష్ట్రభృ దస్యాచార్యాసందీ మా త్వ ద్యోషం॥

పదవి॥ రాష్ట్రభృత్ । అసి । ఆచార్యాసందీ । మా । త్వత్ । యోషం॥

టీక॥ రాష్ట్రభృత్ = ఓకూర్చా! త్వం = నీవు, ఆచార్యాసందీ = ఆచార్యునియొక్క ఆసనమయితివి, త్వత్ = నీకంటె మాయోషం = వేఱుగానుండను.

మ॥ రాష్ట్రభృ దసి సంమ్రా డాసందీ మా త్వ ద్యోషం॥

పదవి॥ రాష్ట్రభృత్ । అసి । సంమ్రాడాసందీ । మా । త్వత్ । యోషం॥

టీక॥ రాష్ట్రభృత్ = ఓకూర్చా! త్వం = నీవు, సంమ్రాడాసందీ = పట్టాభిషేకము చేయఁబడినవానికి ఆసన మయితివి.

మ॥ రాష్ట్రభృ దస్యధిపత్న్యాసందీ మా త్వ ద్యోషం॥

పదవి॥ రాష్ట్రభృత్ । అసి । అధిపత్న్యాసందీ । మా । త్వత్ । యోషం॥

టీక॥ రాష్ట్రభృత్ = ఓకూర్చా! త్వం = నీవు, అధిపత్న్యాసందీ = అధిపతికి ఆసనమైతివి, త్వత్ = నీకంటె, మాయోషం = వేఱుగానుండను॥

తా॥ ఓకూర్చా! నీవు ఆచార్యునకును అభిషేకము జేయఁబడినరాజునకును మండలాధిపతికిని ఆసనమయినందున నేను నిన్ను విడువను.

మూ॥ ఆపః పాదావనేజనీ ర్ద్విషంతం నాశయంతుమే అస్మిన్ కులే బ్రహ్మవర్చ స్యసాని॥

పదవి॥ ఆపః । పాదావనేజనీః । ద్విషంతం । నాశయంతు । మే । అస్మిన్ । కులే । బ్రహ్మవర్చసీ । అసాని ॥

టీక॥ పాదావనేజనీః = పాదప్రక్షాళనమును జేసిన, అపః = ఉదకములు, మే = నాయొక్క, ద్విషంతం = శత్రువును, నాశయంతు = సంహరించుఁగాక, అస్మిన్ = ఈ, కులే = వంశమునందు, బ్రహ్మవర్చసీ=బ్రహ్మవర్చస్సుగలవాఁడనై, అసాని = అయ్యెదను॥

తా॥ పాదప్రక్షాళనమును జేసిన యీజలములు నా శత్రువును హరించుఁగాక. ఈవంశమునందు బ్రహ్మవర్చస్సు గలవాఁడ నయ్యెదను.

మూ॥ మయి మహో మయి యశో మ యీంద్రియం వీర్యం॥

పదవి॥ మయి । మహః । మయి । యశః । మయి । ఇంద్రియం । వీర్యం॥

టీక॥ మయి = నాయందు, మహః = తేజస్సు, మయి= నాయందు, యశః= కీర్తి, మయి = నాయందు, ఇంద్రియం = నేత్రము మొదలగు నింద్రియములు, వీర్యం =రేతస్సును నుండుఁగాక.

తా॥ నాయందు తేజస్సు, కీర్తి, యింద్రియములు, రేతస్సును గలుగుఁగాక (బ్రాహ్మణుఁడు పాదములఁట్టుటచే నివి నిలువ వని యిట్టిప్రార్థన.

మూ॥ ఆ మా గ న్యశసా వర్చసా సగ్ంసృజ పయసా తేజసా చ। తం మా ప్రియం ప్రజానాం కు ర్వధిపతిం పశూనాం ॥

పదవి॥ ఆ । మా । అగన్ । యశసా । వర్చసా । సం । సృజ । పయసా । తేజసా । చ । తం । మా । ప్రియం । ప్రజానాం । కురు । అధిపతిం । పశూనాం॥

టీక॥ త్వం = నీవు, అగన్ = వచ్చుచు, యశసా=కీర్తితోడను, వర్చసా= కాంతితోడను, పయసా = క్షీరములతోడను, తేజసా = తేజస్సుతోడను, మా = నన్ను, సంసృజ = కూర్చుము, తం = అటువంటి, మా = నన్ను, ప్రజానాం = ప్రజలకు, ప్రియం = ఇష్టమైనవానిగాను, పశూనాం = పశువులకు, అధిపతిం = అధిపతినిగాను, కురు = చేయుము॥

తా॥ ఓ యుదకమా! నీవు వచ్చి నన్ను కీర్తిగలవానిఁగాను, వర్చస్సుగల వానిఁగాను, పాడి గల వానిఁగాను, కాంతి గలవానిఁగాను, ప్రజల కిష్టునిఁగాను, పశువులు గలవానిఁగాను జేయుము.

మూ॥ విరాజో దోహో౽సి విరాజో దోహ మశీయ మమ పద్యాయ విరాజ॥

పదవి॥ విరాజః । దోహః । అసి । విరాజః । దోహం । అశీయ । మమ । పద్యాయ । విరాజ॥

టీక॥ విరాజః = అన్నముయొక్క, దోహః = సంరక్షకము, అసి = అయితివి, విరాజః = అన్నమువలన, దోహం = రక్షణమును, అశీయ = పొందెదను, మమ = నాయొక్క, పద్యాయ = పుత్త్రునికొఱకు, విరాజ = దీపింపుము.

తా॥ ఓ యుదకమా! నీ వలన నన్నము కలుగుచున్నది. ఆ యన్నమువలన సంరక్షింపఁబడుచున్నాను. నా పుత్రుఁడును రక్షింపఁబడుఁగాక.

మూ॥ సముద్రం వః ప్రహిణోమి స్వాం యోనిమపి గచ్ఛత। అచ్ఛిద్రః ప్రజయా భూయాసం మాపరాసేచి మత్పయః॥

పదవి॥ సముద్రం । వః । ప్రహిణోమి। స్వాం । యోనిం । అపి । గచ్ఛత। అచ్ఛిద్రః । ప్రజయా । భూయాసం । మా । పరాసేచి । మత్ । పయః॥

టీక॥ వః=మిమ్ములను, సముద్రం=సముద్రమును గూర్చి, ప్రహిణోమి= పంపుచున్నాము, స్వాం=స్వకీయమైన, యోనిం=కారణభూతమైన స్థానమును, గచ్ఛత=పొందుఁడు, ప్రజయా=సంతానముచేతను, అచ్ఛిద్రః=భంగములేనివాఁడనై భూయాసం=అయ్యెదను, పయః=ఉదకము, మత్=నావలన, మాపరాసేచి=అనుపయోగముగా నుండకుండుఁగాక.

తా॥ ఓ యుదకములారా! మిమ్ములను సముద్రమునకు పంపుచున్నాను. మీ జన్మస్థానమునకు వెళ్లుఁడు. నా సంతానమును భంగము చేయఁబోకుఁడు. మీరు నా కెప్పుడు నుపయోగించురీతి నుండుఁడు.

ఇతి నవమఖండః స్సమాప్తః

—♦ అథ దశమఖండ ప్రారంభః ♦—

మూ॥ త్రైయ్యై విద్యాయై యశో௨సి యశసో యశో௨సి బ్రహ్మణో దీప్తి రసి। తం మా ప్రియం ప్రజానాం కు ర్వధిపతిం పశూనాం॥

పదవి॥ త్రైయ్యై । విద్యాయై । యశః । అసి । యశసః । యశః । అసి । బ్రహ్మణః । దీప్తిః । అసి । తం । మా । ప్రియం । ప్రజానాం । కురు । అధిపతిం । పశూనాం॥

టీక॥ త్రయ్యై = మూడైన, విద్యాయై = వేదములయొక్క, యశః = కీర్తివి, అసి = అయితివి, యశసః = కీర్తికీ, యశః = కీర్తివి, అసి = అయితివి, బ్రహ్మణః = వేదముయొక్క, దీప్తిః = ప్రకాశకమైనదానవు, అసి = అయితివి, తం = అటువంటి, మా = నన్ను, ప్రజానాం = మనుష్యులకు, ప్రియం = ఇష్టునిగాను, పశూనాం = పశువులకు అధిపతినిగాను, కురు = చేయుము.

తా॥ ఓ మధుపర్కమా! నీవు మూడు వేదములకు కీర్తిగలుగఁజేయుదానవును, కీర్తికికీర్తినొసగుదానవును, వేదమును ప్రకాశింపఁజేయుదానవు నయితివి. కావున నన్ను ప్రజల కిష్టమైనవానిగాను పశువులు మొదలగునవి గలవానిఁగాను జేయుము.

మూ॥ ఆ మా గన్ని త్యైషా॥

దీనికి నర్థము మొదలగునవి యీవరలో వ్రాయఁబడి యున్నవి.

మూ॥ అమృతోప స్తరణ మ స్యమృతాపిధాన మసి॥

పదవి॥ అమృతోప స్తరణం । అసి । అమృతాపిధానం । అసి ॥

టీక॥ అమృతోప స్తరణం = అమృతముతో సమానమైన పదార్థములకు నాధారము, అసి = అయితివి, అమృతాపిధానమసి = అమృతముచేఁగప్పఁబడినదాన వైతివి॥

తా॥ ఓజలమా। నీవు అమృతముతో సమాన మైన పదార్థములకు నాధార మైతివి. అమృతముచే గప్పఁబడిన దాన వైతివి.

మూ॥ య న్మధునో మధవ్యం పరమ మన్నాద్యం వీర్యం। తేనా௨హం మధునో మధవ్యే పరమేణా ௨న్నాద్యేన వీర్యేణ పరమోన్నాదో మధ్యవో௨సాని॥

పదవి॥ యత్ । మధునః । మధవ్యం । పరమం। అన్నాద్యం। వీర్యం । తేన । అహం । మధునః । మధవ్యేన । పరమేణ । అన్నాద్యేన । వీర్యేణ । పరమః । అన్నాదః । మధవ్యః । అసాని ॥

టీక॥ మధునః = తేనెయొక్క, యత్ = ఏ, పరమం = ఉత్కృష్టమైనది యు, అన్నాద్యం = అన్నమును హరింప జేయునదియు, వీర్యం = బలకరమైనదో, తేన= అటువంటి, పరమేణ = ఉత్కృష్టమైనదియు, అన్నాద్యేన= అన్నమును హరింపజేయునదియు, వీర్యేణ = బలకరమైన, మధునః = తేనె యొక్క, మధ వ్యేన = మధుత్వముచేత, అహం = నేను, పరమః =ఉత్కృష్టమైనవాఁడను, అన్నాదః = అన్నమును దినువాఁడను, మధవ్యః = అందఱును గోరఁదగినవాఁడను, అసాని = అయ్యెదను.

తా॥ అన్నమును జీర్ణము చేయునదియు బలకరమైనదియు నుత్కృష్టమైనది యు నగు తేనెయొక్క మధుత్వముచేత నేను నుఉత్కృష్టుఁడను అన్నమును భక్షిం చువాఁడను అందఱిచేఁ గోరఁబడఁదగిన వాడనయ్యెదను.

మూ॥ గౌరస్యపహతపాప్మాఽప పాప్మానం జహిమమచాఽముష్యచ॥

పదవి॥ గౌః । అసి । అపహతపాప్మా । అప । పాప్మానం । జహి । మమ । చ । అముష్య । చ ॥

టీక॥ గౌః = ఓధేనువా ! త్వం = నీవు, అపహతపాప్మా = నశింపఁజేయఁ బడిన పాపముగలదానవు, అసి= అయితివి, మమ చ=నాయొక్కయు, అముష్యచ= కన్యాదాత యొక్కయు పాప్మానం = పాపమును, అపజహి = పోగొట్టుము.

తా॥ ఓధేనువా ! నీవు నిర్దోషురాలవు. కాన నాయొక్కయు కన్యాదాత యొక్కయు పాపమును నశింపఁజేయుము.

మూ॥ అగ్నిః ప్రాఽశ్నాతు ప్రథమ స్స హి వేద యథాహవిః ।
అనష్ట మస్మాకం కృణ్వ న్బ్రాహ్మణో బ్రాహ్మణేభ్యః ॥

పదవి॥ అగ్నిః । ప్రాశ్నాతు । ప్రథమః । సః । హి ॥ వేద । యథా । హవిః । అనష్టం । అస్మాకం । కృణ్వన్ । బ్రాహ్మణః । బ్రాహ్మణేభ్యః ॥

టీక॥ ప్రథమః = మొదటివాఁడగు, అగ్నిః = అగ్నిహోత్రుఁడు, ప్రా శ్నాతు = భక్షించుఁగాక, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకంటె, బ్రాహ్మణః=

బ్రాహ్మణుఁడైన, సహి = ఆయగ్నిహోతృండు, అస్మాకం = మాకు, అనష్టం = నష్టములేక పోవుటను, కృణ్వన్ = చేయుచు, హవిః = అజ్యాదిహవిస్సు, యథా= ఏరీతిగానుండునో, వేద = తెలిసికొనును.

తా॥ దేవతలలో మొదటివాఁడును బ్రాహ్మణులలో నధికుఁడును నగు అగ్ని హోతృండు మాకు నష్టమును జేయక అజ్యాదిహవిస్సు ఏరీతిగా నుండునో తెలిసి కొని భక్షించును.

మూ॥ యజ్ఞో వర్ధతాం యజ్ఞస్య వృద్ధి మను వృ ద్ధాఽ పచితి ర స్యపచితిం మా కు ర్వపచి తోఽహాం మనుష్యేషు భూ యాసం॥

పదవి॥ యజ్ఞః । వర్ధతాం । యజ్ఞస్య । వృద్ధిం । అను । వృద్ధ । అపచితిః । అసి । అపచితిం । మాం । కురు । అపచితః । అహాం । మనుష్యేషు । భూయాసం॥

టీక॥ యజ్ఞః = పూజాస్వరూపమైన యజ్ఞము = వర్ధ, తాం= వృద్ధిపొందుఁ గాక, యజ్ఞస్య=యజ్ఞము యొక్క, వృద్ధిమను = వృద్ధియయిన పిమ్మట, వృద్ధ = వృద్ధిపొందుము, అపచితిః=పూజనీయమైనదానవు, అసి=అయితివి, మాం= నన్ను, అప చితిం = పూజార్హునిగా, కురు = చేయుము, అహాం = నేను, మనుష్యేషు = మనుష్యులయందు, అపచితః = పూజనీయుఁడను, భూయాసం = అయ్యెదను,

తా॥ ఓధేనువా! నీ సంబంధమైనపూజ వృద్ధిపొందుఁగాక. ఆ పూజవృద్ధి పొందిన పిమ్మట పూజనీయమైన నీవును వృద్ధి పొందుము. నీవు నన్ను పూజనీయుఁ నిగాఁ జేసితివేని మనుష్యులలో నేను పూజార్హుఁడనయ్యెదను.

మూ॥ గౌర్ధేనుభవ్యా మాతా రుద్రాణాం దుహితా వసూనాగ్ స్వసాఽదిత్యానా మమృతస్య నాభిః । ప్రణువోచం చికితుషే జనాయ మా గా మనాగా మదితిం వధిష్ట ॥

ప॥ గౌః । ధేనుభవ్యా । మాతా । రుద్రాణాం । దుహితా । వసూనాం ॥ స్వ సా । ఆదిత్యానాం । అమృతస్య । నాభిః । ప్రణువోచం । చికితుషే. జనాయ । మా । గాం । అనాగాం । అదితిం । వధిష్ట ॥

అ॥ గౌః = ఈ యావు, ధేనుభవ్యా = యోగ్యమైన ఆవు అయ్యెని, రుద్రా ణాం = ఏకాదశ రుద్రులకు, మాతా = తల్లియు, వసూనాం = అష్టవసులకు, దుహి

తా = కుమార్తెయు, ఆదిత్యానాం = ద్వాదశాదిత్యులకు, స్వసా = తోబుట్టువును, అమృతస్య = అమృతమునకు, నాభిః = ప్రధాన అవయవమయ్యేని, చికితుషే = ఏమియు తెలియనట్టి, జనాయ = మనుష్యుని కొఱకు, ప్రణవోచం = మిక్కిలి చెప్పుచున్నాను, అనాగాం = నిర్దోషమైనదియు, అదితిం= హింసింపఁగూడ నిదియునగు, గాం = ఆవును, లేక ఎద్దును మావధిష్ట = వధింపకుఁడు ॥

తా॥ యోగ్యమైన యీ ధేనువు యజ్ఞమందు సమస్తమైన దేవతలు పొందదగిన ఆజ్యాది హవిస్సును నొసఁగున దౌటచే రుద్రులకుఁ దల్లియై, వసువులకుఁ గుమారికయై, ఆదిత్యులకు జెల్లెలయి, అమృతమునకు నాధారమైయున్నది కాన నిర్దోషమై నదియుఁ బరులకు హింసఁజేయనదియు నైన యట్టి ధేనువును బాధపెట్ట గూడదని యవివేకులకు మిక్కిలి చెప్పుచున్నాను.

మూ॥ పిబ తూదకం తృణా న్యత్తు॥

పదవి॥ పిబతు । ఉదకం । తృణాని । అత్తు

టీక॥ ఉదకం=జలమును, పిబతు=త్రాగుఁగాక, తృణాని=ఘాసములను అత్తు=భక్షించుగాక.

తా॥ ఆవు దాని స్వేచ్ఛగా గడ్డి తినుఁగాక నీటిని దాగ్రుఁగాక.

మూ॥ ఓ ముత్సృజత॥

పదవి॥ ఓం । ఉత్సృజత॥

టీక॥ ఓం=అంగీకారమే, ఉత్సృజత=విడిచిపెట్టుదురు కాక.

తా॥ ఆవును స్వేచ్ఛగా విడిచిపెట్టుటకుయందర నంగీకారమే కావున విడువవలయును.

మూ॥ భూతం॥

టీక॥ భూతం=అన్నము సిద్ధముగా నున్నది.

తా॥ అన్నము సిద్ధముగా నున్నది.

మూ॥ సా విరాట్॥

పదవి॥ సా విరాట్

టీక॥ సా=ఆ యన్నము, విరాట్=అనేకవిధములుగా ప్రకాశించుచున్నది.

తా॥ భూతములకు బలినిమిత్తము అన్నము వండఁబడి సిద్ధముగా నున్నది.

మూ॥ తన్మా క్షాయి తస్య తేఽశీయ తన్మ ఊర్జం ధాః ॥

పదవి॥ తత్ । మా । క్షాయి । తస్య । తే । అశీయ । తత్ । మే । ఊర్జం ధాః ॥

టీక॥ తత్ = ఆ యన్నము, మాక్షాయి = నశింపకుండుఁగాక, తస్య = అటువంటి, తే = నిన్ను, (ద్వితీయార్థేషష్ఠి) అశీయ = భక్షించెదను, తత్ = అటువంటి నీవు, మే = నాకొఱకు, ఊర్జం=బలమును, ధాః = కలుగఁజేయుము.

తా॥ ఆ యన్నము నశింపకుండుఁగాక. ఓ యన్నమా! అటువంటి నిన్ను భక్షించెదను కాన నాకు బలమును గలుగఁజేయుము.

మూ॥ ఓం కల్పయత॥

ఇతి దశమఖండ స్సమాప్తః.

---

## —♦ ఏ కా ద శ ఖ ం డః ♦—

మూ॥ ధాతా దదాతు నో రయి మీశానో జగతస్పతిః । సనః పూర్ణేన వావనత్ ॥

పదవి॥ ధాతా । దదాతు । నః । రయిం । ఈశానః । జగతః । పతిః । సః । నః । పూర్ణేన । వావనత్ ॥

టీక॥ జగతః = ప్రపంచమునకు, పతిః = ప్రభువును, ఈశానః = నియామకుఁడును అగు, ధాతా = బ్రహ్మ, నః = మాకొఱకు, రయిం = ధనమును, దదాతు = ఇచ్చుగాక, సః = అటువంటి బ్రహ్మ, నః = మమ్ములను, పూర్ణేన = సంపూర్ణమైన కోరికలతో, వావనత్ = నింపుగాక.

తా॥ ప్రపంచమును పాలించువాఁడును శిక్షించువాఁడు నగు బ్రహ్మ మాకు ధనము నొసఁగుఁగాక. మఱియు మమ్ముల సంపూర్ణమైన వాంఛాసిద్ధి గలవారి నిగాఁ జేయుఁగాత.

మూ॥ ధాతా ప్రజాయా ఉత రాయ ఈశే ధా తేదంవిశ్వం భువనం జజాన ధాతా పుత్త్రం యజమానాయ దాతా తస్మా ఉ హవ్యం ఘృత వద్విధేమ॥

పదవి॥ ధాతా । ప్రజాయాః । ఉత । రాయః । ఈశే । ధాతా । ఇదం । విశ్వం । భువనం । జజాన । ధాతా । పుత్త్రం। యజమానాయ। దాతా। తస్మై। ఉ। హవ్యం । ఘృతవత్ । విధేమ॥

టీక॥ ధాతా = బ్రహ్మ, ప్రజాయాః = మనుష్యులకును, రాయః = ధనము నకును, ఈశే = అధిపతి, ఉత = ఇంతియేకాదు, ధాతా = బ్రహ్మ, ఇదం = ఈ, విశ్వం = సమస్తమయిన, భువనం = ప్రపంచమును, జజాన = సృజియించెను, ధాతా = బ్రహ్మ, యజమానాయ = యజమానునికొఱకు, పుత్త్రం = తనయుని, దాతా = ఇయ్యఁగలఁడు, తస్మై = అటువంటిబ్రహ్మకొఱకు, ఘృతవత్ = నేతి తోఁగూడిన, హవ్యం = హవిస్సును, విధేమ =హోమరూపముగా నిచ్చుచున్నాను.

తా॥ బ్రహ్మ సర్వజంతువులకును ధనమునకును నధిపతిగానుండి ఈ సమస్త ప్రపంచమును సృజించెను. ఈ బ్రహ్మయే యజమానునికి సంతానము నిచ్చును. కాఁబట్టి యటువంటిబ్రహ్మకు నెయ్యి కలిసినహవిస్సును హోమరూపముగా నిచ్చు చున్నాను.

మూ॥ ధాతా దదాతు నో రయిం ప్రాచీం జీవాతు మక్షితాం వయం దేవస్య ధీమహి సుమతిగ్ం సత్యరాధసః॥

పదవి॥ ధాతా । దదాతు । నః । రయిం । ప్రాచీం । జీవాతుం । అక్షితాం। వయం । దేవస్య । ధీమహి । సుమతిం । సత్యరాధసః॥

టీక॥ ధాతా=బ్రహ్మ, ప్రాచీం=చిరకాలమునుండి వచ్చుచున్నదియు, జీవాతుం = జీవించుటకొఱకు మాకుఁజాలినదియు, అక్షితాం=నాశనము లేనిదియు నగు, రయిం=ధనమును, నః=మాకొఱకు, దదాతు=ఇచ్చుగాక, వయం=మేము, సత్యరాధసః=సత్యమే ధనముగాగల, దేవస్య=ఆ బ్రహ్మదేవునియొక్క, సుమతిం= భక్తులయందు ప్రేమగల మంచిబుద్ధిని, ధీమహి=ధ్యానముచేయుచున్నాము.

తా॥ బ్రహ్మదేవుండు చిరకాలమునుండి వంశపరంపరగా మాకు వచ్చు చున్నదై భంగము లేనిదై జీవించుటకు జాలినట్టి ధనమును మాకొఱకు నిచ్చుగాక.

భక్తులయందు ప్రేమగల బ్రహ్మదేవుని యొక్క యట్టి బుద్ధిని విశేషముగా ప్రార్థించెదము.

మూ॥ ధాతా దదాతు దాశుషే వసూని ప్రజాకామాయ మీఢుషే దురోణే తస్మై దేవా అమృతా స్సంవ్యయంతాం విశ్వే దేవాసో అదితి స్సజోషాః॥

పదవి॥ ధాతా । దదాతు । దాశుషే । వసూని । ప్రజాకామాయ । మీఢుషే । దురోణే । తస్మై । దేవాః । అమృతాః । సం । వ్యయంతాం । విశ్వే । దేవాసః । అదితిః । సజోషాః.

టీక॥ ధాతా = బ్రహ్మ, ప్రజాకామాయ = సంతానమునుగోరినట్టియు, దురోణే= గృహమునందు, మీఢుషే = స్వకీయభార్యయందు రేతస్సునుంచినట్టియు, దాశుషే=ఆజ్యాదిహవిస్సునిచ్చుచున్నట్టినాకొఱకు, వసూని=సంతానరూపమైనధనములను, దదాతు=ఇచ్చుగాక, అమృతాః=మరణములేని, దేవాః=దేవతలు, తస్మై= అటువంటినాకొఱకు, సంవ్యయంతాం = సంపదలనిచ్చుటకు(బ్రయత్నింతురు గాక, విశ్వే=సమస్తమైన, దేవాసః=దేవతలు, అదితిః=అదితియను దేవతయు, సజోషాః= సమానప్రేమగలవారగుదురు గాక.

తా॥ దేవతలకు నాజ్యాదిహవిస్సు నిచ్చునట్టియు సంతానముకోరినట్టియు నా గృహమందు నాభార్యతో భోగించుచుండెడునాకొఱకు జరామరణములు లేనిసమస్తమైన దేవతలును అదితియు నాయందు సమానప్రేమగలవా రగుదురు గాక.

మూ॥ య స్త్వా హృదా కీరిణా మన్యమానో౽ మర్త్యం మర్త్యో జోహవీమి । జాతవేదో యశో అస్మాసు ధేహి।ప్రజాభి రగ్నే అమృతత్వ మస్యాం॥

పదవి॥ యః । త్వా । హృదా । కీరిణా । మన్యమానః । అమర్త్యం । మర్త్యః । జోహవీమి । జాతవేదః । యశః । అస్మాసు । ధేహి । ప్రజాభిః । అగ్నే । అమృతత్వం । అస్యాం॥

టీక॥ జాతవేదః = ఓయగ్నిహోత్రుడా! మర్త్యః= మరణస్వభావముగల, యః = ఏనేను, త్వా = నిన్ను, అమర్త్యం = మృతిలేనివానిగా, మన్యమానః = తలంచినవాడనై, కీరిణా = ధ్యానముచేయుచున్న, హృధా = మనస్సుతోఁగూడిన

వాఁడనై, జోహవీమి = పిలుచుచున్నానో, అగ్నే = ఓయగ్నిహోతుఁడా! తస్మిన్ = అటువంటి, అస్మాసు = నాయందు (వచనవ్యత్యయము), యశః= కీర్తిని, ధేహి = ఉంచుము, ప్రజాభిః = సంతానములచేతను, అమృతత్వం = మరణములేని వాఁడను, అస్యాం = అయ్యెదను.

తా॥ ఓ యగ్నిహోతుఁడా! మరణ స్వభావముగల నేను నిన్ను ధ్యానించుచున్న మనస్సు గలవాఁడనై జరామరణములు లేని నిన్నుఁ బిలుచుఁచున్నాను కావన నా యందు నీ యనుగ్రహము నుంచెదవేని "ఆత్మా వై పుత్రనామాసి" అను శ్రుతి ప్రకారంబుగా నేను పుత్ర పౌత్రాదిరూపంబున జనియించుటచే మరణము లేనివాఁడ నయ్యెదను.

మూ॥ యస్మై త్వగ్ం సుకృతే జాతవేద ఉ లోక మగ్నే కృణవ స్యోన్యనం। అశ్వినగ్ం సపుత్రిణం వీరవంతం గోమంతగ్ం రయిం నశతే స్వస్తి॥

పదవి॥ యస్మై। త్వం। సుకృతే। జాతవేదః। ఉ। లోకం। అగ్నే। కృణవః। స్యోనం। అశ్వినం। సః। పుత్రిణం। వీరవంతం। గోమంతం। రయిం। నశత్। స్వస్తి॥

టీక॥ జాతవేదః = ఓ యగ్నిహోతుఁడా!, త్వం = నీవు, యస్మై = ఏ, సుకృతే = పుణ్యాత్మని కొఱకు, లోకం = మనుజుని, కృణవః = సృజించుచున్నావో, సః = ఆ పుణ్యాత్ముఁడు, స్యోనం = సుఖకరుఁడును, అశ్వినం = గుఱ్ఱములు గలవాఁడును, పుత్రిణం = పుత్రులు గలవాఁడును, వీరవంతం = మనుమలు గలవాఁడును, గోమంతం = పశువులు గలవాఁడును, రయిం = ధనవంతుఁడు నగు కుమారుని, స్వస్తి = శుభములు గలుగునట్లుగా, నశత్ = పొందుచున్నాఁడు.

తా॥ ఓ యగ్నిహోత్రుఁడా! ఏ పుణ్యాత్మునకు నీవు సంతానమును గలుగఁ జేయుచున్నావో యట్టి వాని కుమారుండు సుఖములను గలుగఁజేయు వాఁడును, గుఱ్ఱములు మొదలగు బలముగలవాఁడును, పుత్రులు మనుమలు పశువులు ధనము గలవాఁడు నై యెల్లప్పుడు శుభములను బొందుచుండును.

మూ॥ త్వే సుపుత్ర శవసో వృత్రన్ కామకాతయః। న త్వా మింద్రాఽతిరిచ్యతే॥

పదవి॥ త్వే । సుప్రత్రి । శవసః । వృత్రక్ । కామకాతయః । వ । త్వాం । ఇంద్రి । అతిరిచ్యతే ॥

టీక॥ శవసస్సుప్రత్రి = ఓ యింద్రుడా! త్వే = నీయందు, కామకాత యః = సర్వవాంఛితార్థములు, అవృతక్ = ఉన్నవి, ఇంద్రి = ఓ యింద్రుడా! త్వాం = నిన్ను, నాతిరిచ్యతే । మించినవాఁడు లేఁడు.

తా॥ ఓ యింద్రుఁడా! ప్రతి జంతువునకు నేమేమి యభిలాషలు గలవో వానిని సఫలము నొందించుట నీ స్వాధీనమై యున్నది. కాన నీవు అందఱను మించినవాఁడ వని చెప్పఁదగును.

మూ॥ ఉక్థ ఉక్థే సోమ ఇంద్రం మమాద నీథే నీథే మఘవానగ్ం సుతాసః। యదీగ్ం సబాధః పితరం న పుత్రాః సమానదక్షా అవసే హవంతే ॥

పదవి॥ ఉక్థే । ఉక్థే । సోమః । ఇంద్రం । మమాద । నీథే । నీథే । మఘ వానం । సుతాసః । యత్ । ఈం । సబాధః । పితరం । న । పుత్రాః । సమాన దక్షాః । అవసే । హవంతే ॥

టీక॥ సుతాసః = మాకు నిష్టుడగు, సోమః = చంద్రుడు, ఉక్థే ఉక్థే = ప్రతి ఆయుధ సంబంధమైన క్రియ, నీథే నీథే = సమాప్తి పొందింపఁబడినదా చుండగా, మఘవానం = ధనముగల, ఇంద్రం = ఇంద్రుని, మమాద = సంతోష చిత్తునిఁ జేయుఁగాక, యత్ = ఏకారణమువలన, ఈం = ఈ దేవేంద్రుని, సబాధః = సమానబాధగలవారును, సమానదక్షాః = సమానబలము గలవారునగు, పుత్రాః = తనయులు, అవసే = రక్షణకొఱకు, పితరన్న = తండ్రినివలెనే, హవంతే = పిలుచుచున్నారో.

తా॥ లోకములో సమానబలము గలిగి వివాదము గల తనయులు వివాద నివారణము కొఱకుఁ దండ్రిని బిలిచి యెట్లు సంతోషపెట్టెదరో అ తీరుననే చంద్రుఁడు యుద్ధసంబంధమైన ప్రసక్తి కలిగనేని ఐశ్వర్య సంపన్నుఁడైన దేవేం ద్రుని బిలిచి తన్నివారణము చేయించుకొని సంతోషపెట్టుగాక.

మూ॥ భూ ర్భువ స్సువః ॥

పదవి॥ భూః । భువః । సువః ॥

తా॥ భూలోకము భువర్లోకము సువర్లోకము నేఁ జేయుకర్మను జూచుచుండుఁగాక॥

మూ॥ రాకా మహగ్ం సుహవాగ్ం సుష్టుతీ హువే శృణోతు న స్సుభగా బోధతు త్మనా సీవ్య త్వప స్సూచ్యాఽచ్ఛిద్యమానయా దదాతు వీరగ్ం శతదాయ ముక్థ్యం॥

పదవి॥ రాకాం । అహం । సుహవాం । సుష్టుతీ । హువే । శృణోతు । నః । సుభగా । బోధతు । త్మనా । సీవ్యతు । అపః । సూచ్యా । అఛిద్యమానయా । దదాతు । వీరం । శతదాయం । ఉక్థ్యం ॥

టీక॥ అహం = నేను, సుహవాం = యోగ్యముగాఁబిలువఁదగిన, రాకాం = పూర్ణిమను, సుష్టుతీ = యోగ్యమైనస్తోత్రముచే, హువే = పిలుచుచున్నాను, సుభగా = సౌభాగ్యప్రదయైన, సా = ఆపూర్ణిమ, నః = మాయొక్క, ఆహ్వానం = పిలుపును, శృణోతు= వినుఁగాక, ఆత్మనా= తనమనస్సుచేత, బోధతు=తెలిసికొనుఁగాక, అపః = సీమంతకర్మను, సీవ్యతు = యోగ్యమానట్లుగాఁజేయుగాక, అచ్ఛిద్యమానయా = అప్రతిహతమైనదియు, సూచ్యా = సూదివలెనే సూక్ష్మమైనదియు నగు బుద్ధితోఁగూడినవాఁడును, శతదాయం = అనేకులకు విశేషముగా దానమిచ్చువాఁడును, ఉక్థ్యం = స్తోత్రము చేయుదగినవాఁడునగు, వీరం = పుత్త్రుని, దదాతు = ఇచ్చుఁగాక॥

తా॥ చక్కఁగాఁ బిలువఁదగినపూర్ణిమను యోగ్యమైనస్తోత్రముచేఁ బిలుచుచున్నాను. భాగ్యప్రదయైనపూర్ణిమ నా పిలుపును విని తన మనస్సునం దుంచుకొని యీసీమంతకర్మను జక్కఁగా నెరవేఱునట్లు చేయుఁగాక. ఈ పూర్ణిమ యడ్డులేనిసూక్ష్మబుద్ధిగలవాఁడును విశేషముగా దానములనిచ్చువాఁడును శ్లాఘింపఁదగినవాఁడునగు పుత్త్రునిచ్చుఁగాక॥

మూ॥ యాస్తే రాకే సుమతయ స్సుపేశసో యాభి ర్దదాసి దాశుషే. వసూని తాభి ర్నో అద్య సుమనా ఉపాఽగహి సహస్రపోషగ్ం సుభగే రరాణా॥

పదవి॥ యాః । తే । రాకే । సుమతయః । సుపేశసః । యాభిః । దదాసి । దాశుషే । వసూని । తాభిః । నః । అద్య । సుమనాః । ఉప । ఆగహి । సహస్రిపోషం । సుభగే । రరాణా॥

టీక॥ రాకే = ఓపూర్ణిమా ! తే = నీయొక్క, సుపేశసః = మంచిస్వరూపముగల, యాః = ఏ, సుమతయః = మంచిబుద్ధులుగలవో, యాభిః = ఏమంచిబుద్ధులతో, దాశుషే = దానములజేయు యజమానుని కొఱకు, వసూని = ధనములను దదాసి = ఇచ్చుచున్నావో, సుభగే = ఓభాగ్యవంతురాలా ! తాభిః = అటువంటిబుద్ధులతోగూడి, సుమనాః = మంచిమనస్సుగలదానవై, సహస్రిపోషం = అనేకవిధములైన వృద్ధులను, రరాణా = ఇచ్చుచు, నః = మమ్ముగూర్చి, అద్య = ఇప్పుడే, ఉపాగహి = రమ్ము.

తా॥ ఓపూర్ణిమా ! ధర్మముజేయువారికి సంపత్తునొసంగుట మొదలగు నే మంచిగుణములు గలవో యట్టిమంచిగుణములు గలదానవై మంచిమనస్సు గలదానవై యనేకవిధములైన వృద్ధిని గలుగజేయుటకు నిప్పుడే నావద్దకు రమ్ము.

మూ॥ యాగంధరి రేవ నో రా జేతి సాళ్వీ రవాదిషుః విపృత్తచక్రా ఆసీనా స్తీరేణ యమునే తవ॥

పదవి॥ యాగంధరిః । ఏవ । నః । రాజా । ఇతి । సాళ్వీః । అవాదిషుః । విపృత్తచక్రాః । ఆసీనాః । తీరేణ । యమునే । తవ॥

టీక॥ యాగంధరిరేవ= యుగంధరునియొక్క సంతానమే, నః = మాకు, రాజా = ప్రభువుగాక, ఇతి = ఈలాగున, విపృత్తచక్రాః = అనేకరీతులుగానుండిన రాజ్యపాలనముగల, సాళ్వీః = సాల్వదేశస్థులు, యమునే = ఓయమునానదీ! తవ = నీయొక్క, తీరేణ = తీరమందు, ఆసీనాః = కూర్చున్నవారై, అవాదిషుః = పలుకుచుండిరి.

తా॥ ఓయమునానదీ ! సాల్వదేశస్థులు తమదేశమునందు సరియైనరాజపరిపాలన లేక యుండగా నీ తీరమందు కూర్చుండి మాకు యుగంధరునిసంతానమే ప్రభువుగా నుండవలయు ననిరి.

మూ॥ సోమ ఏవ నో రాజే త్యాహు బ్రాహ్మణీః ప్రజాః వివృత్త చక్రా ఆసీనా స్తీరే ణాసౌ తవ॥

పదవి॥ సోమః । ఏవ । నః । రాజా । ఇతి । ఆహుః । బ్రాహ్మణీః । ప్రజాః । వివృత్తచక్రాః । ఆసీనాః । తీరేణ । అసౌ । తవ॥

టీక॥ అసౌ = ఓయమునానదీ! తవ = నీయొక్క, తీరేణ = ఒడ్డునందు, ఆసీనాః = కూర్చుండిన, బ్రాహ్మణీః = బ్రాహ్మణులైన, ప్రజాః = జనులు. వివృత్తచక్రాః = అనేకరీతులుగల రాజ్యపాలనగలవారై, సోమఏవ = సోముఁడే, నః = మాకు, రాజా = రాజుకావలయును, ఇతి= అని, అహాదిస్తుః = పలుకుచుండిరి,

తా॥ ఓ యమునానదీ! బ్రాహ్మణులు సరియైనరాజ్యపాలనము లేకపోవుటచే సోముఁడు మాకు రాజుగా నుండవలయు నని నీ యొడ్డునఁ గూర్చుండి పలుకుచున్నారు.

మూ॥ పుగ్ంసువన మసి॥

పదవి॥ పుంసువనం । అసి ॥

టీక॥ పుంసువనం = పురుషుని బుట్టించుదానవు, అసి = అయితివి.

తా॥ ఓ సుసమా! నీవు పురుషుని బుట్టింపుము.

మూ॥ అభి ష్ట్వాఽహం దశభి రభిమృశామి దశమాస్యాయ సూతవే। యథైవ సోమః పవతే యథా సముద్ర ఏజతి ॥

పదవి॥ అభిః । త్వా । అహం । దశభిః । అభి । మృశామి । దశమాస్యాయ । సూతవే । యథా । ఏవ । సోమః । పవతే । యథా । సముద్రః । ఏజతి ॥

అ॥ అహం = నేను, అభిః = ఈ, దశభిః = పది వ్రేళ్లచేతను, త్వా=నిన్ను, అభిమృశామి = అంతటను దాకుచున్నాను, కిం = ఎందువల్ల ననఁగా, దశమాస్యాయ = పదిమాసములను భరించిన గర్భము, సూతవే = కనుటకొఱకు, యథా= ఏ ప్రకారముగాను, సోమః = సోమరసము, పవతే = జారుచున్నదో, యథా = ఏప్రకారముగాను, సముద్రః = సముద్రము, ఏజతి = కదలుచున్నదో.

తా॥ పది మాసములు భరించియున్న గర్భస్థ శిశువును గనుటకొఱకు ఈ పది వ్రేళ్లచేతను నిన్నంతటను స్పృశించుచున్నాను. ఏ ప్రకారము సోమరసము

జూచుచున్నదో సముద్రము వాయువు వలనఁ గదలుచున్నదో ఆ ప్రకారమే నీ గర్భమునుండి యీ శిశువు బయటికి వచ్చుఁగాక యని పురుషుఁడు భార్యతోఁ బలుకుచున్నాఁడు.

మూ॥ ఏవం తే గర్భ ఏజతు సహ జరాయుణా నిష్క్రమ్య। ప్రతి తిష్ఠ త్వాయుషి బ్రహ్మవర్చసి యశసి వీర్యేఽన్నాద్యే॥

పదవి॥ ఏవం। తే। గర్భః। ఏజతు। సహ। జరాయుణా। నిష్క్రమ్య। ప్రతి। తిష్ఠతు। ఆయుషి। బ్రహ్మవర్చసి। యశసి। వీర్యే। అన్నాద్యే॥

టీక॥ ఏవం=ఈ ప్రకారముగా, తే=నీయొక్క, గర్భః=గర్భమందుండు శిశువు, ఏజతు=తనస్థానమునుండి కదలుగాక, జరాయుణాసహ=మావితోఁగూడ, నిష్క్రమ్య=బయటికివచ్చి, ఆయుషి=ఆయుస్సునందునను, బ్రహ్మవర్చసి=బ్రహ్మవర్చస్సునందునను, యశసి = కీర్తియందునను, వీర్యే = పరాక్రమమందునను, అన్నాద్యే=ఆహారభక్షణయందునను, ప్రతితిష్ఠతు=ప్రతిష్ఠ గలిగియుండుగాక.

తా॥ ఈ ప్రకారముగా నీ గర్భమందుండు శిశువు మావితోఁగూడ బయటికి వచ్చి ఆయుస్సు బ్రహ్మవర్చస్సు కీర్తి పరాక్రమము ఆహారభక్షణము వీనియందు పటుత్వము కలిగియుండుఁగాక.

మూ॥ దశ మాసాం శ్ఛశయానో ధాత్రా హి తథాకృతం॥

పదవి॥ దశ। మాసాన్। చ। శయానః। ధాత్రా। హి। తథా। కృతం॥

టీక॥ గర్భః = గర్భము, దశమాసాన్ = పదిమాసములు, శయానః=వృద్ధి పొందుచు, శయనించినవిధముగానున్నది, తథా=ఆ ప్రకారము, విధాత్రా=బ్రహ్మ చేత, కృతంహి=చేయఁబడినదిగదా.

తా॥ గర్భమందుండు శిశువు శయనించిన రీతిగాఁ బదిమాసము లుండునట్లుగా బ్రహ్మచే నేర్పఱుపఁబడినది.

మూ॥ ఐతు గర్భో అక్షితో జీవో జీవంత్యాః॥

పదవి॥ ఐతు। గర్భః। అక్షితః। జీవః। జీవంత్యాః॥

టీక॥ గర్భః = నీ గర్భమందుండు శిశువు, అక్షుతః = అపాయములేనిదై, జీవః = జీవముకలదౌచు, జీవంత్యాః = జీవించియుండు నీవల్లనుండి, ఐతు = బయటికి వచ్చుఁగాక.

తా॥ నీ గర్భమందుండు శిశువు జీవముగలదై అపాయములేనిదౌచు నీకు నెంతమాత్ర మపాయము కలుగనీయక బయటికి వచ్చుఁగాక.

మూ॥ ఆయమనీ ర్యమయత గర్భ మాపో దేవీ స్సరస్వతీః ॥

పదవి॥ ఆయమనీః । యమయత । గర్భం । ఆపః । దేవీః । సరస్వతీః ॥

టీక॥ ఆయమనీః = గర్భమును, బయటికి వెడలఁజేయు, ఆపోదేవీః = జలముల నధిదేవతలగు, సరస్వతీః = సరస్వతి మొదలగు నదులారా, గర్భం = గర్భమందుండు శిశువును, (ఆ) యమయత = బయటికి వెడలఁజేయుఁడు.

తా॥ జలాధిదేవత లగు సరస్వతి మొదలగు నదులారా! మీరు శిశువును బయటికి వచ్చులాగునఁ జేయుఁడు.

మూ॥ ఐతు గర్భో అక్షుతో జీవో జీవం త్యాః ॥

( దీనికి పదవిభాగము మొదలగునవి మున్నె చెప్పఁబడినవి. )

మూ॥ తిల దేఽవపద్యస్వ న మాగ్ంస మసి నోదరం । స్థలి (రలయో రభేదః) త్ర్యవపద్యస్వ న మాగ్ం సేషు న స్నావసు ॥

పదవి॥ తిలదే । అవ । పద్యస్వ । న । మాంసం । అపి । న । ఉదరం స్థవిత్రీ । అవ । పద్యస్వ । న । మాంసేషు । న । స్నావసు ॥

టీక॥ తిలదే = ఓజరాయువా! అవపద్యస్వ = క్రిందను బడుము, మాంసమపి= మాంసమును, ఉదరం = ఉదరమును, నావపద్యస్వ = పడనియ్యకుము, స్థవిత్రీ = నీవువికలములేనిదానవై, అవపద్యస్వ = పడుము, మాంసేషు = మాంసములతోడను, స్నావసు = నాడులతోడను, నావపద్యస్వ = పడకుము॥

తా॥ ఓజరాయువా! నీవు వికలము కానిదానవై మాంసమును నాడులను పడనియ్యక నీవు మాత్రమే క్రింద పడుము.

మూ॥ న బద్ధ మసి మజ్జసు నిరైతు పృశ్ని శేవలగ్ం శునే జరాయ్వత్తవే॥

పదవి॥ న । బద్ధం । అసి । మజ్జను । నిరైతు । పృశ్ని । శేవలం । శునే । జరాయు । అత్తవే॥

టీక॥ మజ్జను = ఎముకలయందలి సారముతోడను, బద్ధం = బంధింపఁబడిన దానవు, నాసి = కావు, జరాయు = మావి, పృశ్ని = స్వల్పరూపమైనదౌచు, శేవలం = సుఖముకలుగునట్టుగాను, శునే = కుక్కయొక్క, అత్తవే = భక్షుణకొఱకు, నిరైతు = బయటికివచ్చుఁగాక॥

తా॥ ఈ జరాయువు నాడులతో జుట్టఁబడక స్వల్పరూపమును బొంది శునకము భక్షించుటకు సుఖముగా బయలువెడలుఁగాక.

ఇతి ఏకాదశఖండస్సమాప్తః

---

## —♦ అథద్వాదశఖండః ♦—

మూ॥ దివ స్పరి ప్రథమం జజ్ఞే అగ్ని రస్మ ద్ద్వితీయం పరి జాతవేదాః। తృతీయ మప్సు నృమణా అజస్ర మింధాన ఏనం జరతే స్వాధీః॥

పదవి॥ దివః । పరి । ప్రథమం । జజ్ఞే । అగ్నిః । అస్మత్ । ద్వితీయం । పరి । జాతవేదాః । తృతీయం । అప్సు । నృమణాః । అజస్రం । ఇంధానః । ఏనం । జరతే । స్వాధీః॥

టీక॥ జాతవేదాః = పుట్టిన ప్రజ్ఞగలవాడును, నృమణాః=భక్తులైన మనుష్యులయందు ప్రేమగలవాఁడునగు, అగ్నిః = అగ్నిహోతృఁడు, ప్రథమం = ముందుగా, దివస్పరి=ఆకాశము వలన, జజ్ఞే = పుట్టెను, ద్వితీయం = రెండవతూరి, అస్మత్పరి = మనవలన, జజ్ఞే = పుట్టెను, తృతీయం = మూడవతూరి, అప్సు = ఉదకములయందు, జజ్ఞే = పుట్టెను, స్వాధీః = స్థిరచిత్తముగల పురుషుఁడు, అజస్రం = ఎల్లప్పుడు, ఏనం = ఈ యగ్నిహోత్రుని, ఇంధానః = ప్రజ్వలింపఁ జేసినవాఁడై, జరతే = స్తోత్రమును జేయుచున్నాఁడు.

తా॥ విశేషజ్ఞానము గలవాఁడును భక్తులయందు ప్రేమగలవాఁడునైన అగ్నిహోతృఁడు ముందుగా సూర్యరూపముగా నాకాశమువల్లను, పిమ్మట మనవల్ల నన

గా యజమానుని వల్లను, దర్వాత బడబాగ్ని రూపముగా నుదకములయందునుబుట్టెను. ఇటువంటి యగ్నిహోత్రుని మనుష్యుఁడు స్థిరచిత్తము గలవాఁడై ప్రజ్వలింపఁజేసి స్తుతించుచున్నాఁడు.

మూ॥ విద్మా తే అగ్నే త్రేధా త్రయాణి విద్మాతె సద్మ విభృతం పురుత్రా। విద్మా తే నామ పరమంగుహా య ద్విద్మాత ముత్సం యత ఆజగంథ॥

పదవి॥ విద్మ। తే। అగ్నే। త్రేధా। త్రయాణి। విద్మ। తే। సద్మ। విభృతం। పురుత్రా। విద్మ। తే। నామ। పరమం। గుహా।యత్। విద్మ। తం। ఉత్సం। యతః ఆ। జగంథ॥

టీక॥ అగ్నే=ఓ యగ్నిహోత్రుఁడా! తే=నీయొక్క, త్రేధా=మూడు విధములుగా సేర్పడిన త్రయాణి = మూడురూపములను, విద్మ = గుర్తెఱుగుదును, తే=నీయొక్క పురుత్రా=విస్తారమై లేక అనేకవిధములుగా నుండిన, సద్మ = స్థానమును, విద్మ=గుర్తెఱుఁగుదును, తే = నీయొక్క, పరమం = విశేషమైనదై, గుహా=రహస్యమైన, యత్=ఏ, నామ = పేరుగలదో, తత్=దానిని, విద్మ = గుర్తెఱుగుదును, త్వం=నీవు, యతః=ఎక్కడనుండి, ఆజగంథ=వచ్చితివో, తం = అటువంటి, ఉత్సం=ఉత్పత్తిస్థానమును, విద్మ=గుర్తెఱుఁగుదును.

తా॥ ఓ యగ్నిహోత్రుఁడా! పృథివ్యాకాశ స్వర్గముల మూడింటియందున నున్న అగ్నివాయ్వాదిత్యులు అనెడు మూడురూపములను నేనెఱుగుదును. గార్హపత్యాహవనీయదక్షిణాగ్ని రూపములైన నీ స్థానములను గుర్తెఱుఁగుదును. అజ్ఞానులకుఁ దెలియశక్యము గాని నీ యధికమయినరూపమును దెలిసికొంటిని. నీ వెచ్చట జనియించితివో యట్టిస్థానమును దెలిసికొంటిని.

మూ॥ సముద్రే త్వా నృమణా అ ప్స్వంత ర్నృచక్షా ఈధే దివో అగ్న ఊధన్। తృతీయే త్వా రజసి తస్థివాగ్ంస మృతస్య యోనా మహిషా అహిన్వన్॥

పదవి॥ సముద్రే। త్వా। నృమణాః। అప్సు। అంతః। నృచక్షాః। ఈధే। దివః। అగ్నే। ఊధన్। తృతీయే। త్వా। రజసి। తస్థివాంసం। ఋతస్య। యోనౌ। మహిషాః। అహిన్వన్॥

టీక॥ అగ్నే = ఓ యగ్నిహోత్రుఁడా! నృమణాః = లోకుల యనుగ్రహము అనఁగా లోకోపకారము నిమిత్తము, సముద్రే = సముద్రమందు, అప్సు = జలములయందు, అంతః = లోపలను ఉన్నట్టి, త్వా = నిన్ను, ఈధే = ఆజ్యాది హవిస్సుచేత ప్రజ్వలింపఁ జేయుచున్నాఁడు. దివః = స్వర్గలోకమునకు, ఊధః = దిగువభాగముననుండిన సూర్యుఁడు, నృచక్షాః = లోకుల పుణ్యపాపములను జూచుచు, త్వాం = నిన్ను, ఈధే = ప్రజ్వలింపఁజేయుచున్నాఁడు, మహిషాః = పెద్దలు, ఋతస్య = జలమునకు, యోనౌ = కారణమైన, తృతీయేరజసి = మూడవలోకమైన స్వర్గంబున, తస్థివాంసం = ఉన్నవానిఁగా, అహిన్వన్ = నిన్నుఁ దెలిసికొనిరి.

తా॥ ఓ యగ్నిహోత్రుఁడా! ప్రతి మనుష్యుడును లోకోపకారబుద్ధిచే ఆజ్యాదిహవిస్సులచే, సముద్రమధ్యంబున బడబాగ్ని రూపముగా నుండియున్న నిన్ను ప్రజ్వలింపఁజేయుచున్నాఁడు. స్వర్గమునకు దిగువభాగంబున నున్న కర్మసాక్షి యగు సూర్యుఁడును నిన్నుఁ బ్రకాశింపఁజేయుచున్నాడు. ఉదకములకుఁ గారణభూతుఁడవైన నిన్ను త్రివిష్టప మనఁబడు స్వర్గలోకమునందు నున్నవానిఁగాఁ బెద్దలు తెలిసికొనుచున్నారు.

మూ॥ అక్రంద దగ్ని స్తనయ న్నివ ద్యౌః క్షామా రేరిహ ద్వీరుధ
స్సమంజన్ । సద్యో జజ్ఞానో వి హీ మిద్ధో అఖ్య దారోదసీ
భానునా భా త్యంతః ॥

పదవి॥ అక్రందత్ । అగ్నిః । స్తనయన్ । ఇవ । ద్యౌః । క్షామా । రేరిహత్ । వీరుధః । సం । అంజన్ । సద్యః । జజ్ఞానః । వి । హి । ఈం । ఇద్ధః । అఖ్యత్ । ఆ । రోదసీ । భానునా । భాతి । అంతః ॥

టీక॥ ద్యౌః = ఆకాశమునందు, స్తనయన్నివ = మేఘుఁడువలెనే, అగ్నిః = అగ్నిహోత్రుఁడు, అక్రందత్ = ధ్వనిఁజేయుచు, క్షామా = భూమియందు, సమంజన్ = అంతటను వ్యాపించుచు, వీరుధః = పొదరిండ్లుమొదలగువానిని రేరిహత్ = భక్షించెను, కించ = ఇంతియేకాదు, జజ్ఞానః = అడవియందుఁబుట్టినవాఁడై, సద్యః = అప్పుడే, ఇద్ధః = మండుచు, వ్యఖ్యత్ = విశేషముగా ప్రకాశించెను, ఆరోదసీ =

ఆకాశభూములయొక్క, అంతః = మధ్యప్రదేశమునందు, భానునా = తనకాంతిచేత, భాతి = ప్రకాశించుచున్నాడు.

తా॥ ఆకాశమునందు మేఘుఁడువలెనే భూమియందు అగ్నిహోతృఁడు అంతటను వ్యాపించి ధ్వనిచేయుచు అడవిప్రదేశంబున బొదరిండ్లు మొదలగువానిని భక్షింపుచుఁ బుట్టినతోడనే మిక్కిలిమండుచు భూమికి ఆకాశమునకు మధ్యనుండు ప్రదేశము నంతయుఁ దనదీప్తిచే నింపి విశేషముగాఁ బ్రకాశించుచున్నాఁడు.

మూ॥ ఉశి క్పావకో అరతి స్సుమేధా మ ర్త్యే ష్వగ్ని రమృతో నిధా
యి ఇయ ర్తి ధూమ మరుషం భరిభ్ర దు చ్ఛుక్రేణ శోచిషా
ద్యా మినక్షత్॥

పదవి॥ ఉశిక్ । పావకః । అరతిః । సుమేధాః । మ ర్త్యేషు । అగ్నిః । అమృతః । నిధాయి । ఇయ ర్తి । ధూమం । అరుషం । భరిభ్రత్ । ఉత్ । శుక్రేణ । శోచిషా । ద్యాం । ఇనక్షత్॥

టీక॥ ఉశిక్ = కోరఁదగినవాఁడును, పావకః = పవిత్రుఁడును, అరతిః = వచ్చెడువాఁడును, సుమేధాః = మంచిప్రజ్ఞగలవాఁడునుఅగు, అగ్నిః = అగ్నిహోతృఁడు, మ ర్త్యేషు = మనుష్యలోకంబున, అమృతః = ఎప్పుడునునశింపనివాఁడుగా, నిధాయి = ఉంచఁబడెను, సః=ఆయగ్నిహోతృఁడు, ధూమం=పొగను, ఉదియ ర్తి= వెళ్ళఁబుచ్చుఁచున్నాఁడు, అరుషం = విశేషమైన కాంతిని, భరిభ్రత్ = ధరించుచున్నాఁడు, శుక్రేణ = పరిశుద్ధమైన, శోచిషా = కాంతిచేతను, ద్యాం = ఆకాశమును, ఇనక్షత్ = వ్యాపించును.

తా॥ భక్తులు కోరదగినవాఁడును, పవిత్రుఁడును, ఎచ్చటనైనను బుట్టువాఁడును, మంచిప్రజ్ఞగలవాఁడునైన యగ్నిహోత్రుఁడు భూలోకంబున నెల్లప్పుడును నశింపనివాఁడుగాఁ జేయఁబడినందున ఆ యగ్నిహోత్రుఁడు ప్రజ్వరిల్లుచు ధూమమును వెళ్ళఁబుచ్చుచు కాంతినిధరించుచు దనకాంతిని నాకాశమునం దంతటను వ్యాపింపఁ జేయుచున్నాడుఁ.

మూ॥ విశ్వస్య కేతు భువనస్య గర్భ ఆరోదసీ అపృణా జ్జాయమానః
వీడుంచి దద్రి మభిన త్పరాయం జనా యదగ్ని మయజంత
పంచ॥

పదవి॥ విశ్వస్య । కేతుః । భువనస్య । గర్భః । ఆ । రోదసీ । అపృణాత్ । జాయమానః । వీడుం । చిత్ । అద్రిం । అభినత్ । పరాయన్ । జనాః । యత్ । అగ్నిం । అయజంత । పంచ ॥

టీక॥ విశ్వస్య = సమస్తమును, కేతుః = చూచువాఁడును, భువనస్య = ప్రపంచముయొక్క, గర్భః = హృదయమందు జఠరాగ్నిగా నుండువాఁడునగు అగ్నిహోతృఁడు, జాయమానః = పుట్టినవాఁడై, ఆరోదసీ = భూమ్యంతరిక్షములమధ్యను, అపృణాత్ = వ్యాపించును. యత్ = ఎప్పుడు, పంచ = అయిదువర్ణములుగల, జనాః = మనుష్యులు, అగ్నిం = అగ్నిహోతృని, అయజంత= పూజించుచున్నారో, తదా = అప్పుడు, వీడుం = దృఢమైన, అద్రిమపి = పర్వతమునైనను, అభినత్ = భేదించి, పరాయన్ = వెళ్ళును.

తా॥ ప్రపంచమునందు సుకృత దుష్కృతములను జూచుచు సమస్త జంతువులయొక్క గర్భములయందు వైశ్వానరరూపముగాఁ బుట్టినవాఁడై భూమ్యంతరిక్షముల మధ్య వ్యాపించుచున్నాఁడు. కిరాతులతోఁ గూడ నయిదు వర్ణములు గల మనుష్యు లెప్పుడు అగ్నిని బూజించుచున్నారో యప్పుడు దృఢమైన పర్వతమునైనను భేదించి రాఁగలఁడు.

మూ॥ శ్రీణాముదారో ధరుణో రయీణాం మనీషాణాం ప్రార్పణః సోమగోపాః । వసోః సూనుస్సహసో అప్సు రాజా విభాత్యగ్ర ఉషసా మిధానః ॥

పదవి॥ శ్రీణాం । ఉదారః । ధరుణః । రయీణాం । మనీషాణాం । ప్రార్పణః । సోమగోపాః । వసోః । సూనుః । సహసః । అప్సు । రాజా । విభాతి । అగ్రే । ఉషసాం । ఇధానః॥

టీక॥ శ్రీణాం = సంపత్తులను, ఉదారః=సృజించువాఁడును, రయీణాం = ధనములయొక్క, ధరుణః = ధరించినవాఁడును, మనీషాణాం = బుద్ధులయొక్క, ప్రార్పణః = ఇచ్చువాఁడును, సోమగోపాః = చంద్రునైననురక్షించువాఁడును, వసోః = ప్రకాశస్తుఁడును, సహసః = బలమునకు, సూనుః = కుమారుఁడును, అప్సు= జలమునందు, రాజా = ప్రకాశించువాఁడును అగుఅగ్నిహోతృఁడు, ఉషసాం =

పాత్రికాలములయొక్క, అగ్రే = ముందు, ఇదానః = ప్రజ్వలింపజేయబడినవాడై విభాతి = ప్రకాశించుచున్నాఁడు॥

తా॥ సంపత్తులను గలుగఁజేయువాఁడును ధరించువాఁడును మంచిబుద్ధుల నిచ్చువాఁడును చంద్రునకు వెలుగు నిచ్చువాఁడును ప్రశస్తుఁడును బలమువలనఁ గలుగువాఁడును జలమునందు మెఱుపురూపంబునఁ గాని బడబాగ్నిరూపంబునఁ గాని ప్రకాశించునట్టి యగ్నిహోత్రుఁడు ప్రతిదినమందున నుదయంబున యజమానులచేత ప్రజ్వలింపఁజేయఁబడినవాఁడై ప్రకాశించుచున్నాఁడు.

మూ॥ య స్తే అద్యకృణవ ద్భద్రశోచే పూపం దేవ ఘృతవంత మగ్నే ప్ర త న్నయ ప్రతరాం వస్యో అచ్ఛాభి ద్యుమ్నం దేవభ క్తం యవిష్ఠ॥

పదవి॥ యః। తే। అద్య। కృణవత్। భద్రశోచే। అపూపం। దేవ। ఘృతవంతం। అగ్నే। ప్ర। తం। నయ। ప్రతరాం। వస్యః। అచ్ఛ। అభి। ద్యుమ్నం। దేవభ క్తం। యవిష్ఠ॥

టీ॥ భద్రశోచే = కల్యాణములచే ప్రకాశించువాఁడా! దేవ = దేవుడా! అగ్నే = అగ్నిహోత్రుఁడా! యః = ఏ మనుష్యుఁడు, అద్య = ఇప్పుడు, తే = నీకొఱకు, ఘృతవంతం = ఆజ్యముతోఁగూడిన అపూపం = అపూపమును అనఁగా పురోడాశమును, కృణవత్ = హోమముచేయుచున్నాఁడో, యవిష్ఠ = పిన్నవయస్సుగల యోయగ్నిహోత్రుఁడా! దేవభ క్తం = దేవునియందు భ క్తిగల, తం = ఆపురుషుని, వస్యః = స్వాధీనమైన, (శ్రేయః) = శుభములను, అచ్ఛ = పొందుకొఱకు, ప్రణయ = పొందింపుము (అనుగ్రహింపుము) ద్యుమ్నం = ధనమును, అభిప్రతరాంనయ = విశేషముగా పొందింపుము.

తా॥ శుభములచే ప్రకాశించువాఁడును దేవుఁడునగు నో యగ్నిహోత్రుఁడా! ఏ మనుష్యుఁడు నీకొఱకు ఆజ్యముతోఁ గూడినపురోడాశము నిచ్చుచున్నాఁడో దేవునియందు భ క్తిగల యట్టిపురుషునికి నీస్వాధీనమైనశుభములను ధనమును గలుగునట్లు చేయుము.

మూ॥ ఆ తం భజ సౌశ్రవసే ష్వగ్న ఉక్థ ఉక్థ ఆభజ శస్యమానే ప్రియ స్సూర్యే ప్రియో అగ్నా భవా త్యుజ్జాతేన భినద దుజ్జనిత్వైః॥

పదవి॥ ఆ । తం । భజ । సౌశ్రవసేషు । అగ్నే । ఉక్థే । ఉక్థే । ఆ । భజ । శస్యమానే । ప్రియః । సూర్యే । ప్రియః । అగ్నా । భవాతి । ఉత్ । జాతేన । భినత్ । ఉత్ । జనిత్వైః॥

టీక॥ అగ్నే = ఓయగ్నిహోతృుఁడా! తం = ఆపురోడాశమునిచ్చునట్టి పురుషునిఁ, ఆభజ = ఆశ్రయించి యుండుము, సౌశ్రవసేషు = యోగ్యమైనయజ్ఞములయందును, శస్యమానే = ప్రశస్తమైన, ఉక్థేఉక్థే=ప్రతిశస్త్రమందునను, తం= ఆ పురుషుని, ఆభజ = ఆశ్రయించియుండుము, సః = ఆ పురుషుఁడు, సూర్యే =సూర్యునను, ప్రియః = ఇష్టుఁడగుచున్నాఁడు, తస్య = ఆపురుషునను, అగ్నా = అగ్నిహోత్రుడు, ప్రియః = ఇష్టుఁడు, భవాతి = అగుచున్నాఁడు, సః = ఆపురుషుఁడు, జాతేన = పుట్టిన తనయులచేతను, ఉద్భినత్ =ప్రకాశించుఁగాక, జనిత్వైః = కలుఁగఁబోయెడు తనయులచేతను, ఉద్భినత్ = ప్రకాశించుఁగాక.

తా॥ ఓయగ్నిహోతృుఁడా! పురోడాశము నిచ్చునట్టి యాపురుషుని సమీపమం దుండి ప్రతియజ్ఞమునందును ప్రతియుద్ధమునందును గాపాడుచుండుము. అట్టివానికి సూర్యుఁడును నీవును ఇష్టులుగా నుందురు. ఆ పురుషుడు పుట్టినట్టియుఁ బుట్టబోవునట్టియు దనయులచేత ప్రకాశించుచుండును.

మూ॥ త్వా మగ్నే యజమానా అనుద్యూ న్విశ్వావసూని దధిరే వార్యాణి త్వయా సహ ద్రవిణ మిచ్ఛమానా వ్రజం గోమంత ముశిజో వివవ్రుః॥

పదవి॥ త్వాం । అగ్నే । యజమానాః । అను । ద్యూన్ । విశ్వా । వసూని । దధిరే । వార్యాణి । త్వయా । సహ । ద్రవిణం । ఇచ్ఛమానాః । వ్రజం । గోమంతం । ఉశిజః । వివవ్రుః॥

టీక॥ అగ్నే = ఓయగ్నిహోతృుఁడా! యజమానాః = యజమానులు, అను ద్యూన్ = ప్రతిదినంబునను, వార్యాణి = కోరదగిన, విశ్వా = సమస్తమైన,

వసూని=ధనములను, దధిరే=ధరించిరి, ఉశిజః=ప్రిజ్ఞావంతులైన అంగిరస్సు మొదలగువారు, దస్యివిణం=రాతుసులచేత నపహరింపఁబడిన గోధనమును తెచ్చుటకు, ఇచ్ఛమానాః=కోరినవారై, త్వయాసహ=నీతో గూడ వెళ్ళి, గోమంతం=గోవులుగల, వ్రజం=గోష్ఠమును ప్రివేశించి, వివవ్రిః=కవాటమును దెఱచిరి॥

తా॥ ఓ యగ్నిహోత్రుడా! యజమానులు ప్రతిదినంబునను నిన్ను బూజించి కోరదగిన సమస్తమైన ధనములను బొందుచున్నారు. పూర్వమందు దేవతల సంబంధమైన ధేనువును రాతుసు లపహరించి యొక రహస్యప్రిదేశమునందు దాచి యుంచగా బృహస్పతి మొదలగువారు నిన్ను దీసికొని వెళ్ళఁగా వారికి నంధకార ప్రిదేశమునరదు మార్గముఁ గనపఱచితివి కావున వారప్పుడు లోపలికి వెళ్ళి యా గోవు లుండు స్థానమునుండి వెళ్ళి గోవును తెచ్చిరి.

మూ॥ దృశానోరుక్మ ఉర్వ్యా వ్యద్యౌ ద్దుమర్షమాయుశ్శ్రియె
రుచానః । అగ్నిరమృతో అభవద్వయోభి ర్యదేనం ద్యౌ
రజనయ త్సురేతాః ॥

పదవి॥ దృశానః । రుక్మః । ఉర్వ్యా । వి । అద్యౌత్ । దుమర్షం । ఆయుః । శ్రియె । రుచానః । అగ్నిః । అమృతః । అభవత్ । వయోభిః । యత్ । ఏనం । ద్యౌః । అజనయత్ । సురేతాః ॥

టీ॥ దృశానః = చూడఁదగినవాఁడునై, రుక్మః = ప్రికాశించుస్వభావము గల అగ్నిహోత్రుఁడు, ఉర్వ్యా = విశేషమైన కాంతిచేత, దుమర్షం = సహింపశక్యము కానట్టిగా, వ్యద్యౌత్ = విశేషముగా ప్రికాశించుచున్నాఁడు, యత్ = ఎప్పుడు, సురేతాః = శుభరూపమైన రేతస్సుగల, ద్యౌః = ఆకాశము, వయోభిః = హవిస్సురూపమైన అన్నములచేతను, ఏనం = ఈయగ్నిహోత్రుని, అజనయత్ = పుట్టించెనో, తదా = అప్పుడు, ఆయుః = ఆయువున్నకొఱకును, శ్రియె = సంపత్తు కొఱకును, రుచానః = ప్రికాశించువాఁడై, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, అమృతః= నశింపనివాఁడు, అభవత్ = ఆయెను.

తా॥ దూరమునందుండినను అగపడువాఁడై ప్రికాశించునట్టి యగ్నిహోత్రుఁడు విశేషమైన కాంతిచేత నితరులు చూచుటకు శక్యము కానట్లు ప్రికాశించును

వర్చ-మే రేతస్సుగాఁ గల యీ శరీరము హవిస్సురూపమైన అన్నముచే నెప్పుడు వృద్ధించెనో అప్పుడు అగ్నిహోత్రుఁడు ప్రాణులయొక్క ఆయుస్సుకొఱకును సంపత్తుకొఱకును నశింపనివాఁడుగా నుండి యున్నాఁడు.

మూ॥ అస్మి న్నహగ్ం సహస్రం పుష్యా మ్యేధమానా స్వే వశే। అంగా దంగా త్సంభవసి హృదయా దధిజాయసే । ఆత్మా వై పుత్రనా మాఽసి సజీవ శరద శ్శతమ్॥

పదవి॥ అస్మిన్ । అహం । సహస్రం । పుష్యామి । ఏధమానః । స్వే । వశే । అంగాత్ । అంగాత్ । సంభవసి । హృదయాత్ । అధి । జాయసే । ఆత్మా । వై । పుత్రనామా । అసి । సః । జీవ । శరదః । శతం॥

టీక॥ అహం = నేను, అస్మిన్ = ఈకుమారునియందు, సహస్రం = వెయ్యి కోరికలను, పుష్యామి = పొందఁగలను, అయం = ఈపిల్లవాఁడు, స్వేవశే = స్వతంత్రమందున్న వాఁడై, ఏధమానః = వృద్ధిపొందుచుండును, పుత్ర = ఓకుమారుఁడా! అంగాదంగాత్ = ప్రతియవయవమునుండి, సంభవసి = పుట్టితివి, హృదయాదధి = హృదయమువల్లను, జాయసే = పుట్టితివి, త్వం = నీవు, పుత్రనామా = కుమారుడను పేరుగల, ఆత్మావై = నాస్వరూపమే, అసి = అయితివి, సః = అటువంటి, త్వం = నీవు, శతం = నూఱు, శరదః = సంవత్సరములు, జీవ = బ్రతికియుండుము.

తా॥ నేను ఈకుమారునివలన అనేకమైనసంతోషములను బొందెదను. ఈ పిల్లవాఁడు స్వతంత్రముగా జీవించుచు వృద్ధిపొందుగాక. ఓ కుమారా! నీవు నా ప్రతియవయవమునుండి మఱియు మనోరూపమైన హృదయమునుండియుఁ బుట్టితివి. కాఁబట్టి నీవు కుమారుఁడను పేరుగల నా స్వరూప మైతివి. ఇట్టినీవు నూఱుసంవత్సరముల పర్యంతము జీవించి యుండుదువుగాక.

ఇతి ద్వాదశఖండస్సమాప్తః.

---

—♦ త్రయోదశ ఖండః ♦—

మూ॥ అశ్మా భవ పరశు ర్భవ హిరణ్య మస్తృతం భవ పశూనాం త్వా హింకారే ణాఽభిజిఘ్రా మ్యసౌ॥

పదవి॥ అశ్మా । భవ । పరశుః । భవ । హిరణ్యం । అస్తృతం । భవ । పశూనాం । త్వా । హింకారేణ । అభి । జిఘ్రామి । అసౌ॥

టీక॥ అశ్మా = రాయివలెనేస్థిరముగా, భవ = ఉండుము, పరశుః = గొడ్డలివలె నేతీక్ష్ణముగా, భవ = ఉండుము, అస్తృతం = మలినముచేఁగప్పఁబడని, హిరణ్యం = బంగారమువలెనే, భవ = ఉండుము, అసౌ = ఓవత్సా! త్వా = నిన్ను, పశూనాం = పశువులయొక్క, హింకారేణ = హింకారముచేత, అభిజిఘ్రామి = ఆఘ్రాణించుచున్నాను.

తా॥ ఓపిల్లవాఁడా! నీవు రాయివలె స్థిరముగాను, గొడ్డలివలె నితరులకు నసాధ్యుఁడవుగాను, మలినములేనిబంగారమువలెఁ బ్రకాశించువాఁడవుగా నుండుము. పశువులు ప్రేమచేఁ దమదూడల నేతీరుగ నాఘ్రాణించునో ఆ తీరుననే నిన్ను ఆఘ్రాణించుచున్నాను.

మూ॥ మేధాం తే దేవ స్సవితా మేధాం దేవీ సరస్వతీ । మేధాం తే అశ్వినౌ దేవా వా ధత్తాం పుష్కరస్రజా॥

పదవి॥ మేధాం । తే । దేవః । సవితా । మేధాం । దేవీ । సరస్వతీ । మేధాం । తే । అశ్వినా । దేవా । అధత్తాం । పుష్కరస్రజా॥

టీక॥ దేవః = దేవుఁడగు, సవితా = సూర్యుఁడు, తే = నీకొఱకు, మేధాం= ధారణాబుద్ధిని, అదధాతు = చేయుఁగాక, దేవీ = దేవతయగు, సరస్వతీ = సరస్వతి, మేధాం = ధారణాబుద్ధిని, అదధాతు = చేయుఁగాక, దేవా = దేవతలగు పుష్కరస్రజౌ = పద్మమాలికలనుధరించిన, అశ్వినా = అశ్వినులుఇద్దఱును, తే = నీకొఱకు, మేధాం = ధారణాబుద్ధిని, అదధాతు = చేయుఁగాక॥

తా॥ సూర్యుఁడును సరస్వతీదేవియుఁ పద్మమాలికలను ధరించిన అశ్వినీదేవతలిద్దఱును నీకు నెల్లప్పుడు జ్ఞాపకముగలబుద్ధి కలుగునట్లు చేయుదురుగాక,

మూ॥ త్వయి మేధాం త్వయి ప్రజాం త్వ యగ్ని స్తేజో దధాతు। త్వయి మేధాం త్వయి ప్రజాం త్వ యీంద్ర ఇంద్రియం దధాతు। త్వయి మేధాం త్వయి ప్రజాం త్వయి సూర్యో భ్రాజో దధాతు॥

పదవి॥ త్వయి। మేధాం। త్వయి। ప్రజాం। త్వయి। అగ్నిః। తేజః। దధాతు। త్వయి। మేధాం। త్వయి। ప్రజాం। త్వయి। ఇంద్రః। ఇంద్రియం। దధాతు। త్వయి। మేధాం। త్వం। ప్రజాం। త్వయి। సూర్యః। భ్రాజః। దధాతు॥

టీక॥ త్వయి = నీయందు, మేధాం = తెలివిని, త్వయి = నీయందు, ప్రజాం = సంతానమును, త్వయి = నీయందు, తేజః = తేజస్సును, అగ్నిః = అగ్నిహోత్రుఁడు, దధాతు = కలుగఁజేయుఁగాక, ఇంద్రః = ఇంద్రుఁడు, త్వయి = నీయందు, మేధాం = తెలివిని, త్వయి = నీయందు, ప్రజాం = సంతానమును, ఇంద్రియం = రేతస్సును, దధాతు = కలుగఁజేయుఁగాక, సూర్యః = సూర్యుఁడు, త్వయి = నీయందు, మేధాం = తెలివిని, త్వయి = నీయందు, ప్రజాం = సంతానమును, త్వయి = నీయందు, భ్రాజః = ప్రకాశమును, దధాతు = కలుగఁజేయుఁగాక.

తా॥ అగ్నిహోత్రుఁడు తెలివిని, సంతానమును, కాంతిని, ఇంద్రుఁడు తెలివిని, సంతానమును, రేతస్సును, సూర్యుఁడు తెలివిని, సంతానమును, ప్రకాశమును నీకుఁ గలుగఁజేతురుగాక.

మూ॥ క్షేత్రియై త్వా నిర్ ఋత్యై త్వా ద్రుహో ముంచామి వరుణస్య పాశాత్। అనాగసం బ్రహ్మణే త్వా కరోమి। శివే తే ద్యావాపృథివీ ఉభే ఇమే॥

పదవి॥ క్షేత్రియై। త్వా। నిర్ ఋత్యై। త్వా। ద్రుహో। ముంచామి। వరుణస్య। పాశాత్। అనాగసం। బ్రహ్మణె। త్వా। కరోమి। శివే। తే। ద్యావాపృథివీ। ఉభే। ఇమే॥

టీక॥ క్షేత్రియై = చికిత్సజేయతగిన వ్యాధివల్లను, (పంచమ్యర్థమందు చతుర్థి) త్వా = నిన్ను, ముంచామి = విడిచిపెట్టించుచున్నాను, త్వా = నిన్ను,

నిర్ ఋత్యై = రాక్షసులనుండియు, ద్రుహే = ద్రోహముచేయువానినుండియు, వరుణస్య = వరుణదేవునియొక్క, పాశాత్ = త్రాటి నుండియు, ముంచామి = విడిచిపెట్టించుచున్నాను, అనాగసం = నిరపరాధుఁడవైన, త్వా = నిన్ను, బ్రహ్మణే = వేదమునకొఱకు, కరోమి = చేయుచున్నాను, ఉభే = రెండైన, ఇమే = ఈ, ద్యావాపృథివీ = స్వర్గభూలోకములు, తే = నీకు, శివే = మంగళప్రదము లగుఁగాక॥

తా॥ ఓవత్సా! చికిత్సఁ జేయదగినవ్యాధియు రాక్షసునిసంబంధమైనభయమును ఇతరునివలని ద్రోహమును వరుణుని పాశభయమును నిన్ను నంటకుండు నట్లుగాఁ జేయుచున్నాను. దోషరహితుండవైననిన్ను వేదపఠనమునకు దగినవానిగాఁ జేయుచున్నాను. గాన ఈ భూమ్యంతరిక్షములు నీకు శుభములను గలుగఁజేయుచుండుఁగాక॥

మం॥ శం తే అగ్ని స్సహాఽద్భి రస్తు శం ద్యావా పృథివీ సహౌషధీభిః। శ మంతరిక్షుగ్ం సహ వాతేన తే శంతే చతస్రః ప్రదిశో భవంతు॥

పదపా॥ శం। తే। అగ్నిః। సహ। అద్భిః। అస్తు। శం। ద్యావాపృథివీ। సహ। ఓషధీభిః। శం। అంతరిక్షం। సహ। వాతేన। తే। శం। తే। చతస్రః। ప్ర। దిశః। భవంతు॥

టీక॥ అగ్నిః=అగ్నిహోత్రుఁడు అద్భిస్సహ = ఉదకములతోఁగూడ, తే = నీయొక్క, శం = సుఖమునుగుఱించి, అస్తు = అగుఁగాక, ద్యావాపృథివీ = ఆకాశభూములు, సహౌషధీభిః = ఓషధులతోఁగూడ, తే = నీయొక్క, శం = సుఖమునుగుఱించి, స్తాం = అగుఁగాక, అంతరిక్షం = ఆకాశము, వాతేనసహ = వాయువుతోఁగూడ, తే = నీయొక్క, శం = సుఖమునుగుఱించి, అస్తు = అగుఁగాక, తే = ఆ ప్రసిద్ధమైన, చతస్రః = నాలుగైన, ప్రదిశః = ప్రధానములైన తూర్పు మొదలగు దిక్కులు, తే = నీయొక్క, శం = సుఖమునుగుఱించి, భవంతు = అగుఁగాక॥

తా॥ ఉదకములతోఁ గూడ నగ్నిహోత్రుఁడును, ఓషధులతోఁ గూడ స్వర్గభూలోకములును, వాయువుతోఁ గూడ నంతరిక్షమును ప్రసిద్ధములైన తూర్పు మొదలగు ప్రధానదిక్కులు నాలుగును, నీకు సుఖమును గలుగఁజేయుగాక.

మూ॥ యా దైవీ శ్చతస్రః ప్రదిశో వాతపత్నీ రభి సూర్యో
విచష్టే। తాసాం త్వా జరస ఆదధామి ప్ర యక్ష్మ ఏతు
నిర్‌ఋతిం పరాచైః॥

పదవి॥ యాః। దైవీః। చతస్రః। ప్ర। దిశః। వాతపత్నీః। అభి। సూర్యః। విచష్టే। తాసాం। త్వా। జరసః। ఆ। దధామి। ప్ర। యక్ష్మః। ఏతు। నిర్‌ఋతిం। పరాచైః॥

టీక॥ దైవీః=దేవతాసంబంధములైనవియు, వాతపత్నీః=వాయువు పరిపాలకుడు గాగలవియు, యాః=ఏ, చతస్రః=నాలుగైన, ప్రదిశః=ప్రధానదిక్కులు గలవో, తాసాం=ఆ దిక్కులయొక్క, ఆజరసః=ముదిమిపర్యంతము అనఁగా దిక్కులు శీర్ణమగువఱకు, త్వా=నిన్ను, ఆదధామి=స్థాపించుచున్నాను, యక్ష్మః=క్షయ రోగము, పరాచైః = నీవల్లను మళ్ళిపోయి, నిఋతిం = రాక్షసుని, ప్రైతు = పొందుగాక.

తా॥ ఇంద్రుఁడు మొదలగు దేవతుల సంబంధమైనవియు వాయువుచే బరిపాలింపఁ బడునవియు తూర్పు మొదలగు ప్రధానమైన యే నాలుగుదిక్కులు గలవో ఆ దిక్కులుండు నంతకాలము నీవు నుండువుగాక. క్షయ రోగము నిన్ను విడిచి నిఋతిని బొందుఁగాక.

మూ॥ అమోచి యక్ష్మా ద్దురితా దవర్త్యై దుహః పాశా న్నిర్
ఋత్యై చోదమోచి। అ హాఽవర్తి మవిదత్స్యోనమప్యభూ
ద్భద్రేసు కృతస్య లోకే॥

పదవి॥ అమోచి। యక్ష్మాత్। దురితాత్। అవర్త్యై। ద్రుహః। పాశాత్। నిర్‌ఋత్యై। చ। ఉత్। అమోచి। అహాః। అవర్తిం। అవిదత్। స్యోనం। అపి। అభూత్। భద్రే। సుకృతస్య। లోకే॥

టీక॥ అయం = ఈ పిల్లవాఁడు, యక్ష్మాత్=క్షయరోగమనెడు, దురితాత్= పాపమువల్లను, అమోచి = విడువఁబడుగాక, అవర్త్యై = అవర్తియనెడుపాపము నుండి, అమోచి = విడువఁబడుఁగాక, ద్రుహః = ద్రోహము చేయువానియొక్క, ప్రాశాత్ = పాశమునుండి, అమోచి = విడువఁబడుఁగాక, నిర్‌ఋత్యై = రాక్షసుని

వల్లను, అమోచి = విడువఁబడుఁగాక, అవర్తిం = దారిద్ర్యమును, అహాః = పోఁగొట్టుఁగాక, స్యోనం = సుఖమును, అవిదత్ = పొందుఁగాక, సుకృతస్య = పుణ్యముయొక్క, భద్రే = శుభముల నొసఁగెడు, లోకే = లోకమునందు, అభూత్ = ఉండుఁగాక.

తా॥ ఈ పిల్లవాఁడు క్షయరోగమునుండియు అవర్తి యనుపాపమునుండియు ద్రోహముచేయువానినుండియు రాక్షసునుండియు విడువఁబడుగాక. ఈ పిల్లవాఁడు దారిద్ర్యమును బోఁగొట్టుఁగాక. సుఖమును బొందుఁదాక. శుభముల నొసఁగుపుణ్యలోకంబున నివసించుఁగాక.

మం॥ సూర్య మృతం తమసో గ్రాహ్యా యద్దేవా అముంచ న్నసృజ న్వ్యేనసః । ఏవ మహ మిమం క్షేత్రియా జ్జామిశగ్ంసా ద్ద్రుహోముంచామి వరుణస్య పాశాత్॥

పదవి॥ సూర్యం । ఋతం । తమసః । గ్రాహ్యాః । యత్ । దేవాః । అముంచన్ । అసృజన్ । వి । ఏనసః । ఏవం । అహం । ఇమం । క్షేత్రియాత్ । జామిశంసాత్ । ద్రుహః ॥ ముంచామి । వరుణస్య । పాశాత్॥

టీక॥ తమసః = రాహువుయొక్క, గ్రాహ్యాః=గ్రహణమువల్లను, ఋతం = పొందఁబడిన, సూర్యం = సూర్యుని, యత్ = ఏప్రకారముగా, దేవాః దేవతలు, అముంచన్ = విడిపించిరో, ఏనసః = పాపమువల్లను, వ్యసృజన్ = విడిపించిరో తథా = ఆప్రకారముగ, అహం = నేను, ఇమం = ఈపిల్లవానిని, క్షేత్రియాత్ = చికిత్స జేయఁదగిన వ్యాధివల్లను, జామిశంసాత్ = సోమరితనమువల్లను, ద్రుహః = ద్రోహినుండియు, వరుణస్య = వరుణునియొక్క, పాశాత్ = పాశమునుండియు ముంచామి = విడిపించుచున్నాను.

తా॥ రాహువు గ్రహణముచే సూర్యు నాక్రమింపఁగా నట్టిసూర్యుని దేవతలు విడిపించి ప్రాయశ్చిత్తమూలమునఁ బాపనివృత్తిఁ జేసిరి. అతీరుననే చికిత్సఁజేయఁదగినవ్యాధినుండియు సోమరితనము నుండియు ద్రోహినుండియు వరుణునిపాశము నుండియు ఈ పిల్లవానిని విడిపించెదను.

మం॥ భూ స్స్వాహా భువ స్స్వాహా సువ స్స్వాహా హోగ్ స్వాహా॥

తా॥ యీ మంత్రమునకు తాత్పర్యము మొదలగునవి ఈవఱలో జెప్పఁబడినవి.

ఇతి త్రయోదశఖండ స్సమాప్తః

---

—♦ చతుర్దశఖండః ప్రారంభః ♦—

మూ॥ మా తే కుమారగ్ం రక్షోఽవధీ న్మా ధేను రత్యా సారిణీ।
ప్రియా ధనస్య భూయా ఏధమానా స్స్వే గృహే॥

పదవి॥ మా । తే । కుమారం । రక్షః । అవధీత్ । మా । ధేనుః । అత్యా సారిణీ । ప్రియా । ధనస్య । భూర్యాః । ఏధమానాః । స్వే । గృహే ॥

టీక॥ జాయే = ఓ భార్యా! తే = నీయొక్క, కుమారం = తనయుని, రక్షః = రాక్షసుఁడు, మావధీత్ = హింసఁజేయకుండుఁగాక, అత్యాసారిణీ = అతిక్రమించి వెళ్ళునట్టి, ధేనుః = ఆవుగా, మాభూః = కాఁబోకుము, స్వే = మన సంబంధమైన, గృహే = గృహమందు, ఏధమానా = పిల్లవానిని బోషించుచున్నదానవై, ధనస్య = పుత్రరూపమైన ధనమునకు, ప్రియా = ఇష్టురాలవై, భూయాః=అవుము.

తా॥ ఓ భార్యా! నీ తనయుని రాక్షసుఁడు హింసఁ జేయకుండుఁగాక. దూడయుం దుండు ప్రేమచే ఆవు దూడవద్ద కరుగుసమయంబున నితరుల నెట్లు లక్ష్యముఁ జేయకుండునో ఆలాగునఁ నీవు పుత్రుని జూచుసమయంబున నితరులను నిర్లక్ష్యముఁ జేయకుము. మన గృహమందు ధనముతో సమానమైన నీ తనయుని పెంచుచుండుము.

మూ॥ అయం కుమారో జరాం ధయతు దీర్ఘ మాయుః । యస్మై త్వగ్ స్తనప్రప్యా యాఽయు ర్వర్చో యశో బలమ్॥

పదవి॥ అయం । కుమారః । జరాం । యతు । దీర్ఘం । ఆయుః । యస్మై । త్వం । స్తన । ప్రప్యాయ । ఆయుః । వర్చః । యశః । బలమ్॥

టీక॥ అయం = ఈ, కుమారః = పిల్లవాడు, జరాం = ముదిమిని, దీర్ఘం= విశేషమైన, ఆయుః = ఆయుర్దాయమును, ధయతు = పానము జేయుగాక. స్తన = ఓస్తనమా !, త్వం = నీవు, యస్మై = ఎవనికొఱకు, ఆయుః = ఆయుస్సును, వర్చః = కాంతిని, యశః = కీర్తిని, బలమ్ = బలమును, ప్రిప్యాయ = ప్రవింపజేయుచుంటివో॥

తా॥ ఓస్తనమా ! నీవు ఏ పిల్లవానికొఱకు క్షీరరూపముగా ఆయుస్సును గాంతిని గీర్తిని బలమును ఇచ్చెదవో అట్టి యీపిల్లవాఁడు చిరకాలాయుర్దాయాదులను గలుగఁజేయు నీ క్షీరములను బానము జేయుఁగాక.

మూ॥ య ద్భూమే ర్హృదయం దివి చంద్రమసి శ్రితం। త దుర్వి పశ్యం మాహం పౌత్ర్ మఘగ్ం రుదమ్ । య త్తే సుసీమే హృదయం వేదాఽహం త త్ప్రజాపతౌ । వేదామ తస్య తే వయం । మాఽహం పౌత్ర్ మఘగ్ం రుదం ॥

పదవి॥ యత్ । భూమేః । హృదయం । దివి । చంద్రమసి । శ్రితం । తత్ । ఉర్వి । పశ్యం । మా । అహం । పౌత్రం । అఘం । రుదం । యత్ । తే । సుసీమే । హృదయం । వేద । అహం । తత్ । ప్రజాపతౌ । వేదామ । తస్య । తే । తే । వయం । మా । అహం । పౌత్రం । అఘం । రుదం ॥

టీక॥ భూమేః=భూమియొక్క, యత్=ఏ, హృదయం=హృదయరూపమైన భూచ్ఛాయ, దివి=ఆకాశమునందు, చంద్రమసి=చంద్రునియందు, శ్రితం=ఆశ్రితమైయున్నదో, ఉర్వి=ఓ భూమీ ! తత్=ఆ కళంకమును, పశ్యం=చూచితిని, పౌత్రం=పుత్రులసంబంధమైన, అఘం=వ్యసనమును గూర్చి, మారుదమ్=రోదమును జేయను, సుసీమే=యోగ్యమైన ప్రదేశముగలదానా !, తే=నీయొక్క, యత్=ఏ, హృదయం = భూచ్ఛాయగలదో, తత్ = ఆ ఛాయను, ప్రజాపతౌ=ఓషధులను, పుట్టించువాఁడౌటవలను ప్రజాపతి యని చెప్పఁదగిన చంద్రునియం దున్నదానిగాను, అహం=నేను, వేద=గుర్తెఱుఁగుదును, తస్య=ఆ పూర్వోక్తమైన, తే=నీ సంబంధమైన ఛాయను, తే=ఆ ప్రసిద్ధమైన, వయం=మేము, వేదామ=గుర్తెఱుఁగుదుము, మారు అహం=నేను, పౌత్రం=పుత్రులసంబంధమైన, అఘం=వ్యసనమునుగూర్చి, మారుదం=దుఃఖింపను.

తా॥ యోగ్యమైన ప్రదేశము గల యో భూమీ! ఓషధులను పుట్టించువా డవుటచే బ్రజాపతి యనదగిన చంద్రునియందు సంక్రమించిన మనోరూపమైన నీ ఛాయను నే నెఱుగుదును. పుత్రులసంబంధమైన దుఃఖము మాకు సంభవింప కుండుగాక.

మూ॥ నాఽమయతి న రుదతి యత్ర వయం వదామసి। యత్ర చాఽభిమృశామసి॥

పదవి॥ న। అమయతి। న। రుదతి। యత్ర। వయం। వదామసి। యత్ర। చ। అభి। మృశామసి॥

టీక॥ యత్ర=ఏ ప్రదేశమందు, వయం=మేము, వదామసి=మంత్రముల నుచ్చరించుచున్నామో, యత్ర = ఏ ప్రదేశమందు, అభిమృశామసి = భూస్పర్శఁ జేయుచున్నామో, తత్ర=ఆ స్థలమందుఁ గూర్చుండియున్న, అయం=ఈ పిల్లవాడు, నామయతి=వ్యాధిచే బీడింపఁబడ కుండుఁగాక, నరుదతి=ఏడ్వకుండుఁగాక.

తా॥ మే మిచ్చటఁ గూర్చుండి భూస్పర్శఁ జేయుచు మంత్రముల బఠించుచుంటిమి కాన ఈపిల్లవాఁ డిక్కడఁ గూర్చున్నవాఁడై వ్యాధిచే బీడింపఁబడక ఏడ్వకుండుగాక.

మూ॥ ఆప స్సుప్తేషు జాగ్రత రక్షాగ్ంసి ని రితో నుదధ్వం॥

పదవి॥ ఆపః। సుప్తేషు। జాగ్రత। రక్షాంసి। నిః। ఇతః। నుదధ్వం॥

టీక॥ ఆపః=ఓ ఉదకములారా! సుప్తేషు=మేమునిద్రించుచుండఁగా,రక్షాంసి= రాక్షసులను, ఇతః = ఈప్రదేశమునుండి, నిర్ణుదధ్వం = వెడలఁగొట్టుఁడు.

తా॥ ఓయుదకములారా! మేము నిద్రించుచుండఁగా మీరు జాగరూకులై యుండి యిక్కడకు వచ్చినరాక్షసులను, వెళ్లఁగొట్టుఁడు.

మూ॥ అయం కలిం పతయంతగ్గ్ం శ్వాన మి వోద్వృద్ధం। అజాం వాసితా మివ మరుతఃపర్యాద్ధం॥

పదవి॥ అయం। కలిం పతయంతం। శ్వానం। మివ। ఉద్వృద్ధం। అజాం। వాసితాం। ఇవ। మరుతః। పర్యాద్ధం॥

టీక॥ మరుతః= ఓ దేవతలారా: ఉద్వృద్ధం = ఉద్రేకముగల, శ్వానమివ= కుక్కవలెనే, పతయంతం = పిల్లవానిగూర్చివచ్చుచున్న, అయం = ఈ, కలిం = కలి యనుభూతమును,

వాసితాం = ధ్వనిఁజేయుచున్న, అజామివ = ఆడమేకనువలెనే, పర్యాద్ధ్వం = వెళ్లఁ గొట్టుఁడు.

తా॥ ఓ దేవతలారా! మదోద్రేకముగల కుక్కవలె ఈపిల్లవానిఁగూర్చి వచ్చుచున్న యీ కలి యను పేరుగల భూతమును అఱచుచున్న మేకనువలెనే ఇక్కడనుండి వెళ్ళఁగొట్టుఁడు.

మూ॥ శండేరథ శ్శండికేర ఉలూఖలః చ్యవనో నశ్యతా దిత స్స్వాహా॥

పదవి॥ శండేరథః । శండికేరః । ఉలూఖలః । చ్యవనః । నశ్యతాత్ః ఇతః । స్వాహా॥

టీక॥ శండేరథః = శండేరథుఁడను రాక్షసుఁడును, శండికేరః = శండికేరుఁడను రాక్షసుఁడును, ఉలూఖలః = ఉలూఖలుఁడను రాక్షసుఁడును, చ్యవనః = చ్యవనుఁడను రాక్షసుఁడును, ఇతః = ఇక్కడనుండి, నశ్యతాత్ = వతియొక ప్రదేశమునకు వెళ్లుదురు గాక.

తా॥ శండేరథుఁడు శండికేరుఁడు ఉలూఖలుఁడు చ్యవనుఁడు అను రాక్షసులు ఇక్కడనుండి వెళ్ళిపోదురుగాక ॥

మూ॥ అయశ్శండో మర్క ఉపవీర ఉలూఖలః । చ్యవనో నశ్యతా దితః ॥

పదవి॥ అయశ్శండః । మర్కః । ఉపవీరః । ఉలూఖలః । చ్యవనః । నశ్యతాత్ । ఇతః॥

టీక॥ అయశ్శండః = ఇనుమువంటి ముఖముగల శండుఁడును, మర్కః = మర్కుఁడును, ఉపవీరః = విశేష పరాక్రమముగల, ఉలూఖలః = ఉలూఖలుఁడును, చ్యవనః = చ్యవనుఁడును, ఇతః = ఈ ప్రదేశమునుండి, నశ్యతాత్ = వెళ్లుదురుగాక.

తా॥ ఇనుపముఖముగల శండుఁడును మర్కుఁడును పరాక్రమముగల ఉలూఖలుఁడును, చ్యవనుఁడును, ఇక్కడనుండి వెళ్లిపోదురుగాక.

మూ॥ కేశినీ శ్శ్వలోమినీః ఖజా పోఽజోపకాశినీః । అపేత నశ్యతా దితః ॥

పదవి॥ కేశినీః । శ్వలోమినీః । ఖజాపః । అజోపకాశినీః । అపేత । నశ్య తాత్ । ఇతః ॥

టీక॥ కేశినీః = కేశినియనునదియు, శ్వలోమినీః = కుక్కయొక్క వెండ్రుకలవంటి వెండ్రుకలు గల రాక్షసియు, ఖజాపః = కుంటిదియైన ఖజాపయనునదియు, అజోపకాశినీః = మేకవలెనే నుండునదియునైన రాక్షసులను, అపేత = వెళ్లఁగొట్టుఁడు, ఇతః = ఇక్కడనుండి వెళ్ళఁగొట్టబడి యారాక్షసులు, నశ్యతాత్ = నశించిపోవుదురుగాక.

తా॥ కేశిని శ్వలోమిని ఖజాపము అజోపకాశిని యను రాక్షసు లిక్కడనుండి వెళ్ళఁగొట్టఁబడి నశింతురుగాక ॥

మూ॥ మిశ్రవాససః కౌబేరకా రక్షోరాజేనప్రేషితాః । గ్రామగ్ం సజానయో గచ్ఛం తీచ్ఛంతోఽపరిదాకృతాన్॥

పదవి॥ మిశ్రవాససః । కౌబేరకాః । రక్షోరాజేన । ప్రేషితాః । గ్రామం । సజానయః గచ్ఛంతి । ఇచ్ఛంతః । అపరిదాకృతాన్॥

టీక॥ మిశ్రవాససః = పరస్పరము కలిసికొనిన వస్త్రములు గలవారును, రక్షోరాజేన = కుబేరునిచేత, ప్రేషితాః = పంపబడినవారును, సజానయః=భార్యలతోఁ గూడినవారునగు, కౌబేరకాః = కుబేరునిభృత్యులు, అపరిదాకృతాన్ = ఉపనయనముకానిపిల్లవాండ్రను, ఇచ్ఛంతః = కోరుచున్నవారై, గ్రామం = గ్రామమును గుఱించి, గచ్ఛంతి = వెళ్ళుచున్నారు.

తా॥ పరస్పరము నొకరివస్త్రము నొకరు ధరించుచున్నవారును కుబేరునిచేఁ బంపఁబడినవారును ఉపనయనము కాకపోవుటచే దేవతలరక్షణకొఱకు నియ్యఁబడని చిన్నపిల్లలను గోరుచున్నవారై కుబేరునిభృత్యులు తమభార్యలతోఁగూడ గ్రామములఁగూర్చి వెళ్ళుచున్నారు.

మూ॥ ఏతాన్ ఘ్నతైతాన్ గృహ్ణీతేత్యయం బ్రహ్మణస్పుత్రః । తానగ్నిః పర్యసరత్తానింద్రస్తాన్బృహస్పతిః । తానహం వేద బ్రాహ్మణః ప్రమృశతః కూటదంతాన్వికేశాన్లంబన స్తనాన్॥

పదవి॥ ఏతాన్ । ఘ్నత । ఏతాన్ । గృహ్ణీత । ఇతి । అయం । బ్రహ్మణస్పుత్త్రైః । తాన్ । అగ్నిః । పర్యసరత్ । తాన్ । ఇంద్రః । తాన్ । బృహస్పతిః । తాన్ । అహం । వేద । బ్రాహ్మణః । ప్రమృశతః । కూటదంతాన్ । వికేశాన్ । లంబనస్తనాన్॥

టీక॥ బ్రహ్మణస్పుత్త్రైః=బ్రహ్మకుమారుఁడగు, అయం=ఈ, అగ్నిః=అగ్నిహోత్రుఁడు, ప్రమృశతః=బాలుర నక్కడక్కడ వెదకుచున్నవారును, కూటదంతాన్=ఉన్నతమైన పండ్లుగలవారును, వికేశాన్=వ్రేలాడుచున్న వెండ్రుకలు గలవారును, లంబనస్తనాన్=జారిన స్తనములుగలవారనగు, ఏతాన్=ఈ పిశాచములను, గృహ్ణీత = పట్టుకొనుఁడు, ఏతాన్=ఈ పిశాచములను, ఘ్నత = చంపుఁడు, ఇతి=ఈ ప్రకారము పలుకుచు, తాన్=ఆ పిశాచములఁగూర్చి, పర్యసరత్ = పలుమార్లు వెళ్ళుఁగాక, తాన్=ఆ పిశాచములగూర్చి, ఇంద్రః=ఇంద్రుఁడును, తాన్=ఆ పిశాచములగూర్చి, బృహస్పతిః=బృహస్పతియు, పర్యసరతాం=పలుమార్లు వెళ్లుదురుగాక, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడనైన, అహమపి=నేనును, తాన్=ఆ పిశాచములను, వేద=గుర్తెఱుఁగుదును.

తా॥ పిల్లల నక్కడక్కడ వెతకుచున్నవారును ఎత్తయిన దంతములు గలవారును వ్రేలాడుచుండు వెంట్రుకలు స్తనములు గలవారును నగు పిశాచములను బట్టుకొనుఁడు చంపుఁడు అనుచు బ్రహ్మకుమారుండగు నీ యగ్నిహోత్రుఁడును ఇంద్రుడును బృహస్పతియు ఆ పిశాచములఁ గూర్చి పలుమార్లు వెళ్ళుదురుగాక. నేనును ఆ రాక్షసుల నెఱుఁగుదును.

ఇతి చతుర్దశఖండ స్సమాప్తః

---

## —♦ అథపంచదశఖండ ప్రారంభః ♦—

మం॥ నక్తంచారిణ ఉరస్పేశాం చ్ఛూలహస్తా న్కపాలపాన్ । పూర్వ ఏషాం పితే త్యుచ్చై శ్శ్రావ్య కర్ణకః । మాతా జఘన్యా సర్పతి గ్రామే విధుర మిచ్ఛంతీ॥

పదవి॥ నక్తంచారిణః । ఉరస్పేశాన్ । శూలహస్తాన్ । కపాలపాన్ । పూర్వః । ఏషాం । పితా । ఏతి । ఉచ్చైః । శ్రావ్య । కర్ణకః । మాతా । జఘన్యా । సర్పతి । గ్రామే । విధురం । ఇచ్ఛంతీ ॥

టీక॥ నక్తంచారిణః = రాత్రులయందు సంచరించువారును, ఉరస్పేశాన్ = వక్షస్థలమందు ప్రకాశించువారును, శూలహస్తాన్ = చేతులలో శూలములుగల వారును, కపాలపాన్ = తలపుర్రెలు పానపాత్రలు గాఁగలవారును అయినపిశాచము లను బట్టుకొనుఁడు అని పూర్వముతో నన్వయము, ఏషాం=ఈపిశాచములకు. పితా= తండ్రియగు, కర్ణకః=కర్ణకమనుపిశాచము, ఉచ్చైః=బిగ్గఱగా, శ్రావ్య = వినిపిం చుచు, పూర్వః = ముందున్న వాఁడై, ఏతి = వెళ్ళుచున్నాడు, జఘన్యా = హీను రాలైన, మాతా = ఈపిశాచముల తల్లియు, గ్రామే = ప్రతిగ్రామమునందు, విధురం = వ్యాధిచే బాధింపఁబడుపిల్లను, ఇచ్ఛంతీ= కోరుచున్నదై, సర్పతి =వెనుక వచ్చుచున్నది.

తా॥ రాత్రులయందు సంచరించువారును వక్షస్థలమందు ప్రకాశముకలవారు ను చేతులలో శూలములుగలవారును తలపుర్రెలు పానపాత్రలుగాఁ గలవారు నగు పిశాచములను బట్టుకొనుఁడు చంపుడు అని అగ్నిహోత్రుఁడు తెలుసుకొని వెళ్ళుఁ గాక. ఈపిశాచములకు దండ్రి "యైనకర్ణకమనుపిశాచము మీరు రండి బాలురను బట్టుకొనుఁడు" అని వెనుకవచ్చుభూతములకు వినుపించులాగున బిగ్గఱగాఁ బలుకుచు ముందు వెళ్ళుచున్నాఁడు. వీరియొక్క తల్లియు వ్యాధిచే బాధితులైనపిల్లలను బట్టు కొనుటకు ప్రతిగ్రామమునకు ఈపిశాచములవెనుక వెళ్లుచున్నది.

మూ॥ నిశీథచారిణీ స్వసా సంధినా ప్రేక్షతే కులం। యాస్వపంతం బోధయతి యస్యై విజాతాయాం మనః। తాసాం త్వం కృష్ణవర్త్మనే క్లోమానగ్ం హృదయం యకృత్। అగ్నే అక్షీణి నిర్దహ॥

పదవి॥ నిశీథచారిణీ । స్వసా । సంధినా । ప్ర । ఈక్షతే । కులం । యా । స్వపంతం । బోధయతి । యస్యైవిజాతాయాం । మనః । తాసాం । త్వం । కృష్ణ వర్త్మనే । క్లోమానం । హృదయం । యకృత్ । అగ్నే । అక్షీణి । నిర్దహ॥

టీక॥ నిశీథచారిణీ = రాత్రులయందు సంచరించుచున్న, స్వసా = ఆపిశాచములయొక్క చెలియలు, సంధినా = తలుపుయొక్క రంధ్రములగుండా, కులం = లోపలనుండు జనసమూహమును, ప్రేక్షతే = చూచుచున్నది, యా = ఏ పిశాచము, స్వపంతం = నిద్రించువానిని, బోధయతి = మేలుకొలుపుచున్నదో, విజాతాయాం = ప్రసవించిన దాచుండఁగా, యస్యై = ఏ స్త్రీ యొక్క, మనః = మనస్సును బాధపెట్టుచున్నదో, కృష్ణవర్త్మనే కృష్ణవర్త్మన్ = ఓయగ్నిహోత్రుఁడా! తాసాం = ఆ యా పిశాచములయొక్క, క్లోమానం = క్లోమానమనెడు, హృదయం = వక్షస్థలసంబంధమైన, యకృత్ = మాంసమును, అక్షీణి = నేత్రములను, నిర్దహ=దహింపుము.

తా॥ రాత్రులయందు సంచరించునదియైన ఈ పిశాచముల చెల్లెలు తలుపుల యొక్క రంధ్రములనుండి లోపలనుండు జనులను జూచుచున్నది. ఏ పిశాచము నిద్రించువారిని మేలుకొలుపుచున్నదో, ఏ పిశాచము స్త్రీ ప్రసవించిన దాచుండఁగా ఆ స్త్రీ యొక్క మనస్సును బాధపెట్టుచున్నదో, ఓ యగ్నిహోత్రుఁడా! ఆ పిశాచములయొక్క హృదయమందుండెడి క్లోమానమనెడు మాంసవిశేషమును నేత్రములను దహింపుము.

మూ॥ అంగాదంగాత్సంభవసిహృదయాదధిజాయసే। వేదోవైపుత్రనామాసిసజీవశరదశ్శతం ॥

ఈ మంత్రము నకు పదచ్ఛేదము మొదలగునవి వెనుక చెప్పఁబడినవి. వేదోవై అనుచోట వేదశబ్దమునకు ధనరూపమైన వాఁడవయితివి అని చెప్పవలయును.

మూ॥ అశ్మాభవేత్యేషా॥ ఈ మంత్రమునకును పదచ్ఛేదాదులు చెప్పఁబడినవి.

మూ॥ అగ్ని రాయుష్మాన్త్స వనస్పతిభి రాయుష్మాన్తేన త్వాఽఽయుషాఽఽయుష్మంతం కరోమి॥

పదవి॥ అగ్నిః । ఆయుష్మాన్ । సః । వనస్పతిభిః । ఆయుష్మాన్ । తేన । త్వా । ఆయుషా । ఆయుష్మంతం । కరోమి॥

టీ॥ అగ్నిః = అగ్నిహోత్రుఁడు, ఆయుష్మాన్ = ఆయుస్సుగలవాఁడు, సః=ఆయగ్నిహోత్రుఁడు, వనస్పతిభిః=ఇంధనములచేత, ఆయుష్మాన్=ఆయుస్సుగల

వాఁడు, తేన=అటువంటి, ఆయుషా=ఆయుర్దాయముచేతను, త్వా= నిన్ను, ఆయుష్మంతం = ఆయుర్దాయముగలవానిఁగా, కరోమి = చేయుచున్నాను.

తా॥ అగ్నిహోత్రుఁడు సమిత్తుఁచేత ఆయుర్దాయముగలవాఁడు. అటువంటి ఆయుర్దాయముచేత నిన్ను ఆయుర్దాయముగలవానిఁగాఁ జేసెదను.

మూ॥ సోమ ఆయుష్మాన్ స ఓషధీభి రాయుష్మాన్ తేన త్వాఽయుషా యుష్మంతం కరోమి॥

పదవి॥ సోమః । ఆయుష్మాన్ । సఃఓషధీభిః । ఆయుష్మాన్ సః । తేన । త్వా । ఆయుషా । ఆయుష్మంతం । కరోమి॥

టీక సోమః = చంద్రుఁడు, ఆయుష్మాన్ = ఆయుస్సుగలవాఁడు, సః = ఆచంద్రుఁడు, ఓషధీభిః = ఓషధులచేత, ఆయుష్మాన్ = ఆయుస్సుగలవాఁడు, తేన = అటువంటి, ఆయుషా = ఆయుర్దాయముచేత, త్వా = నిన్ను, ఆయుష్మంతం = ఆయుస్సుఁగలవానిగా, కరోమి = చేయుచున్నాను॥

తా॥ చంద్రుఁడు ఓషధులరసరూపమైన అమృతముచేత నాయుష్మంతుఁడాయెను. అట్టిఆయుర్దాయముచేత నిన్ను ఆయుష్మంతునిగాఁ జేసెదను.

మూ॥ యజ్ఞ ఆయుష్మాన్స దక్షిణాభి రాయుష్మాన్ తేన త్వాఽయుషా యుష్మంతం కరోమి॥

పదవి॥ యజ్ఞః । ఆయుష్మాన్ । సః । దక్షిణాభిః । ఆయుష్మాన్ । తేన । త్వా । ఆయుషా । ఆయుష్మంతం । కరోమి॥

టీక॥ యజ్ఞః = యజ్ఞము, ఆయుష్మాన్ = ఆయుష్యము కలది అనఁగా వృద్ధిగలది, సః = ఆ యజ్ఞము, దక్షిణాభిః = దక్షిణలచేత, ఆయుష్మాన్=ఆయుస్సుగలది, తేన= అటువంటి, ఆయుషా = ఆయుస్సుచేత, త్వా=నిన్ను, ఆయుష్మంతం= ఆయుస్సుగలవానిఁగా, కరోమి = చేయుచున్నాను.

తా॥ యజ్ఞము దక్షిణలచేత ఆయుస్సుకలది గాన అట్టిఆయుస్సుచే నిన్ను ఆయుష్మంతునిగాఁ జేసెదను.

మూ॥ బ్రహ్మాఽయుష్మ త్తద్బ్రాహ్మణై రాయుష్మ త్తేన త్వాఽయుషాఽ యుష్మంతం కరోమి ॥

పదవి॥ బ్రహ్మ । ఆయుష్మత్ । తత్ । బ్రాహ్మణైః । ఆయుష్మత్ । తేన । త్వా । ఆయుషా । ఆయుష్మంతం । కరోమి ॥

టీక॥ బ్రహ్మ = బ్రహ్మము, ఆయుష్మత్ = ప్రకాశించుచున్నది, తత్ = ఆ బ్రహ్మము, బ్రాహ్మణైః = బ్రాహ్మణులచేత, ఆయుష్మత్ = ఎల్లప్పుడు ప్రకాశింపఁబడుచున్నది. తేన = అటువంటి, ఆయుషా = ఆయుస్సుచేత, త్వా = నిన్ను, ఆయుష్మంతం = ఆయుస్సుగలవానిఁగా, కరోమి = చేయుచున్నాను.

తా॥ బ్రహ్మము బ్రాహ్మణులచేత ప్రకటింపఁజేయఁబడుచున్నది. కావున ఆయుస్సుగలది యని చెపఁబడియె. అటువంటి ఆయుర్దాయముచేత నిన్ను ఆయుర్దాయముగలవానిఁగాఁ జేసెదను.

మం॥ దేవా ఆయుష్మంత స్తేఽమృతేనాఽయుష్మంత స్తేన త్వాఽయుషాఽయుష్మంతం కరోమి॥

పదవి॥ దేవాః । ఆయుష్మంతః । తే । అమృతేన । ఆయుష్మంతః । తేన । త్వా । ఆయుషా । ఆయుష్మంతం । కరోమి॥

టీక॥ దేవాః = దేవతలు, ఆయుష్మంతః = ఆయుర్దాయముగలవారు, తే = ఆ దేవతలు, అమృతేన = అమృతముచేత, ఆయుష్మంతః = ఆయుర్దాయముగలవారు, తేన = అటువంటి, ఆయుషా = ఆయుర్దాయముచేత, త్వా=నిన్ను, ఆయుష్మంతం= ఆయుర్దాయముగలవానిఁగా, కరోమి =చేయుచున్నాను.

తా॥ దేవతలు అమృతముచేత ఆయుర్దాయము గలవారైరి. అటువంటి ఆయుర్దాయముచేత నిన్ను దీర్ఘాయుష్మంతునిఁగాఁ జేసెదను.

మం॥ సర్వస్మా దాత్మన స్సంభూతాఽసి సాజీవ శరదశ్శతమ్॥

పదవి॥ సర్వస్మాత్ । ఆత్మనః । సంభూతా । అసి । సాజీవ । శరదః॥ శతం ॥

టీక॥ సర్వస్మాత్ = సమస్తమైన, ఆత్మనః = నావల్లనుండి, సంభూతాసి = పుట్టితివి, త్వం = నీవు, శతం = నూరైన, శరదః = సంవత్సరములు, సాజీవ = సుఖముగా జీవింపుము.

తా॥ సులభము.

మూ॥ భూ రపాం త్వౌషధీనాగ్ం రసం ప్రాశయామి శివా స్తా ఆప ఓషధయ స్సం త్వనమీవా స్తా ఆప ఓషధయ స్సం త్వసౌ ॥

పదవి॥ భూః । అపాం । త్వా । ఓషధీనాం । రసం । ప్రాశయామి । శివాః । తాః । అపః । ఓషధయః। సంతు । అనమీవాః । తాః । అపః । ఓషధయః । సంతు । అసౌ॥

టీక ॥ అసౌ = ఓపిల్లవాఁడా! భూః = భూలోకమునందుండెడి, అపాం = ఉదకములయొక్కయు, ఓషధీనాం = ఓషధులయొక్కయు, రసం = రసమును, త్వా = నిన్ను, అనఁగా నీచేత, ప్రాశయామి = భక్షింపఁజేయుచున్నాను, తాః = ఆ ప్రసిద్ధములైన, అపః = ఉదకములును, ఓషధయః = ఓషధులును, శివాః = మంగళకరములు, సంతు = అవుఁగాక, తాః = ఆప్రసిద్ధములైన, అపః = ఉదకములును, ఓషధయః = ఓషధులును, అనమీవాః = రోగములు కలుగనియ్యనివి, సంతు = అవుఁగాక ॥

తా॥ ఓపిల్లవాఁడా! భూలోకమునందుండెడి జలములయొక్కయు ఓషధులయొక్కయు, రసమును నీచే అనుభవింపఁజేయుచున్నాను. ఆ యుదకములును ఓషధులును రోగమును కలుగనియ్యక మంగళములు కలుగఁజేయునవి యగుఁగాక.

మూ॥ భువో౽పాగ్ స్వ రపాం భూర్భువస్స్వ రపాం త్వౌషధీనాగ్ం రసం ప్రాశయామి శివా స్తా ఆప ఓషధయ స్సం త్వనమీవా స్తా ఆప ఓషధయ స్సం త్వసౌ ॥

పదవి॥ భువః । అపాం । స్వః । అపాం । భూర్భువస్స్వః । అపాం । త్వా। ఓషధీనాం । రసం । ప్రాశయామి । శివాః । తాః । అపః । ఓషధయః । సంతు । అనమీవాః । తాః । అపః । ఓషధయః । సంతు । అసౌ ॥

టీక॥ భువః = భువర్లోకమునందుండెడి, అపాం = ఉదకములయొక్కయు, స్వః = స్వర్లోకమునందుండెడి, అపాం = ఉదకములయొక్కయు, భూర్భువస్స్వః= భూలోక, భువర్లోక, స్వర్లోకములయందుండెడి, అపాం = ఉదకములయొక్కయు, ఓషధీనాం = ఓషధులయొక్కయు, రసం = రసమును, త్వా = నిన్ను (నీచేత), ప్రాశయామి=అనుభవింపఁజేయుచున్నాను, తాః=ఆ పూర్వోక్తమైన, అపః=ఉద

కములును, ఓషధయః=ఓషధులును, శివాః=శుభములు కలుగజేయునవియై, సంతు=అవుగాక, తాః=ఆ పూర్వోక్తములైన, ఆపః=జలములును, ఓషధయః=ఓషధులును, అనమీవాః=ఆరోగ్యకరములు, సంతు=అవుగాక.

తా॥ ఓ పిల్లవాఁడా! భూలోక భువర్లోక స్వర్లోకముల యందుండెడి జలములయొక్కయు ఓషధులయొక్కయు రసమును నీచే ననుభవింపజేయుచున్నాను. ఆ జలములును ఓషధులును శుభముల నొసఁగునవియు ఆరోగ్యకరములును అవుగాక.

ఇతి పంచదశఖండస్సమాప్తః

ఇతి ద్వితీయప్రశ్నే పూర్వభాగ స్సమాప్తః.

# ద్వితీయ మంత్ర ప్రశ్నే ఉత్తరభాగః

మూ॥ యద్భూమేః క్రూరం త దితో హరామి పరాచీం నిర్ ఋతిం నిర్వాహయామి। ఇదగ్గ్ శ్రేయోఽవసాన మాగన్మ దేవా గోమ దశ్వావ దిద మస్తు ప్ర భూమ ॥

పదవి॥ యత్ । భూమేః । క్రూరం । తత్ । ఇతః । హరామి । పరాచీం । నిర్ ఋతిం । నిర్వాహయామి । ఇదం । శ్రేయః । అవసానం । ఆగన్మ । దేవాః । గోమత్ । అశ్వావత్ । ఇదం । అస్తు । ప్ర । భూమ ॥

టీక॥ భూమేః = భూమియొక్క, యత్ = ఏ, క్రూరం = కంటక ప్రదేశముకలదో, తత్ = ఆకంటకములను, ఇతః = ఇక్కడనుండి, హరామి = తీసివేయుచున్నాను, నిర్ ఋతిం = అమాంగళ్యమును, పరాచీం = విముఖమైనదానిఁగా, నిర్వాహయామి = వెళ్లఁగొట్టుచున్నాను, దేవాః= ఓదేవతలారా! శ్రేయః= శ్రేష్ఠమైన, ఇదం = ఈ, అవసానం = స్థానముగూర్చి, ఆగన్మ = వచ్చితిమి, ఇదం = ఈ స్థానము, గోమత్= గోవులుగలదియు, అశ్వావత్ = గుఱ్ఱములు గలదియు, భూమ=ఐశ్వర్యముగలదియు ప్రాస్తు = మిక్కిలియవుఁగాక ॥

తా॥ ఇక్కడ భూమిలో నుండు ముళ్ళు ఎముకలు మొదలగునవి తీసివేయుచున్నాను. పుణ్యాహవాచనాదులచే నిక్కడ నమాంగళ్యమును, బోఁగొట్టుచున్నాను. ఓ దేవతలారా! శ్రేష్ఠమైన యీ స్థానమునందుఁ గాపురముండుటకు వచ్చితిమి. ఈ స్థానములోఁ గాపురమున్నమాకు నెప్పుడు పశువులు గుఱ్ఱములు సంపత్తు మొదలగునైశ్వర్యములు కలుగుఁగాక.

మూ॥ స్యోనా పృథివి భవాఽనృక్షరా నివేశనీ। యచ్ఛానశ్శర్మస ప్రథాః ॥

పదవి॥ స్యోనా । పృథివి । భవ । అనృక్షరా । నివేశనీ । యచ్ఛ । నః । శర్మ । సప్రథాః ॥

టీక॥ పృథివి = ఓభూమీ! స్యోనా = సుఖకరమైనదానవై. అనృక్షరా = ముండ్లు మొదలగునవి లేనిదానవై, నివేశనీ = కాపురముండుటకు ననుకూలమైన

దానవై, భవ = ఉండుము, సప్రథాః = అంతటను ప్రసిద్ధికెక్కినదానవు, నః = మాకు, శర్మ = సుఖమును, యచ్ఛ = ఇమ్ము.

తా॥ ఓభూమీ! నీవు సుఖమునుకలుగఁజేయుదానవు. ముండ్లు మొదలగునవి లేనిదానవు శాపురముండుటకు ననుకూలమైనదానవు, అంతటను బ్రసిద్ధికెక్కినదానవు నైతివి గాన మాకు సుఖమును గలుగఁజేయుము.

మ॥ ఇహైవ తిష్ఠ నిమితా తిల్వలా స్యాదిరావతీ మధ్యే తాల్పస్య తిష్ఠంత్యాం మా త్వా ప్రాపన్నఘాయవః ॥

పదవి॥ ఇహ । ఏవ । తిష్ఠ । నిమితా । తిల్వలా । స్యాత్ । ఇరావతీ । మధ్యే । తాల్పస్య । తిష్ఠాం । మా । త్వా । ప్రాపన్ । అఘాయవః ॥

టీక॥ (స్థూణే) = (ఓ శంకూ!) ఇహైవ = ఇక్కడనే, నిమితా = (మాచే) పాతిపెట్టఁబడినదానవై, తిష్ఠ = ఉండుము, తిల్వలా = కుంకుమాదులచేనలంకరింపఁబడినదానవై, ఇరావతీ = (మాకు) నన్నమును, గలుగఁజేయుదానవై, స్యాత్ = అవుము, తాల్పస్య = ద్వారముయొక్క, మధ్యే = మధ్యమునందు, తిష్ఠాం=ఉన్నటువంటి, త్వాం = నిన్ను, అఘాయవః = అనర్థములు, మాప్రాపన్ = పొందవు॥

తా॥ ఓశంకువా ఈ ద్వారమధ్యమునఁ బాతిపెట్టఁబడితివి. పసుపు కుంకుమ మొదలగువానిచే నలంకరింపఁబడితివి. మాకు నన్నమును గలుగఁజేయుచుండుము. ఈ ద్వారమధ్యమునందున్న నీకు ఏ యనర్థములు కలుగకుండుఁగాక.

మ॥ ఆ త్వా కుమారస్తరుణ ఆ వత్సో జగతా సహ. ఆ త్వా పరిస్రుతః కుంభా ఆ దధ్నః కలశీ రయన్॥

పదవి॥ ఆ । త్వా । కుమారః । తరుణః । ఆ । వత్సః । జగతా । సహ । ఆ । త్వా । పరిస్రుతః । కుంభాః । ఆ । దధ్నః । కలశీః । అయన్॥

టీక॥ కుమారః = పిల్లవాఁడు, త్వా = నిన్నుగూర్చి, (ఆయాతు - వచ్చుఁగాక, తరుణః = లేతవయస్సుగలపిల్లవాఁడు, త్వా = నిన్నుగూర్చి, (ఆయాతు) = వచ్చుఁగాక, వత్సః = చిన్నవాఁడు, జగతాసహ = అంతకంటెనధికుఁడైన పిల్లవానితోఁగూడ, (ఆయాతు) = వచ్చుగాక, పరిస్రుతః = ఆజ్యముయొక్క, కుంభాః = కడవలు, త్వా = నిన్నుగూర్చి, అయన్ = వచ్చుఁగాక, దధ్నః = పెరుగుయొక్క, కలశీః = కలశములు, ఆఅయన్ = తీసికొని వత్తురుగాక॥

తా॥ పసిపిల్లవాడును పారాడుపిల్లవాడును కొంచెముగా పడుచుపిల్లవాడును అంతకంటె పెక్కువగా నడుచు పిల్లవాడును నీవద్దకు వత్తురుగాక. పేతికుంభము లును పెరుగుకలశములును నీవద్దకు దెత్తురుగాక.

మూ॥ ఋతేన స్థూణా వధిరోహ వంశోగ్రో విరాజన్న అపసేధ శత్రూన్ ॥

పదవి॥ ఋతేన । స్థూణా । అధిరోహ । వంశ । ఉగ్రః । విరాజన్ । అపసేధ । శత్రూన్ ॥

టీక॥ వంశ=ఓ వెదురా! ఋతేన=సత్యస్వరూపమైన, స్థూణా=మేకులను అధిరోహ=అధిష్ఠించుము, ఉగ్రః=తీక్ష్ణమైనదానవై, విరాజన్=ప్రకాశించుచు, శత్రూన్=విరోధులను, అపసేధ=పాఱదోలుము.

తా॥ ఓ వెదురా! స్థిరముగా నుండెడిమేకుల నధిష్ఠింపుము. మతియొక దానిచే నీవు తిరస్కరింపఁబడక ప్రకాశింపుచు విరోధులను దఱిమివేయుము.

మూ॥ బ్రహ్మ చ తే క్షత్రం చ పూర్వే స్థూణె అభిరక్షతు॥

పదవి॥ బ్రహ్మ । చ । తే । క్షత్రం । చ । పూర్వే । స్థూణె । అభి । రక్షతు ॥

టీక॥ బ్రహ్మచ = బ్రాహ్మణులను, క్షత్రంచ=క్షత్రియులను, తే=నీ యొక్క, పూర్వే = తూర్పుదిక్కునందుండెడి, స్థూణే=మేకులను, అభిరక్షతు= సంరక్షించుఁగాక.

తా॥ ఓ గృహమా! బ్రాహ్మణులును క్షత్రియులును నీకుఁదూర్పుదిక్కునం దుండెడి స్తంభములను కాపాడుదురుగాక.

మూ॥ యజ్ఞశ్చ దక్షిణాశ్చ దక్షిణే । ఇష శ్చోర్జ శ్చాఽపరే । మిత్రశ్చ వరుణ శ్చోత్తరే । ధర్మస్తే స్థూణారాజ శ్శ్రీ స్తే స్థూపః॥

పదవి॥ యజ్ఞః । చ । దక్షిణాః । చ । దక్షిణే । ఇషః । చ । ఊర్జః । చ । అపరే । మిత్రః । వరుణః । చ । ఉత్తరే । ధర్మః । తే । స్థూణారాజః । శ్రీః । తే । స్తూపః ॥

టీక॥ యజ్ఞః = యజ్ఞము, దక్షిణాశ్చ = దక్షిణలు, తే = నీయొక్క, దక్షిణే = దక్షిణదిక్కునందుండెడి, స్థూణే = మేకులను, అభిరక్షతాం = రక్షించుగాక, ఇషశ్చ = ఆశ్వయుజమాసము, ఊర్జశ్చ = కార్తికమాసము, అపరే = పశ్చిమదిక్కునందుండెడి, స్థూణే = మేకులను, అభిరక్షతాం = రక్షించుగాక, మిత్రః = సూర్యుఁడు, వరుణశ్చ = వరుఁడు, ఉత్తరే = ఉత్తరదిక్కునందుండెడి, స్థూణే = మేకులను, అభిరక్షతాం = రక్షించుగాక, ధర్మః = ధర్మరాజు, స్థూణారాజః = ప్రధానస్థంభమైనవాఁడుగా, తే = నీయొక్క, స్తూపః = వెన్నుబద్ద, శ్రీః=లక్ష్మిగా, భవతు = అగుఁగాక॥

తా॥ ఓగృహమా! నీవు దక్షిణదిక్కున నుండెడి స్థూణములను యజ్ఞమును దక్షిణలును పశ్చిమదిక్కున నుండెడి స్థూణములను ఆశ్వయుజకార్తికమాసములును ఉత్తరదిక్కున నుండెడి స్థూణములను సూర్యుఁడు వరుణుఁడును ప్రధానస్తంభమును ధర్ముఁడును లక్ష్మివెన్నుబద్దను ఎల్లప్పుడు రక్షింపుచుందురుగాక.

మూ॥ ఉద్ధ్రియమాణ ఉద్ధర పాప్మనో మా యదవిద్వాన్ యచ్చ
విద్వాగ్ శ్చకార అహ్న యదేనః కృతమస్తి పాపగ్ం
రాత్రియా యదేనః కృత మస్తి పాపగ్ం సర్వస్మా
న్మోద్ధృతో ముంచ తస్మాత్॥

పదవి॥ ఉద్ధ్రియమాణః। ఉద్ధర। పాప్మనః। మా। యత్। అవిద్వాన్। యత్। చ। విద్వాన్। చకార। అహ్న। యత్। ఏనః। కృతం। అస్తి। పాపం। రాత్రియా। యత్। ఏనః। కృతం। అస్తి। పాపం। సర్వస్మాత్। మా। ఉద్ధృతః। ముంచ। తస్మాత్॥

టీక॥ అగ్నే = ఓయగ్నిహోత్రుఁడా! ఉద్ధ్రియమాణః = నాచేబ్రజ్వరిల్లఁజేయఁబడినవాఁడవై, త్వం = నీవు, మా = నన్ను, పాప్మనః = పాపములవలన, ఉద్ధర = ఉద్ధరింపుము, అహం = నేను, అవిద్వాన్ = తెలియనివాఁడనై, యత్ = ఏ పాపమును, చకార = చేసితినో, యత్ = ఏ పాపమును, విద్వాన్ = తెలిసినవాఁడనై, చకార = చేసితినో, అహ్న = పగటియందు, యత్ = ఏ, ఏనః = పాపము, కృతం = చేయఁబడినది, అస్తి = కలదో, రాత్రియా = రాత్రియందు, కృతం = నాచే జేయఁబడిన, యత్ = ఏ (లింగవ్యత్యయః), ఏనః = పాపము, అస్తి =

కలదో, తస్మాత్ = అటువంటి, సర్వస్మాత్ = సమస్తమైన, పాప్మనః = పాపము నుండి, ఉద్ధృతః = నన్ను లేవఁదీసినవాఁడవై, మాం = నన్ను, ముంచ=విడిపింపుము.

తా॥ ఓయగ్నిహోతృుఁడా! నాచేఁ బ్రజ్వరిల్లఁజేయఁబడినవాఁడవై నీవు పాపమునుండి నన్నుద్ధరింపుము. నేను దెలిసి గాని తెలియక గాని యే పాపమును జేసితినో పగటియందుఁ గాని రాత్రియందుఁ గాని యేపాపమును జేసితినో ఆ సమస్తపాపములనుండి నన్ను లేవఁదీసి విముక్తుఁడ నగునట్లు చేయుము.

మూ॥ ఇంద్రస్య గృహో వసుమంతో వరూథిన స్తా నహాగ్ం సుమ
నసః ప్రపద్యే॥

పదవి॥ ఇంద్రస్య । గృహాః । వసుమంతః । వరూథినః । తాన్ । అహం । సుమనసః । ప్రపద్యే॥

టీక॥ వసుమంతః = ధనముగలవియు, వరూథినః = శ్రేష్ఠమైనదారువులం గలవియు నగు, ఇంద్రస్య = దేవేంద్రునియొక్క, గృహాః = గృహములవంటి గృహములేవియో, తాన్ = ఆ గృహములను, అహం = నేను, సుమనసః = మంచి మనస్సుగలవాఁడనై, ప్రపద్యే = పొందెదను.

తా॥ విశేషధనము గలుగఁజేయునవియు శ్రేష్ఠమైన సామగ్రిలు గలవియు నగు దేవేంద్రునిగృహములతో సమానమైనగృహములలో నేను బ్రవేశించుచున్నాను.

మూ॥ అమృతాహుతి మమృతాయాం జుహో మ్యగ్నిం పృథివ్యా
మమృతస్య జిత్యై । త యాఽనంతం కామమహం జయాని
ప్రజాపతి ర్యం ప్రథమో జిగా యాఽగ్ని మగ్నౌ॥

పదవి॥ అమృతాహుతిం । అమృతాయాం । జుహోమి । అగ్నిం । పృథివ్యాం । అమృతస్య । జిత్యై । తయా । అనంతం । కామం । అహం । జయాని । ప్రజాపతిః । యం । ప్రథమః । జిగాయ । అగ్నిం । అగ్నౌ॥

టీక॥ అమృతాహుతిం = అజ్యమేఆహుతిగాఁగల, అగ్నిం = అగ్నిహోతృని, అమృతాయాం = నాశములేని, పృథివ్యాం = భూమియందు, అమృతస్య = దేవత్వమును, జిత్యై = జయించుటకొఱకు, జుహోమి = స్థాపనఁజేయుచున్నాను, అహం = నేను, తయా = ఆహోమముచేత, అనంతం = అమితమైన, కామం =

కోరికను, జయాని = జయింపఁగలను, ప్రథమః = దేవతలలో మొదటివాఁడగు, ప్రజాపతిః = బ్రహ్మ, యం = ఏహేతువువలన ఏకోరికను, జిగాయ = జయించెనో, తస్మాత్ = ఆహేతువువలన, అగ్నిం = అగ్నిహోత్రుని, అగ్నౌ = భూమి యందుంచుచున్నాను.

తా॥ ఆజ్యాదిహవిస్సును బొందునట్టి యగ్నిహోత్రుని నాశరహితమైన భూమియందు దేవత్వమును బొందుటకొఱకు స్థాపించి బూజించుచున్నాను. ఆలాగున బూజించి విశేషమైనకోరికలను బొందెదను. దేవతలలో మొదటివాఁడగు బ్రహ్మయును అటులు పూజించి విశేషమైనకోరికను బొందెను గాన నేను ఈ భూమియందు అగ్నిహోత్రుని స్థాపించి పూజించుచున్నాను.

మూ॥ అన్నప తేఽన్నస్య నో దే హ్యానమీవస్య శుష్మిణః। ప్ర
ప్రదాతారం తారిష ఊర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే ॥

పదవి॥ అన్నపతే। అన్నస్య। నః। దేహి। అనమీవస్య॥ శుష్మిణః। ప్ర। ప్రదాతారం। తారిషః। ఊర్జం। నః। ధేహి। ద్విపదే। చతుష్పదే॥

టీక॥ అన్నపతే=అన్నమునకు నధిపతివగు నో ధాన్యమా!, అనమీవస్య = ఆరోగ్యకరమైనదై, శుష్మిణః=బలమును గలుఁగఁజేయునట్టి, అన్నస్య=అన్నమును, నః=మాకొఱకు, దేహి=ఇమ్ము, ప్రదాతారం=అన్నమునిచ్చుచున్న నన్ను, ప్రతారిషః=మిక్కిలి వృద్ధిపొందింపుము, నః = మాసంబంధమైన, ద్విపదే=మనుష్యులకొఱకును, చతుష్పదే=పశువులకొఱకును, ఊర్జం=అన్నమును, ధేహి=కలుగజేయుము.

తా॥ ఓ ధాన్యమా! ఆరోగ్యకరమైనదై బలమును గలుఁగఁజేయునట్టి యన్నమును మాకు నిమ్ము. అన్నమును అతిథులు మొదలగువారికిఁ బెట్టి తృప్తిపఱచునట్టి నన్ను మిక్కిలి వృద్ధిబొందించుచుండుము. నాసంబంధమైన మనుష్యులకు పశువులకు నెల్లప్పు డన్నమును బలమును కలుగజేయుచుండుము.

మూ॥ అరిష్టా అస్మాకం వీరా స్సంతు మాపరాసేచి నో ధనం॥

పదవి॥ అరిష్టాః। అస్మాకం। వీరాః। సంతు। మా। పరాసేచి। నః। ధనం॥

టీక॥ అస్మాకం = మాయొక్క, వీరాః = పుత్త్రులు, అరిష్టాః = హింసింపఁబడనివారు, సంతు = అగుదురుగాక, నః = మాయొక్క, ధనం = ధనము, మాపరాసేచి = వ్యర్థముగా వ్యయము చేయఁబడకుండుఁగాక॥

తా॥ మా కుమాళ్ళు ఆపత్తులు లేనివారై యుందురుగాక. మా ధనము వ్యర్థముగా వ్యయము చేయబడకుండుఁగాక.

మం॥ భూమి ర్భూమి మగా న్మాతా మాతర మ ప్యగాత్ । భూయాస్మ పుత్త్రైః పశుభిర్యో నో ద్వేష్టి స భిద్యతాం॥

పదవి॥ భూమిః । భూమిం । అగాత్ । మాతా । మాతరం । అపి । అగాత్ । భూయాః । స్మ । పుత్త్రైః । పశుభిః । యః । నః । ద్వేష్టి । సః । భిద్యతామ్॥

టీక॥ భూమిః = భూమి, భూమిం=కారణమైన సూక్ష్మభూమిని, అగాత్ = పొందెను, మాతా = ఆకాశము, మాతరం=కారణమైన సూక్ష్మాకాశమును, అగాత్ = పొందెను, పుత్త్రైః = కుమాళ్లచేతను, పశుభిః = పశువులచేతను, భూయాస్మ = సమృద్ధి గలవారమైతిమి, నః = మమ్ములను, యః = ఎవఁడు, ద్వేష్టి = దూషించుచున్నాఁడో, సః = వాఁడు, భిద్యతాం = పాఱద్రోలఁబడుఁగాక.

తా॥ స్థూలభూతమైనభూమి తనకుఁగారణమైన సూక్ష్మభూమిని బొందెను. స్థూలాకాశము తనకు గారణమైనసూక్ష్మాకాశమును బొందెను. పుత్త్రులు పశువులు గలవాఁడ నైతిని. నాకుండెడి శత్రువులు దూరముగా పాఱిపోదురుగాక.

మం॥ వాస్తోష్పతే ప్రతిజానీ హ్యస్మాన్ త్స్వావేశో అనమీవో భవా నః । యత్త్వేమహే ప్రతి త న్నో జుషస్వ శం న ఏధి ద్విపదే శం చతుష్పదే॥

పదవి॥ వాస్తోష్పతే । ప్రతి । జానీహి । అస్మాన్ । స్వావేశః । అనమీవః । భవ । నః । యత్ । త్వా । ఈమహే । ప్రతి । తత్ । నః । జుషస్వ । శం । నః । ఏధి । ద్విపదే । శం । చతుష్పదే॥

టీక॥ వాస్తోష్పతే । వాస్తుపురుషుఁడా ! అస్మాన్ = మమ్ములను, ప్రతిజానీహి = గుర్తెఱుంగుము, స్వావేశః = మాయందు అభిమానము గలవాఁడవై, నః =

మాకు, అనమీవః = ఆరోగ్యకరుఁడవు, భవ = అగుము, యత్ = ఏహేతువువలన, త్వా = నిన్ను, ఈమహే = యాచించుచున్నానో, తత్ = ఆహేతువువలన, నః = మమ్ములను, ప్రతిభువస్వ = పొందియుండుము, నః = మాయొక్క, ద్విపదే = మనుష్యులకొఱకైన, శం = సుఖమును, చతుష్పదే = పశువులకొఱకైన, శం = సుఖమును, ఏధి = వృద్ధిపొందించుచుండుము.

తా॥ ఓవాస్తుపురుషుఁడా! నిన్ను బ్రార్థనఁ జేయుచుంటిమి గాన మమ్ములను నీ భక్తులమని తెలిసికొని మాయందు బ్రవేశించియుండి మాకు నారోగ్యమును గలుగఁజేయుచుండుము. మా మనుష్యులకుఁ బశువులకు సుఖమును ఎల్లప్పుడు కలుగజేయు చుండుము.

మూ॥ వాస్తోష్పతే శగ్మయా సగ్ంసదా తే సక్షీమహి రణ్వయా
గాతుమత్యా ఆవహా క్షేమ ఉత యోగే వరన్నో యూయం
పాత స్వస్తిభి స్సదా నః॥

పదవి॥ వాస్తోష్పతే। శగ్మయా। సంపదా। తే। సక్షీమహి। రణ్వయా। గాతుమత్యా। ఆవహా। క్షేమః। ఉత। యోగః। వరం। నః। యూయం। పాత। స్వస్తిభిః। సదా। నః॥

టీక॥ వాస్తోష్పతే, ఓవాస్తుపురుషుఁడా! శగ్మయా = సుఖకరమైనదియు = రణ్వయా, విహరించునదియు = గాతుమత్యా = సన్మార్గస్థలమునకు నడచునదియునగు, తే = నీయొక్క, సంపదా = సంపత్తుతో, వయం = మేము, సక్షీమహి = కలిసికొనినవార మైతిమి, ఉత = ఇంతియేకాదు, నః = మాకు, యోగః = పూర్వములేని ధనమును బొందుటయును, క్షేమః = ఉన్నదానిని గాపాడుటయును, వరం = శ్రేష్ఠముగా, ఆవహా = కలుగఁజేయుము, (విశ్వేదేవతలారా) యూయం = మీరు, సదా = ఎల్లప్పుడు, స్వస్తిభిః = శుభవాక్యములతో, నః = మమ్ములను, పాత = రక్షింతురుగాక॥

తా॥ ఓవాస్తుపురుషుఁడా! సుఖమును గలుగఁజేయునదియు సజ్జనులయందు విహరించునదియు సన్మార్గమందు బ్రవర్తించునదియు నగు నీ సంపద గలవారమైతిమి. మాకు లేని సంపత్తు గలుగునట్లుగాను ఉన్నసంపత్తు సంరక్షింపఁబడునట్లుగాను మిక్కిలి చేయుచుండుము. ఓ విశ్వేదేవతలారా! మీ రెల్లప్పుడు శుభవాక్యములను బలుకుచు మమ్ములను రక్షించు చుందురుగాక.

మూ॥ వాస్తోష్పతే ప్రతరణో న ఏధి గోభి రశ్వేభి రిన్దో అజరాస
స్తే సఖ్యే స్యామ పితేవ పుత్రా న్ప్రతి నో జుషస్వ॥

పదవి॥ వాస్తోష్పతే। ప్రతరణః। నః। ఏధి। గోభిః। అశ్వేభిః। ఇందో। అజరాసః। తే। సఖ్యే। స్యామ। పితా। ఇవ। పుత్రాన్। ప్రతి। నః। జుషస్వ॥

టీక॥ వాస్తోష్పతే = ఓ వాస్తుపురుడా! ఇందో = ఐశ్వర్యమును గలిగించు వాఁడా! గోభిః = పశువులచేతను, అశ్వేభిః = గుఱ్ఱములచేతను, నః = మమ్ములను, ప్రతరణః = వృద్ధిపొందించువాఁడవు, ఏధి = అగుము, వయం = మేము, తే = నీ యొక్క, సఖ్యే = స్నేహమందు, అజరాసః = అక్షయముగా, స్యామ = ఉందుము, పితా = తండ్రి, పుత్రాన్ ఇవ = తనయులనువలెనే, నః = మమ్ములను, ప్రతిజుషస్వ = దగ్గఱకుతీసి ప్రేమించుము॥

తా॥ ఐశ్వర్యము నొసఁగెడి యో వాస్తుపురుషుఁడా! నీవు మాకుఁ బశువులను గుఱ్ఱములను గలుగఁజేసి వృద్ధిపొందించుము. నీ స్నేహమును గోరియుంటిమి కాన దండ్రి తనయులనువలెనే మమ్ములను దగ్గఱకుఁ జేరదీసి ప్రేమతో గాపాడుము.

మూ॥ అమీవహా వాస్తోష్పతే విశ్వారూపా ణ్యావిశ స్సఖాసు
శేవ ఏధి నః శివగ్ం శివం॥

పదవి॥ అమీవహా। వాస్తోష్పతే! విశ్వారూపాణి। ఆ। విశన్। సఖాసు శేవః। ఏధి। నః। శివం। శివం॥

టీక॥ వాస్తోష్పతే = వాస్తుపురుషుఁడా!, అమీవహా = వ్యాధులను బోఁగొట్టునట్టినీవు, విశ్వారూపాణి = వ్యాధినివారకములైన సమస్తరూపములను, ఆవిశన్ = ప్రవేశించినవాఁడవవుచు, నః = మాయొక్క, సఖాసు = స్నేహితులయందు, శేవః = శ్రేష్ఠుడవు, ఏధి = అగుము, ఇదం = ఈవాస్తుకర్మము, శివం శివం = మిక్కిలిశుభప్రదమగుఁగాక.

తా॥ ఓవాస్తుపురుషుఁడా! సమస్త వ్యాధులను పోఁగొట్టునట్టినీవు సమస్తమైన పదార్థములయందు బ్రవేసించి యుంటివి. కాన మాస్నేహితులలో నీవు ముఖ్యుడవై యీవాస్తుకర్మమును మిక్కిలిశుభప్రదమైనదానిగాఁ జేయుము.

ఇతిషోడశఖండస్సమాప్తః

—♦ అథసప్తదశఖండః ప్రారంభః ♦—

మూ॥ కూర్కుర స్సుకూర్కురః కూర్కురో వాలబంధనః ఉపరిష్టా ద్య దేజాయ తృతీయస్యా ఇతో దివః॥

మూ॥ ఔలబ ఇత్త ముపాహ్వయతా౽ర్జ్జీ శ్యామ శ్శబలః। అధో రామ ఉలుంబర స్సారమేయో హ ధావతి। సముద్రమ వచాకశత్॥

మూ॥ బిభ్ర న్నిష్కంచ రుక్మంచ శునా మగ్రగం సుచీరిణః సుచీ రిణ సృజ సృజ శునక సృ జైకవాత్యత్॥

పదవి॥ కూర్కురః। సుకూర్కురః। కూర్కురః। వాలబంధనః। ఉపరిష్టాత్। యత్। ఏజాయ। తృతీయస్యాః। ఇతః। దివః। ఔలబః। ఇత్। తం। ఉప। ఆహ్వయత। ఆర్జ్జీ। శ్యామః। శబలః। అధోరామః। ఉలుంబలః। సారమేయః। హ। ధావతి। సముద్రం। అవ। చాకశత్। బిభ్రత్। నిష్కం। చ। రుక్మం। చ। శునాం। అగ్రం। సుచీరిణః। సుచీరిణ। సృజ। సృజ। శునక। సృజ। ఏకవ్రాత్య। సృజ। ఛత్॥

టీక॥ ఔలబః = ఉలబయనుదానియొక్క సంతానమైనదై, సుకూర్కురః = కూర్కురమని మంచిధ్వనిచేయుచున్న, కూర్కురః = కూర్కురమనెడుకుక్కయును వాలబంధనః = తోకచేనితరులనుబంధించెడి, యత్ = ఏ, కూర్కురః = కుక్క, యును, తృతీయస్యాః = మూడవదైన, దివః = లోకమువలన, ఉపరిష్టాత్ = పైవనుండి, ఇతః= ఈభూలోకమునకు, ఏజాయ= (ఏజూయ) వచ్చుచున్నది,తం= ఆకుక్కను, ఉపాహ్వయత = (అపాహ్వయత) పాఱదోలుఁడు, ఆర్జ్జీ=బుజావు యొక్కసంతానమై, శ్యామః = శ్యామమనియు, శబలః = శబలమనియు, అధో రామః=అధోరామమనియు, ఉలుంబలః=ఉలుంబలమనియు పేర్లుగల, తాః = ఆ నాలుగుకుక్కలను, అపాహ్వయత=పాఱదోలుఁడు, సారమేయః=సరమయను దేవతా శునకమువలన బుట్టినదై, శునాం=కుక్కలలో, అగ్రం=ప్రధానమైన, సుచీరిణః= సుచీరిణమను పేరుగల శునకము, రుక్మంచ=బంగారుచే జేయఁబడిన, నిష్కంచ= పతకమును, బిభ్రత్=ధరించినదియై, సముద్రం=ఆకాశమును, అవచాకశత్=చూ

చుచు, ధావతి=పఱుగెత్తుకొని వచ్చుచున్నది, ఏకవ్రాత్య=కుక్కలలో ప్రధానమైన దానా !, ఛత్ = ఛత్ అనుశబ్దమును, సృజ = విడిచిపెట్టుము, సుబీరిణ = ఓసుబీరిణమా !, సృజసృజ = (పిల్లవానిని) విడిచిపెట్టుము, శునక = ఓశునకమా, సృజ= విడిచిపెట్టుము.

తా॥ ఉలబునివలనఁబుట్టి, కూర్కురమనుశబ్దమును జేయుకూర్కుర మను కుక్కయు ఇతరులను దోకచేఁ జుట్టి బాధించునట్టికుక్కయు, స్వర్గలోకమునుండి యిక్కడకువచ్చుచున్నవి. ఋజురియొక్కసంతానమైన శ్యామము శబలము అధోరామము ఉలుంబలము అనుపేర్లు గలనాలుగుకుక్కలును పైననుండి వచ్చుచున్నవి. నాన వాభృత్యులారా ! ఆ కుక్కలను అవతలికిఁ బోగొట్టుఁడు. సరమ యనుదేవతా శునకమువలనఁ బుట్టినదియు, కుక్కలలోఁ బ్రధానమైనదియునై సుబీరిణ మనుపేరు గలకుక్క బంగారు పతకమును ధరించి యాకాశమును జూచుచు వచ్చుచున్నది. సుబీరిణమా ! నీవు పిల్లవాండ్రను బట్టుకొనకుము. ఛత్ అనుభయంకరమైనశబ్దమును జేయకుము.

మూ॥ తత్సత్యం యత్తేఽన్ద్రోఽబ్రవీ ద్గా స్స్వాశయ సాస్వేతి తా స్త్వగ్గం స్వాశయ త్వాఽగచ్ఛ స్తం త్వాఽబ్రవీ దవిదహా॥

పదవి॥ తత్ । సత్యం । యత్ । త్వా । ఇంద్రః । అబ్రవీత్ । గాః । స్వాశయస్వ । ఇతి । త్వాః ! త్వం । స్వాశయత్వా । ఆగచ్ఛః । తం । త్వా । అబ్రవీత్ । అవిదః । హా॥

మూ॥ ఇ త్యవిదగ్ం హీతి వరం వృణీ ష్వేతి కుమార మేవాఽహం వరం వృణ ఇత్యబ్రవీ ద్విగృహ్యా బాహూప్లవసే ద్యా మవ చాకశత్॥

పదవి॥ ఇతి । అవిదం । హి । ఇతి । వరం । వృణీష్వ । ఇతి । కుమారం । ఏవ । అహం । వరం । వృణె । ఇతి । అబ్రవీత్ । విగృహ్య । బాహూ । ప్లవసే । ద్యాం । అవ । చాకశత్॥

టీక॥ గాః = ఆవులనపహరించినవారిని, స్వాశయస్వేతి = బాధిపెట్టమని, ఇంద్రః = ఇంద్రుఁడు, యత్ = ఏవాక్యమును, త్వా = నిన్నుగుఱించి, అబ్రవీత్ =

పలికెనో, తత్ = ఆవాక్యము, సత్యం = నిజమైనది, తతః = అనంతరమందు, త్వం = నీవు, తాన్ = ఆయావులను అపహరించినవారిని, స్పాశయత్వా = బాధించి, తాః = ఆయావులను దీసికొని, అగచ్ఛః = వచ్చితివి, తం = అటువంటి, త్వా = నిన్ను, అవిదహో = ఆవులనుపొందితివా, ఇతి = ఈలాగున దేవేంద్రుడడుగఁగా, అవిదంహి = పొందితిని, ఇతి = అని నీవు పలుకఁగా, వరం = వరమును, వృణీష్వ = కోరుము, ఇతి = ఈలాగున దేవేంద్రుడడుగఁగా = అహం, నేను, కుమారం = పిల్లవానిని బాధించుటయును, వరం = వరమును, వృణే = కోరుచున్నాను, ఇతి = ఈలాగున అబ్రవీత్ = పలికెను, సః = అటువంటి సుబీరణము, బాహూ = హస్తములను విగృహ్య = గ్రహించి, ద్యాం = ఆకాశమును, అవచాకశత్ = చూచుచు, ప్లవసే = వచ్చుచున్నది.

పూర్వమందు రాక్షసులు దేవతులయావుల నపహరించి యొకపర్వతగుహాయందుంచి ద్వారమును గప్పివేయఁగా వానిని దెలిసికొనలేనివారై దేవతలు సరమయను దేవతాశునకముయొక్క కుమారుఁడైనసుబీరణమనుదాని బిలిచి నీవు ఆవుల నపహరించినవారిని దెలిసికొని వారిని బాధించి ఆ యావులను దీసికొని రమ్మని దేవతలు పలుకఁగా నంతట సుబీరణము వెళ్లి యారాక్షసులను బాధించి ఆ యావులను దీసికొని రాఁగా నప్పుడు దేవేంద్రుఁడు నీ కిష్టమైనవరమును గోరుమని సుబీరణముతోఁ బలికెను. అప్పుడు పిల్లలను బాధించుట యనువరమును సుబీరణము దేవేంద్రునివలనఁ బుచ్చుకొన్నదన్నమాటనిజము. అసుబీరణము హస్తములను బట్టుకొని యాకాశమును జూచుచు వచ్చుచున్నది.

మూ॥ బిభ్రన్నిష్కంచ రుక్మంచ శునామగ్రిగం సుబీరిణః। సుబీరిణ సృజసృజ శునకసృజైక హాత్యసృజఛత్॥

ఈ మంత్రమునకు బదవిభాగము మొదలగునవి పూర్వమందు జెప్పబడినవి.

మూ॥ త త్సత్యం య త్తే సరమా మాతా లోహితః పితా అవిూ యే కే సరస్యకా అవధావతి తృతీయస్యా ఇతో దివః॥

పదవి॥ తత్। సత్యం। యత్। తే। సరమా। మాతా। రోహి। తః। పితా। అమీ। ఏ। కే। సరస్యకాః। అవ। ధావతి। తృతీయస్యాః। ఇతః। దివః॥

అ॥ తా॥ ముందు సూత్రముక్రింద నున్నవి.

మూ॥ తేక శ్చ ససరమ తండ శ్చ తూల శ్చ వితూల శ్చార్జున శ్చ లోహిత శ్చ దులాహా నామ వో మాతా మంథాళకో హా వః పితా సం తక్షా కాంతి చక్రివో న సీసరీదత॥

పదవి॥ తేకః । చ । ససరమః। తండః। చ। తూలః।చ । వితూలః। చ। అర్జునః। చ । లోహితః । చ । దులా । హా । నామ । వః । మాతా । మంథాళకః । హా । వః । పితా । సం । తక్షా । హాంతి । చక్రివః । నసీసరీదత॥

టీక॥ తే = నీయొక్క, మాతా = తల్లి, సరమేతియత్, సరమ అనేమాట యేదికలదో, తే = నీయొక్క, పితా = తండ్రి, లోహితఇతియత్ = రోహితుఁ డనెడుమాటయేదికలదో, తత్ = అది, సత్యం = నిజము, సరస్యకాః = సరస్సునం దుఁబుట్టినట్టి, అమీ = ఈ, ఏకే =కొందఱు, తృతీయస్యాః= మూడవదైన, దివః = లోకమునుండి, ఇతః = ఇక్కడకు, అవధావతి = అధోముఖముగావచ్చుచున్నవి, తే = వారు, కే = ఎవరనఁగా, తేకశ్చ = తేకుఁడు, ససరమశ్చ = ససరముఁడును, తండశ్చ = తండుడును, తూలశ్చ = తూలుఁడును, వితూలశ్చ = వితూలుఁడును, అర్జునశ్చ = అర్జునుఁడును, లోహితశ్చ = లోహితుఁడును, అనెడు యేఱుగురు వచ్చుచున్నారు, వః = అట్టిఆఱుగురైనమీయొక్క, మాతా=తల్లి, దులాహానామ= దులా అనేపేరుగలదియు, వః = మీయొక్క, పితా = తండ్రి, మంథాళకః = మంథాళకుఁడు అనువాఁడును వచ్చుచున్నారు, నః = మాయొక్క,తక్షాః= పరిచారకులు; చక్రివః = ఆయుధములుగలవారై, సంహాంతి = కొట్టఁగలరు, నసీసరీదత = మావద్దకు రాఁబోకుఁడు॥

తా॥ సరమ నీయొక్క తల్లియు రోహితుఁడు నీ తండ్రియు యగుట నిజము. మఱియు తేకుఁడు ససరముఁడు తండుఁడు తూలుఁడు వితూలుఁడు అర్జునుఁడు లోహితుఁడు అనెడు మీ యాఱుగురును. మీయొక్క తల్లిదండ్రులగు దులామంథాళకులును ఆకాశమునుం డిక్కడికి వచ్చుచున్నారు. మాభటులు ఆయుధపాణులై మిమ్ములను గొట్టెదరు గాన మా సమీపమునకు రాఁబోకుఁడు.

మూ॥ భ దపేహి సీసరమ సారమేయ నమ స్తే అస్తు సీసర ససా అశ్వా వృషాణః పదో న సీసరీదత॥

పదవి॥ ఛత్ । అపేహి। సీసరమ । సారమేయ । నమః । తే। అస్తు । సీసర। సం । అశ్వాః । వృషాణః పదః। న । సీసరీదత॥

టీక॥ సీసరమ = ఓసీసరమయనుదానా!, సారమేయ = ఓసారమేయమను దానా!, సీసర = సీసరమనుదానా!, ఛత్ = ఛత్ అనుధ్వనిని, అపేహి = విడిచి పెట్టుఁడు, తే = నీకొఱకు, నమః = నమస్కారము, అస్తు = అగుఁగాక, అశ్వాః= నాగుఱ్ఱములు, వృషాణః = బలముగలవియై, పదోన= పాదములవలెనే, సీసరదత= మిమ్ములను బొందును.

తా॥ సీసరమ సారమేయ సీసర యనుకుక్కలారా! ఛత్ అనెడు మీ భయంకరధ్వనిని విడిచిపెట్టి వెళ్లిపొండు. మీకొఱకు నమస్కారముఁ జేసెదను; లేని యెడలబలముగల నాగుఱ్ఱములు వచ్చి పాదములచే మిమ్ములను ద్రొక్కివేయును.

మూ॥ ఛ దపేహి సీసరమ సారమేయ నమ స్తేఅస్తుసీసర శ్వాన
మి చ్ఛ్వాదన్న పురుష చ్ఛత్॥

పదవి॥ ఛత్ । అపేహి । సీసరమ । సారమేయ । నమః । తే । అస్తు । సీసర । శ్వానం । ఇత్ । శ్వా । అదత్ । న । పురుషం । ఛత్॥

ఛత్ అనునది మొదలు సీసర అనువఱకు అర్థము మొదలగునవి చెప్పబడినవి.

టీక॥ శ్వానం = కుక్కను, ఛత్ = ఛత్ అనుధ్వనినిచేయుచున్న, శ్వా = ఇతరమైనకుక్క, అదత్ = భక్షించుఁగాక, పురుషం = పిల్లవానిని, నాదత్ = భక్షింపకుండుఁగాక॥

తా॥ ఇక్కడకు వచ్చినమిమ్ములను మఱియొకకుక్క భక్షించుఁగాక. పిల్లవానిని భక్షింపకుండుఁగాక॥

మూ॥ ఏతే తే ప్రతిదృశ్యేతే సమానవసనే ఉభే। తే అహగ్ం సార
యేణ ముసలే నహావ ఉలూఖవే॥

పదని॥ ఏతే । తే । ప్రతి । దృశ్యేతే । సమానవసనే । ఉభే । తే । అహం సారయేణ । ముసలేన । అవ । హన్మి । ఉలూఖవే॥

టీక॥ సమానవసనే = సమానమైన వస్త్రములుగల, ఉభే= ఇద్దఱైన, ఏతే= ఈ, తే = అశంఖగ్రహముయొక్క తల్లిదండ్రులు, ప్రతిదృశ్యేతే = చూడఁబడు

చున్నారు, తే = వారినిద్దఱను, ఉలూఖలే = రోటిలోనుంచి, సారయేణ = దృఢమైన, ముసలేన = రోకలిచే, అవహన్మి = త్రొక్కుచున్నాను.

తా॥ సమానమైనవస్త్రములు గలశంఖగ్రామముయొక్క తల్లిదండ్రులు అట్లు కానఁబడుచున్నారు. వారి నిద్దఱను రోటిలో వేసి దృఢమైనరోకటిచేఁ ద్రొక్కి సంహరించుచున్నాను.

మూ॥ హత శ్శంఖో హత శ్శంఖ పితా హత శ్శంఖ కుతుర్వకః అప్యేషాగ్ం స్థపతి ర్హతః ॥

పదవి॥ హతః । శ్శంఖః । హతః । శ్శంఖపితా । హతః । శంఖ । కుతుర్వకః । అపి । ఏషాం । స్థపతిః । హతః ॥

టీక॥ శంఖః=శంఖగ్రామము, హతః=చంపబడెను, శంఖపితా=శంఖగ్రామముయొక్కతండ్రి, హతః = చంపఁబడెను, శంఖకుతుర్వకః = క్రూరుఁడైన శంఖుఁడు, హతః=చంపఁబడెను, ఏషాం=వీరియొక్క, స్థపతిరపి=అధిపతియు, హతః=చంపఁబడెను.

తా॥ క్రూరుడైన శంఖగ్రామము వానితండ్రియు వాని యధిపతియుఁ జంపఁబడిరి.

మూ॥ ఋషి ర్బోధః ప్రబోధ స్స్వప్నో మాతరిశ్వా। తే తే ప్రాణా త్స్పరిష్యంతి మా భైషీ ర్న మరిష్యసి॥

పదవి॥ ఋషిః । బోధః । ప్రబోధః । స్వప్నః । మాతరిశ్వా । ఏ తే । తే । ప్రాణాన్ । స్పరిష్యంతి । మా భైషీః । న । మరిష్యసి ॥

టీక॥ బోధఋషిః = బోధాయనమునీశ్వరుఁడు, స్వప్నః = నిద్రించినవాఁడై, ప్రబోధః=మేలుకొనెను, మాతరిశ్వా = వాయువు, తే = నీయొక్క, ఏతే=ఈ ప్రాణాన్=ప్రాణములను, స్పరిష్యంతి=తాకుచున్నది, నమరిష్యసి=మృతినొందవు, మాభైషీః=భయపడకుము.

తా॥ ఓ పిల్లవాఁడా! మనకు సూత్రకారుఁడైన బోధాయన మునీశ్వరుఁడు నిద్రను విడిచి జాగరూకుఁడై అంతయు జూచుచున్నాఁడు. వాయువు నీ ప్రాణములను దాకి కాపాడుచున్నది. కాఁబట్టి నీకు భయములేదు. నీవు మృతినొందవు.

మూ॥ జగ్ధో మశకో జగ్ధో వితృష్టి ర్జగ్ధో వ్యధ్వర స్స్వాహా జగ్ధో
వ్యధ్వరో జగ్ధో మశకో జగ్ధా వితృష్టి స్స్వాహా జగ్ధా
వితృష్టి ర్జగ్ధో వ్యధ్వరో జగ్ధో మశక స్స్వాహా॥

పదవి॥ జగ్ధః। మశకః। జగ్ధః। వితృష్టిః। జగ్ధః। వ్యధ్వరః। స్వాహా। జగ్ధః। వ్యధ్వరః। జగ్ధః। మశకః। జగ్ధా। వితృష్టిః। స్వాహా। జగ్ధా। వితృష్టిః। జగ్ధః। వ్యధ్వరః। జగ్ధః। మశకః। స్వాహా॥

టీక॥ మశకః = మశకమను సర్పము, జగ్ధః = భక్షింపఁబడెను, వితృష్టిః = వితృష్టియనుసర్పము, జగ్ధః = భక్షింపఁబడెను, వ్యధ్వరః = వ్యధ్వరమనుసర్పము, జగ్ధః = భక్షింపఁబడెనుఅని, స్వాహా = హోమముఁజేసి ఆజ్యాదిహవిస్సునిచ్చు చున్నాను. యీపదములే తిరిగి అనులోమవిలోమములుగాఁ జెప్పఁబడెను గానఁ తిరిగి అర్థము మొదలగునవి వ్రాయలేదు.

తా॥ మశకమను అనుసర్పము, వితృష్టి యనుసర్పము, వ్యధ్వర మనుసర్పము, బక్షింపఁబడుఁగాక యని ఆజ్యాదులచే హోమముఁ జేయుచున్నాను.

ఇతిసప్తదశఖండః

---

## —♦ అథాష్టాదశఖండః ♦—

మూ॥ ఇంద్ర జహి దందశూకం పక్షిణం య స్సరీసృపః। దక్ష్ణతం చ
దశంతం చ సర్వాం స్తా నింద్ర జంభయ స్వాహా॥

పదవి॥ ఇంద్ర। జహి। దందశూకం। పక్షిణం। యః। సరీసృపః। దక్ష్ణంతం। చ। దశంతం। చ। సర్వాన్। తాన్। ఇంద్ర। జంభయ। స్వాహా॥

టీక॥ ఇంద్ర = ఓయింద్రుడా!, యః = ఏజంతువు, సరీసృపః = ప్రాకు నట్టిస్వభావముగలదో, తం = అట్టువంటి, పక్షిణం = పార్శ్వములతోఁగూడిన, దందశూకం = సర్పమును, జహి = కొట్టుము, దక్ష్ణంతం = కఱవఁబోవు నట్టిదియు, దశంతంచ = కఱచుచున్నట్టిదియు నగుదానిని, సర్వాన్ = సమస్తమైనఁ తాన్ = ఆసర్పములను, ఇంద్ర = ఓయింద్రుడా!, జంభయ = కదల కుండునట్లు స్తంభనఁజేయుము, ఇతి = అని, స్వాహా = హోమముజేయుచున్నాను.

మూ॥ అప్సు జాత స్సరే వృద్ధ దేవానా మపి హస్త్య । త్వ మగ్న ఇంద్రప్రేషిత స్స నో మా హిగ్ంసీ స్స్వాహా ॥

పదవి॥ అప్సు । జాతః । సరే । వృద్ధ । దేవానాం । అపి । హస్త్య । త్వం । అగ్నే । ఇంద్రప్రేషితః । సః । నః । మా । హింసీః । స్వాహా ॥

టీక॥ అప్సు = ఉదకములయందు, జాత = పుట్టినట్టివాఁడా! సరే = సముద్రమందు, వృద్ధ = వృద్ధిపొందినవాఁడా! దేవానాం = దేవతలయొక్క, హస్త్య= చేతులయందుండువాఁడా! అగ్నే = ఓ యగ్నిహోతుఁడా! సః = అటువంటి, త్వం = నీవు, ఇంద్రప్రేషితః = ఇంద్రునిచేఁ బ్రేరేపింపఁబడినవాఁడవై కర్మములను జేయించుచు, నః = మమ్ములను, మాహింసీః = హింసింపకుము అని, స్వాహా = హోమముఁజేయుచున్నాను.

తా॥ మేఘమునందు మెఱుపురూపముగాను సముద్రమువందు బడబాగ్ని రూపముగాను దేవతలయొక్క చేతులలో నుండునట్టి యోయగ్నిహోతుఁడా! నీవు దేవేంద్రునిచేఁ బ్రేరేపణఁ జేయఁబడినవాఁడవై కర్మములను జేయించుచుంటివి గాన మమ్ములను హింసఁజేయకుము.

మూ॥ త్రాణ మసి పరిత్రాణ మసి పరిధి రసి । అన్నేన మనుష్యాగ్ స్త్రాయసే తృణైః పశూన్ గర్తేన సర్పాన్ యజ్ఞేన దేవాం త్స్వధయా పితౄం త్స్వాహా ॥

పదవి॥ త్రాణమ్ । అసి । పరిత్రాణమ్ । అసి । పరిధిః । అసి । అన్నేన । మనుష్యాన్ । త్రాయసే । తృణైః । పశూన్ । గర్తేన । సర్పాన్ । యజ్ఞేన । దేవాన్ । స్వధయా । పితౄన్ । స్వాహా ॥

టీక॥ త్రాణం = రక్షించునట్టివాఁడవు, అసి = అయితివి, పరిత్రాణం = అంతటను రక్షించునట్టివాఁడవు, అసి = అయితివి, పరిధిః = అంతటను రక్షించునట్టి యోధుఁడవు, అసి = అయితివి, మనుష్యాన్ = నరులను, అన్నేన = అన్నము చేతను, పశూన్ = పశువులను, తృణైః = గడ్డిచేతను, సర్పాన్ = పాములను, గర్తేన = గోతిచేతను, దేవాన్ = దేవతలను, యజ్ఞేన = యజ్ఞముచేతను, పితౄన్ = పితృదేవతలను, స్వధయా = కవ్యముచేతను, త్రాయసే = రక్షించుచున్నావు, ఇతి = ఇట్లని, స్వాహా = హోమముఁజేయుచున్నాను.

తా॥ ఓయగ్నిహోతృుడా! నీవు నన్ను సంతతము రక్షించునట్టియోధుఁడవై యుంటివి. అన్నముచే మనుష్యులను, గడ్డిచేఁ బశువులను, గోతిచే సర్పములను, యజ్ఞముచే దేవతలను, కవ్యముచే పితృదేవతలను రక్షించుచున్నావని హోమముఁ జేయుచున్నాను.

మూ॥ తత్సత్యం యత్తేఽమావాస్యాయాం చ పౌర్ణమాస్యాం చ విషబలిగ్ం హరంతి సర్వ ఉదరసర్పిణః । తత్తే ప్రేరతే త్వయి సంవిశంతి త్వయి న స్సత స్త్వయి సద్భ్యో వర్షాభ్యో నః పరిదేహి॥

పదవి॥ తత్ । సత్యం । యత్ । తే । అమావాస్యాయాం । చ । పౌర్ణమాస్యాం । చ । విషబలిం । హరంతి । సర్వే । ఉదరసర్పిణః । తత్ । తే । ప్రేరతే । త్వయి । సం । విశంతి । త్వయి । నః । సతః । త్వయి । సద్భ్యః । వర్షాభ్యః । నః పరిదేహి॥

టీక॥ ఉదరసర్పిణః = మనస్సునసర్పభయముగల, సర్వే = అందఱును, అమావాస్యాయాం = అమావాస్యయందునను, పౌర్ణమాస్యాంచ = పూర్ణిమయందునను, తే = నీకొఱకు, యత్ = ఏ, విషబలిం = సర్పములకొఱకైనబలిని, హరంతి= ఇచ్చుచున్నారో, తత్ = ఆబలిని, తే = ఆసర్పములు, ప్రేరతే= పొందుచున్నవి, ప్రాప్య = పొంది, త్వయి = నీయందు, సంవిశంతి = నివసించుచున్నవి తత్ = అనునది, సత్యం = వాస్తవమైయున్నది, త్వయి = నీయందు, సతః = నివసించుచున్నట్టి, నః = మమ్ములను, త్వయి = నీయందు, సద్భ్యః = ఉన్నట్టిసర్పముల వల్లను, వర్షాభ్యః = వర్షఋతువులనను పరిదేహి = రక్షింపుము॥

తా॥ సర్వజనులు సర్పములవలని భయనివృత్తికై సర్పములతృప్తికొఱకు నీయందే విషబలి నుంచుచున్నారో ఆ బలిని ఆ సర్పములు పొంది నీయందు నివసించుచున్నవి. యనునది సత్యమయియున్నది. కాఁబట్టి నీయందు నివసించుచున్న మాకు వర్షర్తువలనిభయమును ఆసర్పములవలనిభయము కలుగఁజేయకుము. వర్షర్తువునందు సర్పములు బిలములనుండి విశేషముగ వెడలును కావున ఆఋతువు పేర్కొనబడినది.

మూ॥ నమో అస్తు సర్పేభ్యో యే కేచ పృథివీమను యే అంతరిక్షే
యే దివి తేభ్య స్సర్పేభ్యో నమః॥

పదవి॥ నమః । అస్తు । సర్పేభ్యః । యే । కే । చ । పృథివీం । అను । యే । అంతరిక్షే । యే । దివి । తేభ్యః । సర్పేభ్యః । నమః ॥

టీక॥ యేకేచ = ఏ కొన్ని సర్పములు, పృథివీమను = భూమిని ఆశ్రయించి యున్నవో, తేభ్యః=అటువంటి, సర్పేభ్యః=సర్పములకొఱకు, నమః=నమస్కారము, అస్తు=అగుఁగాక, అంతరిక్షే=ఆకాశమునందు, యే=ఏ కొన్ని సర్పములు గలవో, దివి=స్వర్గమునందు, యే=ఏ కొన్ని సర్పములుగలవో, తేభ్యః=అటువంటి, సర్పేభ్యః= సర్పములకొఱకు, నమః=నమస్కారము, అస్తు = అగుఁగాక.

తా॥ భూలోకంబునను ఆకాశమునందునను స్వర్గమందునను ఏ సర్పములు గలవో ఆ సర్పములకొఱకు నేను నమస్కారమును జేయుచున్నాను.

మూ॥ యేఽదోరోచనే దివో యే వా సూర్యస్య రశ్మిషు । యేషా
మప్సు సదః కృతం తేభ్య స్సర్పేభ్యో నమః॥

పదవి॥ యే । అదోరోచనే । దివః । యే । వా । సూర్యస్య । రశ్మిషు । యేషాం । అప్సు । సదః । కృతం । తేభ్యః । సర్పేభ్యః । నమః॥

టీక॥ యే=ఏ సర్పములు, దివః=ఆకాశసంబంధమైన, అదోరోచనే=ఈప్రకాశించుస్థానమందు, సంతి=కలవో, సూర్యస్య=సూర్యునియొక్క, రశ్మిషు=కిరణములయందు, యేవా=ఏ సర్పములు కలవో, యేషాం=ఏ సర్పములకు, అప్సు=ఉదకములయందు, సదః=స్థానము, కృతం=చేయబడినదో, తేభ్యః=అటువంటి, సర్పేభ్యః= సర్పములకొఱకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక.

తా॥ ఆకాశమునందును సూర్యమండలమందును జలములయందును నివసించియున్న సర్పములకొఱకు నమస్కారమును జేయుచున్నాను.

మూ॥ యా ఇషవో యాతుధానానాం యే వా వనస్పతీగ్ం రను
యే వాఽవటేషు శేరతే తేభ్య స్సర్పేభ్యో నమః॥

పదవి॥ యాః । ఇషవః । యాతుధానానాం । యే । వా । వనస్పతీన్ । అను । యే । వా । అవటేషు । శేరతే । తేభ్యః । సర్పేభ్యః । నమః॥

టీక॥ యాః = ఏ సర్పములు, యాతుధానానాం = రాక్షసులకు, ఇషవః = బాణములయ్యెనో, యేవాం = ఏ సర్పములు, వనస్పతీన్ = వృక్షములను, అను = ఆశ్రియించియున్నవో, యేవా = ఏసర్పములు, అవటేషు=గోతులయందు, శేరతే = నివసించియున్నవో, తేభ్యః = అటువంటి, సర్వేభ్యః = పాములకొఱకు నమః = నమస్కారములు, అస్తు = అగుగాక.

తా॥ రాక్షసులకు బాయుధములుగా నుండియున్న సర్పములకును చెట్లయందున్న సర్పములకును గోతులలోనుండిన సర్పములకును నమస్కారము.

మూ॥ నమో అస్తు సర్పేభ్యో యే పార్థివా య ఆంతరిక్ష్యా యే దివ్యా యే దిశ్యాః। తేభ్య ఇమం బలిగ్ం హరిష్యామి తేభ్య ఇమం బలి మహార్షం॥

పదవి॥ నమః । అస్తు । సర్పేభ్యః । యే పార్థివాః । యే । అంతరిక్ష్యాః । యే । దివ్యాః । యే। దిశ్యాః । తేభ్యః । ఇమం । బలిం । హరిష్యామి । తేభ్యః । ఇమం । బలిం । అహార్షం॥

టీక॥ యే = ఏసర్పములు, పార్థివాః = భూమియందున్నవో, యే = ఏసర్పములు, ఆంతరిక్ష్యాః = ఆకాశమందున్నవో, యే = ఏసర్పములు, దివ్యాః= స్వర్గమునందున్నవో, యే = ఏ సర్పములు, దిశ్యాః = దిక్కులయందున్నవో, తేభ్యః = అటువంటి, సర్వేభ్యః =సర్పములకొఱకు, నమః నమస్కారము, అస్తు = అగుగాక, తేభ్యః = ఆ సర్పములకొఱకు, ఇమం = ఈ, బలిం= పూజనిమిత్తమైన యన్నమును, హరిష్యామి = పొందింపఁజేయగలను, తేభ్యః = అసర్పములకొఱకు ఇమం = ఈ, బలిం = బలిని అహార్షం = పొందింపఁజేసితిని.

తా॥ భూమియందును ఆకాశమునందును స్వర్గమునందును దిక్కులయందు నే సర్పములుగలవో ఆ సర్పములన్నిటికిని నమస్కారముఁజేసెద. ఆసర్పములకు నింతకుఁ బూర్వంబును బలినొసంగితిని. ఇకముందును బలినిమిత్తమన్నము నియ్యగలను.

మూ॥ తక్షకవైశాలేయ ధృతరాష్ట్రైరావత స్తే జీవాస్త్వయి న స్సత స్త్వయి సదోభ్య వహాఃభ్యో నః పరిదేహి। ధృతరా

ష్ట్రైరావత తక్షకవైశాలేయ స్తే జీవా స్త్వయి న స్సత
స్త్వయి సద్భ్యో వర్షాభ్యో నః పరిదేహి॥

పదవి॥ తక్షక । వైశాలేయ । ధృతరాష్ట్రైరావతః । తే । జీవాః । త్వయి । నః । సతః । త్వయి । సద్భ్యః । వర్షాభ్యః । నః । పరిదేహి । ధృతరాష్ట్రైరావత । తక్షకవైశాలేయః । తే । జీవాః । త్వయి । నః । సతః । త్వయి । సద్భ్యః । వర్షాభ్యః । నః । పరిదేహి ॥

టీక॥ వైశాలేయ = విశాలకుసంతానమైన, తక్షక=తక్షకుఁడా ! ధృతరాష్ట్రైరావతః = ధృతరాష్ట్రైరావతమనుసర్పము, తే = నీకు, జీవాః = ప్రాణము, త్వయి= నీయందు, సతః = ఉన్నట్టి, నః = మమ్ములను, త్వయి=నీయందు, సద్భ్యః=ఉన్నట్టి, వర్షాభ్యః = వర్షాకాలమందు విశేషముగా నుండునట్టి సర్పములవలన, నః = మమ్ములను, పరిదేహి = రక్షించుము॥ ధృతరాష్ట్రైరావతః = ధృతరాష్ట్రైరావతమను సర్పమా ! తక్షకవైశాలేయః= విశాలాపుత్రుఁడైన తక్షకుఁడను సర్పము, తే = నీకు జీవాః = ప్రాణము, త్వయి= నీయందు, సతః = ఉన్నట్టి, నః = మమ్ములను త్వయి = నీయందు, సద్భ్యః = ఉన్నట్టి, వర్షాభ్యః = వర్షసర్పములవలన నః = మమ్ములను, పరిదేహి=రక్షింపుము.

తా॥ ఓతక్షకుఁడా ! నీకు ఐరావతమనుసర్పము ప్రాణము ఓ ఐరావతమా ! నీకు తక్షకుఁడు ప్రాణము. కాన మీ మీరిద్దరును మీ యధీనమైన వర్షసర్పముల నుండి మమ్ములను రక్షింపుఁడు.

మం॥ అహిగ్ంసా౽తిబల స్తే జీవా స్త్వయి న స్సత స్త్వయి
సద్భ్యో వర్షాభ్యో నః పరిదేహి అతిబలా౽హిగ్ంస స్తే జీవా
స్త్వయి న స్సత స్త్వయి సద్భ్యో వర్షాభ్యోనః పరిదేహి॥

పదవి॥ అహింస । అతిబలః । తే । జీవాః । త్వయి । నః । సతః । త్వయి । సద్భ్యః । వర్షాభ్యః । నః । పరిదేహి । అతిబల । అహింసః । తే । జీవాః । త్వయి । నః । సతః । త్వయి । సద్భ్యః । వర్షాభ్యః । నః పరిదేహి॥

టీక॥ అహింస = అహింసయనుసర్పమా ! అతిబలః = అతిబలమనుసర్పము, తే = నీకు, జీవాః = ప్రాణము, అతిబల = అతిబలమనుసర్పమా ! అహింసః=అహిం

సయనాం సర్పము, తే = నీకు, జీవాః = ప్రాణము, త్వయినస్సతః = ఇది మొదలు కొని చివరవఱకు మున్నే చెప్పఁబడినది.

తా॥ ఓ అహింసమా! అతిబలము నీకు ప్రాణము ఓ అతిబలమా! అహింసము నీకు ప్రాణము. కాన మీ రిద్దఱును మీ యధీనమందున్న సర్పములవలన మాకు భయము కలుగనియ్యకుఁడు.

మూ॥ యే దందశూకాః పార్థివా స్తాగ్ స్త్వ మితః పరో గవ్యూతి నివేశయ సంతి వై న శ్శఫిన స్సంతి దండిన స్తే వో నే ద్దినసా న్నే ద్యూయ మస్మాన్ హినసాత॥

పదవి॥ యే । దందశూకాః । పార్థివాః । తాన్ । త్వం । ఇతః । పరః । గవ్యూతి । నివేశయ । సంతి । వై । నః । శఫినః । సంతి । దండినః । తే । వః । నేత్ । హినసాత్ । నేత్ । యూయం । అస్మాన్ । హినసాత ॥

టీక॥ యే = ఏ, దందశూకాః = పాములు, పార్థివాః = భూమియందున్నవో, తాన్ = ఆపాములను, త్వం = నీవు, ఇతః = ఇక్కడనుండి, పరః = మఱియొక ప్రదేశమున, గవ్యూతి = రెండుక్రోసులదూరంబున, నివేశయ = ఉంచుము, నః = మాయొక్క గృహమందు, శఫినః = డెక్కలుగల ఏమృగములు, సంతి=కలవో, దండినః కఱ్ఱలుగలఏమనుష్యులు, సంతి = కలరో, తేవై = ఆమనుష్యులు మొదలగు వారు, వః = మిమ్ములను, నేద్దినసాత్, హింసఁజేయకుండుఁగాక, యూయమపి = మీరును, అస్మాన్ = మమ్ములను, నేద్ధినసాత = హింసజేయకుందురుగాక॥

తా॥ ఓ తక్షకుఁడా! భూమియందున్న సర్పములను మా గృహంబునకు రెండు క్రోసుల దూరముగా మఱియొక ప్రదేశమున నుంచుము. ఓ సర్పములారా! మా గృహంబున నున్న పశువులు గాని మనుష్యులు గాని మిమ్ములను హింసఁ జేయరు. మీరును మమ్ములను బాధపెట్ట కుందురుగాక.

మూ॥ సమీచీనామాసి ప్రాచీదిగ్ఘేతయో నామస్థేతిద్వాదశపర్యాయాః॥

మూ॥ సమీచీనామాఽసి ప్రాచీది క్తస్యా స్తేఽగ్ని రధిపతి రసితో రక్షితా య శ్చాఽధిపతి ర్యశ్చగోప్తా తాభ్యాం నమ స్తౌ నో మృడయతాం తే యం ద్విష్మోయశ్చ నోద్వేష్టి తం వాం జంభే దధామి॥

పదవి॥ సమీచీనామా । అసి । ప్రాచీ । దిక్ । తస్యాః । తే । అగ్నిః । అధిపతిః । అసితః । రక్షితా । యః । చ । అధిపతిః । యః। చ । గోప్తా । తాభ్యాం । నమః । తౌ । నః । మృడయతాం । తే । యం । ద్విష్మః । యః । చ । నః । ద్వేష్టి । తం । వాం । జంభే । దధామి ॥

టీక॥ ప్రాచీదిక్ = ఓ తూర్పుదిక్కా !, త్వం = నీవు, సమీచీనామా = సమీచి యను పేరుగలదానవు, అసి = అయితివి, తస్యాః = అటువంటి, తే=నీ యొక్క, అధిపతిః = అధిపతి, అగ్నిః = అగ్నిహోత్రుఁడు, రక్షితా = రక్షకుఁడు, అసితః =అసితుడనెడు సర్పము, అధిపతిః = అధిపతి, యశ్చ = ఏయగ్నిహోత్రుఁడో, గోప్తా=రక్షకుఁడు, యశ్చ=ఏఅసితుఁడో, తాభ్యాం = వారిద్దఱికొఱకును, నమః = నమస్కారము, తౌ = వారిద్దఱు, నః = మమ్ములను, మృడయతాం=సుఖపెట్టుదురుగాక, తే = అటువంటి, వయం=మేము, యం = ఎవనిని ద్విష్మః = ద్వేషించుచున్నామో, యశ్చ = ఎవఁడు, నః = మమ్ములను, ద్వేష్టి = ద్వేషించుచున్నాఁడో, తం=ఆ మనుష్యుని, వాం=మీయిద్దఱియొక్కయొక్క, జంభే= దంతములయందు, దధామి = (ఇచ్చట వచన వ్యత్యయము) ఉంచుచున్నాము.

తా॥ ఓ తూర్పుదిక్కా ! నీవు సమీచి యను పేరుగలదానవు. అటువంటి నీకు అధిపతి యగ్నిహోత్రుఁడును, రక్షకుడు అసితుఁడనెడుసర్పము నై రి. వారిద్దఱికొఱకు నమస్కారముఁ జేసెదను. గాన వారిద్దఱు మమ్ములను సుఖపెట్టుదురుగాక. ఎవనిని మేము దూషించెదమో ఎవఁడు మమ్ములను దూషించునో అట్టివానిని మీ యిద్దఱికోఱలలో నుంచెదను గాన వానిని భక్షించి మమ్ములను రక్షించవలయును.

మం॥ ఓజస్వినీ నామాసి దక్షిణాదిక్తస్యాస్త ఇంద్రోఽధిపతిః పృదాకూ రక్షితా యశ్చాధిపతి ర్యశ్చ గోప్తా తాభ్యాం నమ స్తౌ నో మృడయతాం తే యంద్విష్మో యశ్చ నో ద్వేష్టి తం వాం జంభే దధామి ॥

పదవి॥ ఓజస్వినీనామాఅసి । దక్షిణా । దిక్ । తస్యాః । తే । ఇంద్రః । అధిపతిః । పృదాకుః । రక్షితా । యః । చ । అధిపతిః । యః । చ । గోప్తా । తాభ్యాం । నమః । తౌ । నః । మృడయతాం । తే । యం । ద్విష్మః । యః । చ । నః । ద్వేష్టి । తం । వాం । జంభే । దధామి ॥

టీక॥ దక్షిణాదిక్=ఓ దక్షిణదిక్కా! త్వం = నీవు, ఓ జస్వినీనామా = ఓజస్వినియను పేరుగలదానవై, అసి = అయితివి, తస్యాః = అటువంటి, తే=నీకు, ఇంద్రః=దేవేంద్రుఁడు, అధిపతిః=అధిపతి, పృదాకు=పృదాకు, రక్షితా=రక్షకుడు (యక్ష్మ మొదలు మంత్రాంతమువఱకుఁ బూర్వమంత్రములో జెప్పఁబడెను గాన నిచ్చట వ్రాయలేదు.) ప్రతిమంత్రములో నీలాగునే యూహింపవలయును.

తా॥ ఓదక్షిణదిక్కా! ఓజస్విని యను పేరుగలదానవు. నీకు ఇంద్రుడు అధిపతి; ప్రదాకుఁడనెడుసర్పము రక్షకుఁడు.

మూ॥ ప్రాచీనా మాఽసి ప్రతీచీ ది క్తస్యా స్తే సోమోఽధిపతి స్స్వృజో రక్షితాదధామి॥

పదవి॥ ప్రాచీనామా । అసి । ప్రతీచీ । దిక్ । తస్యాః । తే । సోమః । అధిపతిః । స్వజః । రక్షితా॥

టీక॥ ప్రతీచీదిక్ = ఓపశ్చిమదిక్కా!, త్వం = నీవు, ప్రాచీనామా = ప్రాచియను పేరుగలదానవు, అసి = అయితివి, తస్యాః = అటువంటి, తే = నీకు, సోమః = చంద్రుడు, అధిపతిః = అధిపతి, స్వజః = స్వజుఁడనుసర్పము, రక్షితా = రక్షకుఁడు.

తా॥ ఓపశ్చిమదిక్కా! నీవు ప్రాచి యను పేరుగలదానవు. చంద్రుఁడుఁ అధిపతి స్వజుఁడనెడుసర్పము రక్షకుఁడు.

మూ॥ అవస్థావానామా స్యుదీచీ ది క్తస్యా స్తే వరుణోఽధిపతి స్తిర శ్చిరాజీ రక్షితాదధామి॥

పదవి॥ అవస్థావానామా । అసి । ఉదీచీ । దిక్ । తస్యాః । తే । వరుణః । అధిపతిః । తిరశ్చిరాజీ । రక్షితా॥

టీక॥ ఉదీచీదిక్ = ఓయుత్తరదిక్కా! త్వం = నీవు, అవస్థావానామా = అవస్థావయను పేరుగలదానవు, అసి = అయితివి, తస్యాః = అటువంటి, తే = నీకు, వరుణః = వరుణుఁడు, అధిపతిః = అధిపతి, తిరశ్చిరాజిః = తిర్యగ్జంతువుల యొక్క సమూహము, రక్షితా = రక్షకమైనది.

తా॥ ఓయుత్తరదిక్కా! నీవు అవస్థావమను పేరు గలదానవు. నీవు వరుణదేవుం డధిపతియు తిర్యగ్జంతువులు రక్షకములుగాం గలదాన వైతివి.

మూ॥ అధిపత్నీ నామాఽసి బృహతీ దిక్తస్యాస్తే బృహస్పతి రధి పతి శ్శ్విత్రో రక్షితాఽదధామి॥

పదవి॥ అధిపత్నీ నామా । అసి । బృహతీ । దిక్ । తస్యాః । తే । బృహస్పతిః । అధిపతిః । శ్విత్రః । రక్షితా॥

టీక॥ బృహతీదిక్ = ఊర్ధ్వదిక్కా! త్వం = నీవు, అధిపత్నీ నామా = అధిపత్నియను పేరుగలదానవు, అసి = అయితివి, తస్యాః = అట్టునంటి, తే = నీకు, బృహస్పతిః = గురువు, అధిపతిః = అధిపతి, శ్విత్రః = శ్విత్రుండనుసర్పము, రక్షితా = రక్షకుండు.

తా॥ ఊర్ధ్వదిక్కా! నీవు అధిపత్ని యను పేరుగలదానవు. నీకు బృహస్పతి యధిపతియు శ్విత్రుండనుసర్పము రక్షకుండును అయిరి.

మూ॥ వశినీనామాఽ సియం దిక్తస్యాస్తే యమోధిపతిః కల్మాష గ్రీవో రక్షితా దధామి॥

పదవి॥ వశినీ నామా । అసి । ఇయం । దిక్ । తస్యాః । తే । యమః । అధిపతిః । కల్మాషగ్రీవః । రక్షితా ॥

టీక॥ ఇయందిక్ = అధోదిక్కా! త్వం = నీవు, వశినీనామాః = వశిని యను పేరు గలదానవు, అసి = అయితివి, తస్యాః = అట్టునంటి, తే = నీకు, యమః = యముండు, అధిపతిః = ప్రభువు, కల్మాషగ్రీవః = కల్మాషగ్రీవమను సర్పము, రక్షితా = రక్షకుండు.

తా॥ ఓ అధోదిక్కా! నీవు వశిని యను పేరుగలదానవు. నీకు యముండు అధిపతి. కల్మాషగ్రీవుండు అనుసర్పము రక్షకుండు.

మూ॥ హేతయోనామ స్థ తేషాం వః పురో గృహా అగ్ని ర్వ ఇషవ స్సలిలో వాతనామం దధామి ॥

పదవి॥ హేతయః । నామ । స్థ । తేషాం । వః । పురః । గృహాః । అగ్నిః । వః । ఇషవః । సలిలః । వాతనామం ॥

టీక॥ హేసర్పాః = ఓసర్పములారా! యూయం = మీరు, హేతయో నామ = హేతులుఅను పేరుగలవారు, స్థ = అయితిరి, తేషాం = అట్టువంటి, వః = మీయొక్క, గృహాః = గృహములు, పురః = తూర్పుదిక్కునందున్నవి, అగ్నిః = అగ్నిహోత్రుఁడు, వః = మీకు, ఇషవః = బాణములు, సలిలః = ఉదకము, వాతనామం = రక్షకమైనశబ్దమును ధరించితిరి.

తా॥ ఓసర్పములారా! మీరు హేతు లను పేరుగలవా రైరి. మీ గృహములు తూర్పుదిక్కునం దున్నవి. సలిలశబ్దమును ధరించి రక్షించు చుంటిరి.

మ॥ నిలింపానామ స్థ తేషాం వో దక్షిణా గృహాః పితరో వ ఇషవ స్సగరో వాతనామం దధామి॥

పదవి॥ నిలింపాః। నామ। స్థ। తేషాం। వః। దక్షిణాః। గృహాః। పితరః। వః। ఇషవః। సగరః। వాతనామం॥

టీక॥ నిలింపా నామ=నిలింపులను పేరుగలవారు, స్థ = అయితిరి, తేషాం = అట్టువంటి, వః = మీయొక్క, గృహాః = గృహములు, దక్షిణాః = దక్షిణదిక్కునయందున్నవి, వః = మీయొక్క, ఇషవః = బాణములు, పితరః = పితృదేవతలు, సగరః = సగరుఁడు, వాతనామం = రక్షకశబ్దము.

తా॥ నిలింపులను సర్పములారా! మీ యిండ్లు దక్షిణంబున నున్నవి. మీయొక్క బాణములు పితృదేవతలు. సగరశబ్దమును ధరించి రక్షించు చుంటిరి.

మ॥ వజ్రిణోనామ స్థ తేషాం వః పశ్చా ద్గృహా స్స్వప్నోవ ఇషవో గహ్వరో వాతనామం దధామి॥

పదవి॥ వజ్రిణః। నామ। స్థ। తేషాం। వః। పశ్చాత్। గృహాః। స్వప్నః। వః। ఇషవః। గహ్వరః। వాతనామం॥

టీక॥ వజ్రిణోనామ = వజ్రిణమను పేరుగలవారు, స్థ=అయితిరి, తేషాం = అట్టువంటి, వః = మీయొక్క, గృహాః = గృహములు, పశ్చాత్ = పడమటదిక్కునం దున్నవి, వః = మీయొక్క, ఇషవః = బాణములు, స్వప్నః=స్వప్నము, గహ్వరః= గహ్వరమనుశబ్ధము, వాతనామం = రక్షకశబ్ధము॥

తా॥ వజ్రిణమను పేరుగల సర్పములారా ! మీ యొక్క గృహములు పశ్చిమ దిక్కునందున్నవి. మీకు బాణములు. స్వప్నముః నగరశబ్దమును ధరించి రక్షించు చుంటిరి.

మూ॥ అవస్థావానోనామ స్థ తేషాం వ ఉత్తరా ద్గృహా ఆపో వ ఇషవ స్సముద్రో వాతనామం దధామి॥

పదవి॥ అవస్థావానః । నామ । స్థ । తేషాం । వః । ఉత్తరాత్ । గృహాః । ఆపః । వః । ఇషవః । సముద్రః । వాతనామం॥

టీక॥ అవస్థావానోనామ = అవస్థలుగలవారను పేరుగలవారు, స్థ = అయి తిరి, తేషాం = అటువంటి, వః = మీయొక్క, గృహాః = గృహములు, ఉత్త రాత్ = ఉత్తరదిక్కునందున్నవి, వః = మీయొక్క, ఇషవః = బాణములు, ఆపః = ఉదకములు, సముద్రః = సముద్రుడు, వాతనామం = రక్షకశబ్దము.

తా॥ అవస్థగలవారను పేరుగల సర్పములారా! మీగృహము లుత్తరమున నున్నవి. మీకుబాణములు ఉదకములు ; సముద్రశబ్దమును ధరించి రక్షించుచుంటిరి.

మూ॥ అధిపతయోనామ స్థ తేషాం వ ఉపరిగృహా వర్‌షం వ ఇష వోఽవస్వాన్ వాతనామం దధామి॥

పదవి॥ అధిపతయః । నామ । స్థ । తేషాం । వః । ఉపరి । గృహాః । వర్షం । వః । ఇషవః । అవస్వాన్ । వాతనామం॥

టీక॥ అధిపతయోనామ = అధిపతులుఅను పేరుగలవారై, స్థ = ఉంటిరి తేషాం = అటువంటి. వః = మీయొక్క, గృహాః = గృహములు, ఉపరి = పై భాగంబున నున్నవి, వః = మీయొక్క, ఇషవః = బాణములు, వర్షం = వర్షి చుట, అవస్వాన్ = అవస్వత్తు, వాతనామం = రక్షకశబ్దము.

తా॥ అధిపతు లనుసర్పములారా! మీ గృహములు పైభాగంబున నున్నవి. మీయొక్కబాణములు వర్షము. అవస్వత్తు అను పేరిని ధరించి రక్షించుచుంటిరి.

మూ॥ క్రవ్యానామ స్థ పార్థివా స్తేషాం వ ఇహా గృహా అన్నం వ ఇషవో ఽనిమిషో వాతనామం దధామి॥

పదవి॥ క్రవ్యాః । నామ । స్థ । పార్థివాః । తేషాం । వః । ఇహ । గృహాః । అన్నం । వః । ఇషవః । అనిమిషః । వాతనామం॥

టీక॥ పార్థివాః= భూమియందుండు సర్పములారా, క్రివ్యానామ=క్రివ్యలుఅను పేరుగలవారై, స్థ= ఉంటిరి, తేషాం = అట్టివంటి, వః = మీయొక్క గృహాః = గృహములు, ఇహ = ఈభూలోకమందున్నవి, అన్నం = అన్నము, వః= మీయొక్క, ఇషవః = బాణములు, అనిమిషః = అనిమిషశబ్దము, వాతనామం= రక్షకశబ్దముగాధరించితిరి.

తా॥ క్రివ్య లను పేరుగలసర్పములారా! మీ గృహములు భూలోకమందున్నవి. మీ బాణములు అన్నము. అనిమిషశబ్దమును ధరించి రక్షించు చుంటిరి.

మూ॥ అప శ్వేత పదా జహి పూర్వేణ చాపరేఽణచ । సప్తచ మానుషీ రిమా స్తిస్రి శ్చ రాజబంధవీః (రాజబాంధవీః) ॥

పదవి॥ అప । శ్వేత । పదా । జహి । పూర్వేణ । చ । అపరేణ । చ । సప్త । చ । మానుషీః । ఇమాః । తిస్రః । చ । రాజబంధవీః ॥

టీక॥ శ్వేత = శ్వేతయనుసర్పమా! మానుషీః = మనుష్యసంబంధమైన, సప్తచ = బ్రాహ్మ వైశ్య శూద్రుల సంబంధమైన యేడుజాతులను, రాజబంధవీః= రాజసంబంధమైన, ఇమాః = ఈ తిస్రః = మూడైన, జాతులను, పూర్వేణ = మొదటిదైన, పదాచ = పాదముచేతను, అపరేణచ = రెండవపాదముచేతను, అప జహి =పాఱఁదోలుము.

తా॥ సర్పములకు నధిపతియైన ఓశ్వేతుఁడనుసర్పమా! బ్రాహ్మణసంబంధమైన మూడుజాతులును, క్షత్రియసంబంధమైన మూడుజాతులును, వైశ్యసంబంధమైన రెండుజాతులును, శూద్రసంబంధమైన రెండుజాతులును, మొత్తము పదిజాతులుగల సర్పములను నీ రెండు పాదములచేతను, బాఱఁదోలుము.

మూ॥ న వై శ్వేత స్యాఽధ్యాచా రేఽహి ర్జఘాన కంచన । శ్వేతాయ వైదర్వాయ నమోన్నమ శ్శ్వేతాయ వైదర్వాయ॥

పదవి॥ న । వై । శ్వేతస్య । అధ్యాచారే । అహిః । జఘాన । కం । చ । న । శ్వేతాయ । వైదర్వాయ । నమః । నమః । శ్వేతాయ । వైదర్వాయ ॥

టీక॥ శ్వేతస్య = శ్వేతుఁడనుసర్పమునకు, అధ్యాచారే = అధిపత్యము. కలిగియుండఁగా, అహిః = సర్పము, కంచన = ఏమనుష్యుని, నవై జఘాన = హింసు

జేయదు, శ్వైత్రాయ = శ్వైతుఁడనుసర్పముకొఱకును, వైదర్వ్యాయ = విదర్వపుత్త్రుఁడగు, శ్వైత్రాయ = శ్వైతుఁడనుసర్పముకొఱకును, నమోనమః = నమస్కారము నమస్కారము.

తా॥ శ్వైతుఁడను సర్పము సమస్త సర్పములకును అధిపతి యగుచుండఁగానే సర్పముకు ఏ మనుష్యునైనను గఱవడు కాన విదర్వపుత్రుఁడగునట్టి శ్వైతునకు నమస్కారముఁ జేసెదను.

ఇతి అష్టాదశఖండ స్సమాప్తః

---

## ——♦ అథైకోనవింశతిఖండ ప్రారంభః ♦——

మూ॥ పరమే ష్ఠ్యసి పరమాం మాగ్ం శ్రియం గమయ ప్రత్యవ
రూఢో నో హేమంతః ॥

పదవి॥ పరమేష్ఠీ । అసి । పరమాం । మాం । శ్రియం । గమయ । ప్రతి । అవరూఢః । నః । హేమంతః ॥

టీక॥ పరమేష్ఠీ = ఉత్కృష్టస్థానమందున్నదానవు, అసి=అయితివి, మాం= నన్ను గురించి, పరమాం=అధికమైన, శ్రియం=సంపత్తును, గమయ=పొందించుము, హేమంతః=హేమంతఋతువు, నః=మమ్ములను, ప్రత్యవరూఢః=అధిష్ఠించినది.

తా॥ హోమముఁ జేయఁగా మిగిలిన యో అగ్రయణపిండమా నీవు శ్రేష్ఠమైన స్థానమం దుంటివిగాన నాకు విశేషమైన సంపత్తును గలుగఁజేయుము. హేమంతఋతువునందు శీతబాధచే ఋత్విశయనుల మగుదుము. అట్టి హేమంతఋతువాసన్నమయ్యెను ?

మూ॥ ప్రతిక్షత్రే ప్రతితిష్ఠామి రాష్ట్రే ప్రత్యశ్వేషు ప్రతితిష్ఠామి
గోషుప్రతిప్రజాయాం ప్రతితిష్ఠామి భవ్యే॥

పదవి॥ ప్రతి। క్షత్రే । ప్రతి । తిష్ఠామి । రాష్ట్రే । ప్రతి । అశ్వేషు । ప్రతి । తిష్ఠామి । గోషు । ప్రతి । ప్రజాయాం । ప్రతి । తిష్ఠామి । భవ్యే ॥

టీక॥ అహం = నేను, సంవిశన్నపి = మంచము మొదలగువానియందు శయనించినవాఁడనైనను మత్తుఁడనుగాక, ప్రతిక్షత్రే = క్షత్రియసంబంధమైన యన్ని కార్యములయందును, రాష్ట్రే = రాజ్యపాలనమందును, ప్రతితిష్ఠామి = జాగరూకుఁడనై యుంచున్నాను. ప్రత్యశ్వేషు = గుఱ్ఱములయన్ని ప్రచారములయందును, ప్రతిగోషు = అన్నిగోవుల పరిశీలనయందును, ప్రతితిష్ఠామి = జాగరూకుఁడనైయుంచున్నాను. ప్రతిప్రజాయాం = ప్రతిజనవిచక్షణమందును, ప్రతిభవ్యే = అన్ని శుభప్రసక్తులయందును, ప్రతితిష్ఠామి = జాగరూకుఁడనైయుంచున్నాను.

తా॥ నేను మంచము మొదలగువానియందు శయనించినను మత్తుఁడను గాక రాష్ట్రపరిశీలనయందునను క్షాత్రవంతమందునను గుఱ్ఱములు ఆవులు మొదలగువాని పోషణమునందునను సంతానమునందునను శుభకార్యములయందునను జాగరూకుఁడనై పరిశీలనఁ జేయుచుందును.

మూ॥ ఇహ ధృతి రిహ విధృతి రిహ రంతి రిహ రమతిః॥

పదవి॥ ఇహ । ధృతిః । ఇహ । విధృతిః । ఇహ । రంతిః । ఇహ । రమతిః ॥

టీక॥ ఇహ = ఈ యాసనమందుండి, ధృతిః = ధైర్యముగలవాఁడను, విధృతిః = విశేషమైన ధైర్యముగలవాడనై, ఇహ = ఇక్కడను, రంతిః = క్రీడించెదను, ఇహ = ఇక్కడనే, రమతిః = మిక్కిలి క్రీడించెదను.

తా॥ ఈ యాసనమందుండియే ధైర్యముగలవాఁడనై క్రీడించుచున్నవాఁడ నయ్యెదను.

మూ॥ స్యోనాపృథివిభవాన్నృక్షరానివేశనీయచ్ఛానశ్శర్మసప్రథాః ॥

యీ మంత్రమునకు అర్థాములు మొదలగునవి పూర్వమే చెప్పఁబడెను.

మూ॥ బడిత్థా పర్వతానాం ఖిద్రం బిభర్షి పృథివి ప్రయా భూమి ప్రవత్వతి మహ్నా జినోషి మహిని ॥

పదవి॥ బట్ । ఇత్థా । పర్వతానాం । ఖిద్రం । బిభర్షి । పృథివి । ప్ర । యా । భూమి । ప్రవత్వతి । మహ్నా । జినోషి । మహిని ॥

టీక॥ పృథివి = భూమీ, త్వం = నీవు, పర్వతానాం = పర్వతముల యొక్క, ఖిద్రం = రంధ్రమును, బిభర్షి = ధరించితివి, ఇత్థా = ఈప్రకారము,

బట్ = సత్యము, మహిని = మహిమగల, భూమి = ఓభూమీ, యా = ఏనీవు, ప్రథత్వతి = శుభములను కలుగజేయుచున్నావో, సా = అటువంటినీవు, మహ్నా = నీ మహిమచేత, ప్రిజినోషి = దేవతలను దృప్తినొందించు చున్నావు.

తా॥ ఓభూమీ! నీవు పర్వతములను ధరించినదానవు. నాకు శుభములను గలుగఁజేయుచుంటివి నీవు మహిమచే దేవతలను దృప్తినొందించుచుంటివి.

మూ॥ ఆ త్వా వహంతు హరయ స్సచేత సశ్వైస్త్రైరశ్వైస్సహ కేతుమద్భిః । వాతాజిరై ర్బలవద్భి ర్మనోజవై రాయాహి శీఘ్రం మమ హవ్యాయ శర్వ॥

పదవి॥ ఆ । త్వా । వహంతు । హరయః । సచేత । సశ్వైత్రైః । అశ్వైః । సహ । కేతుమద్భిః । వాతాజిరైః । బలవద్భిః । మనోజవైః । ఆయాహి । శీఘ్రం । మమ । హవ్యాయ । శర్వ॥

టీ॥ సచేత = స్థిరచిత్తముతోఁగూడిన, శర్వ = ఓయీశానుడా!, త్వాం= నిన్ను, హరితః = తెల్లనైన, హరయః = గుఱ్ఱములు, ఆవహంతు = మోయుఁగాక, సశ్వైత్రైః = తెల్లనివర్ణముగలవియు, కేతుమద్భిః = ధ్వజములతోఁగూడినవియు, వాతాజిరైః = వాయువుతో సమానమైన నడకగలవియు, బలవద్భిః = బలముగల వియు, మనోజవైః = మనోవేగముతో సమానవేగముగల, అశ్వైస్సహ = గుఱ్ఱము లతోఁగూడ, మమ = నాయొక్క, హవ్యాయ = హవిస్సునుగ్రహించుటకొఱకు, ఆయాహి = రమ్ము.

తా॥ ఓసాంబమూర్తీ! తెల్లనివియు ధ్వజములుగలవియు వాయువేగమనో వేగములతో సమానమైన వేగముగలవియు బలముగలవియు నగుగుఱ్ఱముల నెక్కి నే నిచ్చెడుహవ్యమును గ్రహించుకొఱకు రమ్ము.

మూ॥ ఉపస్స్పృశతు మీఢ్వాన్ మీఢుషే స్వాహోపస్స్పృశతు మీఢుషీ మీఢుష్యై స్వాహా జయం తోపస్స్పృశతు జయం జయంతాయ స్వాహా భవాయ దేవాయ స్వాహా శర్వాయ దేవాయ స్వాహేశానాయ దేవాయ స్వాహా పశుపతయే దేవాయ స్వాహా రుద్రాయ దేవాయ స్వాహోగ్రాయ దేవాయ స్వాహా భీమాయ దేవాయ స్వాహా మహతే దేవా

యస్వాహా భవస్య దేవస్య పత్న్యై స్వాహా శర్వస్య దేవస్య పత్న్యై స్వాహేశానస్య దేవస్య పత్న్యై స్వాహా పశుపతే ర్దేవస్య పత్న్యై స్వాహా రుద్రస్య దేవస్య పత్న్యై స్వాహోగ్రస్య దేవస్య పత్న్యై స్వాహా భీమస్య దేవస్య పత్న్యై స్వాహా మహతో దేవస్య పత్న్యై స్వాహా। జయంతాయ। స్వాహా॥

పదవి॥ ఉప। స్పృశతు। మీఢ్వాన్। మీఢుషే। స్వాహా। ఉప। స్పృశతు। మీఢుషీ। మీఢుష్యై। స్వాహా। జయంత। ఉప। స్పృశ। జయంతాయ। స్వాహా। భవాయ। దేవాయ। స్వాహా। శర్వాయ। దేవాయ। స్వాహా। ఈశానాయ। దేవాయ। స్వాహా। పశుపతయే। దేవాయ। స్వాహా। రుద్రాయ। దేవాయ। స్వాహా। ఉగ్రాయ। దేవాయ। స్వాహా। భీమాయ। దేవాయ। స్వాహా। మహతే। దేవాయ। స్వాహా। భవస్య। దేవస్య। పత్న్యై। స్వాహా। శర్వస్య। దేవస్య। పత్న్యై। స్వాహా। ఈశానస్య। దేవస్య। పత్న్యై। స్వాహా। పశుపతేః। దేవస్య। పత్న్యై। స్వాహా। రుద్రస్య। దేవస్య। పత్న్యై। స్వాహా। ఉగ్రస్య। దేవస్య। పత్న్యై। స్వాహా। భీమస్య। దేవస్య। పత్న్యై। స్వాహా। మహతః। దేవస్య। పత్న్యై। స్వాహా జయంతాయ। స్వాహా॥

టీక॥ మీఢ్వాన్ = వర్షింపఁజేయునట్టి రుద్రుఁడు, ఓదనం = అన్నమును, ఉపస్పృశతు = స్పృశించుఁగాక, తస్మై = అటువంటి, మీఢుషే = వర్షప్రదుఁడగురుద్రునికొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను, మీఢుషీ = వర్షమును కురిపింపజేయు రుద్రునిభార్య, ఓదనం = అన్నమును, ఉపస్పృశతు = స్పృశించుఁగాక, తస్యై = అటువంటి మీఢుష్యై = రుద్రునిభార్య కొఱకు, స్వాహా = హవిస్సునిచ్చుచున్నాను, జయంత = ఓ జయంతుఁడా! ఉపస్పృశ = అన్నమును ముట్టుకొనుము, తస్మై = అటువంటి, జయంతాయ = కుమారస్వామి కొఱకు స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను, భవాయదేవాయ = భవుడను పేరుగల రుద్రునికొఱకు, స్వాహా = హవిస్సునిచ్చుచున్నాను, శర్వాయదేవాయ = శర్వుఁడను పేరుగల, రుద్రునికొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను, ఈశానాయ

దేవాయ = ఈశానుఁడను పేరుగల రుద్రునికొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను, పశుపతే దేవాయ = పశుపతి యను పేరుగల రుద్రునికొఱకు, స్వాహా= హవిస్సు నిచ్చుచున్నాను, రుద్రాయ దేవాయ = రుద్రుఁడను పేరుగల సాంబమూర్తికొఱకు, స్వాహా = హవిస్సునిచ్చుచున్నాను, ఉగ్రాయ దేవాయ= ఉగ్రుఁడను పేరుగల సాంబమూర్తి కొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను, భీమాయ దేవాయ = భీముఁడను పేరుగల సాంబమూర్తికొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను, మహతే దేవాయ = మహాత్ముఁడను పేరుగల సాంబమూర్తి కొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను, భవస్య దేవస్య = దేవుండును, భవుఁ డను పేరుగల సాంబమూర్తియొక్క, పత్న్యై = భార్యకొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను.

యీ ప్రకారంబుగా మిగిలిన మంత్రములకు నర్థముఁ జెప్పుకొనవలయును.
జయంతాయ = కుమారస్వామికొఱకు హవిస్సు నిచ్చుచున్నాను.

తా॥ వర్షమును గురియింపఁజేయునట్టి రుద్రుఁడును రుద్రుని భార్యయు ఈ యన్నమును స్పృశించినవారై నే నిచ్చునట్టి హవిస్సును గ్రహింతురు గాక, ఓ కుమారస్వామీ ! ఈ యన్నమును స్పృశించి నీవు హవిస్సును గ్రహింపుము. జలము భూమి వాయువు అగ్ని సూర్యుఁడు సోమయాజి ఆకాశము చంద్రుఁడు అను పేరుగల ఏ యెనిమిది శరీరంబులు సాంబమూర్తికిఁ గలవో ఆ శరీరములకు అధిదేవతలగు భవుఁడు శర్వుఁడు ఈశానుఁడు పశుపతి రుద్రుఁడు ఉగ్రుఁడు మహాత్ముఁడు భీముఁడు అను ఎనమండుగురు రుద్రులును వారి భార్యలును కుమారస్వామియు నే నిచ్చునట్టి హవిస్సును గ్రహింతురు గాక.

మూ॥ అగ్నయే స్విష్టకృతే సుహుతహుతాహుతీనాం కామానాగ్ం
సమర్ధయిత్రే స్వాహా॥

పదవి॥ అగ్నయే । స్విష్టకృతే । సుహుతహుతాహుతీనాం । కామానాం సమర్ధయిత్రే । స్వాహా ॥

టీక॥ స్విష్టకృతే=శుభప్రదమైన కోరికల నిచ్చువాడును, సుహుతహుతాహుతీనాం=సుకృతమును జేయునట్టి ఆహుతులను, కామానాం=కోరికలను, సమర్ధయిత్రే= వృద్ధిపొందుచున్నట్టి, అగ్నయే=రుద్రునికొఱకు, స్వాహా=హవిస్సు నిచ్చుచున్నాను,

తా॥ యోగ్యమైన కోరికల నొసఁగువాఁడును పుణ్యమును గలుగఁజేయు ఆహుతులను గోర్కెలను వృద్ధిని బొందించునట్టి శివునకు హావిస్సు నిచ్చుచున్నాను.

మూ॥ స్వస్తి నః పూర్ణా ముఖః పరి క్రామతు గృహాపోపస్పృశ గృహాపాయ స్వాహాగృహా వ్యుపస్పృశ గృహాపైస్య స్వాహా ఘోషిణ ఉపస్పృశత ఘోషేభ్య స్స్వాహా శ్వాసిన ఉపస్పృశత శ్వాసిభ్య స్స్వాహా విచిన్వంత ఉపస్పృశత విచిన్వద్భ్య స్స్వాహా ప్రపున్వంత ఉపస్పృశత ప్రపున్వద్భ్య స్స్వాహా సమశ్నంత ఉపస్పృశత సమశ్నద్భ్య స్స్వాహా దేవసేనా ఉపస్పృశత, దేవసేనాభ్యస్స్వాహాయా ఆఖ్యాతాయా శ్చాఽనాఖ్యాతా దేవసేనా ఉపస్పృశత దేవసేనాభ్యస్స్వాహా ద్వారాపోపస్పృశద్వారాపాయ స్వాహా ద్వారా వ్యుపస్పృశద్వారాపైస్స్వాహాఽన్వాసారిణ ఉపస్పృశ తాఽన్వాసారిభ్య స్స్వాహాని షంగి న్నుపస్పృశ నిషంగిణే స్వాహా॥

ప॥ స్వస్తి । నః । పూర్ణాఽముఖః । పరిక్రామతు । గృహాప । ఉపస్పృశ । గృహాపాయ । స్వాహా । గృహాపి । ఉపస్పృశ । గృహాపైస్య । స్వాహా । ఘోషిణః । ఉపస్పృశత । ఘోషిభ్యః । స్వాహా । శ్వాసినః । ఉపస్పృశత । శ్వాసిభ్యః । స్వాహా । విచిన్వంతః । ఉపస్పృశత । విచిన్వద్భ్యః । స్వాహా । ప్రపున్వంతః । ఉపస్పృశత । ప్రపున్వద్భ్యః స్వాహా । సం । అశ్నంతః । ఉపస్పృశత । సం । అశ్నద్భ్యః స్వాహా । దేవసేనాః । ఉపస్పృశత । దేవసేనాభ్యః । స్వాహా । యాః । ఆఖ్యాతాః । యాః । చ । అనాఖ్యాతాః । దేవసేనాః । ఉపస్పృశత । దేవసేనాభ్యః । స్వాహా । ద్వారాప । ఉపస్పృశ । ద్వారాపాయ । స్వాహా । ద్వారాపి । ఉపస్పృశ ద్వారాపైస్య । స్వాహా । అన్వాసారిణః । ఉపస్పృశత।అన్వాసారిభ్యః। స్వాహా । నిషంగిన్ । ఉపస్పృశ నిషంగిణే । స్వాహా॥

టీక॥ యథా = ఏప్రకారముగాను, నః = మాకు, స్వస్తి = శుభమవునో, పూర్ణాఽముఖః = ఆహుతులచేతనిండియుండినముఖముగలదుర్గుఁడు, తథా = ఆప్రకారముగా, పరిక్రామతు = సంచరించుఁగాక, గృహాప = గృహామునురక్షించునట్టిదుర్గుఁడా! ఇమం = ఈబలిని, ఉపస్పృశ = స్పృశింపుము. గృహాపాయ =

అటువంటిగృహరక్షకుఁడైనరుద్రునికొఱకు, స్వాహా = బలినిచ్చుచున్నాను, గృహపి = గృహమును రక్షించువాడా!, ఉపస్పృశ = బల్యన్నమును స్పృశింపుము, గృహాప్యై = గృహమును రక్షించునట్టియామెకొఱకు, స్వాహా = బల్యన్నమును ఇచ్చుచున్నాను. ఘోషిణః = ధ్వనిగలగుణములారా! ఉపస్పృశత = బల్యన్నమును గ్రహింపుఁడు. ఘోషిభ్యః = ధ్వనిగల గుణములకొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను, శ్వాసినః = శ్వాసముగల గుణములారా! ఉపస్పృశత = బల్యన్నమును స్పృశింపుఁడు, శ్వాసిభ్యః = శ్వాసముగల గుణములకొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను, విచిన్వంతః = వెతకుగుణములారా! ఉపస్పృశత = బల్యన్నమును స్పృశింపుఁడు, విచిన్వద్భ్యః = వెతకునట్టి గుణములకొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను, ప్రపున్వతః = పరిశీలనఁజేయునట్టియో గుణములారా! ఉపస్పృశత = బల్యన్నమును, స్పృశింపుడు, ప్రపున్వద్భ్యః = పరిశీలనఁ జేయునట్టి గుణములకొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను, సమశ్నంతః = కూడ భుజించునట్టి గుణములారా! ఉపస్పృశత = బల్యన్నమును స్పృశింపుఁడు; సమశ్నద్భ్యః = కూడ భుజించునట్టి గుణములకొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను, దేవసేనాః = దేవుని సేనలారా! ఉపస్పృశత = బల్యన్నమును గ్రహింపుఁడు, దేవసేనాభ్యః = దేవుని సేనలైన మీకొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను, ఆఖ్యాతాః = మంత్రములఁ జెప్పఁబడిన, యాః = ఏ, దేవసేనాః = దేవసేనలుకలవో, అనాఖ్యాతాః = మంత్రములలోఁ జెప్పఁబడని యాశ్చ = ఏ, దేవసేనాః = దేవసేనలు కలవో, అట్టి దేవసేనలారా! ఉపస్పృశత = గ్రహింపుడు, దేవసేనాభ్యః = అట్టి దేవసేనలకొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను, ద్వారాప = దేవుని ద్వారపాలుఁడా! ఉపస్పృశ = బల్యన్నమును స్పృశింపుము, ద్వారాపాయ = అట్టి ద్వారపాలకుని కొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను, ద్వారాపి = దేవుని భార్యయొక్క ద్వారపాలకురాలా! ఉపస్పృశ = బల్యన్నమును గ్రహింపుము, ద్వారాప్యై = ద్వారపాలకురాలికొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను, అన్వాసారిణః = దేవునిననుసరించి సంచరించునట్టి దేవభృత్యులారా!, ఉపస్పృశత= బల్యన్నమును గ్రహింపుఁడు, అన్వాసారిభ్యః = అనుసరించి సంచరించునట్టిదేవభృత్యు

లకొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను, నిషంగిణ్ = అంబులపొదిగల దేవా! ఉపస్పృశ = బల్యన్నమును గ్రహింపుము, నిషంగిణే = అంబులపొది గలదేవునికొఱకు, స్వాహా = బల్యన్నము నిచ్చుచున్నాను.

తా॥ రుద్రుఁడు అగ్నిహోత్రములయం దుంచఁబడినయాహుతులను భక్షించు చున్నవాఁడై నాకు శుభము కలుగునట్లుగా సంచరించుఁగాక! గృహమును బాలించు నట్టి రుద్రుఁడా! రుద్రునిగృహిణీ! ధ్వనిని జేయునట్టియు శ్వాసమును విడుచు నట్టియు, వెళకుచున్నట్టియు, పరిశీలనఁజేయుచున్నట్టియుఁ గూడ భుజించునట్టియు దేవుని గుణములారా! మంత్రములయందుఁ జెప్పఁబడినవారును జెప్పఁబడనివారు నగు దేవసేనలారా! దేవునిద్వారమందుఁ గాచియుండెడి ద్వారపాలకా! దేవుని భార్యయొక్క గృహద్వారమందుఁ గాచియుండెడి ద్వారపాలకురాలా! దేవుని ననుసరించియుండుభృత్యులారా! అంబులపొదిగలయోదేవా! మీరందఱును నే నిచ్చునట్టిబల్యన్నమును స్పృశించి గ్రహింపుఁడని హోమముఁ జేయుచున్నాను.

మూ॥ నమో నిషంగిణ ఇషుధిమతే॥

పదవి॥ నమః । నిషంగిణే । ఇషుధిమతే.

టీక॥ నిషంగిణే = అస్త్రములుండినపొదిగలవాఁడును, ఇషుధిమతే = అంబు లుండిన పొదిగలవాఁడు నగుదేవునికొఱకు, నమః = నమస్కారముచేయుచున్నాను.

తా॥ అస్త్రములును బాణములు నుండిన పొదులుగల దేవునికొఱకు నమస్కారము.

మూ॥ క్షేత్రస్యపతినా వయగ్ం హితే నేవ జయామసి గా మశ్వం పోషయిత్న్వా స నో మృడా తీదృశే॥

పదవి॥ క్షేత్రస్యపతినా । వయం । హితేన । ఇవ । జయామసి । గాం । అశ్వం । పోషయిత్ను । ఆ । సః । నః । మృడాతి । ఈదృశే॥

టీక॥ వయం=మేము, క్షేత్రస్యపతినా=గృహమునకధిపతియైన రుద్రునిచేత, హితేనేవ = మిత్రునిసహాయముచేతనువలెనే, జయామసి = జయించుచున్నాము, సః=ఆ గృహాధిపతి, నః=మాయొక్క, గాం = ధేనువును, అశ్వంచ = గుఱ్ఱమును, పోషయిత్ను=ఆ పోషింపఁగలవాడు నగును. ఈ దృశే=ఇటువంటి శుభకార్యము కలుగుచుండగా, మృడాతి=మమ్ములను సుఖపెట్టుచుండుఁగాక.

తా॥ మేము గృహమును పాలించునట్టి రుద్రుని సహాయము గలవారమై స్నేహితుని సహాయము కలిగినవారువలెనే సాధింపవలసిన పదార్థములను సాధింపగలము. గృహపాలకుఁడైన యా రుద్రుఁడు మా పశువులను గుఱ్ఱములను రక్షించుచు శుభకార్యములను గలుగఁజేసి మాకు సుఖము నిచ్చుగాక.

మూ॥ క్షేత్రస్య పతే మధుమ్ంత మూర్మిం ధేను రివ పయో అస్మాసు ధుక్ష్వ । మధుశ్చుతం ఘృత మివసుపూత మృతస్య నః పత యో మృడయంతు ॥

పదవి॥ క్షేత్రస్య । పతే । మధుమంతం । ఊర్మిం । ధేనుః । ఇవ । పయః । అస్మాసు । ధుక్ష్వ । మధుశ్చుతం । ఘృతం । ఇవ । సుపూతం । ఋతస్య । నః । పతయః । మృడయంతు ॥

టీక॥ క్షేత్రస్యపతే =గృహరక్షకుఁడవైన యో రుద్రుఁడా !, మధుమంతం= క్షీరములుగల, ఊర్మిం=అవిచ్ఛిన్నముగా నుండెడి ఆవుల సమూహములను, ధేనుః= ఆవు, పయఇవ=క్షీరములనువలెనే, అస్మాసు=మాయందనగా మాకొఱకు, ధుక్ష్వ= పితుకుము, మధుశ్చుతం = మధువును ఇచ్చునట్టిదై, సుపూతం = మిగుల పవిత్రమైన ఘృతమివ=నెయ్యివలెనే, ఋతస్య = యజ్ఞమునకు, పతయః = అధిపతులైన అగ్ని మొదలగువారు, నః=మమ్ములను, మృడయంతు, సుఖపెట్టుదురుగాక.

తా॥ గృహపాలకుఁడవగునో రుద్రుఁడా ! ఆవు క్షీరముల నే తీరున నొసంగునో ఆ తీరున క్షీరములుకలిగియున్న యావులను మాకు నొసంగు చుండుము. రుచి గలదియుఁబవిత్రమైనదియు నగునాజ్య మే విధంబున సుఖమును గలిగించునో ఆ విధంబుగానే యజ్ఞమునకు నధిపతులగునగ్ని హోతృఁడు మొదలగువారు మమ్ము లను సుఖపెట్టుదురుగాక.

ఇతిఏకోనవింశతిఖండస్సమాప్తః

—♦ అథవింశతిఖండ ప్రారంభః ♦—

మ॥ యన్మే మాతా ప్రలులోభ చరత్యననువ్రతా। తన్మే రేతః పితా వృఙ్క్తా మాఽభురన్యోఽపపద్యతా మముష్మైస్వాహా॥

పదవి॥ యత్ । మే । మాతా । ప్ర । లులోభ । చరతీ । అననువ్రితా । తన్ । మే। రేతః పితా వృఙ్క్తా ఆభుః అన్యః । పపద్యతాం అముష్మై। స్వాహా.

టీక॥ మే=నాయొక్క। మాతా = తల్లి, అననువ్రితా = అనుకూలముగాని వ్రితముగలదై, చరతీ = నడచుచు, యత్ = ఇతురునిసంబంధమైన యేరేతస్సును, ప్రలులోభ = మిక్కిలియిచ్ఛయించెనో, తత్ = ఆ, రేతః = వీర్యమును, మే = నాయొక్క, పితా = తండ్రి, వృఙ్క్తాం = కప్పివేయుచుగాక, మే = నన్నుగురించి, ఆభుః = రెండవతండ్రియైన, అన్యః=ఇతరుఁడు, అవపద్యతాం = నే నిచ్చునట్టి హవ్యమువిషయమై యాశవదలుఁగాక, అముష్మై = ఈ నా సత్యమైన తండ్రి కొఱకు, స్వాహా = ఇచ్చుచున్నాను.

తా॥ నా తల్లి పతివ్రితా ధర్మమును విడిచి మనసునందైనను వ్యభిచరించి యేపరవీర్యమును గ్రహించి యున్నదో అట్టి వీర్యమును నా తండ్రి తన వీర్యముచే గప్పివేసి యంగీకరించుగాక. అది మానసిక వ్యభిచారదోష మగుటచే సాంకర్యము కలుగదు. కాఁబట్టి అట్టి వీర్యమును నా తల్లి గ్రహించుటచే నాకుఁ దండ్రియను భావనచే నే నిచ్చునట్టి యీ హవిస్సు అట్టి యన్యుని జెందక నా తండ్రినే చెందుఁగాక.

మ॥ యాస్తిష్ఠంతి యా ధావంతి యా ఆర్ద్రోఘ్నీః పరితస్థుషీః। అద్భి ర్విశ్వస్య భర్త్రీభి రంత రన్యం పితు ర్దధేఽముష్మై స్వాహా ॥

పదవి॥ యాః । తిష్ఠన్తి । యాః । ధావంతి । యాః । ఆర్ద్రోఘ్నీః । పరితస్థుషీః । అద్భిః । విశ్వస్య । భర్త్రీభిః । అంతః । అన్యం । పితుః । దధే । అముష్మై । స్వాహా ॥

టీక॥ యాః = ఏ యుదకములు, తిష్ఠంతి = చెఱువులు మొదలగువాని యందున్నవో, యాః = ఏ యుదకములు, ధావంతి= నదులు మొదలగువానియందుఁ

బ్రవహించుచున్నవో, యాః = ఏ యుదకములు, ఆర్ద్రాభిః = తడిగల ప్రదేశములను బడఁగొట్టుచున్నవో, యాః = ఏ యుదకములు, పరితస్థుషీః = అంతటను వ్యాపించి యున్నవో, విశ్వస్య = ప్రపంచమునకు, భర్త్రీభిః = అధిపతులైన, తాభిః=అట్టువంటి, అద్భిః = జలములచేత, అన్యం = ఇతరుని, పితుః=తండ్రికంటె, అంతర్దధే=వేఱుగా నుంచుచున్నాను, అముష్మై=ఈ నాతండ్రికొఱకు, స్వాహా= హావిస్సు నిచ్చుచున్నాను.

తా॥ చెఱువులు మొదలగువానియందు నిలిచి యున్న జలములను నదులు మొదలగువానియందు బ్రవహించుచున్న జలములను తడిసియున్న ప్రదేశములను బడగొట్టుచున్న జలములను మఱియు నంతటను వ్యాపించియున్న జలములను బ్రపంచమునకు నాధారములైన యే జలములు గలవో యట్టి జలములను నా తల్లియొక్క మనోవృత్తియందు గలిసిన యన్యుని నా తండ్రికంటె వేఱుగా నుంచుఁగాక. నే నిచ్చునట్టి హవిస్సు నా తండ్రియే గ్రహించుఁగాక.

మూ॥ యన్మే పితామహీ ప్రలులోభ చర త్యననువ్రతా త న్మే
రేతః పితామహో వృఙ్క్తాం మాఽభు ర న్యోఽపపద్యతా
మముష్మై స్వాహా॥

పదవి॥ యత్ । మే । పితామహీ । ప్ర ।లులోభ । చరతీ । అననువ్రతా తత్ । మే । రేతః । పితామహః । వృఙ్క్తాం । మా । అభూః । అన్యః । అపపద్య తాం । అముష్మై । స్వాహా.

టీక॥ మే = నాయొక్క, పితామహీ = తండ్రి తల్లి, అననువ్రతా = అనుకూలమైనవ్రతమును బూననిదై, చరతీ = ప్రవర్తించుచు, యత్ = ఏ, రేతః = అన్యవీర్యమును, ప్రలులోభ = మిక్కిలి యిచ్ఛయించుచున్నదో, మే= నాయొక్క, పితామహః = తండ్రి, తత్ = ఆ, రేతః = వీర్యమును, వృఙ్క్తాం = కప్పివేయుఁగాక, మా = నన్నుగురించి, అభూః = రెండవతండ్రియైన, అన్యః = ఇతరుఁడు, అపపద్యతాం = నేనిచ్చునట్టిహవిస్సునందు దాక వదలి వేయుఁగాక, అముష్మై = ఈ నా తండ్రికొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను.

తా॥ నా తండ్రితల్లి పతివ్రతాధర్మమును విడిచి మనోవృత్తిచే వ్యభిచరించి యే పరవీర్యమును గ్రహించి యున్నదో, అట్టివీర్యమును నాతాత తనవీర్యముచే గప్పి

వేయుఁగాక. అట్టివీర్యమును గ్రహించుటచే నాకు నట్టియన్యుఁడు పితామహుఁడను భావన వదలి యుండుగాక. నే నిచ్చునట్టిహవిస్సు నా తాతనే చెందుఁగాక.

మన్త్రం॥ అంత ర్దధే పర్వతై రంత ర్మహ్యా పృథివ్యా । అభి ర్దిగ్భి రనం తాభి రంత రన్యం పితామహా ద్ద ధేఽముష్మై స్వాహా॥

పదవి॥ అంతః । దధే । పర్వతైః । అంతః । మహ్యా । పృథివ్యా । అభిః । దిగ్భిః । అనంతాభిః । అంతః । అన్యం । పితామహాత్ । దధే । అముష్మై । స్వాహా॥

టీక॥ అన్యం = ఇతరపురుషుని, పర్వతైః = పర్వతములచేత, పితామహాత్ = నా తాతకంటె, అంతర్దధే = వేఱుగాఁ జేయుచున్నాను, అన్యం = ఇతరపురుషుని మహ్యా = విస్తారమైన, పృథివ్యా = భూమిచేత, పితామహాత్ = నాతాతకంటె, అంతర్దధే = వేఱుగాఁ జేయుచున్నాను అనంతాభిః = అమితములైన, అభిః = ఈ, దిగ్భిః = దిక్కులచేత, అన్యం = ఇతరపురుషుని, పితామహాత్ = తాతకంటె, అంతర్దధే= వేఱుగాఁ జేయుచున్నాను, అముష్మై=ఈ నా తాతకొఱకు, స్వాహా= ఇచ్చుచున్నాను.

తా॥ పర్వతములును విస్తారమైన భూమియు, అమితములైన యీ దిక్కులును ఇతరుని నా తాతకంటె వేఱుగా జేయుగాక. నా తాతకొఱకు హవిస్సు నిచ్చుచున్నాను.

మన్త్రం॥ య న్మే ప్రపితామహీ ప్రలులోభ చర త్యననువ్రతా త న్మే రేతః ప్రపితామహో వృఙ్క్తాం మాఽభు రన్యోఽ పపద్యతా మముష్మై స్వాహా॥

పదవి॥ యత్ । మే । ప్రపితామహీ । ప్ర । లులోభ । చరతీ । అనను వ్రతా । తత్ । మే । రేతః । ప్రపితామహః । వృఙ్క్తాం । మా । అభుః । అన్యః అనపద్యతాం । అముష్మై । స్వాహా॥

టీక॥ మే=నాయొక్క, ప్రపితామహీ=తాతతల్లి, అననువ్రతా=అనుకూల మైన వ్రతముకలది కానిదై, చరతీ=ప్రవర్తించుచున్నదై, యత్=ఏ, రేతః=అన్యుని వీర్యమును, ప్రలులోభ=మిక్కిలి యిచ్ఛయించెనో, తత్ ఆ, రేతః=వీర్యమును,

మే=నాయొక్క, ప్రపితామహః = తాతతండ్రి, వృఙ్క్తాం = కప్పివేయుగాక, మాం=నన్ను గుఱించి, ఆభుః=రెండవ ముత్తాతయగు, అన్యః = ఇతరుఁడు, అవపద్యతాం=నేనిచ్చునట్టి హవిస్సు విషయమై యాశను వదలుగాక, అముష్మై=ఈ నా ముత్తాతకొఱకు, స్వాహా=హవిస్సు నిచ్చుచున్నాను.

తా॥ నా తాతతల్లి పతివ్రతాధర్మమును విడిచి మనోవృత్తిచే వ్యభిచరించుటచే రే పరవీర్యమును గ్రహించియున్నదో అట్టి వీర్యమును నా ముత్తాత కప్పివేయుగాక. అట్టివీర్యము నుంచినట్టి యన్యుఁడు నాకు ముత్తాత యనుభావము వదలియుండుగాక. నే నిచ్చునట్టి హవిస్సు నా ముత్తాతనే చెందుఁగాక.

మూ॥ అంత ర్దధ ఋతుభి రహోరాత్రై స్ససంధిభిః అర్ధమాసై శ్చ మాసై శ్చాఽంత రన్యం ప్రపితామహాద్దధేఽముష్మైస్వాహా॥

పదవి॥ అంతః । దధే । ఋతుభిః । అహోరాత్రైః । ససంధిభిః । అర్ధమాసైః । చ । అంతః । అన్యం । ప్రపితామహాత్ । దధే । అముష్మై । స్వాహా॥

టీక॥ ఋతుభిః = ఋతువులచేతను, ససంధిభిః = సాయంకాలప్రాతఃకాలము సంధులతోఁగూడిన, అహోరాత్రైః = రాత్రిపగళ్ళచేతను, అంతర్దధే = వేరుగా జేయుచున్నాను. అర్ధమాసైశ్చ = పక్షములచేతను, మాసైశ్చ = మాసములచేతను, అన్యం = ఇతరుని, ప్రపితామహాత్ = ముత్తాతకంటె, అంతర్దధే = వేఱుగాఁజేయుచున్నాను. అముష్మై = ఈ నా ముత్తాతకొఱకు, స్వాహా = హవిస్సు నిచ్చుచున్నాను.

తా॥ ఋతువులు, మాసములు, పక్షములు, రాత్రులు, పగళ్ళు, సాయంకాల ప్రాతఃకాలసంధులును అన్యుని నా ముత్తాతకంటె వేఱుగాఁ జేయుగాక. నే నిచ్చునట్టిహవిస్సు నా ముత్తాతనే చెందుఁగాక.

మూ॥ యే చేహ పితరో యే చ నేహ యాగ్ంశ్చ విద్మయాగ్ంశ్చ విద్మయాగ్ం ఉ చ న ప్రవిద్మ అగ్నే తా న్వేత్థ యది తే జాతవేద స్తయా ప్రత్తగ్ం స్వధయా మదంతు స్వాహా॥

పదవి॥ యే । చ । ఇహ । పితరః । యే । చ । న । ఇహ । యాన్ । చ ।

టీక॥ యేచ = ఏ, పితరః = పితృదేవతలు, ఇహ = ఈలోకంబునకలరో, యేచ = ఏపితరులు, ఇహ = ఈలోకంబున, నభవంతి = లేరో, వయం = మేము, యాన్ = ఏ పితృదేవతలను, విద్మ = గుర్తెఱుఁగుదుమో, ఉత = ఇంతియేకాదు, యాంశ్చ = ఏపితృదేవతలను, నప్రవిద్మ = గుర్తెఱుఁగమో, అగ్నే = ఓయగ్నిహోతు్రిడా! తాన్ = ఆదేవతలనందరను, త్వం = నీవు, వేత్థయది = తెలిసికొంటివేని వారికొఱకు హావిస్సును బంచి యిమ్మ, జాతవేదః = అగ్నిహోతు్రిడా, తే = వారు, తయా = అటువంటి, ప్రత్తయా = ఇయ్యఁబడిన, స్వధయా = హావిర్భాగముచే,మదంతు=తృప్తినిబొందుదురుగాక యని,స్వాహా = హోమముజేయుచున్నాము.

తా॥ భూలోకంబునఁగాని దేవలోకంబునఁగాని మాచేఁ దెలియబడినవారుగాని మాచేఁ దెలియబడనివారుగాని యేపితృదేవతలు గలరో, ఓ యగ్నిహోత్రుఁడా నీవు వారినందఱిని సెఱిఁగితివేని వారికి సమముగా హావిర్భాగమును పంచి యిమ్మ. ఆ పితృదేవతలు నీ విచ్చినకవ్యముచేఁ దృప్తిని బొందుదురుగాక యని యజమానుఁడు హోమమును జేయుచున్నాఁడు.

మూ॥ స్వాహా పితే్రి పితే్రి స్వాహా స్వాహా పితే్రి పితే్రి స్వాహా
స్వధా స్వాహాఽగ్నయే కవ్యవాహానాయ స్వధా స్వాహా॥

పదవి॥ స్వాహా । పితే్రి । పితే్రి । స్వాహా । స్వాహా । పితే్రి । పితే్రి । స్వాహా । స్వధాస్వాహా । అగ్నయే । కవ్యవాహానాయ । స్వధాస్వాహా॥

టీక॥ స్వాహాపితే్రి = తండి్రికొఱకిచ్చుచున్నాను ఆదరముచేఁ బునరుక్తిగాఁ జెప్పబడియె, స్వధాస్వాహా = స్వధాశబ్దముతోపితృదేవతలకునిచ్చుచున్నాను, కవ్యవాహానాయ = పితృదేవతలకవ్యమును మోసికొనిపోవునట్టి, అగ్నయే = అగ్నిహోతు్రినికొఱకు, స్వధాస్వాహా = స్వధాశబ్దముతో నిచ్చుచున్నాను.

తా॥ పితృదేవతలకు కవ్యమును మోసికొనిపోవునట్టి యగ్నిహోతి్రములో నా తండి్రితాతముత్తాతలకొఱకు కవ్యమును స్వధాశబ్దముతో నిచ్చుచున్నాను.

మూ॥ ఏష తే తత మధుమాగ్ం ఊర్మి స్సరస్వాన్ యావా నగ్ని
శ్చ పృధివీ చ తావత్యస్యమాతా్రి తావతీం త ఏతాం

మాత్రాం దదామి యథాఽగ్నిరక్షితోఽనుపదస్త ఏవం మహ్యాం పిత్రేఽక్షితోఽనుపదస్త స్స్వధా భవతాంత్వగ్ం స్వధాం త్రైస్స హోపజీవ ర్చస్తేమహి మైవ తే పితామహ మధుమాంగ్ం ఊర్మి స్సరస్వాన్ యావాన్ వాయుశ్చాఽంతరిక్షంచ తావత్యస్య మాత్రా తావతీం త ఏతాం మాత్రాం దదామి యథా వాయురక్షిఽతోనుపద స్త ఏవం మహ్యాం పితామహా యాఽక్షి తోఽనుపతస్త స్స్వధా భవ తాం త్వగ్గ్ం స్వధాం త్రై స్స హోపజీవ సామాని తే మహి మైవ తే ప్రపితామహ మధుమాంగ్ం ఊర్మి స్సరస్వాన్ యావా నాదిత్య శ్చ ద్యౌ శ్చ తావత్యస్యమాత్రా తావతీం త ఏతాం మాత్రాం దదామి యథాఽదిత్యోఽక్షి తోఽనుపద స్త స్స్వధా భవతాం త్వగ్గ్ం స్వధాం త్రై స్స హోపజీవ యజూగ్ంషి తే మహిమా॥

పదవి॥ ఏమః । తే । తత । మధుమాన్ । ఊర్మిః । సరస్వాన్ । యావాన్ । అగ్నిః । చ । పృథివీ । చ । తావతీ । అస్య । మాత్రా । తావతీం । తే । ఏతాం । మాత్రాం । దదామి । యథా । అగ్నిరక్షితః । అనుపదస్తః । ఏవం మహ్యాం । పిత్రే । అక్షితః । అనుపదస్తః స్వధా భవ । తాం । త్వం । స్వధాం । త్రైః । సహ । ఉప । జీవ । ఋచః । తే మహిమా । ఏమః । తే । పితామహ । మధుమాన్ । ఊర్మిః । సరస్వాన్ । యావాన్ । వాయుః చ । అంతరిక్షం । చ । తావతీ । అస్య।మాత్రా। తావతీం । తే । ఏతాం । మాత్రాం । దదామి । యథా । వాయురక్షితః । అను పదస్తః । ఏవం । మహ్యాం । పితామహాయ । అక్షితః । అనుపదస్తః స్వధా । భవ । తాం । త్వం । స్వధాం । త్రైః। సహ । ఉప । జీవ । సామాని । తే। మహిమా । ఏమః । తే । ప్రపితామహ । మధుమాన్ ॥ ఊర్మిః । సరస్వాన్ । యావాన్ । ఆ దిత్యః । చ । ద్యౌః । చ । తావతీ । అస్య । మాత్రా । తావతీం । తే । ఏతాం । మాత్రాం । దదామి । యథా । ఆదిత్యోక్షితః । అనుపదస్తః । ఏవం । మహ్యాం । ప్రపితామహాయ । అక్షితః । అనుపదస్తః స్వధా । భవ । తాం । త్వం । స్వధాం । త్రైః । సహ । ఉప । జీవ । యజూంషి । తే । మహిమా॥

టీక॥ తత = ఓతండ్రీ! మధుమాన్ = మధువుగలదియు, ఊర్మిః = విస్తారమైన। ఏషః = ఈ, సరస్వాన్ = కవ్య, మనుసముద్రము, తే = నీకొఱకు ఇయ్యఁబడుచున్నది, అగ్నిః = అగ్నిహోత్రుఁడు పృథివీచ = భూమియు, యావాన్ = ఎంతపరిమితిగలవో, అస్య = ఈకవ్యమునకు, తావతీమాత్రా = అంతపరిమాణము, తే = నీకొఱకు, ఏతాం = ఈ, తావతీంమాత్రాం = అంతపరిమితిగలకవ్యమును, దదామి = ఇచ్చుచున్నాను, యథా = ఏ ప్రకారముగాను, అగ్నిరక్షితః = అగ్నిచే రక్షింపఁబడినదై, అనుపదస్తః = తక్కువకాకయుండునో, ఏవం = ఈ ప్రకారముగాను, మహ్యం = నాకొఱకు, పితౄ = నా తండ్రికొఱకు, అక్షితః = నాశనము కలుగనియ్యనిదానవై, అనుపదస్తః = సంపూర్ణమైనదానవవుచు, స్వధాభవ = పితృదేవతులకు నాహారమగుము, త్వం = నీవు, తాం = అటువంటి, స్వధాం = కవ్యమును, తైస్సహ = ఆయగ్నిహోత్రుఁడు మొదలగువారితోఁ గూడ భుజించి, ఉపజీవ = జీవింపుము, ఋచః = ఋగ్వేదము, తే = నీయొక్క, మహిమా = మహిమను బోధించుచున్నవి. వాయుః = వాయువు, అంతరిక్షం = ఆకాశము, ఆదిత్యః = సూర్యుఁడు, ద్యౌః = స్వర్గము॥ మిగిలినపదములకు నర్థము మున్ను చెప్పబడెను గాన తిరిగి చెప్పఁబడలేదు.

తా॥ ఓతండ్రీ మధురరసముగల కవ్యమును అగ్నిహోత్రుఁడును భూమియు నెంతపరిమితిగలవారలో యంతపరిమితిగా నీకొఱకిచ్చుచున్నాను. ఓయున్నమా! నీవు అగ్నిహోత్రునిచే రక్షింపఁబడినదానవై సంపూర్ణమైనదానవగుచు నా తండ్రికిని నాకును నాశము గలుగనీయక యాహారమగుము. ఓ తండ్రీ! నీవు అట్టికవ్యమును అగ్నిహోత్రుఁడుఁడు మొదలగువారితోఁ గూడ భుజించి జీవింపుము- నీ మహిమను ఋగ్వేదము నుడువుచున్నవి. మిగిలిన పదములకు అర్థము తాత్పర్యమును చెప్పబడెను గానఁదిరిగి చెప్పఁబడలేదు.

వింశతి ఖండస్సమాప్తః

---

—♦ అథ ఏకవింశతిఖండ ప్రారంభః ♦—

మూ॥ పృథివీ తే పాత్రం ద్యౌ రపిధానం బ్రహ్మణ స్త్వా ముఖే జుహోమి బ్రాహ్మణానాం త్వా ప్రాణాపానయో ర్జుహో మ్యక్షిత మసి మైషాం క్షేష్ఠా అము త్రాఽముష్మి న్లోకే॥

పదవి॥ పృథివీ । తే । పాత్రం । ద్యౌః । అపిధానం । బ్రహ్మణః । త్వా । ముఖే । జుహోమి । బ్రాహ్మణానాం । త్వా । ప్రాణాపానయోః । జుహోమి । అక్షితం । అసి । మా । ఏషాం । క్షేష్ఠాః । అముత్ర । అముష్మిన్ । లోకే॥

టీక॥ హేఅన్న = ఓఅన్నమా !, తే = నీకు, పృథివీ = భూమి, పాత్రం = పాత్రము, ద్యౌః = ఆకాశము, అపిధానం = కప్పు, త్వా = నిన్ను, బ్రహ్మణః = బ్రాహ్మణునియొక్క, ముఖే = ముఖమునందు, జుహోమి = హోమముఁ జేయుచున్నాను, త్వా = నిన్ను, బ్రాహ్మణానాం = బ్రాహ్మణులయొక్క, ప్రాణాపానయోః = ప్రాణఅపానవాయువులయందు, జుహోమి = హోమము చేయుచున్నాను, త్వం = నీవు, అక్షితం = నాశనములేనిదానవు, అసి = అయితివి, అముత్ర = పరలోకమందు, పితౄణాం = పితృదేవతలకును, అముష్మిన్‌లోకే = ఈ లోకమునందు, ఏషాం = ఈ బ్రాహ్మణులకును, మాక్షేష్ఠాః = నాశనము కలుగఁజేయకుము.

తా॥ ఓ యన్నమా! నీకు భూమియే యాధారపాత్రము, ఆకాశము కప్పుగా నున్నది. బ్రాహ్మణులయొక్కయు పితృదేవతలయొక్కయుఁ తృప్తికొఱకు బ్రాహ్మణులముఖమునం దుంచుచున్నాను. ఇట్టినీవు నాశములేనిదానవై యీ లోకంబున బ్రాహ్మణులకును పరలోకంబున పితృదేవతలకును నాశము కలుగనియ్యకుము.

మూ॥ మార్జయంతాం పితరో మార్జయంతాం పితామహా మార్జయంతాం ప్రపితామహాః । మార్జయంతాం మాతరో మార్జయంతాం పితామహ్యో మార్జయంతాం ప్రపితామహ్యః॥

పదవి॥ మార్జయంతాం । పితరః । మార్జయంతాం । పితామహాః । మార్జయంతాం । ప్రపితామహాః । మార్జయంతాం । మాతరః । మార్జయంతాం । పితామహ్యః । మార్జయంతాం । ప్రపితామహ్యః ॥

టీక॥ పితరః = తండ్రులు, మార్జయంతాం = ఈ యుదకముచేఁ బరిశుద్ధులగుదురుగాక, పితామహాః = తాతలు, మార్జయంతాం = పరిశుద్ధులగుదురుగాక, ప్రపితామహాః = తండ్రితాతలు, మార్జయంతాం = పరిశుద్ధులగుదురుగాక, మాతరః= తల్లులు, మార్జయంతాం = పరిశుద్ధులగుదురుగాక, పితామహ్యః= తండ్రితల్లులు, మార్జయంతాం = పరిశుద్ధులగుదురుగాక, ప్రపితామహ్యః = తాతతల్లులు, మార్జయంతాం = పరిశుద్ధులగుదురుగాక.

తా॥ ఈ భూమియందు నాచేనుంచఁబడిన యుదకముచేఁ తండ్రులు, తాతలు, తాతతండ్రులు, తల్లులు, తండ్రితల్లులు, తాతతల్లులు పరిశుద్ధులగుదురుగాక.

మూ॥ ఏత త్తేత తాఽసౌ యే చ త్వా మన్వేత త్తే పితామ హాఽసౌ యే చ త్వా మన్వేత త్తే ప్రపితామ హాఽసౌ యే చ త్వా మను। ఏత త్తే మాత రసౌ యాశ్చ త్వా మన్వేత త్తే పితామ హ్యసౌ యాశ్చ త్వా మన్వేత త్తే ప్రపితామ హ్యసౌ యాశ్చ త్వా మను ॥

పదవి॥ ఏతత్ । తే। తత । అసౌ । యే । చ । త్వాం । అను । ఏతత్ । తే । పితామహ । అసౌ । యే । చ । త్వాం । అను । ఏతత్ । తే । ప్రపితామహ। అసౌ । యే । చ । త్వాం । అను । ఏతత్ । తే । మాతః । అసౌ । యాః । చ । త్వాం । అను । ఏతత్ । తే । పితామహి । అసౌ । యాః । చ । త్వాం । అను । ఏతత్ । తే । ప్రపితామహి । అసౌ । యాః । చ । త్వాం । అను ॥

టీక॥ అసౌ = ఈ పేరుగల, తత = ఓ తండ్రీ ! తే=నీకొఱకును, యేచ= ఎవరు, త్వాం = నిన్ను, అను = అనుసరించియుండిరో, తేభ్యః = వారికొఱకును, ఏతత్ = ఈ పిండమును, దదామి = ఇచ్చుచున్నాను, అసౌ = ఈ పేరుగల, పితామహ = ఓ తాతా ! తే = నీకొఱకును, యేచ = ఎవరు, త్వాం = నిన్ను, అను = అనుసరించియుండిరో, తేభ్యః = వారికొఱకును, ఏతత్ = ఈ పిండమును, దదామి = ఇచ్చుచున్నాను, ప్రపితామహ = తాతతండ్రీ ! తే = నీకొఱకును, యేచ = ఎవరు, త్వాం = నిన్ను, అను = అనుసరించియుండిరో, తేభ్యః = వారికొఱకును, ఏతత్ = ఈ పిండమును, దదామి = ఇచ్చుచున్నాను, అసౌ = ఈ పేరుగల, మాతః = తల్లీ! తే = నీకొఱకును, యాశ్చ = ఏ స్త్రీలు, త్వాం =

నిన్ను, అను = అనుసరించియుండిరో, తాభ్యః = వారికొఱకును, ఏతత్ = ఈ పిండమును, దదామి = ఇచ్చుచున్నాను, అసౌ = ఈ పేరుగల, పితామహి = తండ్రి తల్లీ! తే = నీకొఱకును, యాశ్చ = ఏ స్త్రీలు, త్వాం = నిన్ను, అను = అనుసరించియుండిరో, తాభ్యః = వారికొఱకును, ఏతత్ = ఈ పిండమును, దదామి = ఇచ్చుచున్నాను, అసౌ = ఈ పేరుగల, ప్రపితామహి = తాతతల్లీ! తే = నీకొఱకును, యాశ్చ = ఏ స్త్రీలు, త్వాం = నిన్ను, అను = అనుసరించి యుండిరో, తాభ్యః = వారికొఱకును, ఏతత్ = ఈ పిండమును, దదామి = ఇచ్చుచున్నాను.

తా॥ ఓ తండ్రీ! తాతా! తాతతండ్రీ! తల్లీ! తండ్రితల్లీ! తాత తల్లీ! మిమ్ముల నెవరు అనుసరించి యుండిరో వారికొఱకును మీ కొఱకును ఈ యీ పిండముల నిచ్చుచున్నాను. అని వారి వారి గోత్రనామముల నుచ్చరించి పిండముల నిచ్చుచున్నాఁడు.

మూ॥ మార్జయంతాంపితరఇత్యేతే ॥

యీ మంత్రమునకు అర్థము మొదలగునవి ముందే చెప్పఁబడిరు.

మూ॥ యే చ వోఽత్ర యే చాఽస్మా స్వాశగ్ంసంతే యాశ్చ వోఽత్ర యాశ్చాఽస్మా స్వాశగ్ం సంతే తే చ వహాం తాం తాశ్చ వహంతాం తృప్యంతు భవంత స్తృప్యంతు భవత్య స్తృప్యత తృప్యత ॥ తృప్యత ॥

పదవి॥ యే । చ । వః । అత్ర । యే । చ । అస్మాసు । ఆశంసంతే । యాః । చ । వః । అత్ర । యాః । చ । అస్మాసు । ఆశంసంతే । తే । చ । వహంతాం । తాః । చ । వహంతాం । తృప్యంతు । భవంతః । తృప్యంతు । భవత్యః । తృప్యత । తృప్యత ।

టీ॥ హేపితరః = ఓ తండ్రులారా! అత్ర = ఈ వంశమునందు, యేచ= ఎవరు, వః = మిమ్ములను, యేచ = ఎవరు, ఆశంసంతే = కోరియున్నారో హే మాతరః = ఓ తల్లులారా! అత్ర = ఈ వంశంబున, యాశ్చ = ఏ స్త్రీలు, వః = మిమ్ములను, అస్మాసు = మమ్ములను, ఆశంసంతే = కోరియున్నారో,

తే చ = ఆ పురుషులును, స్వధాం = కవ్యమును, వహంతాం = పొందుదురుగాక, తా శ్చ = ఆ స్త్రీలును, స్వధాం = కవ్యమును, వహంతాం = పొందుదురుగాక, భవంతః = తండ్రులైన మీరు, తృప్యంతు = ఆనందమును బొందుదురుగాక, భవత్యః = తల్లులైన మీరు, తృప్యంతు = ఆనందమును బొందుదురుగాక, తృప్యత తృప్యత = మీరందఱును మిక్కిలి తృప్తిని బొందుదురుగాక. ఆదరముచే తిరిగి చెప్పఁబడిరెను.

తా॥ తండ్రి మొదలగు పురుషులారా! మిమ్ములను మమ్ములను ఈ వంశంబున నే పురుషులు కోరియుండిరో ఓ తల్లులారా! ఈ వంశంబున ఏ స్త్రీలు మిమ్ములను మమ్ములను గోరియుండిరో ఆ పురుషులు ఆ స్త్రీలును ఈ యన్నపిండముచే నవశ్యము తృప్తిని బొందుదురుగాక.

మూ॥ పుత్రాన్ పౌత్రా న్నభితర్పయంతీ రాపో మధుమతీ రిమాః ।
స్వధాం పితృభ్యో అమృతం దుహానా ఆపో దేవీ రుభ
యాగ్ం స్తర్పయంతు ॥

పదవి॥ పుత్రాన్ । పౌత్రాన్ । అభి । తర్పయంతీః । ఆపః । మధుమతీః । ఇమాః । స్వధాం । పితృభ్యః । అమృతం । దుహానాః । ఆపః । దేవీః । ఉభయాన్ । తర్పయంతు ॥

టీక॥ పుత్రాన్ = తనయులను, పౌత్రాన్ = మనుమలను, అభితర్పయంతీః = తృప్తినిఁ బొందించుచున్నవియు, మధుమతీః = మధురరసముగలవియు, ఇమాః = ఈ, యాః = ఏ, ఆపః = ఉదకము లగుచున్నవో, తాః = ఆ, ఆపః = ఉదకములు అను, దేవీః = దేవతలు, పితృభ్యః = పితృదేవతలకొఱకు, స్వధాం = కవ్య మును, అమృతం = అమృతమును, దుహానాః = పితుకుచున్నవై, ఉభయాన్ = పితృమాతృవర్గములను, తర్పయంతు = తృప్తినిఁ బొందించుగాక.

తాః తనయులచేతను మనుమలచేతను, నియ్యఁబడు ఈ జలములు మధురరసముగలవియై పితృదేవతలకు కవ్యరూపమైన యమృతమును గలుగఁజేయుచు తండ్రి వర్గమును తల్లివర్గమును దృప్తినిఁ బొందించుఁగాక.

మూ॥ తృప్యత తృప్యత తృప్యత ॥

పదవి॥ తృప్యత । తృప్యత । తృప్యత ॥

టీక॥ హేపితరః = ఓతండ్రులారా!, మీరు, తృప్యత = తృప్తినిబొందుఁడు, హేమాతరః = ఓతల్లులారా!, మీరు, తృప్యత = తృప్తిని బొందుఁడు.

తా॥ ఓ తండ్రులారా! ఓ తల్లులారా! మీరు తృప్తినిఁ బొందుఁడు. త్రిరూపము కనుక మూడుసార్లు చెప్పఁబడియెను.

మూ॥ ప్రాణే నివిష్టోఽమృతం జుహోమి బ్రహ్మణి మ ఆత్మాఽమృతత్వాయ ॥

పదవి॥ ప్రాణే । నివిష్టః । అమృతం । జుహోమి । బ్రహ్మణి । మే । ఆత్మా । అమృతత్వాయ ॥

టీక॥ ప్రాణే = ప్రాణము మొదలయిన వాయువులయందు, నివిష్టః = ఉన్నట్టు, ఆత్మా = చైతన్య స్వరూపుఁడనైన, అహం = నేను, బ్రహ్మణి = పరబ్రహ్మస్వరూపునియందు, మే = నాయొక్క, అమృతత్వాయ = మృతిరాహిత్యముకొఱకు, అమృతం = అమృతతుల్యమైన కవ్యమును, జుహోమి = హోమము చేయుచున్నాను.

తా॥ ఆత్మ స్వరూపుఁడనైన నేను ప్రాణాది పంచవాయువులయందు నధిష్ఠించి యున్నవాఁడనై మరణరాహిత్యము కొఱకు అమృతతుల్యమైన కవ్యమును పరబ్రహ్మయం దుంచుచున్నాను. అని ప్రాణాహుతులను బుచ్చుకొనవలయును.

మూ॥ యాం జనాః ప్రతినందంతి రాత్రిం ధేను మి వాఽయతీం సంవత్సరస్య యా పత్నీ సా నో అస్తు సుమంగలీ స్వాహా ॥

పదవి॥ యాం । జనాః । ప్రతి । నందంతి । రాత్రిం । ధేనుం । ఇవ । ఆయతీం । సంవత్సరస్య । యా । పత్నీ । సా । అస్తు । సుమంగలీః । స్వాహా ॥

టీక॥ జనాః = మనుష్యులు, ఆయతీం = వచ్చుచున్నట్టి ధేనుం = ఆవును, దృష్ట్వేవ = చూచినట్టువలెనే, యాం = ఏ, రాత్రిం = రాత్రిని, దృష్ట్వా = చూచి, ప్రతినందంతి = సంతోషించుచున్నారో, యా = ఏరాత్రి, సంవత్సరస్య = సంవత్సరమునకు, పత్నీ = భార్యగా నుండెనో, సా = అటువంటి ఏ కాష్టకయును

రాత్రి, నః = మాకు, సుమంగలీః = శుభములను గలుగఁజేయునది, అస్తు = అగుఁగాక. ఇతి = ఇట్లని, స్వాహా = అపూపహోమమును జేయుచున్నాఁడు.

తా॥ పాలు పితురు నిమిత్తము తీసికొని వచ్చునట్టి యావును జూచి మనుష్యులతీరున సంతోషింతురో యాతీరున సంవత్సరమునకు భార్యారూపముగా నేర్పడియున్న మాఘ బహుళసప్తమినాటిరాత్రిని జూచి మిక్కిలిసంతోషచిత్తులై అపూపహోమముఁ జేయుదురు గాన నట్టియేకాష్టకరాత్రి నాకు శుభములను గలుగఁజేయుఁగాక యని అపూపహోమమును జేయుచున్నాఁడు.

మూ॥ వహ వపాం జాతవేదః పితృభ్యో య త్రైతాన్ వేత్థ నిహితాన్ పరాకే మేదసః కూల్యా ఉప తాన్ క్షరంతు సత్యా ఏతా ఆశిష స్సంతు కామై స్స్వాహా ॥

పదవి॥ వహ । వపాం । జాతవేదః । పితృభ్యః । యత్ర । ఏతాన్ । వేత్థ । నిహితాన్ । పరాకే । మేదసః । కూల్యాః । ఉప । తాన్ । క్షరంతు । సత్యాః । ఏతాః । ఆశిషః । సంతు । కామైః । స్వాహా ॥

టీక॥ జాతవేదః = ఓయగ్నిహోత్రుఁడా! యత్ర = ఏ, పరాకే = దూరమైనస్థలమందు, నిహితాన్ = ఉన్నట్టి, ఏతాన్ = ఈపితృదేవతలను, వేత్థ= గుర్తెఱుఁగుదువో, తేభ్యః = అట్టువంటి, పితృభ్యః = పితృదేవతలకొఱకు, వపాం = వపను, వహ = తీసికొనిపొమ్ము, తాన్ = ఆ పితృదేవతలనుగూర్చి, మేదసః = మాంసవిశేషముయొక్క కుల్యాః = కాలువలు, ఉపక్షరంతు = ప్రవహించుఁగాక, పితౄణాం పితృదేవతలయొక్క, ఏతాః = ఈ, ఆశిషః = ఆశీర్వచనములు, కామైః= కోరికలతోఁగూడ, సత్యాః = సత్యమైనవి, సంతు = అగుఁగాక అని, స్వాహా = హోమమును జేయుచున్నాఁడు.

తా॥ ఓ యగ్నిహోత్రుఁడా! పితృదేవతలు ఎంతదూరమందున్నను వారిని యెఱుఁగుదువు గాన వారికి పశుసంబంధమైన వపయనుపేరు గలమాంసమును దీసికొని యిమ్ము. ఆ మాంసపుకాలువలు పితృదేవతలు భుజించి తృప్తిఁ జెంది యాశీర్వదింపఁగా వారి యాశీర్వచనములు సత్యములైనవై మనుష్యులకు కోరికల నిచ్చునవి యగుఁగాక యని హోమమును జేయుచున్నాఁడు.

మూ॥ యాంజనాః ప్రతినందం తీత్యేషా॥

యీ మంత్రమునకు సర్దాదులు పూర్వమే చెప్పఁబడియెను.

మూ॥ ఇయ మేవ సా యా ప్రథమా వ్యాచ్ఛ దంతరస్యాం చరతి ప్రవిష్టా వధూ ర్జజాన నవగ జ్జనిత్రి త్రియ ఏనాం మహిమాన స్సచంతే॥

పదవి॥ ఇయం। ఏవ। సా। యా। ప్రథమా। వ్యౌచ్ఛత్। అంతః। అస్యాం। చరతి। ప్రవిష్టా। వధూః। జజాన। నగత్। జనిత్రి। త్రయః। ఏనాం। మహిమానః। సచంతే। స్వాహా॥

టీక॥ యా = ఏఅష్టకయనురాత్రి, అంతరస్యాం = ఈభూమియొక్క మధ్య ప్రదేశమునందు, ప్రవిష్టా = సూర్యకిరణరూపముగాఁ బ్రవేశించినదై, ప్రథమా = సూర్యునికంటె మొదటిదై, వ్యాచ్ఛత్ = ఉదయించినదై, చరతి = ప్రవర్తించు చున్నదో, సా = ఆ రాత్రి, ఇయమేవ = ఇదియే, యా = ఏరాత్రి, వధూః = యౌవనముగలది, జజాన = ఆయెనో, సా = ఆ రాత్రి, నవగత్ = నూతనమైన పెనిమిటిని బొంది, జనిత్రీ = పుత్త్రులను బ్రసవించినది, జజాన= ఆయెను, ఏనాం=ఈ అష్టకను, మహిమానః = మహాత్ములైన, త్రయః = అగ్నిహోతుఁడు, అశ్వినీదేవతలిద్దఱు అనుముగ్గురును, సచంతే = సేవించుచున్నారు, ఇతి = ఈ లాగున, స్వాహా= హోమమును చేయుచున్నాడు.

తా॥ ఏ రాత్రి యరుణోదయకాలంబున సూర్యుని కంటె ముందుగా గిరణరూపముగా ఈ భూమియందు వ్యాపించి మొదట యౌవనస్త్రీగాను పిమ్మటఁ తరుణవయస్కుఁడైనభర్త గలదిగాను తర్వాత దనయులను గన్నదిగా నుండి యగ్నిహోతుఁడు అశ్వినీదేవతలు అను ముగ్గురిచే సేవించబడుచున్నదో అట్టిరాత్రి ఈ యష్టకయనురాత్రియే యని హోమమును జేయుచున్నాఁడు.

మూ॥ ఛందస్వతీ ఉషసా పేపిశానే సమానం యోని మనుసంచరంతీ సూర్యపత్నీ విచరతః ప్రజానతీ కేతుం కృణ్వానే అజరే భూరిరేతసా॥

పదవి॥ చందస్వతీ। ఉషసా। పేపిశానే। సమానం। యోనిం। అను। సంచరంతీ। సూర్యపత్నీ। విచరతః। ప్రజానతీ। కేతుం। కృణ్వానే। అజరే। భూరిరేతసా॥

టీక॥ ఛందస్వతీ = వేదములచే స్తోత్రముఁజేయఁబడునట్టివియు, పేపిశానే = ప్రకాశించునట్టివియు, సమానం = ఏకమైన, యోనిం = కారణమును, అను = అనుసరించి, సంచరంతీ = ప్రవర్తించుచున్నవియు, సూర్యపత్నీ=సూర్యుఁడు, రక్షకుఁడుఁగాఁగలవియు, విచరతః = అనేకవిధములైన ధర్మములను జేయించుచున్నవియు, ప్రజానతీ = సర్వమును దెలిసికొన్నవియు, కేతుం = జ్ఞానమును, కృణ్వానే = కలుఁగఁజేయుచున్నవియు, అజరే = వార్ధక్యములేనివియు, భూరిరేతసా = మిక్కిలి సారవంతములైన, ఉషసా = ప్రాతఃకాలములు భూలోకస్వర్గలోకములయందుఁ బ్రవర్తించుచున్నవి.

తా॥ వేదములచే స్తుతింపఁబడుచున్నవియుఁ బ్రకాశించుచున్నవియు సూర్యుఁడే సమానజన్మకారణముగానున్నవియుఁ గనుకనే సూర్యునివలనఁ గలుగుచున్నవియు సర్వజనులను సమస్తవ్యాపారములయందు బ్రవర్తింపఁజేయుచున్నవియు సమస్తమును దెలిసినవియు ప్రాణులకు జ్ఞానమును గలుగఁజేయుచున్నవియు ఎల్లప్పుడు నుండునవియునై మిక్కిలిసామర్థ్యము గల ప్రాతఃకాలములు భూలోకంబునను స్వర్గలోకంబునను బ్రవర్తించుచున్నవి.

మూ॥ ఋతస్య పంథా మను తిస్ర ఆగు స్త్రియో ఘర్మాసో అను
జ్యోతిషాఽగుః ప్రజా మేకా రక్షత్యూర్జ మేకా వ్రత మేకా
రక్షతి దేవయూనాం॥

పదవి॥ ఋతస్య । పంథాం । అను । తిస్రః । ఆగుః । త్రియః । ఘర్మాసః । అను । జ్యోతిషా । ఆగుః । ప్రజాం । ఏకా । రక్షతి । ఊర్జం । ఏకా । వ్రతం । ఏకా । రక్షతి । దేవయూనాం॥

టీక॥ ఋతస్య = యజ్ఞముయొక్క, పంథాం = మార్గమును, తిస్రః = మూఁడైన ఉషఃకాలములు, అన్వాగుః = అనుసరించియున్నవి, త్రియః=మూఁడైన, ఘర్మాసః= ప్రకాశించుచున్న యగ్నిహోత్రములు, జ్యోతిషా =ఉషఃకాలకాంతిని, అన్వాగుః= అనుసరించియున్నవి, తాసాం = ఆ యుషఃకాలములలో, ఏకా = ఒకటైన యుషఃకాలములలో, ఏకా = ఒకటైనయుషఃకాలము, దేవయూనాం = దేవతలను బూజించువారియొక్క, ప్రజాం = సంతానమును, రక్షతి = రక్షించుచున్నది, ఏకా = మఱియొకటైనయుషఃకాలము, ఊర్జం = బలమును, రక్షతి = రక్షించుచున్నది,

ఏకా = ఇంకొకటైనయుషఃకాలము, వ్రతం = వారి వ్రతమును, రక్షతి = రక్షించు చున్నది॥

తా॥ యజ్ఞముయొక్క మార్గమునగురించి ఉషఃకాలము మూడువిధములుగా నేర్పడియున్నది. ఆ యుషఃకాలములలో నొకటి దేవతలను బూజించువారియొక్క సంతానమును మఱియొకటి బలమును ఇంకొకటి వ్రతమును గాపాడుచుండును. ప్రకాశించుచుండెడి గార్హపత్య ఆహవనీయదక్షిణాగ్నులనెడిమూడును తమ కాంతిచేత నా యుషఃకాలములను బొందుచున్నవి యని గ్రహింపవలయు.

మూ॥ ఏకాష్టకాం పశ్యత దోహమానా మన్నం మాగ్ంసవత్
ఘృతవ త్స్వధావత్ త ద్బ్రాహ్మణై రతిపూత మనంత మక్షు
య్య మముష్మింl లోకే స్ఫీతిం గచ్ఛతు మే పితృభ్యః॥

పద॥ ఏకాష్టకాం। పశ్యత। దోహమానాం। అన్నం। మాంసవత్। ఘృతవత్। స్వధావత్। తత్। బ్రాహ్మణైః। అతిపూతం। అనంతం। అక్షయ్యం। అముష్మిన్। లోకే। స్ఫీతిం। గచ్ఛతు। మే। పితృభ్యః॥

టీక॥ హేబ్రాహ్మణాః = ఓబ్రాహ్మణులారా! మే = నాయొక్క, పితృభ్యః = పితృదేవతలకొఱకు యోగ్యమయిన, మాంసవత్ = మాంసముగలదియు, ఘృతవత్ = నెయ్యిగలదియు, స్వధావత్ = స్వధాశబ్దముగలదియునగు, అన్నం = అన్నమును, దోహమానాం = కలుగజేయుచుండెడి, తత్ = ఏకాష్టకయనెడియా యుషఃకాలమును, పశ్యత = చూడుడు, తత్ = ఆయన్నము, బ్రాహ్మణైః = బ్రాహ్మణులచేత, అతిపూతం = మిక్కిలి పవిత్రముఁజేయఁబడినదై, అనంతం = అమితమైనదై, అక్షయ్యం = నాశములేనిదౌచు, అముష్మిన్ = ఈ, లోకే = లోకమందు, స్ఫీతిం = వృద్ధిని, గచ్ఛతు = పొందుఁగాక॥

తా॥ ఓబ్రాహ్మణులారా! నా పితృదేవతలకొఱకు యోగ్యమైన మాంసము నెయ్యి మొదలగువానితోఁ గూడినయన్నమును గలుగఁజేయునట్టి ఏకాష్టకయనెడి యుషఃకాలము ఇదిగో వచ్చియున్నదిచూడుఁడు. ఆ యన్నము బ్రాహ్మణులమంత్రములచేఁ బవిత్రమైనదై వృద్ధిపొందినదౌచు నా పితృదేవతలకు నాశములేని లోకమును గలుగఁజేసి సంతోషపెట్టుఁగాక.

మూ॥ ఔలూఖలా గ్రావాణో ఘోష మకృత హవిః కృణ్వంతః
పరివత్సరీణం। ఏకాష్టకే సుప్రజా వీరవంతో వయగ్ం
స్యామ పతయొ రయీణాం ॥

పదవి॥ ఔలూఖలాః । గ్రావాణః । ఘోషం । అకృత । హవిః । కృణ్వం తః । పరివత్సరీణం । ఏకాష్టకే । సుప్రజాః । వీరవంతః । వయం । స్యామ । పత యః । రయీణాం ॥

టీక॥ ఔలూఖలాః = రోళ్ళుగాఁ జేయఁబడిన, గ్రావాణః = రాళ్లు, ఘోషం = ధ్వనిని, అకృత = చేసినవి, పరివత్సరీణం = సంవత్సర సంబంధమైన, హవిః = హవిస్సును, కృణ్వంతః = చేసినవి, ఏకాష్టకే = ఓ యేకాష్టక మను యుంమః కాలమా ! వయం = మేము, సుప్రజాః (వచనవ్యత్యయము)= మంచి సంతానముగలవారమై, వీరవంతః = మనుమలు గలవార మనుచు, రయీణాం = ధనములకు, పతయః = అధిపతులము, స్యామ = అయ్యెదము.

తా॥ యజ్ఞమునకుఁ బిష్టమును రుబ్బుటచే రోళ్లుగాఁ జేయబడిన రాళ్ళు ధ్వని జేయుచున్నవి. అట్టి పిష్టము యజ్ఞమునకు హవిస్సుగా నేర్పడియున్నది. ఏకాష్టక మనెడి యుంమః కాలమా ! అట్టి యజ్ఞమును జేయుటచే పుత్రులు పౌత్రులుగల వారమై విశేషమైన ధనము గలవార మగుదుము.

మూ॥ ఏకాష్టకా తపసా తప్యమానా సంవత్సరస్య పత్నీ దుదుహే
ప్రపీనా। తందోహ ముపజీవాథ పితర స్సహస్రధార
మముష్మిన్ లోకే స్వాహా॥

ప॥ ఏకాష్టకా । తపసా । తప్యమానా । సంవత్సరస్య । పత్నీ । దుదుహే । ప్రపీనా । తం । దోహం । ఉప । జీవాథ । పితరః। సహస్రధారం। అముష్మిన్ । లోకే । స్వాహా ॥

టీక॥ తపసా = సంధ్యావందనాది తపస్సులచే, తప్యమానా = తపింపఁజేయఁబడుచున్నదై, సంవత్సరస్య = సంవత్సరమునకు, పత్నీ = భార్యయగు ఏకాష్టక యనెడి యుంవః కాలము, ప్రపీనా = వృద్ధిపొందుచున్నదియై, దుదుహే = క్షీరములను బితుకుచున్నది, పితరః = ఓ పితృదేవతలారా !, సహస్రధారం = అనేకధారలుగల, తం

అట్టువంటు, దోహం = క్షీరమును, అముష్మిన్ స్త్రీః, లోకే = లోకమునందు, ఉప = పొంది, జీవాథ = జీవింపుఁడు॥

తా॥ సంధ్యావందనాది తపస్సులచే నుపాసన చేయబడునదియై, సంవత్సరము నకు భార్యగా నెన్నఁదగిన ఏ కాష్టకమనెడి యుమఃకాలము వృద్ధిబొందుచున్నదై హవిస్సులకు క్షీరములను స్రవింపఁజేయుచున్నది. ఓ పితృదేవతలారా! ఈ లోకం బున అనేకధారలుగా స్రవించు చున్న యట్టి క్షీరములను పానముఁ జేసి మీరు జీవింపుఁడు.

ఇతి ఏకవింశః ఖండస్సమాప్తః

---

## అథద్వావింశఃఖండ ప్రారంభః

మూ॥ ఉక్థ్య శ్చాఽస్యతిరాత్ర శ్చ సాద్యస్క్రీ శ్ఛందసా సహ
అపూపఘృతాహుతే నమ స్తే అస్తు మాగ్ంసపిప్పలే స్వాహా॥

పదవి॥ ఉక్థ్యః । చ । అసి । అతిరాత్రః । చ । సాద్యస్క్రీః । ఛందసా । సహ । అపూపఘృతాహుతే । నమః । తే । అస్తు । మాంసపిప్పలే । స్వాహా॥

టీక॥ హేఏకాష్టకే = ఓయేకాష్టకమా!, త్వం = నీవు, ఉక్థ్యః = ఉక్థ్య మనుయజ్ఞముగాను, అతిరాత్రిశ్చ = అతిరాత్రిమనుయజ్ఞముగాను, ఛందసాసహ = మంత్రములతోడ, సాద్యస్క్రీః = సద్యస్క్రమనుయజ్ఞముగాను, అసి = అయితివి, అపూపఘృతాహుతే = బూరెలచేతను, నేతిచేతను హోమముఁజేయబడుదానా! మాంసపిప్పలే = మాంసమే రుచియగుఫలముగాఁ గలదానా!, తే = నీకొరకు, నమః = నమస్కారము, అస్తు = అగుఁగాక॥

తా॥ బూరెలచేతను నేతిచేతను హోమముఁ జేయఁబడుదానవై మాంసమే రుచియగుపదార్థముగాఁగల యో యేకాష్టకమా! నీకొఱకు నమస్కారముఁ జేసెద. ఉక్థ్యము అతిరాత్రిము సద్యస్క్ర మనెడుయజ్ఞములు నీవే అయితివి. ఆ యజ్ఞములకుఁ గారణములైనవేదములును నీవే అయితివి.

మూ॥ భూః పృథివ్యగ్ని నర్చాఽముం మయి కామం నియునజ్మి
స్వాహా భువో వాయు నాంతరిక్షేణ సా మ్నాఽముం మయి
కామా నియునజ్మి స్వాహా॥

పదవి॥ భూః । పృథివీ । అగ్నినా । ఋచా । అముం । మయి । కామం । నియునజ్మి । స్వాహా । భువః । వాయునా । అంతరిక్షేణ । సామ్నా । అముం । మయి । కామం । నియునజ్మి । స్వాహా ॥

టీక॥ భూః=భూలోకమునందున్న, పృథివీ=భూమిచేతను, అగ్నినా=అగ్నిహోతృనిచేతను, ఋచా=ఋగ్వేదముచేతను, రక్షింపఁబడుచున్న, అహం=నేను, అముం=ఈ, కామం = కోరికను, మయి = నాయందు, నియునజ్మి=స్థాపనఁజేయుచున్నాను, భువః=భువర్లోకమందున్న, వాయునా=వాయువుచేతను, అంతరిక్షేణ=ఆకాశముచేతను, సామ్నా=సామవేదముచేతను, రక్షింపఁబడుచున్న, అహం=నేను, అముం=ఈ, కామం = కోరికను, మయి = నాయందు, నియునజ్మి=స్థాపనజేయుచున్నాను.

తా॥ భూలోకమందుండెడి భూమిచేతను అగ్నిచేతను ఋగ్వేదముచేతను, భువర్లోకమునందుండెడి వాయువుచేతను, ఆకాశముచేతను, సామవేదముచేతను, నేను బోషింపఁబడుచుంటిని గాన నా కోరికలను నాయందే యడఁచి లీనముఁ జేయుచున్నాను.

మూ॥ స్వర్దివాఽదిత్యేన యజుషాఽముం మయి కామం నియునజ్మి స్వాహా జన దద్భి రథర్వాంగిరోభి రముం మయి కామం నియునజ్మి స్వాహా ॥

పదవి॥ స్వః । దివా । ఆదిత్యేన । యజుషా । అముం । మయి । కామం । నియునజ్మి, స్వాహా । జనత్ । అద్భిః । అథర్వాంగిరోభిః । అముం । మయి । కామం । నియునజ్మి । స్వాహా ॥

టీక॥ స్వః=స్వర్లోకసంబంధమైన, దివా=పగటిచేతను, ఆదిత్యేన=సూర్యునిచేతను, యజుషా = యజుర్వేదముచేతను రక్షింపబడుచుండెడి, అహం = నేను, అముం=ఈ, కామం=కోరికను, మయి = నాయందు, నియునజ్మి=స్థాపనఁజేయుచున్నాను, జనత్=జనర్లోకసంబంధమైన, అద్భిః=ఉదకములచేతను, అథర్వాంగిరోభిః=అథర్వణవేదసంబంధ మగుమాటలచేతను రక్షింపబడుచున్న అహం=నేను అముం=ఈ, కామం = కోరికను, మయి = నాయందు, నియునజ్మి=స్థాపనఁజేయుచున్నాను.

తా॥ స్వర్లోకసంబంధమైనదివముచేతను సూర్యునిచేతను యజుర్వేదముచేతను నేను రక్షింపఁబడుచుంటిని. జనర్లోకమందుండెడి యుదకములచేతను అథర్వణవేదముచేతను నేను బోషింపఁబడుచుంటిని గాన నా కోరికలను వాయందే యుడఁచి వేయుచున్నాను.

మూ॥ రోచనా యాఽజిరా యాఽగ్నయే దేవజాతవే స్వాహా ।
కేతవే మనవే బ్రహ్మణే దేవజాతవే స్వాహా॥

పదవి॥ రోచనాయ । అజిరాయ । అగ్నయే । దేవజాతవే । స్వాహా । కేతవే । మనవే । బ్రహ్మణే । దేవజాతవే । స్వాహా ॥

టీక॥ రోచనాయ = ప్రకాశించునట్టియు, అజిరాయ = వడిగాఁబోవునట్టియుం దేవజాతవే = ఆరాధింపఁ దగిన దేవతలను దెలిసినవాఁడునగు, అగ్నయే = అగ్ని హోత్రునికొఱకు, స్వాహా = హోమమును జేయుచున్నాను, కేతవే = జ్ఞానముగలవాఁడును, మనవే = మంత్రస్వరూపుఁడును, బ్రహ్మణే = బ్రాహ్మణులకుఁ గారణభూతుఁడును, దేవజాతవే = పూజింపఁదగిన దేవతలను దెలిసినవాఁడునగు, అగ్నయే = అగ్నిహోత్రునికొఱకు, స్వాహా = హోమమునుఁ జేయుచున్నాను.

తా॥ ప్రకాశించువాఁడును చీకఁటినిబోఁగొట్టుటకై వడిగా వ్యాపించువాఁడును బూజింపఁదగిన దేవతలను దెలిసినట్టివాఁడును, జ్ఞానముగలవాఁడును, మంత్రస్వరూపుఁడును, బ్రాహ్మణులకుఁ గారణభూతుఁడునగు నగ్నిహోత్రునికొఱకు హోమమును జేయుచున్నాను.

మూ॥ స్వధాఽస్వాహాఽగ్నయే కవ్యవాహనాయ స్వధా స్వాహా॥

ఈమంత్రమునకు పదవిభాగము మొదలగునవి యీవఱలోఁ జెప్పబడినవి. కానఁ తిరిగి చెప్పంబడలేదు.

మూ॥ అన్న మివ తే దృశే భూయాసం వస్త్ర మివ తే దృశే
భూయాసం వి॒త్త మివ తే దృశే భూయాసగ్ం శ్ర॒ద్ధేవ తే
దృశే భూయాస మాశేవ తే దృశే భూయాసం॥

పదవి॥ అన్నం । ఇవ । తే । దృశే । భూయాసం । వస్త్రం । మివ । తే । దృశే । భూయాసం । వి॒త్తం । ఇవ । తే । దృశే । భూయాసం । శ్రద్ధా । ఇవ । తే । దృశే । భూయాసం । ఆశా । ఇవ । తే । దృశే । భూయాసం॥

టీక॥ తే = నీయొక్క, దృశే = నేత్రములకు, అన్నమివ = అన్నమువలెనే, అహం = నేనును, భూయాసం = (ఇష్టమైనవాఁడను) అయ్యెదను, తే = నీయొక్క దృశే = నేత్రములకు, వస్త్రమివ = వస్త్రమువలెనే, భూయాసం = ఇష్టమైనవాఁడనయ్యెదను, తే = నీయొక్క, దృశే = నేత్రములకు, విత్తమివ = ధనమువలెనే, భూయాసం = (ఇష్టమైనవాఁడ) నయ్యెదను, తే = నీయొక్క, దృశే = నేత్రములకు, శ్రీర్దేవ = శ్రీద్ధవలెనే, భూయాసం = (ఇష్టమైనవాఁడ) నయ్యెదను, తే = నీయొక్క, దృశే = నేత్రములకు, ఆశేవ = ఆశవలెనే, భూయాసం = (ఇష్టమైన వాఁడ) నయ్యెదను.

తా॥ ఓ యగ్నిహోత్రుఁడా ! అన్నమును వస్త్రమును ధనమును శ్రీద్ధను ఆశను నెటులు ప్రియముగాఁ జూచెదవో అటులే నన్ను ఇష్టమైనవానిగాఁ జూడుము.

మూ॥ సగ్ం స్రవంతు దిశో మహీః స్సమాధావంతు సూనృతాః సర్వే కామా అభియంతు మా ప్రియా అభిరక్షంతు మాఽప్రియాః॥

పదవి॥ సం । స్రవంతు । దిశః । మహీః । సం । ఆధావంతు । సూనృతాః । సర్వే । కామాః । అభియంతు । మా । ప్రియాః । అభి । రక్షంతు । మా । అప్రియాః ॥

టీక॥ సూనృతాః = సత్యమైవాక్కులు, మాం = నన్ను గురించి, సమాధావంతు = వచ్చుఁగాక, తాః = అట్టి సత్యవాక్కులు, మహీః = గొప్పవియగు, దిశః = దిక్కులను, సంస్రవంతు = వ్యాపించుఁగాక, సర్వే = సమస్తమైన, కామాః = కోరికలు, మాం = నన్ను, అభియంతు = పొందుఁగాక, ప్రియాః = హితులు, అభిరక్షంతు = రక్షింతురుగాక, అప్రియాః = విరోధులు, మాభవంతు = లేకపోదురుగాక॥

తా॥ సత్యమైన వాక్యములు బయలుదేరి నాలుగు దిక్కులయందునను బొందుఁగాక. అన్ని కోర్కెలును సిద్ధించుఁగాక. ఎల్లప్పుడు నాహితులు నన్నుఁ గాపాడుచుందురుగాక. నా కెప్పుడును విరోధి లేకుండుఁగాక.

మూ॥ యశోఽసి యశోఽహం త్వయి భూయాసమసౌ ॥

పదవి॥ యశః । అసి । యశః । అహం । త్వయి । భూయాసం । అసౌ ॥

టీక॥ అసౌ = ఓ దాతా ! త్వం = నీవు, యశః = కీర్తిగలవాఁడవు, అసి= అయితివి, అహం = నేను, త్వయి = నీవలెనే, యశః = కీర్తిగలవాఁడను, భూయాసం = అయ్యెదను.

తా॥ దాన మిచ్చునట్టి పురుషునితో దానమును గ్రహించునట్టివాఁడు పలుకుచున్నాఁడు. ఓ దాతా ! నీవు కీర్తిగలవాఁడవు. నీవలెనే కీర్తిగలవాఁడను నేను నయ్యెదను.

మూ॥ అంకౌన్యంకావభితోరథంయాధ్వాంతం వాతాగ్రమనుసంచరంతౌ । దూరేహేతిరింద్రియావాన్పతత్రీతేనోగ్నయః పప్రయః పారయంతు ॥

పదవి॥ అంకౌ । న్యంకౌ । అభితః । రథం । యౌ । ధ్వాంతం । వాతాగ్రం । అను । సంచరంతౌ । దూరేహేతిః । ఇంద్రియావాన్ । పతత్రీ । తే । నః । అగ్నయః । పప్రయః । పారయంతు ॥

టీక॥ ధ్వాంతం = ధ్వనిజేయుచున్నదై, వాతాగ్రం = వాయువువలెనే శీఘ్రముగాఁ బోవునట్టి, రథం = రథమును, అంకౌ = అంకులనెడి యిద్దఱు భూతములును, న్యంకౌ = న్యంకులనెడి యిద్దఱు భూతస్వరూపులును, ఇంద్రియావాన్ = బలముగలిగి, పతత్రీ = బాణములుగల, దూరేహేతిః = దూరేహేతియను భూతస్వరూపమును అను, తే = వారు, అభితః = అంతటను, అనుసంచరంతౌ = అనుసరించి నడిపించువారై, అగ్నయః = శీఘ్రముగా నడిపించువారై, నః = మాయొక్క కోరికలను, పప్రయః = నిండించుచు, పారయంతు = అద్దరిని బొందింతురుగాక ॥

తా॥ అంకు లని న్యంకు లని దూరేహేతి యని చెప్పఁబడురథాధిష్ఠానదేవతలు మాకు మనోరథసిద్ధియగునట్లుగాను ధ్వనితోఁగూడినట్లుగాను రథమును శీఘ్రముగా నడిపించి మాకోరికలనిండించి నన్ను దరిఁ జేర్చుదురుగాక.

మూ॥ అధ్వనామధ్వపతే స్వస్తి మా సంపారయ॥

పదవి॥ అధ్వనాం । అధ్వపతే । స్వస్తి మా సంపారయ॥

టీక॥ అధ్వానామధ్వపతే=మార్గములలోతిరుగుశ్రేష్ఠమైనయానమా!, స్వస్తి= శుభముకలుగునట్లుగాను, మా = నన్ను, సంపారయ = అవశ్యము దరిఁజేర్పుము॥

తా॥ మార్గములయందు దిరుగు యానములలో శ్రేష్ఠమగురథమా! మాకు శుభములు కలుగునట్లుగాను మమ్ములను దరిఁజేర్పుము

మూ॥ అయం వా మశ్వినా రథో మా దుఃఖే మా సుఖే రిషత్ అరిష్ట స్వస్తి గచ్ఛతు వివిఘ్నన్ పృతనాయతః॥

పదవి॥ అయం । వాం । అశ్వినా । రథః । మా । దుఃఖే । మా । సుఖే । రిషత్ । అరిష్టః । స్వస్తి । గచ్ఛతు । వివిఘ్నన్ । పృతనాయతః॥

టీక॥ అశ్వినా = అశ్వినీదేవతలారా!, అయం = ఈ రథః = రథము, వామ్= మీ దేశావున, దుఃఖే = కష్టముగా నుండుమార్గమందునను, మారిషత్ = భంగము నొందకుండుఁగాక, సుఖే = కష్టములేనిమార్గమందునను, మారిషత్ = భంగము నొందకుండుఁగాక, అరిష్టః = అట్టిరథము భంగములేనిదై, పృతనాయతః = యుద్ధముఁ జేయుటకు వచ్చియున్న సేనలను, వివిఘ్నన్ = మిక్కిలి చంపుచు, స్వస్తి = మాకు మేలు కలుగునట్లుగా, గచ్ఛతు = వెళ్ళుఁగాక॥

తా॥ ఓయశ్వినీ దేవతలారా! ఈ రథము రాళ్ళు మొదలగువానిచే సంకటముగా నుండుమార్గమందుఁ గాని లేక శుభమైనమార్గమందుగాని తిరుగుచున్నదై భంగములేని దగుచు మాతో యుద్ధముజేయుటకు వచ్చియున్న సేనలను సంహారింపఁ జేయుచు మాకు మేలు కలుగునట్లుగాను వెళ్ళుచుండుఁగాక.

మూ॥ అశ్వోఽసి హయోఽస్యత్యోఽసి నరోఽస్యర్వాఽసి సప్తిరసి వాజ్యసి వృషాఽసి నృమణా అసి యయుర్నామాఽస్యాఽదిత్యానాం పత్వా న్విహి॥

పదవి॥ అశ్వః । అసి । హయః । అసి । అత్యః । అసి । నరః । అసి । అర్వా । అసి । సప్తిః । అసి । వాజీ । అసి । వృషా । అసి । నృమణాః । అసి । యయుః । నామ । అసి । ఆదిత్యానాం । పత్వాన్ । ఇహి॥

అ॥ త్వం = నీవు, అశ్వః = అశ్వ మనుపేరుగలదానవు, అసి = అయితివి, హయః = హయ మనుపేరుగలదానవు, అసి = అయితివి, అత్యః = అత్య మను పేరుగలదానవు, అసి = అయితివి, నరః = నరము అనుపేరుగలదానవు, అసి = అయితివి, అర్వా= అర్వ మనుపేరుగలదానవు, అసి = అయితివి, సప్తిః= సప్తి యనుపేరు గలదానవు, అసి = అయితివి, వాజీ = వాజి యనుపేరుగలదానవు, అసి = అయితివి, వృషా = వృష యనుపేరుగలదానవు, అసి = అయితివి, నృమణాః = నృమణ యనుపేరుగలదానవు, అసి = అయితివి, యయుః = యయు వనుపేరుగలదానవు, అసి = అయితివి, ఆదిత్యానాం = దేవతలకు, పత్వాక్ = వాహనము, అసి=అయితివి, సః = అటువంటి, త్వం = నీవు, మాం = నన్ను, అన్విహి = అనుసరించి నడువుము॥

తా॥ తనకు లభించినగుఱ్ఱము నభిమంత్రించు చున్నాఁడు. ఓగుఱ్ఱమా! నీవు అశ్వమనియు హయమనియు అత్యమనియు నరమనియు అర్వమనియు సప్తియనియు వాజియనియు వృషయనియు నృమణమనియు యయువనియుఁ జెప్పఁబడుచున్న దానవై దేవతలకు వాహనమయిననీవు నన్నెక్కించుకొని నడువుము.

మూ॥ హస్తియశస మసి హస్తియశసీ భూయాసం వహ కాలవహ శ్రియం మాఽభివహ। ఇంద్రస్య త్వావజ్రేణాఽభినిద ధామ్యసౌ॥

ప॥ హస్తి యశసం। అసి। హస్తియశసీ। భూయాసం। వహ। కాలవహ। శ్రియం। మా। అభి। వహ। ఇంద్రస్య। త్వా। వజ్రేణ। అభి। నిదధామి। అసౌ॥

టీక॥ హస్తియశసం = ఏనుగులలో గీర్తిగల యేనుఁగువు, అసి = అయితివి, అహం = నేను, హస్తియశసీ = ఏనుఁగుల వలనఁ గీర్తిగలవాఁడను। భూయాసం = అయితిని, వహ = నన్ను వహింపుము, కాలవహ = నల్లనిమూపురము గలదానా, శ్రియం = లక్ష్మిని, మాం = నన్నును అభివహ= వహించుము, అసౌ = ఓ యేనుఁగా!, త్వాం = నిన్ను, ఇంద్రస్య = దేవేంద్రుని యొక్క, వజ్రేణ = వజ్రాయుధముతో సమానమైన యంకుశముచే, అభినిదధామి = నియమించు చున్నాను.

తా॥ ఓ యేనుఁగా! ఏనుఁగులలో నీవు కీర్తిగలదానవు. నేను యేనుగులు గలవాడనై కీర్తి గలవాడనైతిని. వల్లని మూపురము గల యో యేనుఁగా! నన్ను నా సంబంధమైన లక్ష్మిని మోయుఁము దేవేంద్రుని వజ్రాయుధముతో సమానమైన యంకుశముచే నిన్ను శిక్షించుచున్నాను.

మూ॥ అవజిహ్వక నిజిహ్వ కాఽవ త్వా హా విషా యజే। తత్సత్యం
యదహం బ్రవీ మ్యధరో మదసా వదా త్స్వాహా॥

ప॥ అవజిహ్వక। నిజిహ్వక। అవ। త్వా। హావిషా। యజే। తత్। సత్యం। యత్। అహం। బ్రవీమి। అధరః। మత్। అసౌ। వదాత్। స్వాహా॥

టీక॥ అవజిహ్వక = అడ్డముగా నుండునాలుక గలవాఁడా! నిజిహ్వక = అధోముఖముగా నుండు నాలుకగలవాఁడా! త్వా = నిన్ను, హావిషా = హావిస్సు చేత, అవయజే = నీవు మళ్లి పోవునట్లుగాను బూజించు చున్నాను, అసౌ = నాకు విరోధియైన యెుకానొక యీ పురుషుఁడు, మత్ = నాకంటె, అధరః = తక్కువ వాఁడై, వదాత్ = పలుకువాఁడవును, ఇతి=ఈలాగని, అహం = నేను, యత్ = ఏ మాటను, బ్రవీమి = పలుకుచున్నానో, తత్ = ఆ మాట, సత్యం = నిజము.

తా॥ ఫలీకరణహోమముఁ జేసి వాక్సంబధమైనప్రతిబంధకమును బోఁగొట్టుకొనుచున్నాఁడు. ఓ అవజిహ్వక నిజిహ్వకమను వారలారా! మిమ్ముగనుగూర్చి ఫలీకరణహోమముఁ జేయుచున్నాను. కానఁ దొలఁగి పొండు. ఎవఁడైనను నాకంటె యుక్తముగా మాటలాడువాఁడు లేకుండుఁగాక యని నేను బలుకుచున్నాను.

మూ॥ ఆ తే వాచ మాస్యాం దద ఆ మనస్యాగ్ం హృదయా దధి
యత్రి యువయోః స్వభూతః తత శ్చ దుఃఖే సుఖే వా
అధ్వని మాఽరిషత్ భగ్నో మాఽ భూద్య త్ర తే వాఙ్ని
హితా తాం త ఆదదే॥

పద॥ ఆ। తే। వాచం। ఆస్యాం। దదే। ఆ। మనస్యాం। హృదయాత్। అధి। యత్రి। యువయోః। స్వభూతః। తతః। చ। దుఃఖే। సుఖే। వా। అధ్వని। మా। రిషత్। భగ్నః। మా। అభూత్। యత్రి। తే। వాక్। నిహితా। తాం। తే। ఆ। దదే॥

టీక॥ తే = నీయొక్క, ఆస్యాం=ముఖమునందైనటువంటిదియు, మనస్యాం=మనస్సునందైనటువంటిదియు, హృదయాదధి = హృదయమందైనటువంటిదియునగు, వాచం = వాక్కును, ఆదదే = గ్రహించుచున్నాను, కింతు = ఇంక నేమనంగా, యత్ర = ఎక్కడను, తే = నీయొక్క, వాక్ = వాక్కు, నిహితా = కప్పంబడియున్నదో, తే = నీయొక్క, తాం = ఆవాక్కును, ఆదదే = గ్రహించుచున్నాను, యత్ర = ఎక్కడను, యువయోః = మీయిద్దఱియొక్క, స్వభూతః = స్వతస్సిద్ధమైనభావము గలదో, తం=ఆ భావమును ఆదదే = గ్రహించుచున్నాను, తతః = ఆ కారణమువలన, దుఃఖే = కష్టమైనను, సుఖేవా = సులభమైనను, అధ్వని=వాగూపమైన మార్గమునందు, మారివత్ = నాకుభంగములేకుండుంగాక, భవాన్ = నీవు, మా = నన్నుగుఱించి, భగ్నః = భంగము కలవాండవు, అభూత్ = అయ్యెదవు.

తా॥ అవజిహ్వక నిజిహ్వకమనువారలారా! ప్రత్యేకముగాం గాని సమష్టిగా గాని మీ యుభయులయొక్క మనోవాక్కాయముల సంబంధమైన స్వభావమును గ్రహించుచున్నాను. మఱియు నీ భావము రహస్యముగా నెక్కడ నున్నను అట్టి భావమును గ్రహించుచున్నాను. కాంబట్టి కష్టమైనను సులభమైనను వాక్ప్రసంగమందు నావలన నీకే పరాజయము కలుగుంగాక. నాకు పరాజయము లేకుండుగాక.

మూ॥ త త్సత్యం య దహం బ్రవీ మ్యధరో మ త్పద్య స్వాఽసౌ॥

పదవి॥ తత్ । సత్యం । యత్ । అహం । బ్రవీమి । అధరః । మత్ । పద్యస్వ । అసౌ ॥

టీక॥ అసౌ=ఒకానొక పేరుగల యో శత్రువా!, త్వం = నీవు, మత్=నాకంటె, అధరః=తక్కువవాండవై, పద్యస్వ = న్యూనతను బొందుమని, యత్=ఏ వాక్యమును, అహం=నేను, బ్రవీమి = పలుకుచున్నానో, తత్ = ఆ వాక్యము, సత్యం=నిజము॥

తా॥ ఓ శత్రువా! నాకంటె నీవు తక్కువవాడవై యుందువని పలుక్కుచున్నాను. ఈ వాక్కు సత్యము.

ఇతిద్వావింశః ఖండస్సమాప్తః

---

—♦ అథత్రయోవింశః ఖండః ♦—

మూ॥ యా త ఏషా రరాట్యా తనూ ర్మన్యో ర్మృధ్నస్య నాశినీ
తాం దేవా బ్రహ్మచారిణో వినయంతు సుమేధసః॥

పదవి॥ యా । తే । ఏషా । రరాట్యా । తనూః । మన్యోః । మృధ్నస్య । నాశినీ । తాం । దేవాః । బ్రహ్మచారిణః । వినయంతు । సుమేధసః ॥

టీక॥ మృధ్నస్య = మంచితనముయొక్క నాశినీ=భంగమును జేయునదియు, మన్యోః = కోపసంబంధమైనదియు, తే = నీయొక్క, ఏషా = ఈ, యా = ఏ, రరాట్యా=ముఖసంబంధమైన, తనూః=శరీరము కలదో, తాం=ఆ క్రోధయుక్తమైన శరీరమును, దేవాః=దేవతలును, సుమేధసః=మంచిబుద్ధిగల, బ్రహ్మచారిణః=వేద శాస్త్రజ్ఞులును, వినయంతు=పోగొట్టుదురుగాక.

తా॥ మంచితనమునకు భంగముగలుగఁజేయునట్టియే కోపము నీముఖమునందు భ్రుకుట్యాదివికారములచేఁ బ్రకాశించుచున్నదో యట్టిక్రోధమును దేవతలును వేద శాస్త్రజ్ఞులును మంచిబుద్ధిగలవారును బోఁగొట్టుదురుగాక.

మూ॥ యత్త ఏత న్ముఖేఽమతగ్ం రరాట ము ది విధ్యతి । వితే
క్రోధం నయామసి గర్భ మశ్వతర్యా ఇవ॥

పదవి॥ యత్ । తే । ఏతత్ । ముఖే । అమతం । రరాటం । ఉత్ । ఇ । విధ్యతి । వి । తే । క్రోధం । నయామసి । గర్భం । అశ్వతర్యాః । ఇవ ॥

టీక॥ తవ = నీయొక్క । ముఖే= ముఖమునందు । ఏతత్ = ఈ, యత్ = ఏ, అమతం = సత్పురుషులకు, నిష్టముకాని, రరాటం = నుదురు నందుండు క్రోధము, ఉద్విధ్యతి = స్ఫురించుచున్నదో, తే = నీయొక్క, తత్ = ఆ, క్రోధం = కోపమును, అశ్వతర్యాః = కంచరగాడిదెయొక్క, గర్భమివ = గర్భము వలెనే, వినయామసి = పోఁగొట్టఁదగినవాఁడవు॥

తా॥ సత్పురుషుల కిష్టముకాని యేక్రోధము నీముఖచిహ్నలచేఁ దెలియఁబడు చున్నదో మంచితనమును బోఁగొట్టున దౌటచేత అట్టికోపమును ఆత్మవినాశకారణ

మైనకంచరగాడిదయొక్క గర్భమును వలెనే పోఁగొట్టికొనఁ దగినది. (కంచర గాడిద గర్భమును దాల్చుట దానిమరణమునకే కారణ మని యెఱుంగవలయు.

మూ॥ అవజ్యా మివ ధన్వనో హృదో మన్యుం తనోమి తే।ఇం
ద్రోపాస్య ఫలిగ మన్యేభ్యః పురుషే భ్యోన్యత్రోమత్॥

పదవి॥ అవ । జ్యాం । ఇవ । ధన్వనః । హృదః । మన్యుం । తనోమి । తే । ఇంద్ర । అపాస్య । ఫలిగం । అన్యేభ్యః । పురుషేభ్యః అన్యత్ర । మత్॥

అ॥ హేస్త్రీ = ఓఆఁడుదానా! తే = నీయొక్క, హృదః = మనస్సు యొక్క, మన్యుం = కామవికారమును, ధన్వనః= ధనస్సువలెనే, జ్యామివ= నారిని అవతనోమి = విడిచిపెట్టించుచున్నాను, ఇంద్ర =ఓయింద్రుఁడా!, అస్యాః =ఈ చిన్నదానియొక్క, ఫలిగం = భగమును, అన్యేభ్యః = ఇతరులైన, పురుషేభ్యః = పురుషులవలన, అపాస్య = విడిచిపెట్టించి, మత్ = నాకంటె, అన్యత్ర = మతి యొకనికి, ఉపభోగ్యం = భోగింపఁదగినదానిఁగా, నకురు = చేయకుము.

తా॥ ఓచిన్నదానా! బాణమును విడిచిపెట్టినపిమ్మట ధనుస్సునవలన నారిని విడిచిపెట్టినరీతిగా సంభోగాదులచే నీ మనస్సునందుండు కామవికారమును బోఁగొట్టు చున్నాను. ఓ యింద్రుఁడా! ఈ చిన్నదానియొక్కయోనిని నాకంటె నితరులు భోగింపకుండునట్లుగాఁ జేయుచుండవలయును.

మూ॥ య దహం ధనేన ప్రపణాగ్ శ్చరామి ధనేన దేవా ధన
మిచ్ఛమానః తస్మిం తోసెమో రుచ మాదధాత్వగ్ని రింద్రో
బృహస్పతి శ్చ స్వాహా॥

పదవి॥ యత్ । అహం । ధనేన । ప్రపణాన్ । చరామి । ధనేన । దేవాః । ధనం । ఇచ్ఛమానః । తస్మిన్ । సోమః । రుచం । ఆ । దధాతు । అగ్నిః । ఇంద్రః బృహస్పతిః॥

టీక॥ ధనేన = క్రయవిక్రయరూపమైనధనముచేత, ధనం = ధనవృద్ధిని, ఇచ్ఛమానః = కోరుచున్నవాఁడనై, అహం = నేను, యత్=ఏ, ధనేన = మూల ధనముచే, ప్రపణాన్ = వ్యాపారములను, చరామి = చేయుచున్నానో, తస్మిన్=

అటువంటిధనమువిషయమై, రుచం = కాంతిని అనఁగావృద్ధిని, సోమః = చంద్రుఁడు అగ్నిః = అగ్నిహోత్రుఁడు, ఇంద్రః = దేవేంద్రుఁడు, బృహస్పతిః = బృహస్పతియు ఆదధాతు = చేయుదురుగాక॥

తా॥ నేను మూలధనముచే పదార్థములను గొని ఆ పదార్థములను దిరిగి విక్రయించి ధనవృద్ధి యగుటకు ఏ వ్యాపారమును జేయుచున్నానో అటువంటివ్యాపారమునందు చంద్రుఁడు అగ్నిహోత్రుఁడు ఇంద్రుఁడు బృహస్పతియు వృద్ధి కలుగునట్లు చేయుదురుగాక.

మూ॥ పరి త్వా గిరే రమిహం పరి భ్రాతుః పరి ష్వసుః పరి సర్వే
భ్యో జ్ఞాతిభ్యః పరిషీతః క్వేష్యసి॥

పదవి॥ పరి । త్వా । గిరేః । అమిహం । పరి । భ్రాతుః । పరి । స్వసుః । పరి । సర్వేభ్యః । జ్ఞాతిభ్యః । పరిషీతః । క్వ । ఏష్యసి ॥

టీక॥ త్వా = నిన్ను, గిరేః = పర్వతసమీపమునకు వెళ్లకముందు అనఁగా దేశాంతరమునకు వెళ్లకముందు, పర్యమిహం = (నా మూత్రముచేఁ దడుపుచున్నాను, భ్రాతుః = సోదరుని సమీపమునకు వెళ్లకముందు, పర్యమిహం = తడుపుచున్నాను, స్వసుః = చెలియలి సమీపమునకు వెళ్లకముందు, పర్యమిహం = తడుపుచున్నాను, సర్వేభ్యః = సమస్తమైన, జ్ఞాతిభ్యః = దాయాదుల సమీపమునకు వెళ్ళకముందు, పర్యమిహం = తడుపుచున్నాను, పరిషీతః = నావల్ల నా మూత్రముచేఁ దడపఁబడినవాఁడవై, త్వం = నీవు, క్వ = ఎక్కడికి, ఏష్యసి = వెళ్ళఁగలవు.

తా॥ స్త్రీ తన పెనిమిటి యితరుల మాటపలుకులలో నుండకుండునట్లుగాను దనకు భృత్యునిపగిది నుండునట్లుగాను జేయుకర్మమును జెప్పుచున్నాఁడు. ఓ నాథా! నీవు దేశాంతరమునకును నీ సోదరుఁడు నీ చెలియలు మొదలగువారి సమీపమునకును దాయాదుల సమీపమునకును వెళ్లకపూర్వమే నా మూత్రముచే నిన్నుఁ దడుపుచున్నాను కాన నీ వచ్చటికిని వెళ్ళకుండుము. నాకు స్వాధీనుఁడవై నాయందే లక్ష్యము గలవాఁడవై యుండవలయునని స్త్రీ ఆవుకొమ్ము తెచ్చి దానిలో తన మూత్రము నుంచి పెనిమిటి నిద్రించుచుండఁగా నతని శరీరమునందుఁ జల్లునని యెఱుంగవలయు. )

మూ॥ శశ్వ త్పరికుపితేన సంక్రామే ణాఽవిచ్ఛిదా। ఉలేన పరిషీ
తో౽సి పరిషీతో౽ స్యులేన ॥

ప॥ పదవి॥ శశ్వత్ । పరి । కుపితేన । సంక్రామేణ । అవిచ్ఛిదా । ఉలేన । పరిషీతః । అసి । పరిషీతః । అసి । ఉలేన ॥

టీక॥ శశ్వత్ = మాటిమాటికి, పరికుపితేన = కోపముగలనాచేత, సంక్రామేణ= భూమియందు ప్రవించుచున్నదియు, అవిచ్ఛిదా = ఎడతెగనిదియు, ఉలేన= పెద్దచీమలబారువంటి మూత్రధారచేత, పరిషీతః = తడపఁబడినవాఁడవు, అసి = అయితివి, ఉలేన = మూత్రధారచేత, పరిషీతః = తడపఁబడినవాఁడవు, అసి = అయితివి.

తా॥ నీవు దేశాంతరమునుగుఱించి వెళ్ళెదవు అనుకోపముచే మూత్రధారచే నిన్నుఁ దడుపుచున్నాను.

మూ॥ ఆవర్తన వర్తయని నివర్తన వర్త యేంద్ర నర్దబుద భూమ్యా
శ్చతస్రః ప్రదిశ స్తాభి రావర్తయా పునః॥

పదవి॥ ఆవర్తన। వర్తయని । నివర్తన । వర్తయ । ఇంద్ర। నర్దబుద । భూమ్యాః । చతస్రః । ప్రదిశః । తాభిః । ఆవర్తయ । పునః ॥

టీక॥ ఆవర్తన = గ్రామాంతరమునకు, వెళ్ళినవారిని దిరిగిపంపునట్టి ఓ గమనాధిదేవతా ! ఆవర్తయ = వెళ్ళిననాభృత్యులఁబంపుము, నివర్తన = గ్రామాంతరమునకు వెళ్ళనియ్యనియో గమనాధిదేవతా ! నివర్తయ = గ్రామాంతరమునకు వెళ్ళనియ్యకుము, నర్దబుద = శర్దమనుబాణముగల, ఇంద్ర=ఓయింద్రుఁడా ! భూమ్యాః= భూమిసంబంధమైన, చతస్రః = నాలుగైన, ప్రదిశః = ఏ ప్రధానదిక్కులుకలవో, తాభిః =(తాభ్యః) ఆదిక్కులకై, పునః = తిరిగి, ఆవర్తయ = మళ్ళింపుము.

తా॥ దేశాంతరమునకు వెళ్ళిన నాభృత్యులను దిరిగి పంపునట్టి ఓ గమనాధిదేవతా ! మా సంబంధమైనవా రెవరు మఱియొకస్థలమునకు వెళ్ళిరో వారిని దిరిగి మా గృహమునకు బంపుము. ప్రయాణమునకు విఘ్నముఁ జేయు గమనాధిదేవతా ! మా సంబంధులు మాకు నిష్టము లేకుండ నెక్కడికైనను వెళ్ళఁ దలఁచి రేని వారిని వెళ్ళనియ్య

కును. ఓ యింద్రుఁడా! ఈ భూమియందుండు తూర్పుమొదలు నాలుగుదిక్కులలో నెక్కడికైనను మా సంబంధీకులు వెళ్ళి రేని వారి నక్కడనుండి తిరిగి వచ్చునట్లుగాఁ జేయుము.

మూ॥ ఆవర్తనే నివర్తన ఆవర్తననివర్తనాయ స్వాహా ॥

పదవి॥ ఆవర్తనే । నివర్తన । ఆవర్తననివర్తనాయ । స్వాహా ॥

టీక॥ ఆవర్తనే = ఏ మార్గముచేవుళ్ళుచుండిరో, నివర్తన = ఆ మార్గముచేతనే మళ్ళింప జేయుదువు, తస్మాత్ = ఆ కారణమువలన, ఆవర్తననివర్తనాయ = ఆవర్తననివర్తనస్వరూపుఁడవైన, తుభ్యం = నీకొఱకు, స్వాహా = హోమమును జేయుచున్నాను.

తా॥ వెళ్ళినమార్గముననే మళ్ళింపఁజేయు ఆవర్తననివర్తనుఁడను గమనాధిదేవతకొఱకు హోమముఁ జేయుచున్నాను.

మూ॥ అను పోఽహ్వా దనుహ్వాయో నివర్తో పో న్యవీవృతత్ ।
ఇంద్రః పరిక్రోశో వః పరిక్రోశతు సర్వతః ॥

పదవి॥ అను । వః । అహ్వాత్ । అనుహ్వాయః । నివర్తః । వః। న్యవీవృతత్
ఇంద్రః । పరిక్రోశః । వః । పరిక్రోశతు । సర్వతః ॥

టీక॥ అనుహ్వాయః = అనుసరించివచ్చునట్టి పురుషుఁడు, వః = మిమ్ముల ను (మా యాజ్ఞను) అన్వహ్వాత్ = అనుసరింపఁగాక, ఇంద్రః = దేవేంద్రునితో సమానమైన, నివర్తః = మళ్ళించుదేవత, వః= మిమ్ములను, న్యవీవృతత్= మళ్ళించఁగాక, పరిక్రోశః = అపశబ్దము, వః = మిమ్ములను, సర్వతః = అన్నిస్థలములయందున, పరిక్రోశతు = ఆ గమనమును నిషేధించుగాక ॥

తా॥ మిమ్ముల ననుసరించివచ్చువాఁడు మా యాజ్ఞకులోఁబడి వెనుకకు వెళ్ళుగాక. రాఁబోవుకష్టములను గుర్తెఱింగిన దేవేంద్రునితో సమానమైనవాఁడు నీవు ప్రయాణమై యుండఁగా నిన్నుఁ బ్రయాణమునుండి వారించుఁగాక. ప్రయాణసమయంబున రోదనము మొదలయిన యపశబ్దంబులు వినఁబడుట నిన్నుఁ బ్రయాణమునుండి వారించుఁగాక.

మూ॥ యది మా మతిమన్యా ద్వా ఆదేవా దేవవత్తరం। ఇంద్రః పాశేన సిక్త్వా వో మహ్యా మద్వశ మానయాత్ ॥

పదవి॥ యది । మాం । అతిమన్యాత్ । వా । ఆదేవాః । దేవవత్తరం । ఇంద్రః । పాశేన । సిక్త్వా । వః । మహ్యై । మద్వశం । ఆనయాత్ ॥

టీక॥ ఆదేవాః = దైవసహాయములేని, యూయం = మీరు, దేవవత్తరం = దైవసహాయముగలిగిన మాం = నన్ను, అతిమన్యాద్వాయది = అతిక్రమించి వెళ్ళెద రేని, ఇంద్రః = దేవేంద్రుఁడు, పాశేన = త్రాడుచే, వః = మిమ్ముల్లను, సిక్త్వా= బంధించి, మహ్యై = భూమియందు, మద్వశం = నా స్వాధీనమగునట్లుగా, ఆన యాత్ = పొందించుఁగాక.

తా॥ గమనాధిదేవత యిట్లు పలుకుచున్నది ఓభృత్యులారా! నన్ను వ్యతిరే కించి మీరు వెళ్ళఁబోకుఁడు. నేనుదైవసహాయము గలిగినవాఁడను, మీరు దైవ సహాయములేదు. అలాగు వెళ్ళెద రేని దేవేంద్రుఁడు మిమ్ముల్లను త్రాటిచేఁ గట్టి నా వద్దకు తెచ్చి విడుచును.

మూ॥ యది వృక్షా ద్య ద్యంతరిక్షా త్ఫల మభ్యపప్త త్తదు వాయు రేవ య త్రా౨స్పృక్ష త్తనువం యత్ర వాస ఆపో బాధం తాం నిర్ఋతిం పరాచైః॥

పదవి॥ యది । వృక్షాత్ । యది । అంతరిక్షాత్ । ఫలం । అభి । అపప్తత్ । తత్ । ఉ । వాయుః । ఏవ । యత్ర । అస్పృక్షత్ । తనువం । యత్ర । వాసః । ఆపః । బాధంతాం । నిర్ఋతిం । పరాచైః

టీక॥ వృక్షాత్ = చెట్టువలనఁగానీ, అంతరిక్షాద్యది = ఆకాశమువలనఁగాని, ఫలం = పండు, అభ్యపప్తద్యది = పడినట్లాయెనా, తత్ = ఆ పతనమునకు, వాయు రేవ = వాయువే కారణము, యత్ర = ఎక్కడ, తనువం = నా శరీరమును అస్పృ క్షత్ = స్పృశించెనో, యత్ర = ఎక్కడ, వాసః = వస్త్రము అస్పృక్షత్ = స్పృశించెనో, తత్ర = ఆప్రదేశమునందుండు, నిర్ఋతిం = అశుచిత్వమును, పరా చైః, లేకుండునట్లుగా, ఆపః = ఉదకములు, బాధంతాం = పోఁగొట్టుఁగాక॥

తా॥ అకస్మాత్తుగా పై నుండి పండు పడఁగా అప్పుడు నా శరీరమును గాని నా వస్త్రమును గాని యీ పండు తాకుటచే బాధ గాని అశుచిత్వము గాని సంభవించిన పక్షమునకు ఉదకముచే గడిగి దానిని బోఁగొట్టుకొనుచున్నాను.

మూ॥ యే పక్షిణః పతయంతి బిభ్యతో నిర్‌ఋతైస్సహ। తే మా శివేన శగ్మేన తేజసోందంతు వర్చసా॥

పదవి॥ యే । పక్షిణః । పతయంతి । బిభ్యతః । నిర్‌ఋతైః । సహ । తే । మా । శివేన । శగ్మేన । తేజసా । ఉందంతు । వర్చసా॥

టీక॥ యే పక్షిణః = ఏపక్షులు, బిభ్యతః = భయపడినవై, నిర్‌ఋతైస్సహ = అమంగళములతోఁగూడ, పతయంతి = నాశరీరముమీఁద నెక్కుడఁబడుచున్నవో, తే = ఆ పక్షులు, తత్ = ఆ ప్రదేశమునుండి, ఉద్గచ్ఛంతు = ఎగిరిపోవుఁగాక, మాం = నన్ను, శివేన = మంగళముతోను, శగ్మేన = సుఖముతోను, తేజసా = కాంతితోను, వర్చసా = ప్రభావముతోను, యుక్తం = కూడుకొనినవానిఁగా, ఆపః = ఉదకములు, ఉందంతు = తడుపుఁగాక.

తా॥ పక్షులు భయపడి శరీరముపైఁ బడినను లేక వానిరెక్కలతోఁగాని పాదములతోఁగాని తాకినపక్షమునను అమంగళము సంభవించును గాన ఈ మంత్రముచే ఉదకమార్జన చేసినపక్షమునకు ఆ యమంగళము పోయి మంగళము సుఖము కాంతి వర్చస్సును గలుగును.

మూ॥ దివో ను మా బృహతో అంతరిక్షాదపాగ్ం స్తోకో అభ్యపప్తచ్ఛివేన స మహా మింద్రియేణ వీర్యేణ మనసాఽహమాగాం బ్రహ్మణా సంపృంచాన స్సుకృతా కృతేన॥

పదవి॥ దివః । ను । మా । బృహతః । అంతరిక్షాత్ । అపాం । స్తోకః । అభ్యపప్తత్ । శివేన । సం । అహం । ఇంద్రియేణ । వీర్యేణ । మనసా । అహం । ఆగాం । బ్రహ్మణా । సంపృంచానః । సుకృతా । కృతేన॥

టీక॥ దివోను = స్వర్గమువలనఁగాని, బృహతః = విస్తారముగా వ్యాపించియున్న, అంతరిక్షాత్ = ఆకాశమువలనఁ గాని, అపాం = ఉదకములయొక్క, స్తోకః = బిందువు, అభ్యపప్తత్ = మీఁదబడెను, తతః = ఆహేతువువలన, అహం =

నేను, శివేన = క్షేమముగానుండిన, ఇంద్రియేణ = త్వగాదీంద్రియములతోడను, వీర్యేణ = బలముతోడను, మనసాచ = మనస్సుతోడను, సమాగాం = కలిసికొనిన వాఁడనయ్యెదను, అహం = నేను, సుకృతా = పవిత్రత్వాది మంచికార్యమును జేయుఁబడియు, కృతేన = నాచేఁబ్రయోగింపఁబడినదియునగు, బ్రహ్మణా = మంత్రముచే, సంపృంచానః = ఉదకములచేదడపుడుదును.

తా॥ అకాలమం దకస్మాత్తుగా ఆకాశమునుండి గాని స్వర్గమునుండి గాని జల బిందువులు మీఁదఁబడినట్లయ్యేనేని భంగముకలుగక స్వస్థతతోఁగూడిన యింద్రియములు మనస్సు బలముకలవాఁడ నయ్యెదను. అశుచిత్వము సంభవించునేనిఁ దత్పరిహారముకొఱకుఁ బవిత్రకరమైన మంత్రములచే నుదకసమ్మార్జనమును జేసికొనియెదను.

మూ॥ ఇమం మే వరుణ శ్రుధీ హవ మద్యా చ మృడయ త్వా
మవస్యు రాచకే॥

పదవి॥ ఇమం। మే। వరుణ। శ్రుధి। హవం। అద్య। చ। మృడయ। త్వాం। అవస్యుః। ఆచకే॥

టీక॥ వరుణ=ఓ వరుణుఁడా!, మే = నాయొక్క, ఇమం=ఈ, హవం=పిలుపును, శ్రుధి=వినుము, అద్య=ఇప్పుడే, మృడయ=సుఖపెట్టుము, త్వాం=నిన్ను అవస్యుః=రక్షకునిగాఁగోరినవాఁడనై, ఆచకే=ప్రార్థించుచున్నాను.

తా॥ ఓ వరుణుఁడా! నిన్ను రక్షకునిగాఁగోరి స్తోత్రము జేయుచుంటిని గాన నేఁ జేయుస్తోత్రమును విని నన్ను సుఖపెట్టుము.

మూ॥ త త్త్వా యామి బ్రహ్మణా వందమాన స్త దాశా స్తే
యజమానో హవిర్భిః। అహేడమానో వరు ణేహ బో
ధ్యురుశగ్ంస మా న ఆయుః ప్రమోషీః॥

పదవి॥ తత్। త్వా। యామి। బ్రహ్మణా। వందమానః। తత్। ఆశాస్తే। యజమానః। హవిర్భిః। అహేడమానః। వరుణ। ఇహ। బోధి। ఉరుశంస। మా। నః। ఆయుః। ప్రమోషీః॥

టీక॥ ఉరుశంస=అనేకులచే, స్తోత్రము జేయబడు, వరుణ=వరుణుడా!, నః=మాయొక్క, ఆయుః = ఆయుర్దాయమును, మాప్రమోషీః = భగపెట్టకుము, అహేడమానః=కోపములేనివాఁడవై, ఇహ = ఈ కర్మమునందు, నేఁజేయు స్తోత్ర

మను, బోధి=తెలిసికొనుము, తత్=అనంతరము, త్వా=నిన్ను, యామి = రక్షణ మునుగోరి నిన్ను బొందుచున్నాను, యజమానః=యజమానుఁడు, బ్రహ్మణా=వేద మంత్రముచే, వందమానః = స్తోత్రముఁజేయుచు, హవిర్భిః = ఆజ్యాది హవిస్సులచే సంతోషపెట్టుచు, తత్=నేఁ గోరునట్టి, ఆశాస్తే=కోరుచున్నాఁడు, ఉరుశంస= అనేకులచే స్తోత్రముఁ చేయబడు వరుణుఁడా! నః = మాయొక్క, (యజమానుని గలుపుకొనుటచే బహువచనప్రయోగము) ఆయుః=ఆయుర్దాయమును, మాప్రమో షీః=భంగపఱుపకుము.

తా॥ అందఱిచేతను గొనియాడబడెడి వరుణుఁడా! మా యాయుర్దాయము నకు భంగము రానియ్యకుము. మేము జేయుకర్మములయందు మాచేఁ జేయఁబడుస్తోత్ర మునః కోపములేనివాఁడవై వినుము. అనంతరము మాకుఁ గావలసినవస్తువులను గోర దను. ప్రతియజమానుఁడును యజ్ఞాదికర్మలయందు వేదములచే నిన్ను స్తోత్రముఁ జేయుచు అజ్యాదిహవిస్సులఁ దృప్తినొందించుచు నేను గోరునట్టిదానినే కోరు చున్నాఁడు

మూ॥ త్వ న్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడో వయా సిసీష్ఠాః యజిష్ఠో వహ్నితమ శ్శోశుచానో విశ్వా ద్వేషాగ్ంసి ప్రముము గ్ధ్యస్మత్॥

పదవి॥ త్వం । నః । అగ్నే । వరుణస్య । విద్వాన్ । దేవస్య । హేడః । అవ । యాసిసీష్ఠాః । యజిష్ఠః । వహ్నితమః । శోశుచానః । విశ్వా । ద్వేషాంసి । ప్ర । ముముగ్ధి । అస్మత్॥

టీక॥ అగ్నే = ఓయగ్నిహోతుృఁడా!, విద్వాన్ = సమస్తమును, గుర్తెఱింగిన, త్వం = నీవు, దేవస్య = దేవుఁడైన, వరుణస్య = వరుణువునకు, నః = మమ్ములఁగుఱించి, యః = ఏ, హేడః = క్రోధముకలదో, తం = ఆక్రోధమును అవయాసిసీష్ఠాః = విడిచిపెట్టించుము, వహ్నితమః = హవిస్సులను మోయువాఁడ వును, శోశుచానః = ప్రకాశించువాఁడవునగు, త్వం = నీవు, యజిష్ఠః = నాచేఁ బూజింపఁబడినవాఁడవు కావున, నః = మా సంబంధమైన, విశ్వా = సమస్తమైన,

ద్వేషాంసి = విరోధకార్యములను, అస్మత్ = మావలననుండి ప్రముముగ్ధి = విడిచి పెట్టించుము.

తా॥ ఓ యగ్నిహోతృడా! నీవు సమస్తమును దెలిసినవాఁడవు. కావున వరుణదేవునకు మాయం దుండుకోపమును ఆయన విడిచిపెట్టులాగునఁ జేయుము. ఆజ్యాదిహవిస్సులచే మాచేఁ బూజింపఁబడి ప్రకాశించుచు శత్రువులు మా విషయమై చేయుద్వేషకార్యములు మమ్ముల నొందకుండులాగునఁ జేయుము.

మూ॥ స త్వం నో అగ్నేఽవమో భ వోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ। అవయక్ష్వ నో వరుణగ్ం రరాణో వీహి మృడీకగ్ం సుహవో న ఏధి॥

పద॥ సః । త్వం । నః । అగ్నే । అవమః । భవ । ఊతీ నేదిష్ఠః । అస్యాః । ఉషసః । వ్యుష్టౌ । అవయక్ష్వ । నః । వరుణం । రరాణః । వీహి । మృడీకం । సుహవః । నః । ఏధి ॥

టీ॥ అగ్నే = ఓ యగ్నిహోతృడా! అవమః = దేవతలలో ప్రధానుఁడవైన, సః = ఆ, త్వం = నీవు, అస్యా = ఈ, ఉషసః = ప్రాతఃకాలముయొక్క, వ్యుష్టౌ = స్ఫురించుట కలుగుచుండఁగా, నః = మాయొక్క, ఊతీ నేదిష్ఠః=రక్షించుటచే సమీపమందుండువాఁడవు, భవ = అగుము, వరుణం = వరుణదేవుని, అవయక్ష్వ=మాకు అపకారముఁ జేయకుండునట్లు చేయుము, నః = మాకొఱకు, రరాణః = ఇష్టములను ఇచ్చుచుఁగాక, మృడీకం = సుఖమును జేయు పురోడాశము, మొదలగువానిని, వహి = భక్షింపుము, సుహవః = శోభస్కరమైన పిలుపు గలవాఁడవై, నః = మమ్ములను, ఏధి = వృద్ధిపొందించుము.

తా॥ దేవతలలో మొదటివాఁడవైన యగ్నిహోతృడా! ప్రతిదినమందునను మమ్ములను రక్షించుకొఱకు మా దగ్గఱనే యుండుము. వరుణునకు మాయందుఁ గోపము లేకుండునట్లు చేసి పాశము మొదలగువానిని మాయందుఁ బ్రయోగింపకుండునట్లు చేయుము. మే మిచ్చునట్టియు సుఖమును గలుగఁజేయునట్టియు పురోడాశము మొదలగువానిని భక్షించి మాకు వాంఛితముల నిచ్చి మమ్ములను వృద్ధిపొందించుము.

మం॥ త్వ మగ్నే అయా స్యయా సన్మనసా హితః । అయాసన్ హవ్య మూహిషేఽయా నో ధేహి భేషజం ॥

పదవి॥ త్వం । అగ్నే । అయాసి । అయాః । సన్ । మనసా । హితః । అయాః । సన్ । హవ్యం । ఊహిషే । అయాః । నః । ధేహి । భేషజం ॥

టీక॥ అగ్నే = ఓ యగ్నిహోత్రుఁడా!, త్వం = నీవు, అయాసి = భక్తులు పొందఁదగినవాఁడ వయితివి, అయాస్సన్= భక్తులు పొందఁదగినయట్టినీవు, మనసా= మనస్సుచేత, హితః = నమస్కరింపఁబడుచున్నావు, అయాస్సన్ = భక్తులు పొందఁదగినయట్టినీవు, హవ్యం = మాచే దేవతలకు నియ్యఁబడుహవిస్సును, ఊహిషే = మోయుచున్నావు, అయాః = భక్తులు పొందఁదగిననీవు, నః = మాకొఱకు, భేషజం = ఔషధమును, ధేహి = కలుగఁజేయుము.

తా॥ ఓ యగ్నిహోత్రుఁడా! భక్తులు కోరదగినవాఁడవు గాన మేము మనస్సుచే నమస్కరించుచున్నాము. మేము దేవతల కిచ్చునట్టిహవిస్సును నీవు వహించి దేవతల కిచ్చువాఁడవుగాన దేవతల యనుగ్రహవశమున సంజీవి మొదలగు నౌషధములను మాకు లభింపఁజేయుము.

మం॥ ప్రజాపతే న త్వ దేతా న్యన్యోవిశ్వాజాతాని పరితా బభూవ। యత్కామా స్తే జుహుమ స్తన్నో అస్తు వయగ్గ్ స్యామ పతయో రయీణాం ॥

పదవి॥ ప్రజాపతే । న । త్వత్ । ఏతాని । అన్యః । విశ్వా । జాతాని । పరితః । బభూవ । యత్కామాః । తే । జుహుమః । తత్ । నః । అస్తు । వయం । స్యామ । పతయః । రయీణాం ॥

టీక॥ ప్రజాపతే = ఓ బ్రహ్మ!, త్వత్ = నీకంటె, అన్యః = ఇతరుఁడు, ఏతాని = ఈ, విశ్వా = సమస్తమైన, జాతాని = వస్తుసముదాయములయందు, నపరితో బభూవ = అంతటను వ్యాపించియున్నవాఁడు లేఁడు, తే = ఆ పూర్వోక్తమైన, వయం = మేము, యత్కామాః = దేనినిఁ గోరినవార మై, జుహుమః = హోమముఁజేయుచున్నామో, తత్ = అది, అస్తు = అగుఁగాక, వయం = మేము, రయీణాం = ధనములకు, పతయః = ప్రభువులము, స్యామ = అయ్యెదము.

తా॥ ఓబ్రహ్మ! నీకంటె నితరుఁడు ఈ ప్రపంచమునందు వ్యాపించియున్న వాఁడు లేఁడు అనఁగా నీవే సమస్తప్రపంచమును నిండియున్నవాఁడ వనుట. మేము దేనిని గోరి నిన్నుఁగుఱించి హోమమును జేయుచున్నామో అది మాకుఁ గలుగుఁ గాక. ఇంతియే కాదు. విశేషమైనధనము కలవారమగునట్లు మమ్ములను జేయుము.

మూ॥ సమ్రాజం చ విరాజం చాఽభిశ్రీ ర్యా చ నో గృహే। లక్ష్మీ రాష్ట్రస్య యా ముఖే తయా మా సగ్ంసృజామసి॥

పదవి॥ సమ్రాజం । చ । విరాజం । చ । అభి । శ్రీః । యా । చ । నః । గృహే । లక్ష్మీః । రాష్ట్రస్య । యా। ముఖే । తయా । మా । సం । సృజామసి॥

టీక॥ నః = మాయొక్క, గృహే = గృహమందు, యాచ = ఏ, అభిశ్రీః= ధనలక్ష్మికలదో, తయా = ఆ ధనలక్ష్మిచేతను, సమ్రాజం = మిక్కిలి ప్రకాశించు వానిఁగా, మాం = నన్ను, సంసృజామసి= ఏర్పఱుచుము. రాష్ట్రస్య= భూమండల ముయొక్క, ముఖే = ప్రధానస్థలమందు, యా = ఏ, లక్ష్మీః = రాజ్యలక్ష్మికలదో తయా = ఆ రాజ్యలక్ష్మిచే, విరాజం = అనేకవిధములఁ బ్రకాశించువానిఁగా, మాం = నన్ను, సంసృజామసి = ఏర్పఱుచుము.

తా॥ ఓయగ్నిహోతుఁడా ! మాగృహమందుండిన భాగ్యలక్ష్మిచేతను భూ మండల సంబంధమైన భాగ్యలక్ష్మిచేతను నన్ను మిక్కిలి ప్రకాశించువానిగాఁ జేయుము.

మూ॥ ఇమం జీవేభ్యః పరిధిం దధామి మైషాం ను గా దపరో అర్థ మేతం శతం జీవన్తు శరదః పురూచీ స్తిరో మృత్యుం దధ తాం పర్వతేన॥

పదవి॥ ఇమం । జీవేభ్యః । పరిధిం । దధామి । మా । ఏషాం । ను । గాత్। అపరః । అర్థం । ఏతం । శతం । జీవన్తు । శరదః । పురూచీః । తిరః । మృత్యుం దధతాం । పర్వతేన॥

టీక॥ ఇమం = ఈ రాతిని, జీవేభ్యః = జీవులకొఱకు , పరిధిం = ఆస్తరణ ముగా, దధామి = స్థాపించుచున్నాను, ఏషాం = ఈ జీవులలో, అపరహః = ఇత

రుఁడైన యొక్క జీవుడును, ఏతం = ఈ, అర్థం = మృత్యురూపమైన ప్రయోజనమును, మా గాత్ = పొందకుండుఁగాక, కింతు = ఇఁక నేమంటే, పురూచీః = అనేక దినములుగాని, శతం = నూరైన, శరదం = సంవత్సరములుగాని, జీవన్తు = జీవించియుండుఁగాక, అనేన = ఈ, పర్వతేన = పర్వతముచేత, మృత్యుం = మరణమును, తిరోదధతాం = కప్పఁబడినదానిగాఁ జేయుదురుగాక. అనఁగా మృత్యువును జయింతురుగాక.

తా॥ ఈ జీవులకు ఈ రాతిని ఆస్తరణముగాఁ జేయుచున్నాను. ఈ రాతి ప్రభావముచే ఈ జీవులలో నొకఁడైనను మరణమును బొందక మృత్యువును జయించి అనేక సంవత్సరములు గాని నూఱుసంవత్సరములుగాని, జీవించి యుందురుగాక.

ఇతి త్రయోవింశఃఖండ స్సమాప్తః

---

శ్రీకృష్ణ యజుర్వేదే ఏకాగ్నికాణ్డే
ప్రథమ ప్రపాఠక నామమంత్ర
ప్రశ్న స్సమాప్తః.

గ్రంథము సంపూర్ణము.

పంచదశకర్మలకును— ప్రాముఖ్యమగు— మంత్రపన్నములు— పదవిభాగ, టీకా తాత్పర్యసహితముగా చేర్పఁబడినవి.

చ॥ ల॥



# ప్రకటన

# ఆర్యానంద ముద్రాక్షరశాలా,

## మచిలీపట్టణము.

---

పోస్టుఖర్చులు ప్రత్యేకము.

(1) సంధ్యామంత్రార్థదర్పణము— టీకా - తాత్పర్యసహితము - అర్థము తెలిసికొని సంధ్యావందనముచేయుట విశేషముగలదు ప్రతి 1 కి ... ... ... రు 0-4-0

(2) అరుణమంత్రార్థప్రకాశిక—సూర్యయంత్రసహితము- సూర్య నమస్కారములు నొనర్చు పుణ్యపురుషులకందరికిని - మంత్ర ముల కర్థము స్వయముగా దెలిసికొనగలరు. ప్రతి 1 కి ... రు 1-8-0

(3) మంత్రప్రశ్న— పంచదశకర్మలకును - ప్రాముఖ్యమగు - మంత్రముల కర్థముగలదు - వివాహోపనయనాది - కర్మలు జర్పునప్పుడు - అర్థముదెలిసికొని - కర్మలు జర్పించిన విశేష ఫలము గలదు. రు 2-0-0

(4) అన్నసూక్తార్థదర్పణము (టీకా-తా-స) రు 0-3-0

(5) శిక్షావల్లి ప్రతిపదార్థసహితము రు 0-4-0

(6) ఆనందవల్లి— (డిటో) రు 0-4-0

(7) భృగువల్లి — ప్రతిపదార్థసహితము రు 0-4-0

(8) నారాయణము — ప్రతిపదార్థసహితము రు 0-8-0

(9) చిత్తిప్రశ్నము (బ్రహ్మమేధము) టీకాతాత్పర్య విద్యారణ్య భాష్యానుసారిణీ - తెలుగున - ముద్రించబడినది - తైత్తిరీయో పనిషత్తులలో - ౭ ఉపనిషత్తుయని చెప్పుదురు. రు 0-8-0

(10) విచ్ఛిన్నోపాసనము - క్రియార్థ సమేతము రు 0-2-0

(11) పురుషసూక్తము - ప్రతిపదార్థ సహితము రు 0-8-0